## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan | INSA | Times of India | Tamil Heritage Foundation |
| CMU-Books | | Indian Express | AnnaUniversity NEW! |
| Sanskrit | | The Hindu | |
| TTD,Tirupathi | | Deccan Herald | |
| Kerala Sahitya Akademi | | Eenadu | |
| | | Vaartha | |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శ్వేతాశ్వతర - ఉపనిషత్తు



ద్వా సుపర్ణా సయుజా సఖాయ ...

శ్రీ రావినూతల రాధాకృష్ణయ్య

# శ్వేతాశ్వతర ఉపనిషత్తు

మూలము, టీక, భావము, వివరణము.




శ్రీ రావినూతల. రాధాకృష్ణయ్య

# అంకితము

శ్వేతాశ్వతర ఉపనిషత్తు [మూలము, టీక, భావము, వివరణ సహితము]. అను ఈ గ్రంథము ఈ భువిపై నివసించు సర్వమానవాళి యొక్క జీవితము సుఖ సంతోష, ఆనందములతో శోభిల్లజేయ దివ్యమైన మహా యోగమును —సేవించు, ప్రేమించు, ధ్యానించు సాక్షాత్కరించుకొనుము— ప్రబోధించిన దివ్యజీవన సంఘ సంస్థాపకులును, జగద్గురు వరేణ్యులునైన

శ్రీ శివానంద సరస్వతీ స్వామీజీవారి అంఘ్రి పద్మ యుగ్మములకు భక్తి పూర్వకముగ సమర్పితము.

ఓం తత్ సత్.

రావినూతల. రాధాకృష్ణయ్య



: రచయిత :

# శ్రీ రావినూతల రాధాకృష్ణయ్య

హెడ్‌మాస్టర్

R. V. M. హైస్కూల్,

వెంకటగిరి టౌన్

# విషయ సూచీ

# ఒక్క మాట

శ్వేతాశ్వతరోపనిషత్తులో 113 మంత్రాలున్నాయి. ఈయుపనిషత్తు ఆరు అధ్యాయాలుగ విభజింపబడింది. నేను రచియించిన ఈ గ్రంథంలో ఆ ముఖంలో ప్రతి అధ్యాయం దేన్ని గురించి తెలుపుతుందో సంగ్రహంగా వివరించాను.

శ్వేతాశ్వతరోపనిషత్తు బ్రహ్మము, ఈశ్వరుడు, జీవుడు, విశ్వము, మోక్షము—వీనిని గురించియు; జనన మరణ చక్రానికి బద్ధుడైన జీవునకు మోక్ష సాధనాన్ని గురించియు; వేదాంత, సాంఖ్య, యోగముల సమన్వయమును గురించియు చక్కగా ప్రదర్శిస్తుంది కావున ఆధునిక పఠితలకు ఉపనిషత్తు చక్కగా బోధపడుటకు ఉపోద్ఘాతంలో 'ఎక్కడనుండి ? ఎక్కడకు? 'ద్వాసుపర్ణా సయుజా సఖాయా', 'బ్రహ్మము, జీవుడు, జగత్తు', 'మోక్షము', 'ఈశ్వరుడు', 'త్రిమార్గములు' అను శీర్షికల క్రింద వివరంగా ఉపనిషత్తు బోధించే సత్యాలను దృష్టాంతాలతో వివరించాను. శ్వేతాశ్వతర ఋషిపుంగవుడు గురుభక్తికి అత్యంత ప్రాధాన్యం ఇస్తారు కావున 'గురుతత్త్వం' శీర్షిక క్రింద గురుభక్తి ఆవశ్యకతను గురించి విపులంగా వివరించాను.

ప్రతి మంత్రమునకు టీక, భావము, వివరణము వ్రాయబడింది. మంత్రంలో పదాలు ఏ వరుసలో వస్తాయో ఆ వరుసలోనే ప్రతి పదానికి అర్థం ఇవ్వబడింది. ఒక్కొక్క పరిపదానికి సంస్కృతములోనే అర్థము, మరలా దానికి తెలుగు అర్థం ఇవ్వబడింది. (ఉదా॥ సంయునక్తు = సంయోజయత్, సంయుక్త పరచుగాక). భావము గ్రాంథిక భాషలో వ్రాయబడింది. వివరణం శిష్ట వ్యావహారికంలో జరిగింది. మంత్రంలోని ప్రతి పదం, లేక సముచిత పదజాలం వ్యాఖ్యానం చేయబడింది.

వివరణం సరళంగా జరిగింది. అందరకూ అర్థమయ్యే పంథాలో వ్రాయబడింది. ఉపనిషత్ వైభవాన్ని వ్యాఖ్యలో పేర్కొంటూ వచ్చాను. ఆధునిక పాశ్చాత్య తత్త్వశాస్త్రజ్ఞులకు ప్రాచీన హిందూ ఋషిపుంగవులకు గల తేడాను దృష్టాంతపూర్వకంగా వివరించాను. (మూడవ అధ్యాయం 8వ, 21వ. మంత్రాలను చూడగోరెదను). వ్యాఖ్యలో సాధనాంశము (Practical aspect) నకు అధిక ప్రాధాన్యం ఇవ్వడం నా గ్రంథంలోని విశిష్టత (రెండవ అధ్యాయం 8వ మంత్రాన్ని చూడండి). ఈ ఉపనిషత్తులో పరమాత్మ రుద్రుడుగా ఈశుడుగా సూచింపబడినాడనే సత్యాన్ని వ్యాఖ్యలో తెలిపాను.

ప్రతి జిజ్ఞాసువు తన పూజామందిరమున ఎల్లప్పుడూ ఉంచుకొనదగిన కాపీగా ఉండాలనే తహతహతో జపధ్యానానంతరం ఋషియజ్ఞంగా నా సరళ మహావ్యాఖ్యరచన సాగించాను.

మంత్రములు సులభంగా చదువుటకు వీలగుటకు సముచితమైన స్పేసింగు ఇవ్వబడింది.

శ్రీ శంకరభగవత్పాదుల వ్యాఖ్యను, శ్రీ శివానంద యతీంద్రుల భాష్యమును ముఖ్యంగా అనుసరించాను.

పఠితలకు Easy reference కోసం గ్రంథాంతమున మంత్ర వర్ణానుక్రమణికను చేర్చాను.

ఈ ఉపనిషత్తునుఎందుకు చదవాలి? బ్రహ్మను శ్రుతుల ద్వారా తప్ప స్వతంత్ర ఆలోచనతోగాని, హేతువాదంతోగాని అవగతం చేసుకోజాలం.

అందువల్లనే బాదరాయణుడు (వ్యాస భగవానుడు) సదా వేదాక్షరములందే ఆశ్రయం గైకొంటాడు. ఈ గ్రంధ పఠనం వల్ల మనస్సు విక్షేపరహితమౌతుంది. మన మనస్సు సత్త్వపూరితమౌతుంది. మనం కష్టాలలో ఉన్నప్పుడు స్వాధ్యాయం మనకు ఉపసమనాన్ని కలిగిస్తుంది. ఈ ఉపనిషత్తు విజ్ఞానఖని. విజ్ఞానం అసంఖ్యేయములైన కష్టాల్ని పోగొట్టుతుంది. లెక్కలేని పాపాలను భస్మీపటలం గావిస్తుంది. అజ్ఞానమూలాన్ని ఛేదిస్తుంది మనకు సుఖశాంతులను ప్రసాదిస్తుంది. మోక్షానికి తిన్నని బాట చూపుతుంది. అందువల్ల మంచి సాధకులైనవారు స్వాధ్యాయం ఎన్నడు మానరాదు.

ఈ గ్రంధముద్రణ విజయవంతమగుటకు దోహదమొసంగిన తెలుగు యూనివర్సిటీ, కళాభవన్, సైఫాబాద్ హైదరాబాదు వారికి నేను కడుంగడు కృతజ్ఞుడను మరియు ఈ గ్రంధముద్రణకు సహకరించిన ఉదారులకు. మిత్రులకు, సుహృత్తులకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు. గ్రంధమును అందముగ ముద్రించుటకు తోడ్పడిన శ్రీ మహాలక్ష్మి ప్రింటర్స్, తిరుపతి వారికి నా ప్రేమపూర్వక అభివందనములు.

ఉపనిషద్ ద్రష్టల ఆశీస్సు మన ఎల్లరపై సదా యుండుగాక!

వెంకటగిరి టౌన్ ఓం తత్ సత్.

30-3-1987 రావినూతల. రాధాకృష్ణయ్య

# ఆముఖం

శ్వేతాశ్వతరోపనిషత్తు కృష్ణ యజుర్వేద అంతర్గతము. ఈ చిన్ని ఉపనిషత్తును, అనగా అందలి తత్త్వాన్ని, శ్వేతాశ్వతరుడు అనే ఋషిపుంగవుడు తన శిష్యులకు ముముక్షువులకు బోధించాడు. అందువల్ల ఈ యుపనిషత్తు శ్వేతాశ్వతరుని పేరిట శ్వేతాశ్వతరోపనిషత్తు అని పిలువబడింది. శ్వేత అంటే తెల్లని (పరిశుద్ధమైన). అశ్వ అంటే గుర్రము (ఇంద్రియములు). కాబట్టి శ్వేతాశ్వతర అనే పదానికి ఇంద్రియములను నిగ్రహించినవాడు అని

అర్థము. ఈ యుపనిషత్తు ఆరు అధ్యాయాలుగ విభజింపబడింది. ఈ యుపనిషత్తు నందలి మంత్రముల సంఖ్య 113.

| అధ్యాయము: | I | II | III | IV | V | VI |
|---|---|---|---|---|---|---|
| శ్లోకముల సంఖ్య: | 16 | 17 | 21 | 22 | 14 | 23 |

దశోపనిషత్తులలో ఇది యొకటి కాకపోయినప్పటికి ఇది ముఖ్యమైన ఉపనిషత్తుగానే పరిగణింపబడుతూంది.

శ్వేతాశ్వతర ఋషి పరమ తపస్వి, మహాజ్ఞాని అతడు పురుషార్థం సల్పి, భగవదనుగ్రహం పొందాడు. పరతత్త్వాన్ని ఆ ఋషీశ్వరుడు సాక్షాత్కరించుకొన్నాడు అతడు తాను ప్రత్యక్షీకరణము చేసికొన్న సత్యాన్ని పరమ హంస సంన్యాసులకు ప్రబోధించాడు. శ్వేతాశ్వతరోపనిషత్తునందలి భావాలు గంభీరములైనవి. ఇందులో సాధన, సాధ్యము, సాధకుడు ప్రతిపాద్య విషయ వైభవము మొదలగునవి బహుసరళంగా, స్పష్టంగా మంజులమైన భాషలో నిరూపింపబడ్డాయి ఈ యుపనిషత్తులో సాంఖ్యము, వేదాంతము, యోగము—వీటి యొక్క అద్భుతమైన సమన్వయం ప్రదర్శింపబడింది. గొప్ప గొప్ప బ్రహ్మ సూత్ర భాష్యకారులు తమ సిద్ధాంతాలను సమర్థించుకొనేందుకు ఈ ఉపనిషత్తులోని అనేక మంత్రాలను ఉల్లేఖిస్తూంటారు. ఈ ఉపనిషన్మంత్రాలను ఆధారం చేసుకొని సాంఖ్యవాదులు, కడకు ద్వైతమతావలంబులు తమ తమ సిద్ధాంతాలను సమర్థించుకుంటారు.

శ్వేతాశ్వతరోపనిషత్తు "ఈ విశ్వానికి కారణం ఏమిటి ?" అనే మీమాంసతో ప్రారంభమౌతుంది. కొందరు బ్రహ్మవాదినులు జగత్ కారణ విషయాన్ని గురించి విచారిస్తారు. ఈ ప్రపంచానికి తుది కారణం ఏమిటి ? అది బ్రహ్మమా ? బ్రహ్మము ఎటువంటి కారణం ? అది నిమిత్త కారణమా ? ఉపాదాన కారణమా ? లేక రెండూనా ? ఈ జీవితానికి మూలం ఏమిటి? ఈ జీవితానికి ఎవరైనా నియామకుడు, ఆధారభూతుడు, అంతర్యామి యున్నాడా? ఈ ప్రపంచం నిర్మాలింపబడేటప్పుడు, అనగా ప్రళయకాలంలో మనం ఎక్కడుంటాం ?మరణానంతరం జీవాత్మ ఏమౌతుంది? చనిపోయిన పిదప ఆత్మ ఉంటుందా? లేక అది పూర్తిగా నశించిపోతుందా? ఆ ఆత్మ

బ్రహ్మములో లీనమౌతుందా? జీవాత్మలను పాలించే పరమ ప్రభువు ఎవరైనా ఉన్నాడా? ఈ విశ్వానికి కాలాన్ని కారణమనవచ్చునా? ఈ విశ్వానికి జీవాత్మను కారణం అనవచ్చునా? ఈ విధంగా బ్రహ్మజిజ్ఞాసువులు జగత్ కారణాన్ని గురించి విచారిస్తారు.

ధ్యాన సమాధులతో పరమాత్మ సాక్షాత్కారాన్ని పడసిన యోగిపుంగవులు ఈ సృష్టికి కారాణాన్ని దర్శించారు. ఈ విశ్వానికి కారణం దేవాత్మశక్తియని వారు దర్శించారు. దేవాత్మశక్తి యనగా పరమేశ్వరుని వశంలో ఉండే త్రిగుణాత్మక మాయాశక్తి. పరమేశ్వరుడు తన మాయా శక్తివల్ల ఈ ప్రపంచానికి అభిన్న నిమిత్త ఉపాదాన కారణమౌతాడు. అందువల్ల పరమేశ్వరుని సాక్షాత్కారమైన మీదటనే జీవుడు మాయా చక్రాన్నుండి బయట పడి. ముక్తుడు కాగలడు. పాలలో వెన్నవలె పరమేశ్వరుడు సర్వ వస్తువులలో వ్యాపించియున్నాడు సత్యంవల్ల ఇంద్రియ మనస్సులను నిగ్రహించడంవల్ల ఆ పరమేశ్వరుని సాక్షాత్కారం కలుగుతుంది. ఆ పరమేశ్వరుడే భోక్త భోగ్యము, ప్రేరకుడు. ఈ విధంగా ప్రథమాధ్యాయంలో జగత్ కారణాన్ని నిర్ణయించేందుకు. పరమేశ్వర సాక్షాత్కారానికి ప్రణవ చింతన పూర్వకమైన ధ్యాన అభ్యాసం సాధనగా పేర్కొనబడింది.

బ్రహ్మజిజ్ఞాసువు ప్రప్రథమంలో తన హృదయాన్ని శుద్ధిచేసుకోవాలి. అతడు తన మనస్సును నిర్మలం చేసుకోవాలి. దీనికి మార్గం నిష్కామ్య సేవ, జపం. కీర్తన, సాత్త్వికాహారము, గురుశుశ్రూష, పేదలసేవ ఇత్యాదులు. ఇంద్రియాల్ని వాటి విషయాల్నుండి ప్రత్యాహరించాలి. ఇంద్రియాల్ని నిగ్రహించకపోతే జిజ్ఞాసువునకు, లేక సాధకునకు సరియైన యుంజానము అంటే మనోధారణము (Concentration of mind). కుదరదు. అందువల్ల ఇంద్రియ శిక్షణ మొదట ఆధ్యాత్మిక అభ్యాసంగా గుర్తించాలి.

రెండవ అధ్యాయంలో బ్రహ్మధ్యానాన్ని అభివృద్ధి చేసుకొనేందుకు మార్గాలు వివరించబడ్డాయి. ఆత్మసాక్షాత్కారానికి నిరంతర తీవ్రసాధన (అభ్యాసం) చాల ఆవసరమని ఈ అధ్యాయంలో పేర్కొనబడింది. పురుషార్థంయొక్క ప్రాముఖ్యత తెలుపబడింది. జ్ఞానయోగ, రాజయోగ, కర్మయోగముల సమన్వయ సంయోగాభ్యాసం సిఫార్సుచేయబడింది. యోగనియమాలు,

యోగఫలాలు వర్ణింపబడ్డాయి. ఈ సర్వ నామ రూపాలల్లో బ్రహ్మము ఉన్నాడని అతడే సకలానికి ఆలంబనం, అధిష్ఠానం అని యీ అధ్యాయంలో తెలుప బడింది.

సాధన నిరూపణ అనంతరము మూడవ అధ్యాయములో సాధ్యవస్తువును ప్రతిపాదనచేయడం జరిగింది. బ్రహ్మజ్ఞానం మాత్రమే అజ్ఞానాంధకారాన్ని నిర్మూలించి మానవులను జనన మరణ చక్రాన్నుండి ముక్తులచేయగలదు. సంసార చక్రాన్నుండి తప్పించుకొనడానికి బ్రహ్మజ్ఞానప్రాప్తి వినా మరొక మార్గము లేదు. పరమాత్మ సాక్షాత్కారమే మానవ జీవిత గమ్యము. ఈ అధ్యాయంలో పరమాత్మ ఈశుడుగా పేర్కొనబడినాడు. రుద్రుడు స్వకీయ మాయాశక్తిచే అంతటినీ పాలిస్తాడు. నిర్గుణ బ్రహ్మము నిరుపాధికము. మాయాముక్తము. సగుణ బ్రహ్మమునకు మాయ ఉపాధి, మాయ సగుణబ్రహ్మమునకు కారణ శరీరము. మాయ అతని వశంలో ఉంటుంది. పరబ్రహ్మము. సగుణ బ్రహ్మము తాదాత్మ్యమే. బ్రహ్మమునకు సచ్చిదానందము స్వరూప లక్షణము. బ్రహ్మమునకు సర్వజ్ఞత్వము, సర్వవ్యాపిత్వము మొదలగునవి తటస్థ లక్షణాలు. భక్తుల హృదయపూర్వక పవిత్ర ధ్యానాచరణకోసం సాక్షాత్ నిర్గుణ బ్రహ్మ సగుణ బ్రహ్మము ఔతాడు.

నాలుగవ అధ్యాయంలో తత్త్వబోధ ప్రాప్తి వర్ణింపబడింది మాయ నుండి ముక్తిని పొందుకోసం భగవంతుని స్తవనం చేయబడింది. 'స నో బుద్ధ్యా శుభయా సంయునక్తు,' అతడు (భగవంతుడు) మాకు పరిశుద్ధమైన బుద్ధి కలుగజేయుగాక! ఈ అధ్యాయం ఈ స్తుతితో ప్రారంభమౌతుంది. ఈ అధ్యాయంలో దేవుని స్వరూపము, మాహాత్మ్యము అనేక ప్రకారములుగ వర్ణింపబడింది. మంచి అందమైన ఈకలుగల రెండు పక్షులున్నాయి. అవి సయుజా (ఎడబాటులేని) మిత్రములు ఆ పక్షులు ఒకే వృక్షం మీద నివసిస్తాయి. వాటిలో ఒకటి తీయని ఫలాన్ని తింటుంది. ఇంకొకటి తినకుండ అభిచాకసీతి (చూస్తూంటుంది).

ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే ।

తయోరన్యః పిప్పలం స్వాదు
అత్తి అనశ్నన్ అన్యః అభిచాకశీతి ॥

జీవాత్మ, పరమాత్మలే ఆ రెండు పక్షులు. అందువల్లనే ఆ పక్షులు ఎడబాటులేని సఖులు. ఈపక్షులు నివసించే వృక్షం దేహము. పూర్వ కర్మల ఫలాలైన సుఖ దుఃఖాలే ఆవృక్ష ఫలాలు. జీవాత్మ దేహంతో తాదాత్మ్యమొనర్చుకొని, అహంకారంతో కర్మ ఫలాపేక్షతో కర్మలొనర్చి, కర్తృత్వాభిమానియై కర్మఫలాల్ని అనుభవిస్తాడు. పునర్జన్మలు పొందుతాడు. కాని పరమాత్మ కేవల సాక్షిమాత్రుడై, నిర్లిప్తుడై, అసంగుడై యుంటాడు. అందువల్ల అతడు ఎల్లప్పుడు ఆనందఘనుడై యుంటాడు.

అయిదవ అధ్యాయంలో సంసృతి కారణమైన క్షరము: మోక్ష హేతువైన అక్షరము; క్షర, అక్షరములకు భిన్నమై ఆ రెండింటిని నియమించునట్టి సాక్షియైన పరబ్రహ్మము స్పష్టీకరింపబడినవి. ఈ అధ్యాయములో క్షరముయొక్క భోగత్వము, అక్షరముయొక్క (జీవునియొక్క) భోక్తృత్వము, పరమాత్మయొక్క నియంతృత్వము వర్ణింపబడినవి. జీవుడు తన సంకల్పానుసారము వివిధ యోనులను పొందుటయు, అతడు పరమాత్మ జ్ఞానము పొందిన పిదప సకల విధములైన బంధనములనుండి ముక్తుడగుటయు ఇందు తెలుపబడినవి.

అంతిమాధ్యాయమైన ఆరవ అధ్యాయంలో పరమాత్మయొక్క స్వరూపం, మహత్వం ప్రతిపాదింపబడ్డాయి పరమాత్మ జ్ఞానం (Knowledge of the supreme self) వల్లనే సకలవిధములైన దుఃఖముల నివృత్తి కలుగుతుందని ఈ అధ్యాయంలో స్పష్టం చేయబడింది. పరమేశ్వరుని సాక్షాత్కారం పొందకుండ దుఃఖ నివృత్తి పొందడం అసంభవమని గట్టిగా చెప్పబడింది.

యదా చర్మవత్ ఆకాశం వేష్టయిష్యంతి మానవాః ।
తదా దేవం అవిజ్ఞాయ దుఃఖస్యాంతః భవిష్యతి ॥

భగవంతుని తెలుసుకోకుండ దుఃఖాన్ని అంతమొందింపజేయడం ఆకాశాన్ని మానవులు చర్మంలాగా చుట్టవేసినప్పుడే సంభవం. భగవంతుని సాక్షాత్కా

రించుకొన్న తరువాతనే దుఃఖాలు శోకాలు అంతిమొందుతాయి. దైవ సాక్షాత్కారం వినా, ఎవరైన దుఃఖ నివృత్తి కోసం యత్నిస్తే అతని ప్రయత్నాలన్నీ—ఆకాశాన్ని చుట్టివేయడానికి యత్నించే యత్నంలాగా—నిరుపయోగములౌతాయి. ఈ అధ్యాయంలో పరమేశ్వరుని దివ్య వైభవాన్ని గురించి. గురుభక్తిని గురించి తెలుపబడింది.

శ్వేతాశ్వతర ఋషిపుంగవుడు ఆత్మసాక్షాత్కారమును పడసిన మహానుభావుడు. అందువల్లనే ఆతడు ధైర్యంగా తన ప్రత్యక్ష అనుభవాన్ని ఇలా చెబుతాడు:

"వేదాహమేతం పురుషం మహాంతం.

I Know this Mighty Being,

ఈ మహాపురుషుని నే నెరుగుదును"

పాశ్చాత్య తత్వశాస్త్రజ్ఞులు తమ గ్రంథాలలో ఈ విధంగా చెప్పడం మనకు కనబడదు. వేదాంతంమీద చాల, చాల పుస్తకాలు వ్రాసి వారు కట్టకడపట ఇలా అంతంచేస్తారు: "The Absolute is beyond realisation. There is nothing beyond intellect. ఆత్మ అనేది సాక్షాత్కారానికి అతీతమైనది బుద్ధికి మించి యింక ఏమియులేదు. ఈ విధంగా వారు అనడానికి కారణం ఏమిటి? వారికి సాక్షాత్కారంలేదు వారికి పరిశుద్ధమైన సుసూక్ష్మమైన కుశాగ్రమైన బుద్ధిలేదు. వారికి తపశ్శక్తిలేదు. వారు తీవ్రమైన తపశ్చర్య చేయలేదు వారు తమ ఇంద్రియాల్ని, మనస్సును నిగ్రహింపలేదు. వారు ధ్యానాన్ని అభ్యసింపలేదు శ్వేతాశ్వతర ఋషిపుంగవుడు నిర్వికల్ప సమాధిలో బ్రహ్మజ్ఞానమును పొందినాడు. అందువల్లనే ఆతడు ధైర్యంగా తన ప్రత్యక్షానుభవమును "వేదాహమేతం పురుషం మహాంతం" అని ప్రకటించాడు.

శ్వేతాశ్వతర ఉపనిషత్తులో ఆదినుండి అంతంవరకు కేవలం పరమార్థ తత్త్వం నిరూపణం చేయబడింది. ఉపనిషదంతంలో పారమార్థిక విద్యా సాంప్రదాయం ఇలా తెలుపబడింది:

తపః ప్రభావాద్దేవప్రసాదాచ్చ బ్రహ్మ
హ శ్వేతాశ్వతరోఽథ విద్వాన్ ।

అత్యాశ్రమిభ్యః పరమం పవిత్రం
ప్రోవాచ సమ్యగృషిసంఘజుష్టమ్ ॥

బ్రహ్మమును సాక్షాత్కరించుకొని, తన తపశ్శక్తివలనను, భగవదనుగ్రహం వలనను ప్రాజ్ఞుడైన శ్వేతాశ్వతర మహర్షి సర్వ ఋషులచే సేవింపబడు చున్న పరమ పవిత్రమైన బ్రహ్మతత్త్వమును పరమహంస సంన్యాసులకు ఉపదేశించెను.

ఉపనిషద్ విద్యను గ్రహించడానికి అధికారిత్వం ఉపనిషదంతమున్న రెండుమంత్రాలలో తెలుపబడింది.

వేదాంతే పరమం గుహ్యం
పురాకల్పే ప్రచోదితం ।
నాప్రశాంతాయ దాతవ్యం
నాపుత్రాయాశిష్యాయ వా పునః ॥
యస్య దేవే పరా భక్తిః
యథా దేవే తథా గురౌ ।
తస్యైతే కథితా హ్యర్థాః
ప్రకాశంతే మహాత్మనః ॥

పూర్వకల్పమున ఉపదేశింపబడిన వేదాంతమునందలి ఈ పరమరహస్యాన్ని కాముకతలను నిగ్రహించుకొనినవానికిగాని, మాతా పితరులకు తన విద్యుక్త ధర్మాలను నిర్వర్తించని వానికిగాని గురునిలో దోషములుగాంచు అయోగ్యుడైన శిష్యునకు గాని బోధింపకూడదు.

ఎవనికి భగవంతునియెడ పరమ భక్తి గలదో, ఎవనికి భగవంతుని యెడ ఎంత భక్తిగలదో అంతభక్తి గురుపరేణ్యునియెడగలదో ఆ మహాత్మునకు ఈ ఉపనిషత్ సత్యములను తెల్పినచో అప్పుడే అవి శోభిల్లును.

శ్వేతాశ్వతరోపనిషత్తు వేదాంత - సాంఖ్య యోగ సూత్రముల మిశ్రణమును ప్రదర్శించును. ఈ యుపనిషత్తు బ్రహ్మము, ఈశ్వరుడు, జీవాత్మ విశ్వము, మోక్షము — వీనిని విశదపరచును. విశ్వస్వభావమునుగూర్చి

జీవాత్మనుగూర్చి ఈ ఉపనిషత్తు చక్కగ తెలియజేయును. జనన మరణ సంసార చక్రమున తగుల్కొనిన జీవాత్మను మోక్షోపాయము ఈఉపనిషత్తులో తెలియజేయబడినది. ఈ ఉపనిషత్తు జీవాత్మ ఈశ్వరుడు, విశ్వము, బ్రహ్మము — వీనివి గురించి మనకు వివేచనము కలిగించును. మరియు ఈ ఉపనిషత్తు మనకు యోగ విధానమును గురించియు యోగ గమ్యమును గురించియు, యోగ సాధనను గురించియు, యోగాభ్యాస ఫలితములను గురించియు తెలియజేయును. యోగమును మూడు రూపములలో అనగా కర్మయోగము, భక్తియోగము, జ్ఞానయోగము— ఈ మూడురూపములలో ఈ ఉపనిషత్తు పబోధించుచున్నది.

---

# ఉపోద్ఘాతము

## I ఎక్కడనుండి? ఎక్కడకు?

ప్రస్తుతం మనం ఏమిగా ఉన్నాం? ఇతఃపూర్వం మనం ఏమిగా ఉంటూండినాం? ఇక మీదట ఏమిగా ఉండబోతాం? మనజన్మకు ముందు మనం ఉండినామా? మన మరణాంతరువాత మనంఉండబోతామా? చనిపోయిన తరువాత మనం ఏమౌతాం?

యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే
అస్తీత్యేకే నాయమస్తీతి చైకే
ఏతద్విద్యామనుశిష్టస్త్వయాహం
వరాణామేష వరస్తృతీయః — కఠోపనిషత్తు.

యమధర్మరాజుతో నచికేతుడిలా అన్నాడు: "మానవుడు చనిపోయినపుడు— కొందరు అతడు ఉన్నాడని చెప్తారు: మరికొందరు అతడు లేడు అని అంటారు. — ఈ సందేహాన్ని గూర్చి మీరు బోధించగా నేను విని గోరు

తున్నాను. ఇవి నా వరములలో మూడవది." ఈ ప్రశ్నకు జవాబు లభించే వరకు దాన్ని వెన్నాడుతూంటాడు విజ్ఞుడైన మానవుడు. మూఢుడు సమాధానం కోసం ఎలాంటి ప్రయత్నం చేయడు. ఒక వేళ ప్రయత్నం చేసినా ఒకసమాధానానికి రాకపూర్వమే ఆ ప్రయత్నాన్ని వదలివేస్తాడు. ఈ మానవ జన్మలోనే భగవదనుగ్రహంవల్ల ఈ ప్రశ్నకు తగిన సమాధానం పొంద వచ్చు. ఈ ప్రసాదాన్ని మనం వ్యర్థం చేసుకోకుండ ఉండాలి. ప్రాజ్ఞులను మనం అనుసరించి, సమస్యను తీవ్రంగా ఆలోచించెదము. గాక!

ఈ ప్రపంచంలో మనకు సత్యాన్వేషణకై వివిధములైన ప్రమాణాలు ఉన్నాయి అవి ప్రత్యక్ష ప్రమాణం, అనుమాన ప్రమాణం, ఉపమాన ప్రమాణం, శబ్దప్రమాణం, అర్థాపత్తి ప్రమాణం అనుపలబ్ధి ప్రమాణం మొదలగునవి. సత్యాన్వేషణలో మనం ఎల్లవేళల ప్రత్యక్ష ప్రమాణంపైన, అనుమానం ప్రమాణంపైన ఆధారపడేందుకు వీలులేదు. కొన్ని భౌతిక దృగ్విషయములపట్ల గూడ ఈ ప్రమాణాలు పని చేయక పోవచ్చు ఒక దృష్టాంతం తీసుకొందాం. మనకు తల్లి తండ్రి యున్నారు. అతన్ని తండ్రియనిగాని, లేక ఆమెను తల్లియనిగాని ప్రత్యక్ష ప్రమాణంచేత ఋజువు చేయగలమా? మనంగా మనం అతన్ని తండ్రిగా, ఆమెను తల్లిగా చూచి యుండగలమా? చూచియుండలేము. అనుమాన ప్రమాణం చేతనైనా దాన్ని ఋజువుచేయగలమా? అలాకూడా వీలుకాదు. బిడ్డ పుట్టుతుంది. దానికి తల్లి తండ్రి ఉండడం చూస్తాం. అందువల్ల మనం పుట్టాము కాబట్టి మనకుతల్లి తండ్రి ఉండి ఉండాలని ఊహిస్తాము. కాని యిదికూడ అముక వ్యక్తి మన తండ్రియనిగాని, తల్లియనిగాని నిరూపింపజాలదు. కడకు మనం చక్కెర తీపిదనాన్ని ప్రత్యక్షప్రమాణం ద్వారా నిరూపించలేము. ఈరెండు ప్రమాణాలు (ప్రత్యక్షం, అనుమానం) ఇటువంటి చిన్న లౌకిక సమస్యలనే పరిష్కరింపలేనప్పుడు ఇక వీటిని పరమ సత్యంపట్ల ఎలా ప్రయోగింపగలం?

అందువల్ల మనం శబ్ద ప్రమాణాన్ని ఆశ్రయించాలి. అది ఆప్తవాక్యం. అతడు మన తండ్రియని. ఆమె మన తల్లియని చెప్పబడినాడు. అంతే, మనం దాన్ని విశ్వసిస్తాము. అలాగే ఋషులు తమ పరమ

తపశ్చర్యవల్ల సత్యాన్ని కనుగొని మనకు అందజేసినారు. ఈ సత్యం వేదములలో ఉంది దాన్ని మనం అకుంఠితంగా విశ్వసించాలి. అంతే.

వేదాలును రెండు భాగాలుగా విభజించారు. అవి కర్మకాండ, జ్ఞానకాండ. కర్మకాండ మనం చేయవలసిన పనుల (యజ్ఞయాగముల) ను గురించి తెలుపుతుంది. జ్ఞానకాండకు చేరుకొనేముందే మనం కర్మకాండ దశను దాటాలి. కర్మకాండ చిత్తశుద్ధి కోసం నిర్దేశింపబడింది. చిత్తశుద్ధి లేకుండ మనం జ్ఞానకాండలోని మనోజ్ఞమైన సత్యాలను అవగతం చేసుకోలేము. సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే. — గీతా ఓ పార్థా! అన్ని కర్మలు జ్ఞానమున పరిసమాప్తినొందును.

నిత్యమైన మన ప్రశ్నకు సమాధానం జ్ఞానకాండలో, అంటే వేదాంతంలో లభ్యమౌతుంది. వేదాంతం ఆత్మగుణాలను గూర్చి పూర్తి సమాచారం అందజేస్తుంది. అది ఆత్మకు బ్రహ్మమునకు గల సంబంధాన్ని గురించి చక్కగ తెలియజేస్తుంది. మన ప్రశ్నకు ఉపనిషత్తులు, భగవద్గీత స్పష్టమైన సమాధానాన్ని ఇస్తాయి.

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః. — గీతా. అసత్యమైనది, ఎన్నడూ లేదు. సత్యములయినది ఎన్నడూ లేకుండ యుండదు. అంటేదీన్నిబట్టి మనం సత్యవస్తువు (బ్రహ్మము) సదా యుంటుంది. అనే నిర్ధారణకు వస్తాము. అందువల్ల ఆత్మయొక్క మొదటి గుణం అమృతత్వమని మనం తెలుసుకోవాలి. అది అవిక్రియము. దాన్ని మనం మార్చలేము పదార్థము యొక్క రూపములు మాత్రం మారుతాయి కాని, అవి ఏమూలకములతో నిర్మితమైనవో అవి (అమూలకములు) ఎన్నడూ మార్పుచెందవు. మనం మట్టికుండనుపగులగొట్టినప్పటికీ, మట్టి యింకా ఉండనే ఉంటుంది. ఒకే మౌలికమైనభూతాలు భిన్న భిన్నంగా కనబడుతాయి, భిన్నరూపాలుగా కనబడుతాయి, కానీఈమూలకములు నాశమొందవు. శిల్పి శిలనుండి కృష్ణ విగ్రహాన్ని చెక్కుతాడు. ఆ కృష్ణ విగ్రహం రాతిలో ఇతఃపూర్వమే ఉండనే ఉంది. అందువల్లశిల్పి కృష్ణ విగ్రహాన్ని సృష్టించాడు, అని అనలేము. అయితే అతడు చేసిన పనిఏమిటి? అతడు హెచ్చుగా ఉన్నటువంటి రాతి పదార్థాన్ని

తీసివేశారు. అప్పుడు కృష్ణ విగ్రహం ఏర్పడింది. సృష్టియనే పదం సంస్కృతంలో "విసృజ్" అనే ధాతువునుండి వచ్చింది. 'విసృజ్' అంటే విసరు. ముందుకు తోసియు అని అర్థం. మనం మనచుట్టూ చూచేది అంతయూ బ్రహ్మము యొక్క ఉనికే. మనం శూన్యంలో నుంచి దేన్నీ సృష్టించలేం. ఆత్మ సదా ఉంటూనే ఉంది; దేహనాశం తర్వాత సైతం అది ఉంటూనే ఉంటుంది. పుట్టుకకు ముందు ఏమి జరిగిందో అది అంతా తెరవెనుక ఉండింది. ఇప్పుడు స్టేజీ మీదికి తేబడింది. నాటకంలోని పాత్రధారులు తెరవెనుక మనకు కనబడకుండ ఉన్నంత మాత్రాన వారు లేరని చెప్పడం సాధ్యమా? ఈసృష్టికూడ అటువంటిదే. అనగా తెరవెనుక ఉన్న పాత్రధారులను స్టేజీ మీదకు తేవడం వంటిదే ఈ సృష్టికూడా.

అప్పుడే పుట్టిన శిశువును దృష్టాంతంగా తీసుకొందాం. చిన్ని శిశువు హర్షాన్ని, శోకాన్ని భయాన్ని కనబరుస్తుంది. ఈ-జన్మలో అది చూస్తూన్న వస్తువులను గత జన్మలోని వస్తువులతో సరిపోల్చుకొంటుంది అని మనం అనుకొంటే తప్ప బిడ్డ భయాన్ని, శోకాన్ని హర్షాన్ని ప్రదర్శించడాన్ని వివరించలేము. గత జన్మలో హర్షమును, శోకమును, భీతిని పుట్టించే విషయాలు ఈ జన్మంలో సైతం అలాగే చేయడం జరుగుతుంది. గతాన్ని స్మరించడం పూర్వ జన్మమును ఋజువుచేస్తుంది. మరియు అది ఆత్మయొక్క అస్తిత్వాన్నికూడా ఋజువు చేస్తుంది అప్పుడే పుట్టిన శిశువు ఆకలి తీర్చుకోవడానికోసం, పూర్వజన్మలో తాను చేసిన పనిని స్మరించి, తన తల్లి రొమ్ము నుండి పాలుత్రాగుతుంది. తల్లి రొమ్మునుండి పాలు త్రాగడం బిడ్డకు ఇప్పుడు ఎవ్వరూ నేర్పలేదు. అందువల్ల తొలి జన్మయందలి అనుభవాన్ని స్మరించి ఆశిశువు ఇప్పుడు స్తన్యాన్ని కుడిచింది. బిడ్డయొక్క ఆత్మపూర్వపు దేహాన్ని విడిచిపెట్టినప్పటికిని క్రొత్త దేహాన్ని తీసికొని పూర్వ దేహపు అనుభవాల్ని స్మరిస్తుంది.

మనం యీ ప్రపంచంలోకి వచ్చేటప్పుడు కేవలం అంధకార, అజ్ఞానాలతో రాము. పూర్వజన్మ స్మృతులతో, అలవాట్లతో ఈ జన్మకు వస్తాము. పూర్వానుభవాలనుండి కోరికలు తలెత్తుతాయి. కోరిక లేకుండ ఎవడు పుట్టడు. ఇది మన అనుభవం. ఏవో కొన్ని కోరికలతో ప్రతి ప్రాణి ఉద్భవిస్తుంది.

అవి గత జన్మలోని వాటి అనుభవములకు సంబంధించినవై ఉంటాయి. ఈ కోరికలు పూర్వ జన్మలందలి అతని ఆత్మయొక్క అస్తిత్వాన్ని నిరూపిస్తాయి.

"నేను చచ్చిపోయాను" అని మనం ఎన్నడూ అనలేం. నేను అంటే జీవాత్మ. స్వప్నంలో మనం మనమృత దేహాన్ని చూస్తాము అప్పుడు మనం సాక్షిగా విశిష్టంగా ఉంటాము. మనం మనస్వదేహం చచ్చిపడియున్నట్లు చూస్తూ కూడ మనం జీవించియే యున్నాం. 'అహం' యొక్క స్వభావం అస్తిత్వ తెలియుచున్నది. జీవితమును గూర్చి 'ఎందుకు?' అనే ప్రశ్న వెలువడదు. హిమం ఎందుకు చల్లగా ఉంది అని ప్రశ్నించడం అలాగే అగ్ని ఎందుకు వేడిగా ఉంది అని ప్రశ్నించం. స్వభావము కాని దానికే 'ఎందుకు' అనే ప్రశ్న ఉదయిస్తుంది.

ఏది స్వాభావికం కాదో అది అశాశ్వతం. అసత్యం మనయొక్క అసలు స్వభావం అమృతత్త్వం మనం అన్యథా భావిస్తున్నాం కాబట్టి బాధ పడుతున్నాము. సందర్భవశాత్తు ఒక చేప నీటినుండి బయట పడింది. అది శ్వాసయాడక కొట్టుకొంటుంది. దానిమీద దయగొని, జాలిపడి దానిని యింటికి తీసుకవెళ్ళి. దానికి సకల పరిచర్యలు చేశాడు ఒక కరుణాళువు. కాని, అది అప్పటికి కొట్టుకొంటూనే ఉంది. అప్పుడతడు దాన్ని నీటిలో పారవేశాడు. ఆ ఝషం ఆనందంతో ఆ క్షణమే ఈదసాగింది. మన పరిస్థితి కూడా యిటు వంటిదే. మనం మన యథార్థ స్వరూపాన్ని విస్మరించాం అందువల్ల నీటి వెలుపలబడ్డ చేపలాగా దుఃఖపడుతూన్నాం. కాని, మనం మన యథార్థ స్వరూపాన్ని సాక్షాత్కారం చేసుకొంటే మనం మరల ఆనందంగా ఉంటాం. ఆత్మ స్వభావం ఎటువంటిది అనగా :

> అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో ।
> న హన్యతే హన్యమానే శరీరే ॥— గీత.

ఆత్మకు పుట్టుక లేదు. అది నిత్యమైనది. శాశ్వతమైనది. సనాతనమైనది. శరీరము చంపబడినను అది వధింపబడదు.

ఆత్మ సాక్షాత్కారం మన జీవిత గమ్యము. పరమేశ్వర ప్రత్యక్షీకరణమునకై మనము మన జీవిత అనుక్షణము యత్నింతము గాక!

## ద్వా సుపర్ణా సయుజా సఖాయా

రెండు పక్షులు ఒకే వృక్షంలో నివసిస్తున్నాయి. అవి ఎడబాటులేని మిత్రాలు. అందులో ఒక పక్షి ఫలాలను ఆరగిస్తుంది. ఇంకొకటి ఫలాన్ని ముట్టుకోకుండా ఊరకచూస్తూంటుంది. ఫలాలను తినేమొదటి పక్షి జీవుడు (జీవాత్మ). ఇంకొక పక్షి కూటస్థుడు. (సాక్షి. పరమాత్మ). వృక్షము విచిత్రమైన మాయా వృక్షం (సంసారం). ఫలాలు సుఖదుఃఖాలు (జీవుడొనరించిన కర్మఫలాలు).

మొదటి పక్షి (జీవుడు. మానవుడు) తాను రుచికరమైన పదార్థాలను తిన్నప్పుడు, తీయని పానీయాలను త్రాగినపుడు హర్షంతో ఉబ్బిపోతాడు. అతడు చేదు పదార్థాలను తిన్నప్పుడు, పంచదారలేని కాఫీ త్రాగినప్పుడు ముఖాన్ని ఒక విధంగా చిట్లించుకొంటాడు. అతనికి ఉద్యోగంలో ప్రమోషన్ వచ్చినపుడు, వివాహం అయినపుడు, పుత్రుడు పుట్టినపుడు ప్రహర్షితుడౌతాడు. కాని, అతని భార్యయో, కుమారుడో చనిపోయినపుడు. ఉద్యోగం ఊడిపోయినపుడు విషాదంతో విలపిస్తాడు. అతడు తమాషాగా మోటారు కారులో వెళ్ళేటప్పుడు నవ్వుతాడు. అతడు కీళ్ళ వాతంతో, రక్త విరేచనాలతో బాధపడేటప్పుడు ఏడుస్తాడు.

అతడు ఈ ప్రపంచ ప్రలోభాలచే ఆకర్షితుడౌతాడు. దేహసౌఖ్యానికోసం అతడు ప్రియమైనదాన్ని సుఖాన్ని కోరుకొంటాడు. అతడు శ్రేయస్సును కోల్పోతాడు. (He chooses the pleasant and loses the good). అతడు అంధకారం మధ్య జీవిస్తూ తాను ప్రజ్ఞానియని, మేధావియని కలలు కంటూంటాడు. అతడు అనేక వక్రమార్గాలలో చక్రభ్రమణం చేస్తూంటాడు. అతడు మోహితుడు అతనికి పరలోక జీవితాన్ని గురించి తెలియదు. అతడు ధనమోహంతో కడు మోహితుడౌతాడు. "ఇదే ప్రపంచం, ఇంకొక లోకంలేదు" అని అతడు భావిస్తాడు. ఈ విధంగా అతడు మరల మరల మరణ ప్రాబల్యానికి లోనౌతూంటాడు.

ఇష్టాపూర్తం మన్యమానా వరిష్ఠం ।
నాన్యత్ శ్రేయో వేదయంతే ప్రమూఢాః ॥ —కఠోపనిషత్తు

ఈ పరమ మూఢులు యజ్ఞాలను, దానాలను తమ అత్యుత్తమ లక్ష్యంగా భావిస్తారు. వారికి అంతకంటె గొప్పదైన శ్రేయస్సును గురించి తెలియదు.

బావులను త్రవ్వించడం, చెరువులు త్రవ్వించడం, దేవళాలను నిర్మించడం, అనుపత్రులను కట్టించడం, పేదలకు అన్నదానం చేయడం, ప్రజోపయోగమైన వనములు పెంచడం, దానధర్మాలు చేయడం మొదలగునవి స్మృతులచే విధింపబడిన కర్మలు. అజ్ఞానులు, మోహితులు, మూఢులు జీవితగమ్య సాధనకు ఇవే ముఖ్యమైన సహకారులని భావిస్తారు. యజ్ఞ యాగాలే అత్యుత్తమమైనవని భావించి, ఈ మూఢులు భార్యాబిడ్డలు బంధువులు, గొడ్డుగోదె, ఆస్తిపాస్తి — వీనిపై అత్యాసక్తి కలిగియుంటారు, వారికి వేరే పరమ గమ్యమును గురించి అవగాహన లేదు. అఖండానందానికి సాధనం ఆత్మజ్ఞానం అని వారికి తెలియదు.

మానవుడు ఈనాడు షడ్రసోపేతమైన విందులు ఆరగిస్తాడు రేపటి రోజున అతడు పస్తులుంటాడు ఈనాడు అతడు విమానంలో ప్రయాణిస్తాడు, రేపటిరోజున అతడు వట్టికాళ్ళతో ఘోర అరణ్యాలలో సంచరిస్తాడు ఈరోజు అతడు వ్యాపారంచేసి లక్షలు లాభాలుగడిస్తాడు రేపు అతడు దివాలాతీసి వీధులవెంట బిచ్చగాడుగ తిరుగుతాడు.

మానవుడు డిగ్రీలు, డిప్లమాలు బిరుదాలు, గౌరవాలు, అధికారం, పేరు, ప్రతిష్ఠ గడిస్తాడు. అతడు సురూపవతిని పెండ్లాడుతాడు తెలివిగల పిల్లల్ని కంటాడు ఏదేది అతనికి ఆనందం ప్రసాదిస్తుందని అనుకొంటాడో దాన్నంతా అతడు సమకూర్చుకొంటాడు అతనికి విశ్రాంతి కరువౌతుంది. అతడు ఒకనాడు ఈ ఐహిక వైభవం ఒక భ్రాంతి మాత్రమని తెలుసు కొంటాడు.

మానవుడు కర్మలాచరించి ఫలాల్ని ఎదురుచూస్తాడు అతని కారణ శరీరంలో, చిత్తంలో సంస్కారాలు నిక్షేపమౌతాయి. ఈ ప్రేరిత కర్మల్ని క్రియమాణ (ఆగామి) కర్మలంటారు. ఈ ఆగామి కర్మలు సంచితకర్మలతో కలుపబడుతాయి. ఈ జన్మలో అతడు తన ప్రారబ్ధ కర్మఫలాల్ని అనుభవిస్తాడు అతనికి ఈ దేహాన్ని యిచ్చింది ప్రారబ్ధ కర్మ. ఆత్మజ్ఞానంచే సంచిత కర్మలు నశిస్తాయి. సాక్షిభావంతో, నిష్కామ్య భావంతో కర్మలు

ఆచరిస్తే ఆగామి కర్మలు ఏమీచేయవు కాని. ప్రారబ్ధ కర్మ ఫలాలను అనుభ వింపవలసి యుంటుంది.

మానవుడు కర్మఫలాపేక్షలేకుండ కర్మలు చేస్తే అతనికి దేహం ధరించడం. భాధలనుభరించడం ఉండదు. అతడు కర్మలనుండి ముక్తి పొందాలంటే రాగద్వేషాలను (అభిమానాన్ని) నాశంచేయాలి. అతడు రాగద్వేషాలను తొలగించుకోవాలంటే అహంకారాన్ని నిర్మూలించాలి. అతడు అహంకారంలేకుండా ఉండాలంటే అవివేకాన్ని అంతం చేయాలి. అతడు అవివేకం లేకుండా ఉండాలంటే అవిద్యను ధ్వంసంచేయాలి. మానవుని సర్వదుఃఖాలకు అవిద్యయే మూలకారణం.

ఈ జీవుడనే పక్షి భౌతికకాయాన్ని వదలి, తాను చేసిన పుణ్యకర్మల ఫలాల్ని అనుభవించేదాని కోసం సూక్ష్మ శరీరంతో స్వర్గానికి వెళ్ళుతుంది. అక్కడ అప్రాకృత సుఖాలను అనుభవించి. పుణ్యం క్షయించిన వెంటనే. ఈ మర్త్యలోకానికి తిరిగి వస్తుంది. ఈ విహంగం సూక్ష్మశరీరంతో బాటు సంస్కారాలను, వాసనలను మోసుకొని పోతుంది. ఈ రావడం. పోవడం విధానాన్ని అవగమనం అంటారు. ఈ అవగమనం బ్రహ్మజ్ఞానం కలిగే వరకు జీవుడు స్తూనే ఉంటాడు.

రెండవ పక్షి సాక్షి స్వతస్సిద్ధమైనది. సుఖదుఃఖాలు. పుణ్యాపాపాలు, రాగద్వేషాలు అతనిని (రెండవ పక్షిని) ఏమీచేయలేవు సుఖం. దుఃఖం, పుణ్యం, రాగం, ద్వేషం అనేవి అతఃకరణం యొక్క ధర్మాలు. అవి శుద్ధమైన, స్వయం ప్రకాశకమైన, అమృతమైన, సూక్ష్మమైన, సర్వగతమైన, నిర్గుణమైన. నిరాకారమైనసాక్షిని ఏమీ చేయలేవు. అంతఃకరణ ధర్మాలైన సుఖ దుఃఖాలు ఈ రెండవ పక్షిని అంటవు. అది వాటిచే నిర్లిప్తము. క్రీడలలో జయాపజయాలవల్ల బాధపడేవారు ఆటగాండ్రే కాని, ప్రేక్షకులు కారు కదా! కేవల సాక్షియై ఫలములను అశనము చేయని ఆపక్షిసత్తముడు సకల విధ ద్వంద్వములచే నిర్లిప్తుడు. అతడు సర్వ కర్మ బంధములనుండి వినిర్ముక్తుడు.

జీవుడు యజ్ఞదానతపః కర్మలుచేసి పావనుడౌతాడు అతడు నిష్కామ సేవ చేస్తాడు. దానధర్మాలుచేస్తాడు.పుణ్య కర్మలుఆచరిస్తాడు. వీటివల్ల అతడు చిత్తశుద్ధిని పొందుతాడు. అతడు ఆత్మసంయమం. మనోనిగ్రహం. ఇంద్రియ నిగ్రహం అభ్యసిస్తాడు. అతడు ఉత్తమ సద్గుణాలను అలవరచుకొంటాడు. అతడు మోక్షసాధనములైన సాధన చతుష్టయాన్ని అలవరచుకొంటాడు. వివేకం,వైరాగ్యం. శమం. దమం. ఉపరతి. తితిక్ష శ్రద్ధ. సమాధానం, ముముక్షుత్వం — ఈ తొమ్మిదింటిని సాధన చతుష్టయం అంటారు. బ్రహ్మజిజ్ఞాసువు ఆధ్యాత్మిక పథంలో గమించడానికి ఈ తొమ్మిది సద్గుణాలు చాలాఆవశ్యకం అతడు శ్రుతులను శ్రవణం చేస్తాడు. తరువాత అతడు విన్నవిషయాలను మననంచేస్తాడు. తదుపరి అతడు ఉపనిషన్మహా వాక్యముల (అహం బ్రహ్మాస్మి. తత్త్వమసి) పై ధ్యానిస్తాడు. క్రమేణ అతడు ఆత్మజ్ఞానాన్ని పొందుతాడు. ఈవిధంగా అతడు కూడా కర్మఫలాలను అశనం చేయడు. అతడు కర్మబంధ వినిర్ముక్తుడౌతాడు. అతడుకూడ పండును తినకుండ రెండవ సాక్షిపక్షివలె ఊరక చూస్తూంటాడు.

> ద్వా సుపర్ణా సయుజా సఖాయా
> సమానం వృక్షం పరిషస్వజాతే ।
> తయోరన్యః పిప్పలం స్వాదు అత్తి
> అనశ్నన్ అన్యో అభిచాకశీతి ॥
>
> —శ్వేతాశ్వతరోపనిషత్తు VI—6

సదా ఎడబాటులేని మిత్రములుగనున్న రెండు పక్షులు ఒకే ఒకవృక్షములో నివసించుచున్నవి. ఆ రెండు పక్షులలో ఒక పక్షి తీయని ఫలమును తినును. ఇంకొక సుపర్ణము ఆఫలమును స్పృశించకుండ కేవలము వీక్షించుచుండును.

## III బ్రహ్మము, జీవుడు, జగత్తు.

### బ్రహ్మము

ఆదిదేనికి ఉందో అది అసత్తు. అంతం దేనికి ఉందో అదికూడ

అసత్తే. ఏది గతంలో, వర్తమానంలో, భవిష్యత్తులో ఉంటుందో అది సత్తు. త్రికాలలో ఉండేది బ్రహ్మము ఒక్కటే అందుచల్ల బ్రహ్మమే సత్యము. సత్యవస్తువు మాత్రమే నిత్యమైనది మార్పులేనిది ఆదిలేనిది అంతములేనిది కాగలదు ఆదిలో లేనిది, అంతంలో లేనిది నడుమకూడా లేనిదే అనాలి.

సకల నామ రూపాలకు అధిష్ఠానమైనది బ్రహ్మము. అద్వైత వస్తువు అయిన బ్రహ్మమునుండి సమస్తము ఉద్భవిస్తుంది. బ్రహ్మము ఆనందమునకు ఉద్గమస్థానము

లోలోపల వెలుగొందే శాశ్వత సత్యము బ్రహ్మము. ఇంద్రియములు దేహము మనస్సు, బుద్ధి మొదలగునవి అంతస్సత్యాన్ని కప్పేటటువంటి బాహ్యమైన ఆచ్ఛాదనాలు. ఈ కోశాలన్నీ బ్రహ్మముయొక్క వ్యక్తస్వరూపాలే. అవి బ్రహ్మములో నెలకొనియున్నాయి. బ్రహ్మము సారవస్తువు.

మానవునకు అన్నిటికంటె అతిప్రియతమమైన వస్తువు ఆత్మ. ఆత్మ కోసమే అన్నీ ప్రియమైనవి. ఆత్మ అఖండ ఆనందానికి ఉద్గమస్థానం.

సృష్టి సంహారాలు దృగ్విషయాలే. అవి మాయ యొక్క ఇంద్రజాలం. అవి మనస్సుయొక్క ఇంద్రజాలం. వాస్తవంలో ఏదీ సృష్టింపబడలేదు. ఏదీ నాశంకాలేదు. బ్రహ్మము ఈ దృగ్విషయాలకు అతీతుడు

బ్రహ్మము అనంతం. అతడు నిత్యము, అమృతము అనంతం ఒక్కటే రెండు అనంతాలు ఉండేందుకు వీల్లేదు మార్పులేనిది, అవిక్రియమైనది, అఖండమైనది. అద్వితీయమైనది. ఆదిలేనిది, అంతములేనిది. దేశరహితమైనది. కాలరహితమైనది, కారణరహితమైనది, అనంతము కాగలదు. బ్రహ్మములో కలలు, అంశములు, భాగములు ఉంటే బ్రహ్మములో నానాత్వం ఏర్పడుతుంది. బ్రహ్మములో వైవిధ్యాలు ఉండేందుకు వీల్లేదు

బ్రహ్మము స్వయంప్రకాశకుడు, స్వయంభువు పరిపూర్ణుడు. ఆత్మస్థితుడు స్వప్రకాశకుడు. బ్రహ్మమును బ్రహ్మమే భాసింపజేసుకొంటాడు. అతడు సర్వదా జ్యోతిర్మయుడు. అతని సహజ స్వభావం స్వప్రకాశం బ్రహ్మము అనంతము. అశరీరము, కాలరహితము అయినదానివల్ల అతడు

అజము. అమరము. బ్రహ్మము శూన్యం కాదు. ఏలనంటే అతడు "శుద్ధ చైతన్యం". నిద్రావస్థలో ఉండేది అజ్ఞానం. బ్రహ్మము శుద్ధ చైతన్యం. అది సత్యస్య సత్యం. అది సర్వుల ఆత్మ.

జీవాత్మలు, ప్రపంచము — ఇవి అసత్యం. "బ్రహ్మము ఒక్కటే సత్యము, నిత్యము.

## జీవుడు

జీవాత్మ పరమాత్మ వేర్వేరు కాదు. పరమాత్మను అర్చించి జీవాత్మ పరబ్రహ్మమౌతాడు. "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" బ్రహ్మమును తెలుసుకొన్నవాడు బ్రహ్మమగును.

పాలలో పాలు కలిసినట్లే జీవాత్మ పరమాత్మల సంయోగం. ప్రత్యేక వ్యక్తిత్వం అంతమొందింది. జీవాత్మ పరమాత్మతో తాదాత్మ్యం చెందుతాడు. ఒకే చైతన్యం (సారవస్తువు) ఈ యావద్విశ్వాన్ని పరివ్యాపించి యున్నదని అతడు తెలిసికొంటాడు.

జీవుడు పొరబాటున దేహాన్ని, తదితర ఉపాధులను తనపై ఆరోపించుకొని, వాటితో తాను తాదాత్మ్యం చెందుతాడు. ఈ తాదాత్మ్యమే బంధము ఈ తాదాత్మ్యమునుండి విమోచనం పొందడాన్ని మోక్షం అంటారు ఈ తాదాత్మ్యాన్ని కలుగజేసేదేది? అవిద్య ఈతాదాత్మ్యానికి కారణం అవిద్య. ఈతాదాత్మ్యాన్ని తొలగించేది ఏది? అవిద్య విద్యను, తత్కార్యములను ఆత్మజ్ఞానం తొలగిస్తుంది. పరమానంద ప్రాప్తి, సకల విధ దుఃఖ నివృత్తి — ఇవే మోక్ష స్వరూపం.

జీవుడు తత్త్వతః అమృతాత్మయే. అతడు మోహంవల్ల తన్నుతాను." పంచకోశములతో తాదాత్మ్యం చేసుకొంటాడు. అతడు "అన్నమయ కోశం తానేయని అనుకొని భౌతిక కాయం భస్మమైతే తానే భస్మమైనట్లు భావిస్తాడు అతడు "ప్రాణమయ కోశం" తానేయని అనుకొని "నాకు ఆకలిగా ఉంది

నాకు దప్పిక వేస్తూంది. నేను ఫలానా పని చేశాను" అని భావిస్తాడు. అలాగే అతడు "మనోమయ కోశం" తో తాదాత్మ్యం చెంది "నేను కాముకుణ్ణి, నేను కుపితుణ్ణి. నేనుపరమ లోభిని" అని వాపోతాడు. అతడు 'విజ్ఞానమయకోశం' తో తాదాత్మ్యంచెంది "నేనుకుశాగ్రమతిని, నేను సర్వజ్ఞుణ్ణి, నేను మహాభోక్తను" భావిస్తాడు. తరువాత అతడు 'ఆనందమయ కోశం' తో తాదాత్మ్యమై "నేను సుఖిని' అని భావిస్తాడు ఈ పంచకోశాలు మానవుని యొక్క అసలు ఆత్మకు భిన్నమైనవే ఐదు పాత్రలు ఒకదానిలో ఒకటి యున్నట్లుగా, ఉల్లిగడ్డ పొరల వలె ఈ కోశాలు ఒకదానిలో ఒకటి యున్నది. పరమాత్మ ఈ పంచకోశములచే కప్పబడియున్నది. జ్ఞానం అజ్ఞానంచే కప్పబడియుంది. "అజ్ఞానేన ఆవృతం జ్ఞానం — గీతా.

జీవుడు పంచ క్లేశములచే సంసారంలో చిక్కుకోపోయాడు. అవి 1.అవిద్య (అజ్ఞానము), 2. అస్మితము (అహంకారము), 3. రాగద్వేషము (అనురాగము, ఈర్ష్య). 4. అభినివేశము (జీవితమునకు అంటిపెట్టుకొని యుండుట. అతడు ఈ యిహ జీవనానికి మూడు గ్రంధులతో (ముడులచే) బద్ధుడౌతాడు, ఆ మూడు గ్రంధులు ఏవన; 1 అవిద్య 2 కామము 3. కర్మ.

ఈ మూడు గ్రంధులు, పంచక్లేశములు ఛేదింపబడి నాశనమైనప్పుడు జీవాత్మ పరమాత్మతో ఐక్యమై నిత్యానందమును పొందురాడు. ఆత్మజ్ఞానం వల్ల గ్రంధులు, క్లేశములు అంతమొందుతాయి.

# జగత్తు

త్రాడును పాముగా భ్రమిస్తాము. ముత్యపు చిప్పను వెండి యని అనుకొంటాం. ఎండమావులను సరోవరం అనుకొంటాం స్తంభాన్ని మనుజుడు అని అనుకొంటాం దేహాన్ని, ప్రపంచాన్ని పరిశుద్ధ ఆత్మయని అనుకొంటాం. ఇదంతా దేనివల్ల? మిథ్యారోపణవల్ల త్రాటిని పాముగా అంటున్నాం మనం పామునకు అధిష్ఠానాన్ని తెలిసికొన్నప్పుడు, అనగా అది త్రాడు అని

తెలిసికొన్నప్పుడు తాడుగా దానిని గూర్చిన జ్ఞానం కలిగినప్పుడు. పాము యొక్క భ్రాంతి భయం అదృశ్యమౌతాయి అలాగే బ్రహ్మజ్ఞానం కలిగినప్పుడు ఈ దేహాభావం అదృశ్యమౌతుంది జగత్తుయొక్క సత్యత్వం పూర్తిగ అదృశ్య మౌతుంది. ఈ కష్టాలన్నిటికి, బాధలన్నిటికి దుఃఖాలన్నిటికి మూల కారణం ఏమిటి ? ఈ శోకాలన్నిటికి మూల హేతువు అవిద్య దేహమే ఆత్మ యనెడి మిథ్యా మనోభావనమే మానవకోటియొక్క సకల విధ దుఃఖములకు మూల కారణము.

గాఢమైన నిద్రలో ప్రపంచం లేదు. మనస్సు ఉంటేనే జగత్తు ఉంటుంది. మనస్సులేని చోట జగత్తులేదు. మనస్సుకైతం నశ్వరమైనదే. మనస్సునకుండే ఆకర్షణలు, వికర్షణలు పూర్తిగా నశిస్తే మనస్సు నాశనమౌతుంది. మనస్సుజడం. అది అవినాశికాదు. అది వినాశి. అది సత్వగుణకార్యం. చిత్తశుద్ధి, ఏకాగ్రత ద్వారా మనం ఈ మనస్సును ధ్వంసంచేయగలిగితే యీ ప్రపంచం అదృశ్యమౌతుంది. మనోనాశమైనపుడు సకలము బ్రహ్మమే యౌతుంది అప్పుడు సర్వత్ర బ్రహ్మమే కనబడుతుంది.

ప్రపంచ ఆకర్షణ ఎలా తొలగుతుంది ? జిజ్ఞాసువు రెండు గదులు ఉంచుకోవాలి. ఒకటి అన్న, పాన, స్నానాదులకు, ఇంకొకటి అధ్యయన, ధ్యానాదులకు. ఒకమాసం రోజులు అతడు తన గదిలో ఏకాంతంగా గడపాలి. వార్తాపత్రికలు చదవడం పూర్తిగా మానేయాలి. న్యూస్ పేపర్ పఠనం ప్రాపంచిక సంస్కారాలను పునరుద్దీపితం చేస్తుంది. అది మనస్సును కలవరపెడుతుంది, భావోద్రేకాలను పుట్టిస్తుంది, మనస్సులో కలతలు తెచ్చిపెడుతుంది. అది భగవంతుని మరచేటట్లు చేస్తుంది కేవల దృశ్యమానమైన యీ ప్రపంచాన్ని మనకు ఘన సత్యంగా కనబడేటట్లు చేస్తుంది. ఎంతసేపూ జిజ్ఞాసువు గదిలోనేయుండాలి అతడు గదినుండి బయటకు రాకుండా యుండాలి. అతడు తన కాలాన్నంతా స్వాధ్యాయంలో. ధ్యానంలో గడపాలి. అన్నిసంబంధాలు తెగదెంచుకోవాలి, అప్పుడు అతనికి ప్రపంచ ప్రజ్ఞయే యుండదు ఒకవేళ ఉన్నా పూర్వంలాగా ఈ ప్రపంచం అతన్ని ఆకర్షించలేదు, అలాగే జిజ్ఞాసువు

ధ్యానంలోనే నిమగ్నుడై, ఆత్మలో విశ్రమిస్తూంటే అతనికి ఈ ప్రపంచం పూర్తిగా అదృశ్యమౌతుంది ప్రపంచం అతనికి స్వప్నవత్ ఔతుంది.

బ్రహ్మమతో పోలిస్తే యీ ప్రపంచం మిథ్య. కాముకుడైన విషయాసక్తునకు ఈ ప్రపంచం ఒక ఘనసత్యం, జీవన్ముక్తునకు ఈ ప్రపంచం కాలిన గుడ్డలాగా గోచరిస్తుంది. దేహప్రజ్ఞలేని విదేహ ముక్తునకు అసలు జగత్తు లేనేలేదు. వివేకికి ఈ ప్రపంచం పట్ల ఎటువంటి ఆకర్షణ యుండదు. ఏవో గ్రంథాలలో ఈ ప్రపంచం మిథ్యయని చదివిన దానివల్ల మనం యీ ప్రపంచాన్ని విడినాడి, అరణ్యాలలోకి ప్రవేశించకూడదు. సరియైన ఆధ్యాత్మిక అర్హతలు లేకుండ జిజ్ఞాసువు అడవికి వెళ్ళితే అతడు పాడైపోతాడు. కాని, మన మెల్లర "బ్రహ్మ సత్యం" జగన్మిథ్య' అనే భావనలో స్థిరులై యుండాలి, ఈ భావనలో వైరాగ్యాన్ని, ముముక్షుత్వాన్ని పెంపొందిస్తుంది. మనం యీ ప్రపంచంలో ఉండాలి, కాని ప్రాపంచికులు కాగూడదు. ప్రపంచంలో ఉండే మనం మోక్షప్రయత్నం చేయాలి.

మిత్రులారా! మనం మాయావాదాన్ని, అజాతివాదాన్ని అపార్థం చేసుకోకూడదు. శాస్త్రాల ఉపదేశం ఏంటి? జిజ్ఞాసువులు మోక్ష సాధన సామగ్రియైన సాధన చతుష్టయ సంపన్నులు కావాలి ఇది మొదటి అర్హత. ఇది ఆధ్యాత్మిక జీవనానికి పునాది, తరువాత వారు సద్గురు చరణములను ఆశ్రయించాలి. గురు ముఖతః శాస్త్రములను వినాలి, విన్న విషయాల అసలైన అర్థాలపై మననం చేయాలి, తరువాత ఉపనిషత్తు మహా వాక్యములపై అనుసంధానం చేయాలి ఆత్మ సాక్షాత్కారం పొందాలి.

## IV మోక్షము, ఈశ్వరుడు

## మోక్షము

మోక్ష స్వరూపం సర్వ దుఃఖ నివృత్తి. పరమానంద ప్రాప్తి. దేహము. రాగము. ద్వేషము, అజ్ఞానము. అహంకారము. అభినివేశము; ఆధ్యాత్మిక

అధి భౌతిక, అధిదైవిక తాపములు; జననము,మరణము ముసలితనము, రోగము—ఇవన్నియు వివిధ రకములైన బాధల్ని కలుగజేస్తాయి. జిజ్ఞాసువు మోక్షన్ని పొందితే ఈ సర్వ దుఃఖములు నాశనమౌతాయి.

సంసార బంధములనుండి విడుదలను మోక్షం అంటారు. మోక్షం అంటే ఏదో ఒక దానిని పొందడం కాదు. మోక్షం కర్మాచరణవలన పొంద బడే వస్తువు అయితే అది నిత్యమైనది అయ్యేందుకు వీల్లేదు. అది ఎప్పుడూ ఉండనేఉంది. సర్వమూ వాస్తవములో బ్రహ్మమే. అయితే సాధించవలసినది ఏమిటి? వేర్పాటు భావనను నశింపజేయాలి. వేర్పాటు నశిస్తే మోక్షం సులభ సాధ్యమౌతుంది. అన్ని సాధనలు అవిద్యా నివృత్తినే, వేర్పాటు భావనా నిర్మూలననే ఉద్దేశిస్తాయి. తెరను తొలగిస్తే సాధకుడు తన నిరాడంబ స్థితిలో ప్రకాశిస్తాడు.

మోక్షం జీవిత గమ్యం మనం మోక్షాన్ని పొందితే ఈ భూతలంలో మన జీవితం అంతమౌతుంది ఇక జనన మరణాల నుండి విమోచనం కలుగుతుంది మోక్షం మనకు పరమానందాన్ని ప్రసాదిస్తుంది. మోక్షం అంటే వినాశం కాదు. జీవాత్మ పరమాత్మ అభేదత్వ సాక్షాత్కారమే మోక్షము. మనో నాశంవల్ల, స్వల్ప అహమును విధ్వంసంచేయడంవల్ల నిత్యానందం అమృతత్వం లభ్యమౌతాయి

ఏదో చచ్చిపోయిన తరువాత మనకు కలిగే స్థితిని మోక్షం అనుకోవడం పొరబాటు మోక్షం అనేది ఎప్పుడో ఎక్కడో సంభవించే విషయం కాదు. అది ఇప్పుడే, ఇక్కడే సాక్షాత్కరించుకోగల పరమస్థితి, జీవన్ముక్తుడు ఎక్కడకూ వెళ్ళడు, అతని మనస్సు. ప్రాణము శుద్ధ చైతన్య బ్రహ్మములో లీనమౌతాయి అతని ప్రాణాలు ఉత్క్రమించవు. "న తస్య ప్రాణాః ఉత్క్రామంతే "అతడు అఖండైక రసబ్రహ్మముతో తాదాత్మ్యం పొందుతాడు.

శ్రుతులలో ఇలా చెప్పబడియుంది :

భిద్యతే హృదయగ్రంథిః
ఛిద్యంతే సర్వసంశయాః ।

క్షీయంతే చాస్య కర్మాణి
తస్మిన్ దృష్టే పరావరే ॥

— ముండకోపనిత్తు,

కారణము, కార్యము ఉభయములైన అతని దర్శనముతో హృదయ గ్రంథి భేదపడును, సర్వ సంశయములు తీరును, అతని సకల కర్మలు నశించును.

యథా నద్యః స్యందమానాః సముద్రేఽస్తం
గచ్ఛంతి నామరూపే విహాయ ।
తథా విద్వాన్ నామరూపాద్విముక్తః
పరాత్పరం పురుషముపైతి దివ్యమ్ ॥

— ముండకోపనిషత్తు.

ప్రవహించెడి నదులు తమ నామ రూపములను పోగొట్టుకొని సముద్రములో అదృశ్యమగును అట్లే జీవన్ముక్తుడు నామ రూపములనుండి ముక్తుడై పరాత్పరుడైన దివ్య పురుషుని చేరును.

తత్ర కో మోహః కశ్శోక ఏకత్వమనుపశ్యతః.

ఈశోపనిషత్తు.

అతడెట్లు మోహితుడు కాగలడు? అతడు సర్వత్ర ఏకత్వమునే చూచుండగ శోక మెట్లుయుండును?

తద్వాత్మతత్త్వం ప్రసమీక్ష్య దేహీ
ఏకః కృతార్థో భవతే వీతశోకః.

— శ్వేతాశ్వతరోపనిషత్తు.

జీవాత్మ ఆత్మ తత్త్వమును దర్శించినప్పుడు అతడు తన ఏకత్వమును తెలిసికొనును, జీవిత గమ్యమును పొందును, మరియు శోకమునుండి విముక్తుడగును

"తురీయం" అనేది ఆధ్యాత్మిక స్థితి, తురీయ స్థితిలో మనస్సుయొక్క ఆట యుండదు; మనస్సు బ్రహ్మములో లీనమౌతుంది అది నాల్గవ ప్రమేయం. అందు అనంతమైన బ్రహ్మానందం విలసిల్లుతుంది. అది జడావస్థ కాదు.

అది విస్మృతి స్థితి కాదు అది సర్వ సంపూర్ణ ప్రజ్ఞాస్థితి. అది అంత్య గమ్యం. అదే ముక్తి. అదే మోక్షం.

వాసనా క్షయము, సంకల్పక్షయము మనో నాశానికి దారితీస్తాయి. మనో నాశమైనప్పుడు జీవాత్మ పరమాత్మతో అభేదత్వం పొందుతాడు. అతడు నిత్యుడైన, అద్వితీయుడైన పరబ్రహ్మము ఔతాడు. అతడు సత్తామాత్రుడౌతాడు

"తత్" త్వం అసి" – ఈ సత్యాన్ని కనుగొనడమే మోక్షము.

## ఈశ్వరుడు

మనం భగవంతుని వ్యావహారిక దృష్టితో చూస్తే అతన్ని ఈ ప్రపంచానికి కారణంగా, సృష్టికర్తగా, రక్షకుడుగా, లయకర్తగా భావించవచ్చు. అందువల్ల అతనిని సర్వశక్తిమంతుడుగ, సర్వజ్ఞుడుగ, ఈశ్వరుడుగ భావించవచ్చు. అప్పుడతడు గుణములతో విలసిల్లుతూ ఉన్నట్లు కనబడుతాడు. ఈ విషయంలో భగవంతుడు సగుణ బ్రహ్మము, లేక ఈశ్వరుడు అని వ్యవహృతముచేయబడుతాడు. అతడు ప్రత్యక్ష భక్తులకు ఆరాధ్యవస్తువు ఔతాడు. సగుణ బ్రహ్మములో, అనగా ఈశ్వరునిలో మనం సకల కల్యాణగుణములు గాంచవచ్చు. అతడు అనంత కల్యాణ గుణ సమన్వితుడు. సగుణ బ్రహ్మము, నిర్గుణ బ్రహ్మము ఇరువురు బ్రహ్మములని పొరబడరాదు. అవి రెండూ ఒకే సత్యవస్తువు. పారమార్థిక, దృష్ట్యా వ్యావహారిక దృష్ట్యా అలా పిలువబడుతున్నాయి.

ఈశ్వరుడు పరమాత్మ. అతడు సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు. అతడు ప్రకృతికి ఆత్మ. అతడు విశ్వానికి ప్రాణం. అతడు అన్ని అశుభములకు అతీతుడు, అతడు ఈ ప్రపంచానికి సృష్టికర్త పాలకుడు. నాశకుడు. అతడు సర్వ జగత్తును వ్యాపించును. అతడు అంతర్యామి.

నిర్గుణ బ్రహ్మము సగుణ బ్రహ్మమునకు విరుద్ధతత్త్వము కాదు. నిర్గుణ బ్రహ్మముయొక్క పిండితార్థము సగుణ బ్రహ్మము సగుణబ్రహ్మము నిమిత్తకారణము, ఉపాదాన కారణము. ప్రపంచం అతని నుండి వెలువడి, అతనిలో ఉంటుంది. బ్రహ్మముగావిశ్వము మారదు. బ్రహ్మము తన అనిర్వచనీయ మాయాశక్తి ద్వారా ఈ జగత్తుకు కారణమౌతాడు. బ్రహ్మముపై ఈశ్వరత్వము మిథ్యారోపణం చేయబడింది.

ఈశ్వరుడు స్వయంభువు. అతనికి కారణం లేదు. అతడు కార్యం లేదు. అతనికి ఆదిలేదు కావున అతడు మొదటి కారణం ఔతాడు. ఈ సకల సచరాచర జగత్తు బ్రహ్మముయొక్క స్వరూపమే.

ఈశ్వరుడు మాయావిశిష్ట చైతన్యం. ఈశ్వరలోకం లేదు. పామరులు శివుణ్ణి ఈశ్వరుడు అంటారు. శివునిలోకం కైలాసం. కార్యబ్రహ్మము యొక్క లోకం బ్రహ్మలోకం. హిరణ్యగర్భుని ఉపాసకుడు బ్రహ్మలోకం జేరుతాడు.

ఈశ్వరుడు ఈ లోకపాలకుడు. మాయ అతని కారణ శరీరం. ఈ అనిర్వచనీయ మాయాశక్తి అతని వశంలో ఉంటుంది. ఈ మాయశుద్ధ సత్వం. భగవంతుడు సర్వజ్ఞుడు. సర్వవ్యాపి. సర్వశక్తిమంతుడు. అతడు దయాసాగరుడు అతడు దీనబంధువు. దీననాథుడు. అతడు భక్తవత్సలుడు అతడు కరుణాసాగరుడు. కృపానిధి. దీనదయాళుడు. అతడు సాకారుడు. సగుణుడు అతడు సవిశేష బ్రహ్మము. అతడు భక్తిచే గమ్యుడు. ఈ ప్రపంచం ఉన్నంతవరకు ఈశ్వరుడు ఉంటాడు విశ్వప్రళయంలో ఈశ్వరుడు ఉండడు. సర్వజ్ఞత్వం, సర్వశక్తిమత్వం, సర్వవ్యాపిత్వం మొదలగునవి బ్రహ్మమునకు తటస్థ లక్షణాలు. అందువల్ల ఎంతకాలం ప్రపంచం కనబడుతుందో అంతకాలం ఈశ్వరుడు ఉన్నట్లే.

సృష్టికర్తగ భగవంతుని పాత్రను గౌణమనాలి. మానవుల కర్మలకు తగిన విధంగా భగవంతుడు సృష్టిని కలుగజేసాడు. వృక్షాలకు వర్షంవంటివాడు పరమేశ్వరుడు. వృక్షాలకు నీరు అవసరమే. కాని వాని పెరుగుదల వానమీద గాక వాని విత్తనాల స్వభావం మీద ఆధారపడుతుంది

సృష్టించేదానికి ఈశ్వరునకు ఏ పనిముట్లు పనిలేదు అతడు తన మహా శక్తులచే వివిధ కార్యములలోనికి మారగలడు. అతనిలో సర్వశక్తులు ఉన్నాయి. భగవంతునకు బాహ్య సహకారం అవసరం లేదు భగవంతుని సృష్టి మానవ కార్యాలాంటివి కావు. పాలు పెరుగుగా మారినట్లు ఈశ్వరుడు తన్ను తాను ఈ జగత్తులోనికి మార్చుకొంటాడు. ఈ వైవిధ్యం గల ప్రపంచం ఈశ్వరుని నుండి ఉద్భవించింది గనుక ఈశ్వరునకు బహుళ శక్తులను ఆరోపించారు. ఈశ్వరుడు స్వచ్ఛందుడు. అతడు సృష్టి చేయాలనే నిర్బంధం లేదు. మానవు

మానవునకు శ్వాసించడం ఎలా స్వాభావమో అలాగే ఈశ్వరునకు సృష్టించడం స్వాభావికం. పరమేశ్వరుని ఆనందం పొంగిపొరలి అతడు ప్రాణాన్ని, శక్తిని అంతటా వెదజల్లుతాడు. 'భగవంతుడు ఈ ప్రపంచాన్ని ఎందుకు సృష్టించాడు? అనే ప్రశ్నకు సమాధానం లేదు

## V త్రిమార్గములు

# కర్మయోగం

మానవకోటికి నిస్వార్థంగా సేవచేయడాన్ని కర్మయోగం అంటారు పరమేశ్వరుడు అంతర్యామి. అతడు మన దేహాన్ని, మనస్సును, ఇంద్రియాలను కర్మకు పురికొల్పుతాడు. మన పరమేశ్వరుని హస్తగత ఆయుధంగా మారాలి. మనం చేసిన పనికోసం అభివందనాలనుగాని, అభినందననుగాని నిరీక్షింపరాదు. మనం కర్మలను కర్తవ్యంగా ఆచరించాలి. కర్మలను, కర్మఫలాలను భగవంతునకు సమర్పించాలి. అప్పుడు మనం కర్మబంధనాలనుండి ముక్తులమౌతాము.

కర్మయోగి ప్రేమమయుడై యుండాలి. అతడు అందరితో కలసిమెలసి తిరిగే స్వభావం కలిగియుండాలి. అతనిలో దయ, అనుకంప, సానుభూతి, ఆత్మసంయమం, సహనం, ప్రేమ కరుణ, అనుసరణత్వం, సర్దుబాటుతనం, ఓర్పు: సుఖ దుఃఖాలను, విమర్శలను భరించే సుగుణం; పరుషవచనాలను, నిందలను భరించే శక్తి—ఇటువంటి సుగుణాలు చోటు చేసుకోవాలి సేవ భగవంతుని పూజ. అందువల్ల అతడు అవకాశాలకోసం ఎప్పుడూ వేచియుండాలి. సేవలో ఉల్లాసం చూపుతూ ఉండాలి. ఇతరులను సేవించునప్పుడు గొణగకుండ యుండాలి. సేవచేసేటప్పుడు కరములను కర్మకు, మనస్సును మాధవునకు ఇవ్వాలి,

కర్మయోగం జ్యోతిర్జ్ఞానాల స్వీకరణకు మనస్సును సిద్ధం చేస్తుంది అది హృదయాన్ని విశాలపరుస్తుంది.

ఏకత్వ మార్గంలో నిలిచే అన్ని ప్రతిబంధకాలను అది నిర్మూలిస్తుంది. కర్మ యోగం చిత్తశుద్ధికి మంచి సాధన. అందువల్ల నిరంతరం స్వార్థరహిత సేవ యొనరించాలి.

# భక్తియోగం

శాస్త్రాలు అనంతం. మనం తెలుసుకోవలసింది ఎంతో ఉంది' కాలం స్వల్పం. విఘ్నాలు అనేకం. హంస జల క్షీర మిశ్రణంనుండి క్షీరసారాన్నే పరిగ్రహించునట్లు ఏది సకల శాస్త్రాల సారమో దాన్ని గ్రహించాలి. ఆ సారమే భక్తి. ఆ సారాన్ని పానం చేసి, శాశ్వతమైన శాంతి ధామాన్ని మనం పొందగలం.

భగవంతుని యెడగల అయత్నకృత ప్రేమ ప్రవాహాన్ని భక్తి అంటారు. అది విశుద్ధమైన ప్రేమ ధర్మ జీవనానికి భక్తి అధిష్ఠానం. భక్తి వాసనలను, అహంకారాన్ని నిర్మూలిస్తుంది. భక్తి మనస్సును మహోన్నత శిఖరాలకు ఉన్నతపరుస్తుంది విజ్ఞాన సౌధకవాటాలను తెరచేందుకు భక్తి గురుకీలకం. భక్తి జ్ఞానంలో అంతమొందుతుంది. భక్తి రెండుగా ప్రారంభించి, ఒకటిగా అంతమొందుతుంది

క్రమేణ మనము నవ విధ భక్తిని అలవరచుకోవాలి. 1. పరమేశ్వరుని లీలలను వినాలి. దీన్ని శ్రవణం అంటారు. 2. అతనిని స్తుతిసూ గానం చేయాలి దీన్నికీర్తన అంటారు. 3. పరమేశ్వరుని నామములను స్మరించాలి. ఇది స్మరణం 4. అతని పాదపద్మములను పూజించాలి. ఇది పాదసేవనం. 5. భగవంతునకు పుష్పాలను సమర్పించాలి ఇది అర్చనం. 6. భగవంతుని యెదుట దండప్రణామం చేయాలి, ఇది వందనం. 7. అతనికి సేవ యొనరించాలి. ఇది దాస్యభావము 8. అతనితో స్నేహం సల్పాలి. ఇదిసఖ్యభావము. 9. భగవంతునకు మనం ఆత్మార్పణ చేసుకోవాలి. ఇది ఆత్మనివేదనం.

భక్తిని సులభంగా సత్వరంగా అలవరచుకొనేది ఎలాగు? భక్తిని సత్వరంగా అలవరచుకొనేదానికి సులభ మార్గం ఇది. మనం చేయగలిగింది చేసి, మిగిలినది భగవంతునకు వదలివేయాలి. భాగవతులను సేవించాలి. వారి సన్నిధిలో ఉండాలి. జపం, కీర్తన చేయాలి రామాయణం, భాగవతం పఠించాలి. బృందావనంలో, అయోధ్యలో కొంత కాలం గడపాలి.

భగవద్దర్శనం కావాలంటే ప్రహ్లాదుని లాగా హృదయపూర్వకంగా ప్రార్థించాలి. రాధామాతలాగా గానం చేయాలి వాల్మీకి, తుకారాం తులసీదాసులలాగా భగవన్నామాన్ని జపించాలి. గౌరాంగునిలాగా పారవశ్యంలో కీర్తన చేయాలి. భగవంతుని యెడబాటుకై మీరాబాయి లాగా ఏకాంతంలో ఏడ్వాలి. అప్పుడే భగవద్దర్శనం సత్వరంగా లభ్యమౌతుంది.

పరమ భాగవతులు ప్రేమలో నివసిస్తారు. వారు ప్రేమలో శ్వాసిస్తారు. ప్రేమలో గానం చేస్తారు ప్రేమలో భుజిస్తారు ప్రేమలో పానం చేస్తారు. ప్రేమలో నడుస్తారు ప్రేమలో భాషిస్తారు. ప్రేమలో ప్రార్థిస్తారు. ప్రేమలో చింతిస్తారు. ప్రేమలో చరిస్తారు ప్రేమలో ధ్యానిస్తారు ప్రేమలో రచిస్తారు. ప్రేమలో మరణిస్తారు వారు దివ్య ప్రేమామృత మధువును గ్రోలి, ప్రేమ మూర్తులై, ప్రేమ విగ్రహులై తరిస్తారు.

ప్రేమ, విశ్వాసం, శ్రద్ధ, భక్తి లేని జీవితం వ్యర్థ జీవితం. అది యథార్థ మరణం. భువిపై ప్రేమశక్తి మహత్తమమైనది. ప్రేమ నిర్నిరోధమైనది. మానవుని హృదయాన్ని గెలువగలిగింది ప్రేమ ఒక్కటే. ప్రేమ శత్రువుని నిర్జిస్తుంది. ప్రేమ క్రూర మృగాల్ని మచ్చిక చేస్తుంది. ప్రేమ శక్తి అనంతం. ప్రేమ లోతు అగాధం. ప్రేమ స్వభావం దివ్యమైనది ప్రేమ వైభవం వర్ణనాతీతము. మతముయొక్క పరమ సారసంగ్రహము ప్రేమ. కావున మనము విశుద్ధ ప్రేమను అలవరచుకోవాలి.

ప్రేమకు మించిన సుగుణము లేదు. ప్రేమకు మించిన పెన్నిధి లేదు. ప్రేమకు మించిన ధర్మము లేదు. ప్రేమకు మించిన మతము లేదు. ఈ యావద్విశ్వం ప్రేమలోనుంచి ఆవిర్భవించింది. ఈ విశ్వం ప్రేమలోనే జీవిస్తుంది. ఈ జగత్తు ప్రేమలోనే లీనమౌతుంది. పరమేశ్వరుడు

ప్రేమమయుడు. ప్రేమమూర్తి, ప్రేమవిగ్రహము. భగవంతుని సృష్టిలో ప్రతి అంగుళములో అతని ప్రేమను. పరమేశ్వరుని అపరిమిత కరుణను మనము అర్థంచేసుకోవచ్చు.

భాగవత పురుషుల దివ్య ఆశీస్సులు మన ఎల్లరపై సదా యుండుగాక!

# జ్ఞానయోగము

జ్ఞానయోగం వైరాగ్యపు పునాది మీద నిలబడుతుంది. వైరాగ్యం వివేక పూర్వకమైనట్టిదిగా ఉండాలి. అది కారణ వైరాగ్యమయినచో చాలదు.

ఆత్మచింతన, ఆత్మధ్యానం. ఉపనిషద్ శ్రవణం, ఆత్మస్మరణం, ఆత్మకథనం—ఇవి ఆధ్యాత్మిక సంస్కృతి. జ్ఞానయోగ విద్యార్థికి తొమ్మిది అర్హతలు ఉండాలి. అప్పుడే అతనిలో బ్రహ్మజిజ్ఞాసకు ఆస్కారముంటుంది. ఈ తొమ్మిది ముఖ్యార్హతలు ఏవన: 1. నిత్యానిత్య వస్తు వివేకము. 2. ఇహాముత్రార్థ ఫల భోగ విరాగము 3. శమము 4. దమము 5. ఉపరతి 6. తితిక్ష 7 శ్రద్ధా 8. సమాధానం 9. ముముక్షుత్వము,

జ్ఞానయోగ విద్యార్థుల ప్రారంభములో జ్ఞానయోగ సాధనలో మిక్కిలి ఉపయోగపడు ఈ క్రింది గ్రంథములను చదువవలయును.

ఆత్మబోధ. తత్త్వబోధ. పంచీకరణము, లఘువాసుదేవ మననము, పంచదశి విచారసాగరము, ఉపనిషత్తులు, శ్రీ శంకరులవారి వావృత్త గ్రంథములు.

ధ్యానమునకు జ్ఞానయోగులు ఈక్రిందిమంత్రములలో నొకదానిని వారియభిరుచిననుసరించి వరింతురు. ఓం, సోఽహం, శివోఽహం, అహంబ్రహ్మాస్మి, ఈమంత్రములపై ధ్యానము సల్పునపుడు జ్ఞానయోగసాధకుడు ఇట్లుచింతించును

ఓం శుద్ధ సచ్చిదానంద స్వరూపోహం
సాక్షి చేతన కూటస్థోహం.
శరీరత్రయ విలక్షణోహం.
పంచకోశ వ్యతిరిక్తోహం.
అసంగ స్వప్రకాశ నిర్మలోహం.
ఈశావాస్యం ఇదం సర్వం.
ఏకమేవ అద్వితీయం బ్రహ్మ.

ఇటువంటి ధ్యానం కాలక్రమేణ ఆత్మసాక్షాత్కారంగా ఫలిస్తుంది.

# VI మహా యోగము

కర్మయోగం, భక్తియోగం, జ్ఞానయోగం — ఈ యోగత్రయం ఆత్మ సాక్షాత్కార ప్రాప్తికి అత్యావశ్యకము. ఈ యోగాలు ఒకదాని కొకటి విరుద్ధ కావు. అంతే గాదు అవి హృదయ వికాసానికి, మనోభివృద్ధికి, బుద్ధి పెరుగుదలకు ఎంతగానో తోడ్పడుతాయి. జీవిత గమ్యం వైపు యాత్ర సాగించే సాధకుడు ఏ యొక యోగాన్ని తృణీకరించరాదు, ఈ యోగాలు పూరకాలు, సంపూరకాలు

సాంఖ్య యోగౌ పృథక్ బాలాః
ప్రవదంతి న పండితాః. —గీతా.

జ్ఞానయోగం, కర్మయోగం— వీటిని వేర్వేరని బాలిశులు అంటారు: పండితులు అనరు.

శ్రీ ఆది శంకరులు కేవల అద్వైత వేదాంతి. అయినప్పటికి, వారు సదా సగుణ బ్రహ్మమును ఆరాధించారు. దేవి, కృష్ణుడు, హరి, శివుడు, తదితర దేవతాపరమైన స్తోత్రాలు, పద్యాలు ఎన్నో రచించారు శ్రీ శంకరులు. వారు మానవ కోటికి నిరుపమ స్వార్థరహిత సేవ చేశారు. వారొనర్చిన లోక సంగ్రహం సాటిలేనిది. వారు స్వేచ్ఛా పురుషులు. వారు కర్మ చేయవలసిన పనిలేదు, కాని వారు నిర్విరామంగా సేవ యొనర్చినారు. వారు నాలుగు మఠ పీఠాలను స్థాపించారు. శ్రీ ఆచార్యులవారు అర్హులైన విద్యార్థులకు సంన్యాసం యిచ్చారు. వారు వేదాంత ధ్వజాన్ని ఎగురవేసి, తక్కిన తత్త్వశాస్త్రాలపైన వేదాంతపు ఆధిక్యతను చాటినారు మానవ జాతిని పెడదారి పట్టించే వివిధ మతాల అధిపతుల్ని, నానా తెగల నాయకుల్ని అణచివేసి వారిని శ్రేయో మార్గంపై నిలిపినారు, శ్రీ శంకరులు. ఈనాడు శ్రీ శంకరుల వేదాంతం నిరుపమమై అలరారుతూంది. శ్రీ ఆచార్యులవారు, అనేక గ్రంథాల్ని రచించారు, వారి ప్రస్థాన త్రయీ (గీత, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు — వీటిపై వారు వ్రాసిన) భాష్యం కేవలం అత్యద్భుతం శ్రీ శంకరులను మించిన కర్మయోగి, మహాభక్తుడు, పరమ వేదాంతి యున్నాడా?

శ్రీ శంకరాచార్యులవారు ఒక స్తోత్రంలో ఇలా అంటారు.

ఓ ప్రభూ! నేను. నీవు ఒకటే.

అలలు సాగరానికి చెందుతాయి.

సాగరం అలలకు చెందదు.

అలాగే నేను నీవాడను;

కాని, నీవు నా వాడవు కావు.

శ్రీ మధుసూదన సర్వస్వతులవారు పూర్ణ పరబ్రహ్మజ్ఞాని. అతడు భక్తుడు గూడ. ఆ మహాపురుషునకు పరబ్రహ్మసాక్షాత్కారము అయిన తరువాత కూడ అతడు శ్రీ కృష్ణభగవానుని సగుణమూర్తిని ఆరాధించుచుండెను. శ్రీ మధుసూదన స్వామివారు ఇలా అంటారు: నేను సకల ప్రాణికోటి యందు పరమాత్మను దర్శించుచున్నప్పటికి, సమస్తమును ఏకముగ ఆలోకించు చున్నప్పటికిని శ్రీకృష్ణుని పదారవిందములను భజింపవలెనను తృష్ణ నన్ను వీడదు. నాకు శ్రీకృష్ణుడు పరమ సత్యము. కృష్ణాత్ పరం కిమపి తత్త్వమహం న జానే. కృష్ణుని మించిన పరమ సత్యము నాకేమియు తెలియదు.

యోగసంయోగం (మహాయోగం) ఆధునిక యుగానికి బాగా సరిపోయే సాధన. పక్షి రెక్కలు లేకుండ ఎగురలేందు. భక్తి తోక వంటిది. పక్షికి రెండు రెక్కలున్నా అది తోకలేందే సరిగా ఎగురలేందు. భక్తియనెడి తోక కర్మ యనెడి రెక్కను; జ్ఞానమనెడి రెక్కను సరిగా ఉంచుతుంది. కర్మయోగ, భక్తియోగ, జ్ఞానయోగ సమన్వయాభ్యాసము మనహస్తాన్ని, హృదయాన్ని, శిరస్సును బాగా అభివృద్ధి పరుస్తాయి. ఈ యోగముల సక్రమాభ్యాసము మనల్ని గమ్యాన్ని చేరేటట్టు చేస్తుంది.

ప్రాచీన ఋషులు, యోగులు ధ్యాన సమాధి నిష్ఠులై మానవుని పరిపూర్ణతకు దారిచూపే మంచి మార్గాలను కనుగొన్నారు. ఆ మార్గాలే కర్మయోగం, భక్తియోగం, జ్ఞానయోగం. చాలా కాలం అయిన తరువాత, రాను రాను ప్రజలు ఈ యోగాలు వేర్వేరు అని భావింపసాగారు. ఒక యోగం మరొక యోగంకంటె తక్కువని, ఎక్కువని అనుకొనసాగారు. వాస్తవంలో

ఒక యోగం మరొక యోగానికి విరుద్ధంకాదు. అవి మూడు పరస్పర సహకారులు ఈ యోగత్రయం (కర్మయోగం - భక్తియోగం - జ్ఞానయోగం) యొక్క అనుష్ఠానము మానవుని సమన్వయాభివృద్ధికి దోహదకారులై అతని హస్తాన్ని, హృదయాన్ని, శిరస్సును వికసింపజేస్తాయి. ఏయోగాన్ని తక్కువగా మనం అంచెనా వేయకూడదు. అలాజేస్తే అదిమన తెలివితక్కువ తనమే యౌతుంది.

శివుని కుటుంబం యుండే చిత్తరువుని చూడండి. పార్వతీ మాత మధ్యలో ఆసీనురాలై యుంటుంది. ఆమెయిరువైపుల గణేశుడు, సుబ్రహ్మణ్యస్వామి యుంటారు. గణేశుడు విజ్ఞానాధిపతి. సుబ్రహ్మణ్యస్వామి కర్మాధిపతి. (కుమారస్వామి దేవతా గణములకు సేనాని). పార్వతిమాత భక్తిని సూచిస్తుంది ఈ చిత్తరువు మన కొక పాఠం బోధిస్తుంది. పరిపూర్ణత్వాన్ని మహాయోగ (కర్మయోగ, భక్తి యోగ, జ్ఞానయోగ) అభ్యాసం ద్వారానే పొందగలమని ఈ చిత్తరువు వలన సూచితమగుచున్నది. పరిపూర్ణత్వ సిద్ధికి మహాయోగమే నిశ్చిత మార్గము. ఇదే ఆ చిత్తరువు మనకు అందించే సందేశం.

మనమందరం సత్యపథములో నడచెదము గాక! ఈ యోగత్రయ అభ్యాసం ద్వారా మనము పూర్ణాభ్యుదయమును పడయుదుము గాక! మన మెల్లరము మహాయోగమును అభ్యసించి పూర్ణ యోగులమై వెలయుదుము గాక!

# VII గురుతత్త్వము

ఓం జయ గురు శివ గురు హరి గురు రామ్ ।
జగద్గురు పరం గురు సద్గురు శ్యామ్ ॥
ఆది గురు అద్వైత గురు ఆనంద గురు ఓం ।
చిద్గురు చిద్ఘన గురు చిన్మయ గురు ఓం ॥



శ్రీ శంకరాచార్య స్వామి

గురు దేవునకు వందనములు, నమస్కృతులు, ప్రణిపాతములు. ఓం నమో నారాయణాయ.

ఆధ్యాత్మిక పథంలో గమించే ప్రతి జిజ్ఞాసువునకు గురువు అత్యావశ్యకం అనడంలో అతిశయోక్తి లేదు. జిజ్ఞాసువు ప్రారంభ దశలో అనేక కష్టాలను ఎదుర్కొనవలసి వస్తుంది. సాధకునకు అనేక సంశయాలు కలుగవచ్చుకూడ. సందేహ నివారణకై ఎవరినో ఒకరిని ఆశ్రయించవలసి వస్తుంది. అందువల్ల 'దేవుడే నాకు గురువు', "నాకు నేను గురువు" అనడం మంచిదిగాదు.

కొందరు కొన్ని సిద్ధులు ప్రదర్శిస్తారు. కొందరు వారిని గొప్ప మహాత్ములని భావించి; వారిని గురువులుగా చేసికొని, అలా చేసుకొన్న తరువాత తమ పొరబాటుకు బాధ పడుతూంటారు ఒకసారి గురువును ఎన్నుకున్న తరువాత అతన్ని మార్చకూడదు. మహాత్ములతో సత్సంగం సల్పి, వారితో కొంత కాలం చరించి, మన నిష్టకు అనుగుణమైన ఉపదేశం చేసే గురువు పాదాలను ఆశ్రయించాలి. మన నిష్టకు అనుగుణంగా గురువును బోధ చేయాల్సిందిగా ప్రార్థించాలి. అతడు అలా సమ్మతించకపోతే, ఆయన చెప్పన దంతా మనం ఆలకించినా మనం మన యొక్క ఆదర్శ నిష్టను మానుకోరాదు. మన యిష్ట దైవాన్ని మార్చరాదు.

మన దోషాలు, తప్పిదాలు, పొరబాట్లు మనకు తెలియవు. కారణం? మన అహంకారమే 'ఆయన కంటే నాకు ఎక్కువ తెలుసు' అంటాము. మన తప్పులను ఎవరైనా వేలుపెట్టి చూపితే మనం తగవులాడడం ప్రారంభిస్తాము, మనం మన తప్పులను ఒప్పుకోం. చిన్నచిన్న విద్యలకే గురువు అవసరం. అయినపుడు ఇక బ్రహ్మవిద్య సంగతిని గూర్చి ఏం చెప్పాలి మన తప్పిదాలను దర్శింపగలవాడు గురుదేవుడే.

"నాకు సాక్షాత్కారం కలిగింది" అని అనుకోవడం వట్టి భ్రమ. ఆధ్యాత్మికతత్వం ఒక మహా సాగరం. మనం నేర్చింది పుడిసెడంత. మహాత్ముల జీవితాలను పరిశీలిస్తే మనకీ విషయం తెలుస్తుంది. చైతన్యులవారు, తుకారాము, తులసీదాసు పరమ భక్తాగ్రగణ్యులైయుండి కూడ తాము

ఆధ్యాత్మిక రంగంలో విద్యార్థులనే భావించే వారు. అందువల్ల మనం విద్యార్థులకు విద్యార్థులుగ ఉండాలి. కావాలి. ఆధ్యాత్మిక మార్గం పూలబాట కాదు. అది కష్టతరమైనది. కంటకయుతమైనది. నిష్ఠురమైనది మన ఎముకలను బయటకు తీసి వాటిని పొడిచేసి, దానినుండి నూనెనుతీసి. ఆ నూనెతో వత్తి వెలిగించాలి. ఇలా అనేక సంవత్సరాలు చేయాలి. అప్పుడే భగవద్దర్శనం ఔతుంది. కాని. ఇవన్నీ విని మనం నిరాశచెందాల్సిన పనిలేదు. జనకునివలె, ఖట్వాంగునివలె. పరీక్షిత్తులవలె మనకు సాయుజ్యం సత్వరంగా లభించక పోవచ్చు. మూడు వేల జన్మల పిదప మనకు సాయుజ్యం కలుగనీ. మనం ఏమీ సాధన చేయకుండా త్రుటిలోనే మోక్షం ఎలా పొందగలం! మూడువందల తొంబై ఎనిమిది రూపాయల ఉద్యోగానికి పది పదిహేను ఏండ్లు విద్యాభ్యాసం చేసి తంటాలు పడాలి అమోఘమైన మన జీవిత గమ్యాన్ని పొందేందుకు ఇంకెంతగా శ్రమించాలి? మన జీవిత గమ్యం అమృతత్త్వం. ఈ అమృతత్త్వ ఫలాన్ని పొందడానికి ఎంత కష్ట పడాలి? మనం కోట్లకొలది జన్మలైనా భయపడరాదు. ఈ భావం వచ్చినప్పుడే మనం నిజమైన బ్రహ్మ జిజ్ఞాసువులం అవుతాము.

ప్రాచీన కాలంలో శిష్యులు గురు శుశ్రూష సల్పేవారు. ఒక గంటసేపు వారు గురువర్యుని బట్టలు ఉతికే వారు. ఒక గంటసేపు వారు స్వాధ్యాయంలో గడపే వారు. భిక్షకు వెళ్ళి, ప్రాప్తించిన దానిని గురు పాదముల చెంత ఉంచే వారు. గురువుగారు ఏదైనా ప్రసాదమిస్తే భుజించే వారు, లేకపోతే పూరకుండే వారు. ఈనాడో, శిష్యునకు ఒక్కరోజు ఆహారం దొరకకపోతే గురువును మర్దిస్తాడు. శిష్యుడు ఆశ్రమాన్ని విడిచివెళ్ళిపోతాడు. ఆ శిష్యునకు గురువుగారు ఎన్నో సంవత్సరాలు బాగా తిండి పెట్టియున్నా. ఒక్కరోజున కొంచెం నాపాటు తగ్గితే ఇలా ప్రవర్తిస్తాడు గతాన్నంతా మరచిపోతాడు. తన గురువుగారైన సాందీపనికి శ్రీ కృష్ణ భగవానుడు తన తల మీద కట్టెలు మోసుకొని పోతూండే వాడు. సత్యకాముడు అనే శిష్యుడు తన గురువుగారి ఆవులను మేపి. అవి సహస్ర గోవులు అయ్యేవరకు శ్రమించాడు, అందువల్ల శ్రేయస్కాములకు ప్రతి ఒక్కరికి గురువు ఉండాలి.

మనకు మొదటి తరగతి గురువరేణ్యుడు లభించకపోతే మించిపోయిన దేమీ లేదు, మనకు ఐదవ తరగతి గురువు దొరకినా ఫరవాలేదు, అతన్ని

గురువుగా స్వీకరించవచ్చు. అతని ఉపదేశాలను పాటించవచ్చు. మనకు సందేహాలు కలిగినప్పుడు వాటిని అతడు తీరుస్తాడు. గురువుగారితో మనం వూరక వాదింపగూడదు. "ఏమండీ మిమల్ని నేనెందుకు గురువుగా తీసుకోవాలి? మీరు నాకు ముక్తిని ఇవ్వగలరా?" అని అనవసరంగా వాదిస్తే మనం శాశ్వతంగా నష్టపోతాం. మనకు బుద్ధి యుండవచ్చు. మన బుద్ధి విశ్వ సమస్యకు సమాధానం ఉవ్వలేందు విశ్వాసం వుండే వారికి బుద్ధి సక్రమంగా పనిచేస్తుంది. గురువు మనకు అనవసరం అనుకుంటే అది మన అహంకారాన్ని మాత్రమే సూచిస్తుంది,

కొందరు భగవంతుణ్ణి గురువుగా పెట్టుకొంటారు. అటువంటివారు ఏ మహాత్ములను దర్శించినా వారిని భక్తి ప్రపత్తులతో సమీపించి, ప్రశ్నించి, ఏవైనా సందేహాలుంటే వాటిని నివారించుకోవచ్చు. ఆ మహాత్ములను అన్న పాన వస్త్రాదులతో సేవింపవచ్చు. కాని యిటువంటి వ్యక్తులు ఏ కొలది మందియో యుండగలరు. జన బాహుళ్యానికి స్వకీయ గురువు అవసరం అనడం నిర్వివాదం,

గురువే బ్రహ్మము, గురువే శివుడు. మనకు తల్లి, తండ్రి, స్నేహితుడు గురువే గురుదేవుని భక్తి శ్రద్ధలతో సేవించాలి. అతడు మనకు బ్రహ్మ విద్యను గరపి, మార్గం చూపుతాడు గురుసేవ పావనమైనది. గురు పూర్ణిమ రోజు మనం గురువులను ఆరాధించాలి. వారు మనల్ని ఆశీర్వదిస్తారు. ఆత్మ సాక్షాత్కారానికి గుర్వనుగ్రహం అత్యవసరం. గురుదేవుని దోషాలు చూడకూడదు. అతన్ని ఆరాధించాలి, అతన్ని కీర్తించాలి. గురు శిష్యుల సంబంధం అతి పవిత్రం. ఈ పవిత్రమైన గురు శిష్య సంబంధాన్ని తెంచుకోకూడదు. "మా విద్విషావహై". మేమిరువురము (గురువు, శిష్యుడు) కలహించుకొనకుండ ఉందుము గాక:

మనకు తల్లి దండ్రులు ఈ భౌతికకాయాన్ని ఇచ్చారు. గురుదేవుడు ఈ సంసార మహోదధిని దాటేందుకు సహాయపడుతాడు. అతడు మన ప్రాపంచిక స్వభావాన్ని పూర్తిగ మార్చివేస్తాడు. అతని బోధనలు మన కనులు తెరిపిస్తాయి. మనం అమృతత్వ మధువును అతని అనుగ్రహంవల్ల పానం

చేయగలం. గురు ఋణాన్ని మనం కోట్ల కొలది జన్మలలో కూడ తీర్చు కోలేము. ఒక్క గురువును మనం జన్మాంతం భక్తి శ్రద్ధలతో అంటియుండాలి. సత్వరంగా, సులభంగా, సుఖంగా గమ్యాన్ని చేరేదానికి ఇది రాచబాట గురుదేవుని పాద పద్మములందు మన మనస్సు లగ్నం కానప్పుడు, మనకు ఏ తెలివితేటలున్నను, అవి నిష్ఫలమే.

> శరీరం సురూపం తథా వా కళత్రం
> యశశ్చారు చిత్రం ధనం మేరు తుల్యం । 1.
>
> కళత్రం ధనం పుత్రపౌత్రాది సర్వం
> గృహం బాంధవాః సర్వమేతద్ధి జాతం ।2.
>
> షడంగాదివేదా ముఖే శాస్త్ర విద్యా
> కవిత్వాది గద్యం సుపద్యం కరోతి ।3.
>
> విదేశేషు మాన్యః స్వదేశేషు ధన్యః
> సదాచారవృత్తేషు మత్తో న చాన్యః ।4.
>
> సభామండలే భూపభూపాల బృందైః
> సదా సేవితం యస్య పాదారవిందమ్ । 5
>
> యశో మే గతం దిక్షు దానప్రతాపాత్
> జగద్వస్తు సర్వం కరే సత్ప్రసాదాత్ । 6
>
> న భోగే న యోగే న వా వాజిరాజ్యే
> న కాంతాసుఖే నైవ విత్తేషు చిత్తమ్ । 7
>
> అరణ్యే న వా స్వస్య గేహే న కార్యే
> న దేహే మనో వర్తతే మే త్వనర్ఘ్యే । 8
>
> గురోరంఘ్రి యుగ్మే మనశ్చేన్న లగ్నం
> తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥

శ్రీ శంకరాచార్యకృత గుర్వష్టకము.

సౌష్ఠవమైన సుందర శరీరము, అందమైన అర్ధాంగి, నిర్మలమైన యశస్సు, మేరునగతుల్య ధనము; గుణవతి యైన భార్య, ఐశ్వర్యము, పుత్రులు, పౌత్రులు, ఇల్లు, వాకిలి ప్రియులైన బంధువులు పెక్కురు; వేదవిజ్ఞానము

యత్సత్యేన జగత్సర్వం యత్ప్రకాశేన భాతియత్ ।
యదానందేన నందంతి తస్మై శ్రీ గురవే నమః ॥ 9

న గురోరధికం తత్త్వం న గురోరధికం తపః ।
న గురోరధికం జ్ఞానం తస్మై శ్రీ గురవే నమః॥ 10

గురురేకో జగత్సర్వం బ్రహ్మవిష్ణుశివాత్మకం ।
గురోః పరతరం నాస్తి తస్మాత్ సంపూజయేత్ గురుం ॥ 11

యస్య దేవే పరా భక్తిర్యథా దేవే తథా గురౌ ।
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః ॥ 12

మన్నాథః శ్రీజగన్నాథః మద్గురుః శ్రీజగద్గురుః ।
మహాత్మా సర్వభూతాత్మా తస్మై శ్రీగురవే నమః ॥ 13

ధ్యానమూలం గురోర్మూర్తిః పూజామూలం గురోఃపదం ।
మంత్రమూలం గురోర్వాక్యం మోక్షమూలం గురోః కృపా॥ 14

నమః శివాయ గురవే సచ్చిదానందమూర్తయే ।
నిష్ప్రపంచాయ శాంతాయ నిరాలంబాయ తేజసే ॥ 15

అజ్ఞానమూలహరణం జన్మకర్మనివారణం ।
జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం గురోః పాదోదకం పిబేత్ ॥ 16

నిత్యం శుద్ధం నిరాభాసం నిరాకారం నిరంజనం ।
నిత్య బోధం చిదానందం గురుం బ్రహ్మ నమామ్యహం ॥ 17

నిధయే సర్వవిద్యానాం భిషజే భవరోగిణాం ।
గురవే సర్వలోకానాం దక్షిణామూర్తయే నమః॥ 18

ఓం

# గురు వందనా

ఓం నమో బ్రహ్మాదిభ్యో
బ్రహ్మవిద్యాసంప్రదాయ కర్తృభ్యో
వంశఋషిభ్యో మహద్భ్యో నమో గురుభ్యః
సర్వోపప్లవరహితః ప్రజ్ఞానఘనః
ప్రత్యగర్థో బ్రహ్మైవాహమస్మి ॥ 1

ఓం నారాయణం పద్మభవం వసిష్ఠం
శక్తిం చ తత్పుత్రపరాశరం చ
వ్యాసం శుకం గౌడపదం మహాంతం
గోవింద యోగీంద్రమథాస్య శిష్యం ॥ 2.

శ్రీ శంకరాచార్యమథాస్య పద్మపాదం చ
హస్తామలకం చ శిష్యం
తం త్రోటకం వార్తికారమన్యాన్
అస్మద్గురూన్ సంతతమానతోఽస్మి ॥ 3.

శ్రుతి స్మృతి పురాణానామ్
ఆలయం కరుణాలయమ్
నమామి భగవత్ పాదమ్
శంకరం లోకశంకరమ్ ॥ 4.

శంకరం శంకరాచార్యమ్
కేశవం బాదరాయణమ్
సూత్రభాష్యకృతౌ వందే
భగవంతౌ పునః పునః ॥ 5.

ఈశ్వరో గురు రాత్మేతి
మూర్తి భేద విభాగినే
వ్యోమవద్ వ్యాప్తదేహాయ
దక్షిణామూర్తయే నమః ॥ 6.

జిహ్వాగ్రహమున నుండుట, సకల శాస్త్రవిద్యా ప్రావీణ్యము, కవిత్వము వ్రాయుట, గద్య పద్య రచన చేయుట; మాతృభూమి యందు గొప్ప సన్మానము, పరదేశములందు ఖ్యాతి, పుణ్య కర్మాచరణ, దుష్కృతములు చేయకుండుట; విశ్వమునకు సామ్రాట్టుగ నుండుట, మహారాజులచే పాదసేవ చేయుంచుకొనుట; ప్రపంచమంతటా దానవీరుడను ఖ్యాతినొందుట; ఏ భోగమును వెదుకకుండుట, యే యోగశక్తులను కోరకుండుట అశ్వమేధ యాగ ఫలాలు కోరకుండుట, కాంతలయందు సుఖము నాశింపకుండుట, ధనమున లోభము లేకుండుట; స్వగృహవాసముగ భావించి అరణ్యములో నివసించుటకు అయుత్తపడుట, కర్మలయందు ఆసక్తి లేకుండుట, వికృతరూపముచే కట్టుబడకుండా యుండుట —ఇవన్నీ ఉన్నప్పటికీ గురుదేవుని చరణారవింద ములందు మనస్సు లగ్నము కానిచో వీటిన్నింటివలన ఏమి ప్రయోజనం?

ఆధ్యాత్మిక మార్గమున పయనించు సర్వబ్రహ్మ జిజ్ఞాసువులకు, వారు ధ్యానమునకు ఆసీనులగుటకుముందు, మనస్సు నిశ్చలమగుటకై, గుర్వనుగ్రహము సిద్ధించు నిమిత్తము వారు గురుస్తోత్రము సలుపవలయును, గురు సంస్మరణ మాత్రముననే మనము రెండు నిముషములలోనే గురుశక్తి ప్రభావమును ప్రజ్ఞాపూర్వకముగ తెలిసికొనసగును, ధ్యానాత్పూర్వము పఠన యోగ్యమైన గురుస్తోత్రమును, బహుళ ప్రచారమునమున్న శ్లోకములను ఇచ్చట భక్తుల ప్రయోజనార్థము పొందుపరచుచున్నాను. ఈ మహత్తరమైన శ్లోకములను చదువుటవలన, పఠించుటవలన, పారాయణము చేయుటవలన ధ్యాన వాతావరణము అనుకూలమగును, ప్రశాంతమగును. అలజడిచెంది యున్న మనస్సు నిశ్చల మొందును.

---

# గురు స్తోత్రమ్

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగన సదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్ ।
ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి ॥ 1.

యస్యాంతర్నాదిమధ్యం న హి కరచరణం
నామగోత్రం న సూత్రం
నో జాతిర్నైవ వర్ణం న భవతి పురుషో
నో నపుంసం న చ స్త్రీ ।
నాకారం నో వికారం న హి జననమరణం
నాస్తి పుణ్యం న పాపం
నో తత్త్వం తత్త్వమేకం సహజ సమరసం
సద్గురుం తం నమామి ॥ 2

గురుర్ బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుఃసాక్షాత్ పరం బ్రహ్మ తస్మై శ్రీగురవే నమః ॥ 3.

చైతన్యం శాశ్వతం శాంతం వ్యోమాతీతం నిరంజనం ।
నాదబిందుకలాతీతం తస్మై శ్రీ గురవే నమః ॥ 4

అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా ।
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీ గురవేనమః ॥ 5

అఖండమండలాకారం వ్యాప్తం యేన చరాచరం ।
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవేనమః 6

స్థావరం జంగమం వ్యాప్తం యత్కించిత్సచరాచరం ।
త్వంపదం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః ॥ 7

చిన్మయం వ్యాపితం సర్వం త్రైలోక్యం సచరాచరం ।
అసిత్వం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః ॥ 8



# శ్వేతాశ్వతర ఉపనిషత్తు

## శాంతి మంత్రః

ఓం సహ నావవతు
సహ నౌ భునక్తు
సహ వీర్యం కరవావహై।
తేజస్వినావధీతమస్తు
మా విద్విషావహై॥

ఓం శాంతిః శాంతిః శాంతిః

**టీక:**

ఓం = ప్రణవము: సహ నావవతు = అతడు మమ్మిరువురను బ్రోచు గాక: సహ నౌ భునక్తు = మేమిరువురము అనుభవించునటుల చేయగాక: సహ వీర్యం కరవావహై = పిండితార్థమును తెలుసుకొనుటకు యత్నించుము గాక: తేజస్వినావధీతమస్తు = మాచదువులు ఫలవంతమగు గాక; మా విద్విషావహై = మేము ఒకరితో నొకరు కలహించుకోకుండ ఉందుము గాక.

**భావము:**

ఓం: అతడు (పరమాత్మ) మమ్మిరువురను [గురుని, శిష్యుని] రక్షించుగాక! మేమిరువురము మోక్షానందమును అనుభవించునట్లు చేయుగాక! శాస్త్రముల యథార్థమైన అర్థమును కనుగొనుటకు మేమిరువురము ప్రయత్నింతుము గాక! మేమెన్నడును ఒకరితో నొకరు కలహించుకోకుండ ఉందుము గాక!

**వివరణము;**

ఓం పరబ్రహ్మము సర్వోత్కృష్టమైనది పరమాత్మకు పేరు "ఓం" అందువల్ల "ఓం" ఆరాధనీయమైనది సమస్తమూ ఓంకారమే. బ్రహ్మమునకు ప్రతీక ఓం. అది శక్తివచనము (world of power) అది ఏకాక్షరము. అది వేదముల పిండితార్థము. అది సంసార మహాసాగరాన్ని దాటుటకు సురక్షితమైన నౌక. అది అమృతత్వ ప్రదాత.

అన్ని మంత్రములలో మహాఘనమైనది ప్రణవము. ఓంకారము. ఓం అది నేరుగా మోక్షమును ప్రసాదించును. సర్వ మంత్రములు ఓం తో మొదలిడును. ప్రతిస్తోత్రము ఓం తో ప్రారంభమౌతుంది. ప్రతి ఉపనిషత్తు ఓం తో మొదలిడుతుంది. గాయత్రికి ముందు ఓం వస్తుంది. వివిధ దేవతలకు అర్పించే ఆహుతులు గూడ ఓం తో ప్రారంభమౌతాయి. ఓంకార

ఉచ్చారణ లేకుండా ఏ యజ్ఞాన్ని ప్రారంభించం ఓంకార మహిమను పరిమిత పదజాలంతో వర్ణించలేం.

వాక్కు ఎక్కడ అగిపోతుందో, సంకల్పాలు ఎక్కడ ఆగిపోతాయో, బుద్ధి తదితర ఇంద్రియాల పనులు ఎచ్చట స్తంభించి పోతాయో ఆ నెలవే ఓం సర్వ వేదాలచే స్తుతింపబడేది ఓం. సర్వ శాస్త్రాలచే ప్రకటింపబడేది ఓం. బ్రహ్మ చర్యాన్ని అనుష్టించే బ్రహ్మజిజ్ఞాసువుల వాంఛితగమ్యం ఓం. ఓంకారం సర్వోత్కృష్టమైనది. అది పరమ ఆలంబనం. అది పరమ సత్యం. ఓం ను తెలుసుకొన్నవాడు బ్రహ్మలోకంలో పూజింపబడుతాడు. ఓం ను తెలుసుకొన్న వాడు తాను కోరినదెల్లా పొందుతాడు.

అకార, ఉకార, మకారములతో ఓం ఏర్పడింది. 'అ' శబ్దము యొక్క ప్రారంభాన్ని. "ఉ" శబ్దము యొక్క మధ్యమాన్ని. "మ్" శబ్దము యొక్క అంతాన్ని సూచిస్తాయి. అందువల్ల ఓం లో శబ్ద సర్వస్వం, పదసర్వస్వం ఉంద న్నమాట. ఓంకారం అన్ని త్రయాల్ని సూచిస్తుంది బ్రహ్మ, విష్ణువు, శివుడు; విరాట్, హిరణ్యగర్భుడు ఈశ్వరుడు; సత్త్వము. రజస్సు తమస్సు; జాగ్రద వస్థ స్వప్నావస్థ, సుషుప్త్యవస్థ; సృష్టి, స్థితి, సంహారము—ఇత్యాదులు ఓంచే సూచింప బడుతాయి.

ఓంకార ఉచ్చారణ, ఓంకార జపము, ఓంకార గానము, ప్రణవ ధ్యానము మనస్సును నిర్మలం చేస్తాయి. అవి విక్షేపాన్ని తొలగిస్తాయి అవి అజ్ఞానపు తెరను నాశన మొనరుస్తాయి. బ్రహ్మ జిజ్ఞాసువు బ్రహ్మములో లీనమగుటకు అవి తోడ్పడుతాయి.

ఓంకారమే ధనుస్సు. మనస్సే సాయకము. పరబ్రహ్మము దానిలక్ష్యము పరిశుద్ధమైన, ఏకాగ్రత గల మనస్సుతో బ్రహ్మ లక్ష్యమును తాకవలెను. బాణం లక్ష్యముతో ఏకమగు విధమున ధ్యాత బ్రహ్మముతో ఏకమగును.

ఈ ఒక్క ఏకాక్షరాన్ని తెలుసుకొంటే విజ్ఞాన సర్వస్వం తెలుసుకొన్నట్లే ఓంను తెలుసుకొన్నవాడు అక్షయమైన పరమజ్ఞానాన్ని పొందుతాడు.

ఓంకార ధ్యానం సల్పేవారు పద్మ, సిద్ధ, సుఖాసనాలలో ఒకదానిలో ఆ సీనులౌతారు. వారు స్థిరంగా కూర్చుంటారు. త్రికూటమున, అనగా రెండు

కనుబొమల మధ్య వారు ధారణ సల్పుతారు, వారు ఈ భావాలను పురశ్చరిస్తూ ధ్యానిస్తారు.

| | | | | |
|---|---|---|---|---|
| సచ్చిదానంద స్వరూపోహమ్ | ............ | ఓం | ఓం | ఓం |
| అహం బ్రహ్మాస్మి | ............ | " | " | " |
| సాక్షి చేతన కూటస్థోహమ్ | ............ | " | " | " |
| శరీరత్రయ విలక్షణోహమ్ | ............ | " | " | " |
| పంచకోశ వ్యతిరిక్తోహమ్ | ............ | " | " | " |

ఈ విధంగా ప్రణవోపాసకులు ధ్యానించి, పరమాత్మతో తమ అభేదత్వాన్ని గాంచి, పరిశుద్ధమైన బ్రహ్మ వైభవంతో ప్రకాశిస్తారు.

## సహ నావవతు

అతడు మమ్ము బోధించుగాక. అతడు అనగా పరబ్రహ్మము. పరమాత్మ గురు శిష్యులను కాపాడుగాక! ప్రతి ఉపనిషత్తు శాంతి మంత్రంతో ప్రారంభమౌతుంది. ఒక్కొక్క వేదానికి ఒక్కొక్క శాంతి మంత్రం ఉంటుంది. ఈ శాంతి మంత్రం యజుర్వేదాంతర్గతమైనది. ఈ శాంతి మంత్రాన్ని ఉపనిషదంతంలో కూడా చెప్పుతారు. గురు శిష్యుల్ని భగవంతుడు కాపాడాలని కోరుకొంటున్నారు. జ్ఞాన యజ్ఞంలో ఏ యిక్కట్టులు కలుగకుండ ఉండేందుకు గురు శిష్యులు ఇలా ప్రార్థిస్తున్నారు.

## సహ నౌ భునక్తు

మేమిరువురం అనుభవింతుము గాక, అనుభవించాల్సింది తుచ్ఛసుఖాలు కాదు. అనుభవించవలసింది మోక్షానందాన్ని ప్రపంచ సుఖాలన్నిటిని మూటగట్టితే అదంతా బ్రహ్మానందంలో లవలేశం కూడ కానేరదు. మోక్షం అఖండానందం. మోక్షం అనంతానందం. దాన్ని అనుభవించడమే జీవిత లక్ష్యం. మోక్షాన్ని పరమేశ్వరుడు అనుగ్రహించాలి. అందువల్లనే ఈ శాంతి మంత్రంలో పరమేశ్వరుడు వారికి, అనగా గురుశిష్యులకు మోక్షానందమును అనుభవింపజేయు శక్తి నొసంగవలసినదిగ కోరడమైనది. అనగా జీవిత గమ్యమును సర్వదా స్మరిస్తూ, దాన్ని పొందే దానికోసం పురుషకారం సాగించి దైవానుగ్రహం పొంది, ఆత్మసాక్షాత్కారం పొందాలి.

## సహవీర్యం కరవావహై

యధార్థ భావమును అర్థము చేసుకొనుటకు యత్నింకుము గాక! ఉపనిషత్తుల పఠనాన్ని భక్తి శ్రద్ధలతో సాగించాలి. ఉపనిషత్తులను అహంకారంతో సమీపిస్తే అవి వారికి సత్యాలను ప్రకాశింపచేయవు అవి వారి పెడ బుద్ధికి సరియైన అర్థాలను ఇవ్వదు. మరియు ఉపనిషత్తులను చదవడం భగవత్ ప్రసాదాని కై యుండాలి. ఏవో వాటిలో తప్పులు పట్టడాని కై ఉండరాదు. ఉపనిషత్తులలో కొన్ని సందర్భాలలో అయుక్తా భాసమనిపించేటటువంటివి కానవస్తాయి. అటువంటి వాటిని గుర్వనుగ్రహంవల్ల, పరమేశ్వరుని దయవల్ల సరియైన అవగాహన చేసుకోవాలి. కేవలం నిఘంటు, వ్యాకరణ పాండిత్యం చాలదు. కొన్నింటికి అర్థాలు గురుముఖతః తెలిసికొంటే అర్థం చాల తేటతెల్లమౌతుంది. శాస్త్రాధ్యయనం చేయడం మన ధర్మం. ఏది చేయదగినది, ఏది చేయతగనది అనే వాటిని నిర్ధారించడములో శాస్త్రమే మనకు ప్రమాణం కావాలి. అందువల్ల శాస్త్రమే కార్యాకార్య నిర్ధారణలో మనకు తోడ్పాటుకు రావాలి. గురు శిష్యులు శాస్త్రము యొక్క సత్యమైన అర్థమును కనుగొనుటకు సర్వథా యత్నించాలి గురువు శిష్యునకు విషయం అర్థమయ్యేవరకు బోధించాలి. శిష్యుడు గుర్వనుగ్రహం పొందడానికి శ్రద్ధాభక్తులు, వివేకం కలిగియుండాలి.

## తేజస్వినావధీతమస్తు

మా చదువులు ఫలవంతమగు గాక! ఆధ్యాత్మికవిద్య చదువులకు చదువు. అధ్యయనం ఫలవంతం కావాలని కోరబడుచున్నది. విద్య వినయాన్ని ఇవ్వాలి. విద్య వినయాన్ని ఇవ్వక అహంకారాన్ని పెంపొందిస్తే అది విద్యయనిపించుకోదు. ఉపనిషత్తుల శ్రవణం ఏ ఉద్దేశ్యంతో చేయబడుతుంది? ప్రథమంలో బ్రహ్మమును గూర్చి పరోక్ష జ్ఞానం కలిగే నిమిత్తం. పరోక్ష జ్ఞానం కలిగిన మీదట మనన, నిధిధ్యాసనముల వల్ల అపరోక్ష జ్ఞానం కలుగాలి. అలా అపరోక్ష జ్ఞానానికి దారితీసేటట్లు ఉండాలి మన చదువులు. జీవిత లక్ష్యమును విస్మరించే చదువులు వాస్తవంలో జ్ఞానమయము కాదు, అదే కేవలం అజ్ఞానం అని చెప్పుకోవాలి. "అధ్యాత్మ విద్యా విద్యానం," విద్యలలో నేను ఆధ్యాత్మ విద్యయని శ్రీకృష్ణ భగవానుడు గీతంలో చెప్పుతారు.

## మా విద్విషావహై

మేము కలహించుకోకుండ ఉందుము గాక! కలహం అజ్ఞానానికి మారు పేరు. విద్యను అభ్యసిస్తూ గురు శిష్యులు కలహించుకుంటే వారు ఆ విద్యకు కళంకం తెచ్చిన వారవుతారు. బ్రహ్మజ్ఞానం ఐక్యతకు దారి చూపాలి, భిన్నత్వానికి దారి తీయగూడదు. అందువల్ల ఆదిలోనే గురుశిష్యులు "మే మిరువురము కలహించుకొనక ఉండెదము గాక" అని కోరుకొను చున్నారు. ఇది వేదకాలము నాటి గురుకుల విద్యా సాంప్రదాయము. గురుభక్తి మోక్షదాయకమైనది. ఈనాడు విద్యలు ఎలా ఉన్నాయో చూడండి, ఆ విద్యలలో నీతికి ప్రాధాన్యం లేదు. ఆత్మ అనేది కనబడదు, వినబడదు. గురుశిష్యులు ఒకరినొకరు బాదుకొంటూ ఉంటారు నేటి విద్యావిధానంలో గురుశిష్య పవిత్ర సంబంధానికి చోటులేదు.

## ఓం శాంతిః శాంతిః శాంతిః

తాపత్రయము శమించుగాక! మానవుడు దుఃఖాలతో, తాపాలతో బాధ పడు తుంటాడు. అతడు రోగాలచే బాధ పడుతాడు. ఇటువంటి తాపాలను ఆధ్యాత్మిక తాపాలంటారు. అతడు మోటారు ప్రమాదాలు మొదలగువానికి గురిఔతుంటాడు. ఇటువంటి తాపాలను అధిభౌతిక తాపాలంటారు, అతడు తుఫానులకు వరదలకు తట్టుకోలేకుండా పోతాడు. ఇటువంటి తాపాలను అధిదైవిక తాపాలంటారు. ఈ తాపత్రయ శాంతికోసం "ఓం శాంతిః శాంతిః శాంతిః" ముమ్మారు చెప్పబడుతుంది.

మరియు మనం అధ్యయనం చేయబోయే ఉపనిషత్తును మనం నిర్విఘ్నంగా చదివేదానికి సహాయ పడవలసినదిగా కోరుటను ఈ శాంతి మంత్రం తెలియజేస్తుంది.



# ప్రథమో௨ధ్యాయః

## ఒకటవ అధ్యాయము

**హరి ఓం బ్రహ్మవాదినో వదంతి**
**కిం కారణం బ్రహ్మ కుతః స్మ జాతా**
**జీవామ కేన క్వ చ సంప్రతిష్ఠాః।**
**అధిష్ఠితాః కేన సుఖేతరేషు**
**వర్తామహే బ్రహ్మవిదో వ్యవస్థామ్॥ 1 ॥**

టీక:

హరిః ఓం = విష్ణువు ప్రణవము; శుభప్రదమైన ఆరంభము: బ్రహ్మ వాదినః = బ్రహ్మమును గూర్చి విచారము చేయువారు; వదంతి= భాషించు చున్నారు; కిం = ఏమిటి; కారణం = హేతువు; బ్రహ్మ = బ్రహ్మమా; కుతః = ఎందుకు; స్మజాతాః = జాతాః స్మ= మనముజన్మించితిమి; జీవామః = మనము జీవించుచున్నాము; కేన= ఎవ్వనిచే; క్వ= ఎచ్చట; చ= మరియు; సంప్రతిష్ఠాః = అంత్యమున విశ్రమించును; అధిష్ఠితాః = పరిపాలింపబడు; కేన= ఎవనిచే; సుఖ ఇతరేషు= సుఖ దుఃఖములందు; వర్తామహే= మనము ఉందుము; బ్రహ్మ విదః = బ్రహ్మమును తెలిసికొన్నవారు; వ్యవస్థాం= నియ మమును; వ్యవస్థను.

భావము

హరిః ఓం! పరబ్రహ్మమును గూర్చి విచారము సల్పువారు తమలో తాము ఇట్లను కొనుచున్నారు; కార ణము ఏమిటి? అది బ్రహ్మమా? మనము ఎచ్చట నుండి

జన్మించితిమి? మనము ఎవనిచే జీవింతుము? కట్టకడపట మనము ఎచ్చట విశ్రమింతుము? ఓ బ్రహ్మవిదులారా, ఎవనిచే పాలింపబడినవారమై, సుఖదుఃఖములందు, మనము వివిధ పరిస్థితులలో జీవించుచున్నారము?

విపరణము

**హరిః ఓం! బ్రహ్మవాదినః వదంతి.**

పరమేశ్వర స్మరణానంతరము బ్రహ్మవాదినులు, అనగా బ్రహ్మమును గూర్చి విచారము సల్పువారు ఒకరితోనొకరు ఇట్లు భాషించుచున్నారు. బ్రహ్మవాదినులు అనగా బ్రహ్మవదనశీలురు. బ్రహ్మచర్చ చేయువారు బ్రహ్మవాదినులు. బ్రహ్మవేత్తలయిన వారందరు గుమికూడి చర్చ సాగించుచున్నారు

**కిం కారణం బ్రహ్మ.**

కారణమేమిటి? ఈ ప్రపంచానికి కారణమేమిటి? అది బ్రహ్మమా? బ్రహ్మము ఎలాంటి కారణము? అది నిమిత్త కారణమా? ఉపాదాన కారణమా? లేక రెండూనా?

**కుతః స్మ జాతా,**

మనం ఏల వచ్చాము? మనం ఎలా వచ్చాము? మన జీవితానికి అది ఏది? మన జీవితానికి ఉద్గమ స్థానం ఏది?

**జీవామః కేన.**

మనము ఎవనిచే జీవించు చున్నాము? ఈ జీవితానికొక భర్త, ఆధార భూతుడు, నియంత, అంతర్యామి యున్నాడా?

**క్వ చ సంప్రతిష్ఠాః.**

ఈ ప్రపంచం నాశనమయ్యేటప్పుడు, ప్రళయకాలంలో మనముదేనిపై ప్రతిష్ఠితులమై యుంటాము? మరణానంతరం మన ఆత్మ ఏమౌతుంది? చనిపోయిన తరువాత ఆత్మ ఉంటుందా? లేక పూర్తిగా నాశమై పోతుందా? అది బ్రహ్మములో లీనమౌతుందా?

అధిష్ఠితాః కేన సుఖేతరేషు వర్తామహే.

జీవాత్మలను పాలించే పరమేశ్వరుడెవడైనా ఉన్నాడా? ఎవనిచే పాలితులమై, సుఖదుఃఖములలో, వివిధ పరిస్థితులలో మనము జీవించు చున్నారము?

బ్రహ్మవిదో వ్యవస్థాం.

బ్రహ్మవాదినులు జగత్తుయొక్క సృష్టి, స్థితి, ప్రళయ, నియమ హేతు సంబంధిత ప్రశ్నలు వేసుకొని చర్చించుచున్నారు. ఈ విషయం రెండవ మంత్రంలో తెలుపబడింది.

**కాలః స్వభావో నియతిర్ యదృచ్ఛా**
**భూతని యోనిః పురుష ఇతి చింత్యా ।**
**సంయోగ ఏషాం న త్వాత్మభావాత్**
**ఆత్మాప్యనీశః సుఖదుఃఖహేతోః ॥2॥**

టీక:

కాలః = కాలము; స్వభావః = స్వభావము; నియతిః = శాసనము, ఆవశ్యకత; యదృచ్ఛా = ఆకస్మిక ప్రాప్తి; భూతాని = పంచభూతములు; యోనిః = గర్భము, కారణము; పురుషః = మగ; ఇతి = ఈ విధముగ; చింత్యా = భావించి; సంయోగః = సమూహము; కలయిక; ఏషాం = వీటియొక్క; న = లేదు; తు = నిజముగ; ఆత్మభావాత్ = అత్మయొక్క ఉనికవ వలన; ఆత్మా = జీవాత్మ; అపి = పైతము; అనీశః = ఈశ్వరుడు కాడు; సుఖ దుఃఖ హేతోః = సుఖ దుఃఖములకు లోబడి యున్నందువలన,

భావము

కాలము, నైసర్గిక ప్రకృతి, నియతి, ఆకస్మిక

ప్రాప్తి పంచ భూతములు, గర్భము, మగవాడు—వీనిని జగత్తుకు కారణముగ భావింపవలెను. ఆత్మయొక్క ఉను కవ వలన ఆ కారణము వీనన్నింటి యొక్క సమూహము కాదు. ఆత్మ (జీవాత్మ) సైతము, సుఖ దుఃఖములకు లోబడి యున్నందున, ముక్తుడు కాదు.

వివరణము

ఈ విశ్వానికి కారణమేమిటో విచారింప బడుతూంది. "కాలః స్వభావో నియతిర్ యదృచ్ఛా" ఈ విశ్వానికి కారణం కాలమా? అనగా, కాలము బ్రహ్మమా? కాదు. నైసర్గిక ప్రకృతి బ్రహ్మమాటకాదు, ఆవశ్యకత (నియతి) బ్రహ్మమా కానేరదు. అదృష్టం బ్రహ్మమా? కానేరదు.

భూతాని యోనిః పురుష ఇతి చింత్యా

పంచభూతములు బ్రహ్మమా? కానేరవు యోని బ్రహ్మమా? కానేరదు, మగటిమి బ్రహ్మమా? కానేరదు.

సంయోగ ఏషాం

అయితే కాలము, ప్రకృతి, నియతి, అదృష్టము, భూతములు, యోని, పురుషుడు—వీనన్నింటి సమూహము బ్రహ్మమగునా? కానేరదు. ఎందువలన? "న తు ఆత్మభావాత్" పరమాత్మ యొక్క ఉను కవ ఉండుట వలన. అయితే జీవాత్మ ఈ విశ్వానికి సృష్టికర్తయా? కాదు. ఎందువల్ల జీవాత్మ సృష్టికర్త కాదు? "ఆత్మాప్యనీశః సుఖ దుఃఖ హేతోః" జీవాత్మ సుఖ దుఃఖముల ప్రాబల్యమునకు గురియైనందువల్ల అతడు కూడ ముక్తుడు, శక్తుడు కాడు. అందువల్ల జీవాత్మ సైతం విశ్వానికి కారణముకాడు.

The Individual Soul cannot be the **author of creation of** this universe as he is impotent over the cause of pleasure and pain.



శ్రీ స్వామి శివానంద సరస్వతి మహారాజ్

(ధ్యానము నభ్యసించిన మహాపురుషులు దేవాతశక్తిని సృష్టికి కారణముగ తెలిసికొనిరి)

ఈ విశ్వానికి కారణాన్ని తెలుసుకోవడం ఎలా? దాన్ని తెలుసుకొన్న వారెవరు? ఎలా తెలుసుకొన్నారు? ఈ విషయం తరువాతి మంత్రంలో తెలుప బడుతుంది.

## తే ధ్యానయోగానుగతా అపశ్యన్
## దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢామ్।
## యః కారణాని నిఖిలాని తాని
## కాలాత్మయుక్తాన్యధితిష్ఠత్యేకః ॥3॥

టీక:

తే = వారు; ధ్యానయోగాను గతాః = ధ్యాన యోగమును అభ్యసించుచు: అపశ్యన్ = చూచిరి; ప్రత్యక్షము చేసికొనిరి; దేవాత్మశక్తిం = భగవంతుని శక్తిని; స్వగుణైః = గుణముల చేత; నిగూఢాం = దాచియుంచబడినది; యః = ఎవరు; కారణాని = కారణములు; నిఖిలాని = సర్వము; తాని = అవి; కాలాత్మయుక్తాని = కాలముతో ప్రారంభించి జీవాత్మతో అంతమగు; అధితిష్ఠతి = పాలించును; ఏకః = అద్వితీయము.

భావము

ధ్యానము నభ్యసించిన మహాపురుషులు తన స్వగుణములందు గుప్తమైన దేవాత్మశక్తిని [భగవంతుని శక్తిని] ఈ సృష్టికి కారణముగ ప్రత్యక్షముచేసికొనిరి. ఆ శక్తియే[కాలముతో ప్రారంభమై జీవాత్మతో అంతమగు] ఈ కారణము లన్నింటిపై ఆధిపత్యము వహించును.

వివరణము

దేవాత్మ శక్తి సృష్టికి కారణము. భగవంతుని శక్తి విశ్వసృష్టి మూల కారణము. భగవంతుని శక్తియే దేవాత్మ శక్తి. మాయయే దేవాత్మశక్తి.

కాలము. నైసర్గిక స్థితి, నియతి, అదృష్టము, పంచభూతములు, గర్భము, పురుషుడు, జీవాత్మ — వీటన్నిటిపై ఆధిపత్యం వహించే జగత్కారణమైనది దేవాత్మశక్తి. అది ఆది మాయ. అది అనిర్వచనీయమైన భగవంతుని శక్తి (Inscrutable Power of god), ఆది త్రిగుణాత్మక మాయ. సత్త్వము, రజస్సు, తమస్సు అనేవి త్రిగుణాలు. సత్త్వం అంటే శుచిత్వము, మంచితనము, నైర్మల్యము. రజస్సు అంటే చర్య కామం, చురుకుతనం. తమస్సు అంటే చీకటి, సోమరితనం, జడత్వం. స్వగుణం ఈ త్రిగుణాలకు సంబంధించినది.

ధ్యాన యోగాన్ని అభ్యసించిన మహాయోగులు సృష్టి కారణాన్ని దర్శించారు. దేవాత్మ శక్తినే వారు సృష్టికి కారణంగా ప్రత్యక్షం చేసుకొన్నారు. ఆ యోగి పుంగవుల అనుభవం ప్రత్యక్షమైనది, నిరపేక్షమైనది, సత్యమైనది.

నిష్కామ్య సేవ హృదయ శుద్ధిని చేకూరుస్తుంది. హృదయ శుద్ధి ప్రేమకు సోపానమౌతుంది, ప్రేమమయ హృదయం ధ్యాన యోగ్యత పొందుతుంది. ధ్యానం సాక్షాత్కారానికి దారితీస్తుంది భగవంతుని దర్శనం, ఆత్మ సాక్షాత్కారం ధ్యానం వినా లభ్యం కాదు.

ధ్యానావస్థిత తద్గతేన మనసా పశ్యంతి
యం యోగినో యస్యాంతం న విదుః
సురాసురగణాః దేవాయ తస్మై నమః."

సమాధిలోనే పరమాత్మ అవగాహన వీలౌతుంది. అందువల్లనే మహాత్ములు ఎల్లప్పుడూ ధ్యానంలో, సమాధిలో ఉండేవారు. వారు పరమేశ్వరుని ప్రత్యక్షం చేసుకొనేవారు. వారు బ్రహ్మమును విశ్వచక్రంగా ధ్యానించేవారు. నాలుగవ మంత్రంలో ఈ విషయం ద్యోతకం కాగలదు.

తమేకనేమిం త్రివృతం షోడశాంతం
శతార్ధారం వింశతిప్రత్యరాభిః।
అష్టకైః షడ్భిర్విశ్వరూపైక పాశం
త్రిమార్గ భేదం ద్వినిమిత్తైకమోహమ్ ॥4॥

టీక:

తం = ఆతనిని; ఏకనేమిం = ఒకచక్రపరిధితో; త్రివృతం = మూడుకట్టులతో; షోడశాంతం = పదునారు అంతభాగములుగల; శతార్ధారం = ఏబది ఆకులతో; వింశతిప్రత్యరాభిః = ఇరువదిఆధారపుటాకులతో; అష్టకైః షడ్భిః = ఎనిమిదేసి గల ఆరింటిలో; విశ్వరూపైకపాశం = అనేకరూపములుగల ఒకత్రాటితో; త్రిమార్గభేధం = మూడు విభిన్నమార్గములతో; ద్వినిమిత్తైకమోహం = రెండు భ్రమణములకు కారణమగు ఒక్క భ్రమణముతో.

భావము

ఒక్క అంచును, మూడు కట్టులను, పదునారు అంత భాగములను, ఏబది ఆకులను, ఇరువది ఆధారపుటాకులను గల్గి, ఎనిమిదేసిగల ఆరింటితో విలసిల్లు అనేక రూపములుగల ఒక త్రాటిని, మూడు విభిన్న మార్గములు గల్గి, రెండు భ్రమణములకు కారణమగు ఒక్క భ్రమణముతో నొప్పు చక్రముగ మనము భగవంతుని అవగాహనచేసి కొందుము.

వివరణము

తం.

ఆతనిని భగవంతుని. భగవంతుడు విశ్వమనెడి చక్రముగ ధ్యానింపబడుచున్నాడు

## ఏక నేమిం.

ఒక చక్ర పరిధితో. నేమి యనగా చక్రముయొక్క అంచు. ఈ విశ్వచక్రమునకు నేమి ఏది? ఈ చక్రమునకు నేమి circum- ference, fully, edge, rim) మాయ యనదగును. అవ్యక్తాకాశము. మాయ, ప్రకృతి, శక్తి. అజ్ఞానము అని వివిధాభిధానములతో వ్యవహృత మగు ప్రకృతి ఈ విశ్వచక్రమునకు నేమి (fully). ఈ నేమిపైననే సృష్టి యంతయు ఆధారపడుచున్నది.

## త్రివృతం.

ఈ విశ్వచక్రముయొక్క మూడుకట్టులు (three tyres) దేనిని సూచించును? సత్త్వగుణము, రజోగుణము, తమోగుణము — ఈ త్రిగుణములు ఆ మూడు పైటులచే సూచింపబడుచున్నవి. లేదా, ఆ మూడుపైరులు దేశ కాల కారణములను సూచింపవచ్చును

## షోడశాంతం.

పదునారు అంతపుభాగాలు (sixteen end parts). విశ్వచక్రానికి పదునారు అంతపు భాగాలు ఏవి? సాంఖ్య వేదాంతంలో పేర్కొనబడిన పదునారు వికృతులే ఈ విశ్వ చక్రానికి అంతపు భాగాలు. ఆ వికృతులే సృష్టి పూర్తి అయ్యేదానికి కారణం. జ్ఞానేంద్రియాలు ఐదు కర్మేంద్రియాలు ఐదు మనస్సు, పృధివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశం — ఇవి సాంఖ్య వేదాంతుల పదునారు వికారములు. కొందరు ఈ పదునారు అంతపు భాగములు (sixteen end parts of the cosmic wheel) విరాట్ పురుషుని సూత్రాత్మను, పదునాల్గు భువనములను సూచిస్తాయని చెప్పుతారు.

## శతార్థారం.

ఏబది ఆకులతో (with fifty spokes) భువనచక్రంయొక్క ఏబది ఆకులు (spokes) ఏవి? ఐదు రకాల అజ్ఞానం, ఇరువది ఎనిమిది రకాల అసమర్థతలు, తొమ్మిది రకాల తష్టులు, ఎనిమిది రకాల సిద్ధులు — వీటిని

సూచిస్తాయి. తమస్సు, మోహము; మహా మోహము, తిమిరము, అంధ తిమిరము అనేవి అయిదు రకాల అజ్ఞానం. తరము సుతరము, తారయంతి, ప్రమోదము, ప్రమోదితము, ప్రమోదమనము, రమ్యకము, సత్ప్రి మోదితము అనేవి అష్ట సిద్ధులు,

## వింశతి ప్రత్యరాభిః.

ఇరువది ఆధారపుటాకులు, ఇక విశ్వ చక్రానికుండే ఇరువది ఆధారపుటాకులు (Twenty Counter Spoker) వేన్ని సూచిస్తాయి? దశేంద్రియాలు; వాటి దశ విషయాలు విశ్వ చక్రానికుండే ఆధారపుటాకుల్ని సూచిస్తాయి.

## అష్టకైః షడ్భిః.

ఎనిమిదేసి గల ఆరింటితో (Six Sets of Eight). విశ్వచక్రం ఎనిమిదేసి గల ఆరింటితో ఒప్పు చున్నది. అవి ఏవి? మొదటిది సాంఖ్యుల అష్టవిధ ప్రకృతి. అవేవన! పంచ భూతములు, మనస్సు, బుద్ధి, అహంకారము. రెండవది అష్ట ధాతువులు. అవేవన; బహిశ్చర్మము, అంతశ్చర్మము, రక్తము మాంసము, క్రొవ్వు, ఎముకలు, మజ్జ వీర్యము. మూడవది అష్ట సిద్ధులు. అవేవన; అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వం, వశిత్వం. నాలుగవది ఎనిమిది రకాల మనోభావాలు. అవేవన; పుణ్యం, పాపం, జ్ఞానం, అజ్ఞానం, వైరాగ్యం, రాగం, మహాబలం, దౌర్బల్యం. ఐదవది అష్టవిధదేవతలు వారెవరన; బ్రహ్మ, ప్రజాపతి, దేవతలు, గంధర్వులు, యక్షులు, రక్షసులు, పితృగణము, పిశాచములు, ఆరవది ఆత్మ యొక్క అష్టవిధ సుగుణాలు. అవేవన; దయ, క్షమ, ద్వేషరాహిత్యం, శుచిత్వం, అనాయాసము, అకార్పణ్యము, నిస్పృహ శాంతి,

## విశ్వరూపైక పాశం.

అనేక రూపములతో నొప్పరు ఒక త్రాడు. విశ్వచక్రానికుండే ఈ త్రాడు కామాన్ని సూచిస్తుంది. అది ఆశను సూచిస్తుంది ఆశా పాశం అనేక రకాలుగా ఉంటుంది. కోరికలు అపరిమితం, అనంతం కాబట్టి అవి విశ్వరూపైక పాశంగా పేర్కొనబడ్డాయి.

## త్రిమార్గభేదం

మూడు విభిన్న మార్గములతో. (With three different roads) ఆ త్రిమార్గాలు ఏవి? అవేవన; ధర్మము, అధర్మము, జ్ఞానము. విశ్వ చక్రం ఈ మూడు మార్గములగుండ గమిస్తుంది.

## ద్వినిమిత్తైకమోహం.

ప్రతి భ్రమణం రెండు భ్రమణాలకు కారణమౌతుంది. (with each revolution which is the cause for two) మోహమంటే ఏమటి? ఇచ్చట మోహమంటే చక్రం తిరగడం. విశ్వచక్రం ఒకసారి తిరగడంవల్ల రెండు సంభవిస్తాయి. వాటిని పుణ్యపాపాలనిగాని, సుఖదుఃఖాలనిగాని అనవచ్చు.

ఈ మంత్రంలో భగవంతుడు చక్రరూపంలో ధ్యానింపబడినాడు. ఈ మంత్రంలో విశ్వచక్రం వర్ణింపబడినది. మన భగవంతుని విశ్వచక్రంగా ధ్యానింపవచ్చు. (We can meditate on the Lord as the wheel of the universe) తరువాతి (ఐదవ) మంత్రంలో భగవానుడు నదీ రూపంలో ధ్యానింపబడుతాడు.



పంచస్రోతోఽంబుం పంచయోన్యుగ్రవక్రాం
పంచప్రాణోర్మిం పంచబుద్ధ్యాదిమూలాం।
పంచావర్తాం పంచదుఃఖౌఘవేగాం
పంచాశద్భేదాం పంచపర్వామధీమః ॥5॥

టీక

పంచ స్రోతః అంబుం = ఐదు కాలువల నీటిని గలది; పంచయోని ఉగ్ర వక్రాం = ఐదు ఉత్పత్తి స్థానములలోగూడి ఉగ్రమును, వక్రము నైనది; పంచ ప్రాణ ఊర్మిం = ఐదు ప్రాణములను అలలుగ గలది; పంచబుద్ధి ఆది మూలాం = పంచ విధ దర్శనము ఆది మూలముగ గలది, మనస్సు; పంచ ఆవార్తాం = ఐదుసుడిగుండములు గలది; పంచ దుఃఖ ఓఘ వేగాం = ఐదువిధములైన దుఃఖముల వేగముతో చోదితమైనది; పంచాశత్ భేదాం = ఏబది అంశములతో గూడినది; (పంచక్లేశ భేదాం = ఐదువిధ ములైన దుఃఖములతో భాగింపబడినది) పంచాపర్వాం = ఐదు శాఖలు గలది; అధీమః = మేము భావించుచున్నాము, ధ్యానించుచున్నాము, అర్థము చేసుకొనుచున్నాము

భావము

ఉగ్రములైన, వక్రములైన ఐదు ఉత్పత్తి స్థానముల నుండి ప్రవహించు ఐదు కాలువలతో విలసిల్లునట్టిదియు, పంచప్రాణములనెడి అలలతో అలరునట్టిదియు, పంచ విధ దర్శనము (మనస్సు)ను ఆది మూలముగ శోభిల్లునట్టిదియు, ఐదు సుడిగుండములతో రాజిల్లునట్టిదియు, అయిదు విధములైన దుఃఖముల యొక్క వేగముతో చోదితమైనట్టిదియు, పంచక్లేశములచే విభాజ్యమైనట్టియు, అయిదు శాఖలు కలిగినట్టిదియు అగు ఒక నదీ రూపముగ మేము పరమేశ్వరుని ధ్యానించుచున్నాము.

## వివరణము

"ఐదవ మంత్రం ఐదుతో"

(పంచశబ్దందో) ప్రారంభం కావడం గమనార్హం. ఋషి భగవంతుని నదీ రూపముగ ధ్యానించుచున్నాడు.

## పంచస్రోతః అంబుం

ఐదు కాలువల నీటితో నొప్పునది. ఈ దివ్యమైన నదికి ఐదు కాలువలు గలవు. ఐదు ఉత్పత్తి స్థానములనుండి నీరు ఐదు కాలువలద్వారా ప్రవహించు చున్నది. ఈఐదు కాలువలు ఏవి? చక్షురాది జ్ఞానేంద్రియములే ఆ ఐదుకాలువలు పంచేంద్రియములు ఐదు స్రోతస్సులను సూచించును.

## పంచ యోని ఉగ్రవక్రాం

ఐదు ఉత్పత్తి స్థానములలో గూడి ఉగ్రమును, వక్రమును అయినది. ఈ నది ఉగ్రమైనది. భయంకరమైనది. అది వక్రమైనది వంకరటింకరలు గలది. దానికి ఐదు ఉత్పత్తి స్థానములు గలవు. ఐదు ఉత్పత్తి స్థానము లు ఏవి? పంచభూతములే ఐదు ఉత్పత్తి స్థానములు. పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము — ఇవి ఐదు ఉత్పత్తి స్థానములు.

## పంచప్రాణోర్మిం.

ప్రాణములనే ఐదు అలలు గలది. పంచప్రాణములు వేనిని సూచిం చును? ప్రాణములు అలలను సూచించును. ప్రాణము. అపానము, వ్యాన ము, ఉదానము సమానము అనునవి పంచప్రాణములు. ఇవి నదియొక్క అలలను సూచించును.

## పంచబుద్ధ్యాదిమూలాం.

పంచ విధ సందర్శనము (five fold perception, మనస్సు) ను ఆదిమూలము (original source) గ గలది విశ్వము మనస్సుపైననే ఆధారపడుచున్నది. మనస్సు ఉన్నప్పుడే విశ్వం ఉంటుంది, మనస్సు

లేకపోతే విశ్వం ఉండదు. నిర్వికల్ప సమాధిలో మనస్సు నాశనమౌతుంది. అందువల్ల నిర్వికల్ప సమాధిలో విశ్వం ఉండదు. అది అదృశ్యమౌతుంది. ఎప్పుడైతే మనస్సు ఉండదో అప్పుడు విశ్వం ఉండదు. "మనోవృత్తి రూపత్వాత్ సర్వజ్ఞానానాం మనో మూలం కారణం యస్యాః సంసార సరితస్తామ్. సమస్త జ్ఞానము మనోవృత్తి రూపమై యున్నది. ఆ మనస్సు ఈ సంసార రూప నదియొక్క మూలకారణమగుచున్నది.

## పంచఆవర్తాం.

ఈ నదిలో ఐదు సుడి గుండములు ఉన్నాయి. ఆ సుడిగుండాలు ఏవి? శబ్దాది విషయములే ఆ సుడిగుండములు. శబ్దము, స్పర్శ, రూపము రసము, గంధము — ఇవి విషయములు. ఇవే సుడిగుండములు. జీవాత్మలు ఈ సుడిగుండాలలో చిక్కుకొని, మునిగిపోతారు. "పంచశబ్దాదయో విషయా ఆవర్తనీయాస్తేషు విషయేషు ప్రాణినో నిమజ్జంతీతి యస్యాస్తాం పంచావర్తామ్.

## పంచదుఃఖౌఘవేగాం.

ఐదు విధములైన దుఃఖముల వేగముతో చోదితమైనది. ఈ నది యొక్క పంచ విధ దుఃఖాలు నదీ వేగాన్ని ఎక్కువచేస్తాయి. ఐదు విధాలైన దుఃఖాలు ఏవి? గర్భదుఃఖము, జన్మ దుఃఖము, జరా దుఃఖము, వ్యాధిదుఃఖము మరణ దుఃఖము — ఇవి ఐదు విధములైన దుఃఖాలు. ఈ దుఃఖాలు నదీ వేగాన్ని అధికం చేస్తాయి.

## పంచాశత్ భేదాం.

ఏబది అంశములు గలది. శ్రీ శంకరులవారు "పంచక్లేశ భేదాం" అని అంటారు. ఈ నది ఐదు విధములైన క్లేశములచే విభజింపబడినది. పంచ క్లేశములుఏవి? అవిద్యా, అస్మితా, రాగము, ద్వేషము అభినివేశము- ఇవి పంచక్లేశములు.

పంచపర్వాం.

ఈ నదికి ఐదు వంపులు ఉన్నాయి. పై నుడివిన పంచక్లేశములే ఈ సంసారనదియొక్క పంచపర్వములు (మలుపులు).

అధీమః.

ధ్యానించుచున్నాము. భగవంతుని నదీరూపముగ ధ్యానింతుము. నది లోనికి నీరు ఎలా వస్తుంది? మహాసముద్రంలోని నీరు ఆవిరియై నదీరూపం ధరిస్తుంది. మరలా ఆ నది మహా సముద్రం ప్రవేశిస్తుంది. అనగా నీరు సముద్రంలోనుంచి వచ్చి, సముద్రంలోకి మరలా వెడుతుంది. అలాగే ఈ ప్రపంచం బ్రహ్మములో నుంచి వచ్చింది మరల అది బ్రహ్మములోనే లీన మౌతుంది.

జీవుడు సంసారంలో ఎలా చిక్కుకొన్నాడు? సంసారాన్నుండి అతడు బయటపడడం ఎలాగు? ఈ విషయం తదువాతి శ్లోకాలల్లో చెప్పబడుతుంది.

---

సర్వాజీవే సర్వ సంస్థే బృహంతే
అస్మిన్ హంసో భ్రామ్యతే బ్రహ్మచక్రే।
పృథగాత్మానం ప్రేరితారం చ మత్వా
జుష్టస్తతస్తే నామృతత్వమేతి ॥6॥

టీక:

సర్వాజీవే = దేనియందు సకల జీవరాశులు నివసించునో అది; సర్వ సంస్థే = సమస్తము దేనిలో విశ్రమించునో అది; బృహంతే = మహాన్, బ్రహ్మాండమైన; అస్మిన్ = ఈ; హంసః = జీవాత్మ; భ్రామ్యతే = గిర గిర త్రిప్పబడుచున్నాడు; బ్రహ్మచక్రే = బ్రహ్మ చక్రమున; పృథక్ = విభిన్నము; ఆత్మానం = ఆ ఆత్మనుండి; ప్రేరితారం = ప్రేరకుడు, ఈశ్వరుడు; చ = మరియు, మత్వా = భావించి, తెలిసికొని; జుష్టం =

సేవింపబడిన; తతః = తరువాత; తేన = ఈశ్వర సేవనముచే; అమృతత్వం = అమృతత్వమును, ఏతి = పొందును.

భావము

ఈ అనంతమైన బ్రహ్మచక్రమున సకల జీవరాశులు నివసించుచున్నవి, విశ్రమించుచున్నవి. యాత్రికుడైన జీవుడు (పునర్జన్మ పడయు జీవాత్మ) తాను, పరమాత్మ అన్యమని అనుకొన్నప్పుడు ఈ బ్రహ్మచక్రమున గిరగిర త్రిప్పబడుచున్నాడు. పరమేశ్వరునిచే అనుగ్రహింపబడినపుడు జీవుడు అమృతత్త్వమును పడయును.

వివరణము

బ్రహ్మచక్రము ఏమిటి? ఈ ప్రపంచాన్నే బ్రహ్మచక్రము అన్నారు. సకల జీవరాశులు ఈ బ్రహ్మచక్రమున నివసించుచు, దానిలోనే లీనమగుచున్నవి. ఇది అద్భుతమైన, మహత్తరమైన చక్రము.

హంసః అనగా హంస, మరాళము. ఇచట జీవుడు హంసయని పిలువబడినాడు, హంస యనగా యాత్రికుడు, సంసార పథమున పయనిస్తున్నాడు. కాబట్టి జీవుని హంస యన్నారు జీవుడు తాను పరమాత్మనుండి భిన్నమని భావించినపుడు అతడు ఈ సంసార చక్రమున గిరగిర త్రిప్పబడుచున్నాడు. మానవుడు అనేక జన్మలు పొంది, వివిధ యోనులగుండ చరించి, అనేక అనుభవాల్ని పడసి క్రమేణ అభ్యుదయాన్ని సాధిస్తాడు, కట్టకడపట అతడు బ్రహ్మముతో ఐక్యము చెందుతాడు, "అనేక జన్మ సంసిద్ధః తతోయాతి పరాంగతిం" అనేక జన్మలలో పరిశుద్ధుడైన తరువాత యోగి పరమగతిని, బ్రహ్మమును పొందును జీవుడు తాను, బ్రహ్మము ఒకటని భావించినపుడు అతడు అమృతత్త్వమును పొందును. "యద్ భావం తద్ భవతి" అతడు "అహం బ్రహ్మాస్మి" నేను బ్రహ్మము అను భావముతో బ్రహ్మైక్యమును, అమృతత్త్వమును పడయును.

పరమేశ్వరుని అనుగ్రహము వల్లనే మనం సాధన చతుష్టయసంపన్నులం ఔతాము. భగవదనుగ్రహము మనకు వేదాంతంపట్ల అభిరుచి కలుగుతుంది. దేవుని అనుకంపవల్లనే మనం పరమాత్మతో తాదాత్మ్యాన్ని తెలుసుకొంటాం.

తేషామేవానుకంపార్థం
అహం అజ్ఞానజం తమః।
నాశయామి ఆత్మభావస్థో
జ్ఞానదీపేన భాస్వతా॥ గీతా.

వారిపై నాకుగల నిర్నిరోధమైన అనుకంపవల్లనే ప్రకాశవంతమైన జ్ఞానజ్యోతిచే అజ్ఞానజన్యమగు వారి తిమిరమును నాశమొందింతును.

దదామి బుద్ధియోగం తం
యేన మాముపయాంతి తే॥ గీతా.

నేను వారికి బుద్ధియోగమును ప్రసాదింతును, వారు దానిచే నన్ను పొందుదురు.

అందువల్ల పరబ్రహ్మ సాక్షాత్కారానికి పురుష ప్రయత్నమేగాక పరమేశ్వరానుగ్రహం కూడ ఉండాలి అని విశదమగుచున్నది.

---

ఉద్గీతమేతత్పరమం తు బ్రహ్మ
తస్మింస్త్రయం సుప్రతిష్ఠాక్షరం చ ।
అత్రాంతరం బ్రహ్మవిదో విదిత్వా
లీనా బ్రహ్మణి తత్పరా యోనిముక్తాః॥7॥

టీక

ఉద్గీతం = గానము చేయబడినది; ఏతత్ = ఈ; పరమం = సర్వోత్కృష్టమైన; తు = నిజముగ; బ్రహ్మ = బ్రహ్మము; తస్మిన్ = దానిలో;

త్రియం = మూడు; సుప్రతిష్ఠ = గట్టిఆలంబనము; అక్షరం = క్షరముకాని; చ = మరియు; అత్రాంతరం = దానియందలి; బ్రహ్మవిదః = బ్రహ్మమును తెలుసు కొన్నవారు; విదిత్వా = తెలిసికొనుటచే; లీనాః = లీనమగుదురు; బ్రహ్మణి = బ్రహ్మమునందు; తత్పరాః = దానియందు మనస్సు లగ్నమైయుండువారు; యోనిముక్తాః = గర్భమునుండి విడివడినవారు, పునర్జన్మలేనివారు.

## భావము

ఇది వాస్తవములో పరబ్రహ్మముగ ప్రకటింపబడినది. దానియందు త్రయము గలదు. అది స్థిరమైన ఆధారము. అది అవినాశి. దానిలో ఏమున్నదో తెలుసుకొనుటచే బ్రహ్మవిదులు బ్రహ్మము పట్ల భక్త భావము గలవారై, బ్రహ్మములో లీనులై, జన్మనుండి ముక్తిని పడయుదురు.

## వివరణము

ఏ తత్ అనగా దీనిని. అనగా నిరుపాధిక పూర్ణ ఆనంద అద్వితీయ నిర్గుణ పరబ్రహ్మమును. మూలములో "తు" శబ్దము నిశ్చయార్థకమును తెలియజేస్తుంది. బ్రహ్మము ప్రాపంచిక ధర్మములు లేనికారణమున సర్వోత్కృష్టమైనది. అది సకల విధములైన సాంసారిక ధర్మములచే అనాక్రాంతమైనది. సర్వోత్కృష్టమైన బహోపాసనవల్ల కలుగు మోక్ష రూప ఫలము సైతము ఉత్కృష్టమైనదే.

త్రియము అనగా మూడు. ఈ త్రియము ఏమిటి? భోక్త, భోగ్యము ప్రేరితుడు— ఇవి త్రియము. జీవాత్మ, భోగ్యవస్తువులు, పరమాత్మ— ఇవి త్రియము. జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్త్యవస్థ— ఇవి కూడా త్రియము కావచ్చును.

సుప్రతిష్ఠ అక్షరం చ. బ్రహ్మము స్థిరమైన ఆలంబనము. అది అవినాశి. ఈ ప్రపంచానికి బ్రహ్మము అధిష్టానము (substratum). విశ్వ ప్రళయమప్పుడు ఈ యావత్తు ప్రపంచం బ్రహ్మలోనే విశ్రమిస్తుంది.

బ్రహ్మ విదః అనగా బ్రహ్మమును తెలుసుకొన్నవారు. బ్రహ్మ విదులు విచారము సల్పుతారు. వారు ఉపాధులను వేరు పరుస్తారు. తాము పంచ కోశములు (అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనంద మయ కోశములు) కాము అని తెలుసుకొంటారు. తాము త్రిశరీరములు (స్థూల, సూక్ష్మ కారణ శరీరములు) కామని తెలుసుకొంటారు. "నేతి నేతి" సిద్ధాంతం ద్వారా తాము దృశ్య ప్రపంచం కామని తెలుసుకొంటారు. ధ్యాన యోగ సాధన ద్వారా, సమాధి ద్వారా వారు అంతస్సారమును, అనగా పర బ్రహ్మ తత్త్వాన్ని గ్రహిస్తారు. వారు ఆ సారవస్తువులో (పరబ్రహ్మములో) లీనమౌతారు.

యోని ముక్తాః అనగా యోని నుండి ముక్తులు. యోని ముక్తులనగా పునర్జన్మ రహితులు బ్రహ్మ విదులు ఆత్మ సాక్షాత్కారమువల్ల పునర్జన్మ రహితులౌతారు.

**యోనిముక్తా భవంతి గర్భ జన్మ జరా మరణ**
**సంసార భయాన్ముక్తా భవంతీత్యర్థః**

గర్భ వాసము, పుట్టుక, ముసలితనము, మరణము—వీటితో గూడిన సంసార భయము నుండివారు ముక్తులగుదురని అభిప్రాయము.

తరువాతి శ్లోకమున అజ్ఞానావస్థలో, ఉపాధి వశుడై యున్న జీవుని స్థితిని గూర్చి తెలుపబడినది.



సంయుక్తమేతత్ క్షర మక్షరం చ
వ్యక్తావ్యక్తం భరతే విశ్వమీశః।
అనీశశ్చాత్మా బధ్యతే భోక్తృభావాత్
జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః॥8॥

టీక:

సంయుక్తం = ఒకటిగచేరినది; ఏతత్ = ఈ; క్షరం = నాశనమగునది;అక్షరం = నాశనములేనిది; చ = మరియు; వ్యక్తావ్యక్తం = వ్యక్తమైనది; అవ్యక్తమైనది భరతే = భరించును; విశ్వం = విశ్వమును; ఈశః = ప్రభువు; అనీశః = ప్రభువులేని; చ = మరియు; ఆత్మా = జీవాత్మ; బధ్యతే = బంధితుడగును; భోక్తృభావాత్ = భోక్త అయినందువలన; జ్ఞాత్వా = తెలిసికొని; దేవం = భగవంతుని; ముచ్యతే = ముక్తుడగును; సర్వపాశైః = సకలపాశములనుండి

భావము

ఈ విశ్వము క్షరాక్షరముల సంఘాతము. అది వ్యక్తావ్యక్తముల కలయిక. దానిని పరమేశ్వరుడు భరించుచున్నాడు. ఎంత కాలము జీవాత్మ పరమేశ్వరుని ఎరుగడో అంతము ఆతడు ఇంద్రియ భోగముల పట్ల ఆసక్తుడగును. అతడు బద్ధుడగుచున్నాడు. అతడు దేవుని తెలిసికొనినపుడు అతడు అన్ని శృంఖలముల నుండి ముక్తుడగును.

వివరణము

సంయుక్తం ఏతత్ క్షరం అక్షరం చ.

సంయుక్తమనగా కూడినది. ఈ విశ్వము క్షరములతో, అక్షరములతో, వ్యక్తముతో, అవ్యక్తముతో కూడియున్నది.

క్షరమంటే ఏమిటి? క్షరః సర్వాణి భూతాని. క్షరమనగా సర్వ భూతములు. నాశమగుటచే అది క్షరమనియు, వినాశియనియు పిలువబడును. సర్వ భూతములు క్షరము అనబడుచున్నది. కార్యసమూహమంతయు క్షరము (destructible) అనబడుచున్నది.

అక్షరమంటే ఏమిటి? అనేక సాంసారిక జీవాత్మల కామకర్మాది సంస్కారమునకు ఆశ్రయమైయుండుదానిని అక్షర మందురు. సంసార బీజము అనంతమైయుండుటవలన సమసిపోవునదికాదు అందువలన దానిని అక్షర మనుచున్నాము. సంసార మాయావృక్షమునకు బీజమై యుండుదానిని అక్షర మందురు. కూటస్థో౽క్షర ఉచ్యతే కూటస్థుడు అక్షరమని చెప్పబడుచున్నాడు. కూటమనగా మాయ.

ఈ విశ్వము క్షరాక్షరములతో గూడినది.

ద్వావిమౌ పురుషౌ లోకే
క్షర శ్చాక్షర ఏవ చ.— గీతా

లోకమునందు రెండు రకముల పురుషులు గలరు. అవి క్షరపురుషుడు, అక్షర పురుషుడు

## వ్యక్తావ్యక్త భరతే విశ్వ మీశః

వ్యక్త అవ్యక్తముల కలయిక అయిన ఈ విశ్వమును పరమేశ్వరుడు భరించుచున్నాడు. వ్యక్తమనగా వ్యక్తమైన ప్రపంచము, అవ్యక్తమనగా అవ్యక్తమైన మూల ప్రకృతి. ఈ వ్యక్త విశ్వమునకు మూలప్రకృతిలో బీజముండును. భరతే అనగా భరించును. పరమేశ్వరుడు క్షరాక్షరముల తోను, వ్యక్త ములతోను గూడిన విశ్వమును భరించుచున్నాడు.

యో లోకత్రయ మా విశ్య
బిభర్తి అవ్యయ ఈశ్వరః --- గీతా.

అవ్యయుడగు ఈశ్వరుడు లోకత్రయమును వ్యాపించి, ధరించియున్నాడు. పరమాత్మ క్షరాక్షరములకు వ్యక్తావ్యక్తములకు అత్యంత విలక్షణుడై యున్నాడు. తనస్వరూపస్థితి మాత్రమున నుండి సర్వమును సర్వజ్ఞుడైన, అవ్యయుడైన ఈశ్వరుడు ధరించియున్నాడు.

## అనీశశ్చాత్మా బధ్యతే భోక్తృభావాత్.

పరమేశ్వరుని ఎరుగని జీవాత్మ భోక్తయై బద్ధుడగుచున్నాడు. అనీశశ్చాత్మా అనగా అజ్ఞానముతో నొప్పు జీవాత్మ. అజ్ఞానియైన జీవుడు దేహేంద్రియ మనోబుద్ధులతో తాదాత్మ్యము నొందును. అట్లు చేయుటచే అతడు కర్తృత్వభావమును, భోక్తృత్వ భావమును అలవరచుకొనును. "అహంకర్తా, అహంభోక్తా" యను భావము అతని బంధమునకు కారణమగుచున్నది. "నాహం కర్తా, నాహంభోక్తా" అను భావము ఉదయింపనంత వరకు, అనగా జీవాత్మ దేవుని అవగతముచేసుకోనంత కాలము అతని మనస్సు ఇంద్రియ భోగములలో రతిని చూపును. అతడు ఇంద్రియ సుఖ జీవితమునకు అంటి యుండును. అతడు భోక్తృత్వభావమువలన దేహాధ్యాసవలన బద్ధుడగుచున్నాడు.

## జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వ పాశైః

అతడు దైవ సాక్షాత్కారము పొందిన పిదప సర్వబంధనములనుండి విమోచనము పడయును. ముచ్యతే అనగా ముక్తుడగును. అతడు భగవంతుని తెలుసుకొన్న పిదప సర్వవిధములైన అజ్ఞాన శృంఖలములనుండి ముక్తుడౌతాడు. కాబట్టి ఆనందమునకు మూలము భగవత్సాక్షాత్కారమే. ఆత్మ సాక్షాత్కారము వినా నిజమైన ఆనందములేదు ఇంద్రియ జయము లోనే ఆనందము ఇమిడియున్నది. పరమేశ్వరుని సాక్షాత్కారమే సర్వవిధ దుఃఖనివృత్తిని, పరమానంద ప్రాప్తిని కలిగించగలదు

మానవుని దుఃఖాలకు, బాధలకు కారణాన్ని ఋషి తరువాతి మంత్రంలో బోధిస్తాడు.

జ్ఞాజ్ఞౌ ద్వావజావీశనీశావజా
హ్యేకా భోక్తృభోగ్యార్థయుక్తా।
అనంతశ్చాత్మా విశ్వరూపో హ్యకర్తా
త్రయం యదా విందతే బ్రహ్మమేతత్॥9॥

టీక

జ్ఞాజ్ఞౌ = సర్వజ్ఞుడైన ఈశ్వరుడు, అజ్ఞుడైన జీవాత్మ; ద్వౌ = ఇరువురు; అజౌ = పుట్టుకలేనివారు; ఈశనీశౌ = సర్వసమర్థుడు,అసమర్థుడు; అజా = జన్మరహితురాలు; హి = నిశ్చయముగా; ఏకా = ఒకటి; భోక్తృ భోగ్యార్థయుక్తా = భోక్తతోను, భోగ్యవస్తువులతోను కూడినటువంటి; అనంతః = అనంతమైనది; చ = మరియు; ఆత్మా = ఆత్మ; విశ్వరూపః = విశ్వరూపము; హి = వాస్తవములో అకర్తా = కర్తృత్వములేని; త్రయం = మూడు; యదా = ఎప్పుడు; విందతే = తెలిసికొనునో; బ్రహ్మం = బ్రహ్మము; ఏతత్ = ఈ.

భావము

సర్వజ్ఞుడైన ఈశ్వరుడు, అజ్ఞుడైన జీవుడు; సర్వసమర్థుడైనభగవంతుడు, అసమర్థుడైన జీవాత్మ-వీరిరువురు అజులే (పుట్టుక లేనివారే). భోక్తతోను, భోగ్యవస్తువులతోను సంబంధపరుపబడినట్టిదియు, భోక్త భోగ్యముల సాక్షాత్కారము కలిగించునట్టిదియు నైన ఆమె [ప్రకృతి] సైతము పుట్టుకలేనిదే. ఈ మూడింటిని [ఈశ్వరుని, జీవుని, ప్రకృతిని] బ్రహ్మముగ తెలిసికొనునప్పుడే ఆత్మ తన

అనంత స్వభావమును, విశ్వరూపత్వమును, అఖండ స్వేచ్ఛను, నిష్క్రియత్వమును సాక్షాత్కరించుకొనును.

వివరణము

జ్ఞాజ్ఞౌ ద్వౌ అజౌ ఈశనీశౌ*

ఈశ్వరుడు సర్వజ్ఞుడు. జీవుడు అజ్ఞుడు ఈశ్వరుడు, జీవుడు—వీరిరువురు జన్మాదిరహితులు, వారు అజులు. వారికి జన్మలేదు. సర్వేశుడు పరమేశ్వరుడు. అనీశుడు జీవుడు. వీరిరువురు అజులు. వారికి జన్మలేదు వీరుభయులు పుట్టుకలేనివారే, అజులే. సర్వేశుడు పరమేశ్వరుడు; అనీశుడు జీవుడు సర్వజ్ఞుడు పరమేశ్వరుడు; అసర్వజ్ఞుడు జీవుడు. సర్వకృత్తు పరమేశ్వరుడు, అసర్వకృత్తు జీవుడు. సర్వభృత్తు పరమేశ్వరుడు, దేహాది భృత్తు జీవుడు. సర్వాత్ముడు పరమేశ్వరుడు, అసర్వాత్ముడు జీవుడు. విశ్వైశ్వర్య ఆప్తకాముడు పరమేశ్వరుడు, అవిశ్వైశ్వర్య అనాత్మకాముడు జీవుడు. వీరిరువురు అజులే.

అజా హి ఏకా భోక్తృ భోగ్యార్థయుక్తా

మాయ భోక్తతోను, భోగ్య వస్తువులతోను సంబంధ పరుపబడి యున్నది. ఆమె భోక్త భోగ్యముల సాక్షాత్కారమును కలిగించును ఆమె సైతము పుట్టుకలేనిదే.

మాయయా అనిర్వాచ్యత్వేన వస్తుత్వాయోగాత్ తథాహ — 'ఏషా హి భగవన్మాయా సదసద్వ్యక్తి వర్జితా' ఇతి

ఆ నిర్వచనీయమైన దగుట వలన మాయను ఫలాని వస్తువనుటకు వీలుగాదు. ఈ విధముగ మాయను గూర్చి చెప్పబడియుంది. "పరమేశ్వరుని మాయ సద సద్రూపమునకు దూరమైనది."

---

*"ఈశనీశౌ, ఛాందసం హ్రస్వత్వం" ఈశనీశౌ అనే పదంలోని శకారము యొక్క హ్రస్వత వైదికమని తెలియవలెను.

మాయ కూడా అజము. ఆమెకు జన్మలేదు. ఆమె సర్వమును సృజిస్తుంది. ఆమె పరమాత్మయొక్క శక్తి. త్రిపుటి ఆమెయొక్క వికారములే (modifications). భోగి, భోగము, భోజ్యవస్తువు — ఈ మూడు ఆమెయొక్క వికారములే. పరమేశ్వరుడు మిథ్యాశక్తియైన మాయా సమన్వితుడైనందువల్ల భగవంతునిలో భిన్నత్వములన్నియు ఉన్నట్లు గోచరిస్తుంది.

## అనంతశ్చ ఆత్మా విశ్వరూపః హి అకర్తా

పరమాత్మ అనంతుడు. అతడు విశ్వరూపుడు. అతడు నిష్క్రియుడు. పరిపూర్ణుడు నిర్వికారుడు. పరమాత్మ సర్వదా కేవల సాక్షిస్వరూపుడు. అతడు సర్వదా స్వతంత్రుడు.

## త్రయం యదా విందతే బ్రహ్మమేతత్

ఈశ్వరుని జీవుని, ప్రకృతిని బ్రహ్మముగ తెలిసికొన్నప్పుడే జీవాత్మ తన అనంత స్వభావమును, విశ్వరూపత్వమును, అఖండస్వేచ్ఛను, నిష్క్రియత్వమును సాక్షాత్కరించుకొనును.

అజ్ఞానంవల్ల జీవాత్మ తానుకర్తయని, భోక్తయని భావిస్తాడు. మానవ కోటి దుఃఖాలకు, బాధలకు ఇది మూలకారణం. విషయం (object) ఎల్లప్పుడూ దానిని వీక్షించు కర్త (subject) పై ఆధారపడియుంటుంది. జీవాత్మ పరమాత్మతో తన తాదాత్మ్యమును తెలుసుకొన్నప్పుడు కర్తృత్వభావం అదృశ్యమౌతుంది. నిర్వికల్ప సమాధిలో త్రిపుటి అదృశ్యమౌతుంది. కర్త కర్మ ఒకటి ఔతుంది. ద్రష్టదృశ్యము ఏకమౌతుంది. త్రిపుటి బ్రహ్మములో లీనమౌతుంది. జీవాత్మ తన యథార్థ స్వరూపాన్ని, తన అనంత స్వభావాన్ని విశ్వరూపత్వాన్ని, పరిపూర్ణ స్వాతంత్ర్యాన్ని దర్శిస్తాడు.

తరువాతి మంత్రమున ఋషిసత్తముడు మాయానివృత్తికి మార్గమును తెలియజేయుచున్నాడు.



క్షరం ప్రధానమమృతాక్షరం
క్షరాత్మానావీశతే దేవ ఏకః।
తస్యాభిధ్యానాద్యోజనాత్ తత్త్వభావాద్
భూయశ్చాంతే విశ్వమాయా నివృత్తిః॥10॥

టీక

క్షరం= వినాశశీలమైనది; ప్రధానం= ప్రకృతి: అమృతాక్షరం= చావులేని, నాశనములేని; హరః= భగవంతుడు; క్షర= నశ్వరమైన ప్రకృతిని ఆత్మానౌ= జీవాత్మలను; ఈశతే=పాలించును; దేవః=పరమాత్మ; ఏకః= అద్వితీయము; తస్య = అతనియొక్క; అభిధ్యానాత్ = ధ్యానమువల్ల; యోజనాత్= కూడికవలన; తత్త్వ భావాత్= అతనితో (పరమాత్మతో) ఒకటి అగుటవలన; భూయః= మరల; చ= మరియు: అంతే= ప్రారబ్ధము తొలగిన పిదప; విశ్వమాయా నివృత్తిః= సకలవిధ మాయా నివృత్తి

భావము

ప్రకృతి క్షరమైనది. పరమేశ్వరుడు అమృతుడు, అక్షరుడు. అతడు క్షరులైన ప్రకృతిని జీవాత్మలను పాలించును. పరమేశ్వరుని ధ్యానించుటవలన, అతనితో సంయోగముపొందుట వలన, అతనితో ఒకటి యగుట వలన తుదియందు సకలవిధ భ్రాంతి (మాయా) నివృత్తి కలుగును.

వివరణము

క్షరం ప్రధానం

ప్రకృతి నశ్వరమైనది. (matter is destructible). ప్రధానము అంటే మూలప్రకృతి. స్వతఃగ మూలప్రకృతి నశ్వరమైనది కాదు.

అది అనాది. దానికి ఆదిలేదు అది బీజము, దానికి పుట్టుకలేదు. అయితే దాన్ని క్షరమని దేనికన్నారు? భగవంతునకు ప్రకృతికి మధ్య తేడా చూప దానికి దాన్ని క్షరమని పిలిచారు. మోక్షమును పడసిన మహాత్మునకు ప్రకృతి సమస్తం అదృశ్యమౌతుంది. అందువల్ల ప్రధానాన్ని (ప్రకృతిని) క్షరమన్నారు.

## అమృతాక్షరం హరః

హరుడు అమృతుడు. అక్షరుడు, భగవంతునికు చావులేదు. అతనికి నాశములేదు. హరుడు అనగా నాశముచేయువాడు. జీవాత్మలయొక్క అజ్ఞానమునంతటిని భగవంతుడు నాశమొనర్చును గావున అతడు హరః (హరుడు) అని పిలవబడుచున్నాడు. అవిద్యాదేః హరణాత్ పరమేశ్వరో హరః ' బ్రహ్మము అమృతాక్షరుడైన ఈశ్వరుడు. అతడు ఏకైక బ్రహ్మము అతడు ఏకము. అతడు అద్వయుడు. అతడు ఒకేఒక భగవంతుడు. అతడు సచ్చిదానంద అద్వితీయ పరమాత్మ.

## క్షర ఆత్మానౌ ఈశతే దేవః ఏకః

ఏకైక దేవుడు క్షరులైన ప్రకృతిని, జీవాత్మలను పాలించును.

## తస్యాభిధ్యానాత్.

క్షరులైన ప్రధానమును, జీవాత్మలను పాలించునట్టి ఆ ఏకైక హరుని (పరమాత్మను) ధ్యానించుటవలన సకలవిధ భ్రాంతి నివృత్తి కలుగును. ధారణ ధ్యానంలో సమాప్తమౌతుంది. ధ్యానము సమాధికి గొంపోతుంది కావున సమాధిప్రాప్తికి, మాయా నివృత్తికి అతని ధ్యానము అత్యావశ్యకము.

## యోజనాత్.

కూడికవలన పరమాత్మతో జీవాత్మ చేరికవలన జిజ్ఞాసువు, యోగాభ్యాసకుడు ప్రప్రథమంలో పరమేశ్వరునితో సాయుజ్యాన్ని పొందుతాడు. దీన్నిసవికల్పసమాధి అంటారు. సవికల్ప సమాధిలో ధ్యాత (ధ్యానించువాడు)

ధ్యేయము (పరమాత్మ) ల మధ్య కొంచెం భేదముంటుంది. సవికల్ప సమాధిలో త్రిపుటి ఉంటుంది. ధ్యాత, ధ్యానము, ధ్యేయము — ఇవి త్రిపుటి. పరమాత్మతో జీవుని చేరికవలన భ్రాంతి నివృత్తి కలుగును. భ్రాంతి నివృత్తికి వేరొక మార్గములేదు.

## తత్త్వభావాత్

అనగా పరమాత్మతో ఏకమగుటవలన. సవికల్పి సమాధి అనంతరం అతడు తన్ను పరమేశ్వరునిలో లీనం చేసుకొంటాడు. అతడు పరమేశ్వరుని భావమున ప్రవేశిస్తాడు. దీనిని నిర్వికల్ప సమాధి అంటారు. ఈ నిర్వికల్ప సమాధిలో త్రిపుటీలయం ఉంటుంది. నిర్వికల్ప సమాధిలో త్రిపుటి పూర్తిగా అదృశ్యమౌతుంది. ధ్యాత ధ్యేయముల మధ్య అత్రామాత్రం అంతరంకూడ అదృశ్యమౌతుంది. ధ్యాత ధ్యేయంతో తన తాదాత్మ్యాన్ని తెలుసుకోవడంవల్ల ధ్యాత. ధ్యానం, ధ్యేయం (ధ్యానించువాడు, ధ్యానముచేయుట, పరమాత్మ) — ఈ మూడు ఒకటి ఔతాయి. ఇక్కడ ధ్యానం అంతమౌతుంది

· భగవద్గీతలో భగవానుడు ఇలా ప్రవచిస్తారు·

భక్త్యా త్వనన్యయా శక్య
అహమేవం విధోఽర్జున
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన
ప్రవేష్టుం చ పరంతప,

అర్జునా, *అనన్యభక్తివలన మాత్రమే నేను తత్త్వతః తెలియబడుటకు, చూడబడుటకు, ప్రవేశింపబడుటకు సాధ్యుడనగుదును.

---

*సర్వ కారణములచేతను పరమాత్మకంటే వేరుగ మరొకటి ఏదియు దేనికి అగపడుట లేదో అది అనన్య భక్తి. అపృథగ్భూతమైన భగవంతుని కంటే అన్యముగ వేనియందును, ఏదియు ఏపుడునూ ఉండదో అది అనన్య భక్తి యనబడును,

భూయశ్చాంతే విశ్వమాయా నివృత్తిః.

తదేక ధ్యానము వల్ల ప్రారబ్ధ కర్మతొలగిన పిదప సకలవిధ భ్రాంతి నివృత్తియగును. భూయః అనగా పునః పునః, మాటి మాటికి, మరల మరల, జిజ్ఞాసువు "నేను బ్రహ్మమును", "అహం బ్రహ్మాస్మి" అని ధ్యానించ వలెను. ఈ అనసజ్యోత బ్రహ్మ ధ్యానమువల్ల ధ్యాత సమాధిని పడయును. అతనికి ఆత్మ జ్ఞానము కల్గును. అతని జ్ఞానాగ్నిలో సర్వకర్మలు భస్మమగును.

"అంతే" అనగా, ప్రారబ్ధకర్మ సమాప్తియైన పిదప. అనగా స్వాత్మజ్ఞానోదయ వేళయందు విశ్వమాయా నివృత్తి కలుగును, సుఖదుఃఖాత్మకమైనటి అశేష ప్రపంచ రూపమాయా నివృత్తి కలుగును.

తరువాతి మంత్రమున కైవల్య మోక్షస్థితిని వర్ణించుచున్నారు.

## జ్ఞాత్వా దేవం సర్వపాశాపహానిః
## క్షీణైః క్లేశైర్జన్మమృత్యుప్రహాణిః।
## తస్యాభిధ్యానాత్తృతీయం దేహభేదే
## విశ్వైశ్వర్యం కేవల ఆప్తకామః॥ 11 ॥

టీక

జ్ఞాత్వా = తెలిసికొని: దేవం = భగవంతుని; సర్వపాశాపహానిః = సకల విధములైన అజ్ఞాన బంధనములు నాశమగును; క్షీణైః = నాశమొందును; క్లేశైః జన్మ మృత్యు ప్రహాణిః = జనన మరణ హేతు దుఃఖ వినాశము; తస్య అభిధ్యానాత్ = ఆ పరమాత్మ యొక్క ధ్యానము వలన; తృతీయం = మూడవ స్థితిని; దేహ భేదే = దేహము లయమగు వేళ; విశ్వైశ్వర్యం = విశ్వాధిపత్యమును; కేవల = అద్వితీయుడు; ఆప్తకామః = సర్వకామ తుష్టినొందినవాడు.

భావము:

భగవంతుని తెలిసికొనుటవలన సకల విధములైన అజ్ఞాన బంధములు వినాశమొందును; జననము, మరణము,దుఃఖము — ఇవి అంతమొందును. ఆ పరమాత్మను ధ్యానించుటవలన దేహము లయమగు వేళ ధ్యాత తృతీయ స్థానమును, అనగా విశ్వాధిపత్యమును పడయును. అతని వాంఛితములన్నియు ఈడేరి, అతడు అద్వయుడగును.

వివరణము;

## జ్ఞాత్వా దేవం సర్వపాశాపహానిః

"అయం అహం అస్మి" "ఆ బ్రహ్మమే నేను" అని తెలిసికొని అతడు సకలవిధములైన అవిద్యా బంధనములను తెగద్రెంచుకొనును. భగవంతుని విస్మరించుటవలననే మనకు గర్భవాసాది దుఃఖములు కలుగుచున్నవి పరమేశ్వర సాక్షాత్కారమువలన సకల విధ దుఃఖ నివృత్తి ప్రాప్తి సిద్ధించును. ఇదే జీవిత గమ్యము,

## క్షీణైః క్లేశైః జన్మ మృత్యు ప్రహాణిః

ఈశ్వర సాక్షాత్కారమువలన జనన మరణ దుఃఖములు అంతమొందును అవిద్య, అహంకారము, రాగము, ద్వేషము, అభినివేశము-వీనిని పంచక్లేశము లందురు. ఈ క్లేశములు తొలగుటవలన జన్మ మృత్యువు మొదలగు దుఃఖములకు హేతువులు అంత మొందును. ఇది జ్ఞానఫలము. సకల విధ దుఃఖ నివృత్తి, పరమానంద ప్రాప్తి—ఇవి జీవిత గమ్యము సర్వోపనిషత్తులు మానవ జీవిత లక్ష్యము ఆత్మ సాక్షాత్కారము అని ప్రదర్శించుచున్నవి.

## తస్యాభిధ్యానాత్ తృతీయం దేహభేదే.

ఆ పరమేశ్వరుని ధ్యానమువలన అతడు తృతీయ ఫలమును పొందునని తెలుపబడినది. అతడు ఈ తృతీయ స్థితిని శరీర పతనానంతరము

పొందునని నుడువబడినది. దేహ పతనానంతరము అతడు అర్చిరాది దేవయాన మార్గముగుండ గమించి, పరమేశ్వర సాయుజ్యమును పడసి, పరమ వ్యోమ రూప కారణ బ్రహ్మమునందు స్థితమైన సంపూర్ణ ఐశ్వర్య రూప తృతీయ ఫలమును పడయును.

## విశ్వైశ్వర్యం కేవల ఆప్త కామః

అతడు విశ్వాధిపత్యమును పడయును. అతని వాంఛితములన్నియు తీరెను. అతడు అద్వయుడగును. ధ్యాత తాను పరమేశ్వరునిలో లీనమైన ప్పుడు అతడు అద్వితీయుడగును. దీనిని కైవల్యస్థితి యందురు. అతడు ఆప్త కాముడై నప్పుడు అతనిలో కోరిక లెట్లుండగలవు? భగవంతునితో ఐక్యము నొందుటచే అతడు విశ్వైశ్వర్యమును సార్వభౌమాధికారమును పడయును. ఇక అతని కేమి కోరికలు తృప్తి నొందకుండును? భగవంతుని ఐశ్వర్యమంతయు అతని పాదాల క్రింద పొర్లుచుండును. (All the wealth of Lord rolls under his feet) అందువల్ల అతని వాంఛితము లన్నియు తృప్తి నొందును. అతనికి ప్రాపంచిక సుఖముల పట్ల ఎటువంటి కోరిక యుండజాలదు.

ధ్యానాత్ ఐశ్వర్యమతులం
ఐశ్వర్యాత్ సుఖముత్తమమ్ ।
జ్ఞానేన తత్ పరిత్యజ్య
విదేహో ముక్తిమాప్నుయాత్ ॥

'ధ్యానమువలన అతులిత ఐశ్వర్యం కలుగుతుంది. ఐశ్వర్యంవల్ల సర్వో త్కృష్టమైన సుఖం లభ్యమౌతుంది. జ్ఞానంచేత దానిని త్యజించి, దేహాభి మానరహితుడై మోక్షమును పొందవలెను' అని శివధర్మోత్తరమున తెలుప బడినది.

---

# ఏతద్జ్ఞేయం నిత్యమేవాత్మసంస్థం
# నాతః పరం వేదితవ్యం హి కించిత్।

భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా
సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మమేతత్ ॥12॥

టీక

ఏతత్ = ఇది; జ్ఞేయం = తెలియబడవలెను; నిత్యం = సదా; ఏవ = మాత్రము; ఆత్మసంస్థం = స్వాత్మలో ఉన్నట్టి; న = లేదు; అతః = దాని కంటే; పరం = ఉత్తమమైనది; వేదితవ్యం = తెలియబడు చున్నది; హి = నిశ్చయముగ; కించిత్ = అణుమాత్రము; భోక్తా = భోగము పొందువాడు; భోగ్యం = భోగింపబడునది; ప్రేరితారం = అంతర్యామి యగు పరమేశ్వరుడు; చ = మరియు; మత్వా = తెలిసికొని; సర్వం = సకలము; ప్రోక్తం = వేదములలో చెప్పబడియున్నది; త్రివిధం = మూడు విధములైన; బ్రహ్మం = పర బ్రహ్మము; ఏతత్ = ఇది.

భావము:

ఇది ప్రతివ్యక్తి స్వాత్మలో నిత్యము వెలుగొందు చున్నట్లు తెలిసికొనవలెను. నిశ్చయముగ దానికంటె తెలియదగిన ఉత్కృష్టతర వస్తువు మరొకటి లేదు. భోక్తను, భోగ్యమును కర్మఫల ప్రదాతయైన పరమేశ్వరుని అవగతము చేసుకొన్నప్పుడు వేదములోని సర్వము విదితమైనట్లే. ఇది మూడు విధములైన బ్రహ్మము.

వివరణము

ఏతద్ జ్ఞేయం.

దీనిని తెలిసికొనవలెను. "జీవాత్మ సాక్షాత్తు నిత్యమైన పరబ్రహ్మము" అనే సత్యాన్ని ప్రత్యక్షం చేసుకోవాలి. అవిద్య వల్ల, అజ్ఞానంవల్ల జీవాత్మ తన పరమార్థ స్వరూపాన్ని, అసలు స్వరూపాన్ని, యథార్థ స్వభావాన్ని విస్మరిస్తాడు. అజ్ఞానంవల్ల అతడు ఆత్మను భౌతికకాయంతో

తాదాత్మ్య పడుస్తాడు ఆ కారణం చేత అతడు తన దివ్య స్వభావాన్ని బొత్తుగ మరచిపోతాడు. దేహతాదాత్మ్యము వలన జీవుడు శోకమోహ మహోదధిలో మునిగిపోతాడు శోకమును తరించుటకు అతడు పరమాత్మతో తాదాత్మ్యమును అభ్యసింపవలెను.

## నిత్యం ఏవ ఆత్మ సంస్థం.

అనగా పరబ్రహ్మము సర్వదా స్వకీయ ఆత్మలో వెలుగొందుచున్నట్లు ధ్యానింపవలెను. పరమాత్మ ప్రతివ్యక్తి హృదంతరాళంలో నిత్యము భాసిస్తున్నాడు. నిత్యవస్తువు (పరబ్రహ్మము) సాక్షాత్కారానికి పూర్వం నుంచి కూడ ఎప్పటి నుండియో స్వాత్మలో ఉంటూన్నది సాక్షాత్కారం అంటే ఏదో ఒక వస్తువును పొందడంగాదు. ఆవరణాలను చీల్చివేసి, అజ్ఞానాన్ని ధ్వంసంచేసి మూడు హృదయ గ్రంథులను (అవిద్య కామ కర్మ) భేదించి తన అనంత యథార్థ స్వభావాన్ని తెలుసుకోవడమే సాక్షాత్కారం. బ్రహ్మ సాక్షాత్కారమే జీవిత గమ్యమని ఉపనిషత్తులు వేనోళ్ళ చాటుచున్నాయి. కావున మానవ జన్మను పొందిన ప్రతి ఒక్కరు జీవితగమ్యాన్ని మరవక, దాన్ని సాధించ దానికే జీవితంలో అనుక్షణం యత్నించాలి. ఇదే మానవుని ప్రథమ కర్తవ్యం. తక్కిన కర్తవ్యాలన్నీ గౌణములే.

## నాతః పరం వేదితవ్యం హి కించిత్.

వాస్తవములో దానికంటే తెలియదగిన ఉత్కృష్టతర వస్తువు మరొకటి లేదు. బ్రహ్మమును తెలిసికొంటే సమస్త ఇతర జ్ఞానం కలుగుతుంది. ఆత్మ జ్ఞానం సర్వోత్కృష్టమైనది. దీనికి ఆవల తెలిసికోవలసినది మరేమియులేదు ప్రతిదానికి బ్రహ్మము అధిష్ఠానం. మనకు మృత్తికను గురించి తెలిస్తే మట్టితో చేయబడిన సకల వస్తువులను మనం తెలుసుకోగలం. అలాగే మానవునకు ఆత్మ సాక్షాత్కారం కలిగితే అతనికి సమస్త వస్తువులను గురించి జ్ఞానం కలుగుతుంది. శౌనకుడు అంగీరసునితో ఇలా అంటాడు; "కస్మిన్ భగవో విజ్ఞాతే సర్వం ఇదం విజ్ఞానం భవతి" what is that by knowing which everything else is known? దేన్ని తెలుసుకొంటే సకలమైన విజ్ఞానం కలుగుతుంది?— ముండకోపనిషత్తు.

బ్రహ్మవిదుడు **అఖండ జ్ఞానమునకు ఏది మూలమో దాన్ని తెలుసు** కొంటాడు. అతడు ఏ శాస్త్రాన్ని చదువక పోయినామనంఅతన్నిఏ శాస్త్రంలో

(in any Secular Science) ప్రశ్నించినా అతడు మనకు సరియైన సమాధానం ఈయగలుగుతాడు. ఇది బ్రహ్మజ్ఞాన విశిష్టత.

## భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా

జీవాత్మను, ఇంద్రియ భోగ్య వస్తువులను, పరమేశ్వరుని అతడు తెలుసుకొన్నప్పుడు అతడు మోక్షమును పొందును. భోక్తను, భోగ్యమును, పరమేశ్వరుని—ఈ మూడింటిని జిజ్ఞాసువు బ్రహ్మముగ తెలిసికొన్నప్పుడు అతడు అంత్య విమోచనమును పొందును.

## సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మమేతత్.

ప్రోక్తం అనగా చెప్పబడినది. ప్రోక్తం అనగా వేదములలో చెప్పబడినది. సర్వం ప్రోక్తం అనగా వేదములలో చెప్పబడినదంతయు. త్రివిధం బ్రహ్మం ఏతత్. ఇది మూడు విధములైన బ్రహ్మము. ఈ మూడు విధములైన (భోక్త, భోగ్యము, కర్మఫల ప్రదాత) వానిని బ్రహ్మముగ తెలిసికొని బ్రహ్మవిదుడు జీవిత గమ్యమైన అంత్య విమోచనమును, అనగా ఆత్మ సాక్షాత్కారమును పడయును.

పరమాత్మ ఈ దేహంలో ఎలా దర్శింపబడుతుందో తరువాతి మంత్రంలో చెప్పబడుతుంది.

---

## వహ్నేర్యథా యోనిగతస్య మూర్తిః
## న దృశ్యతే నైవ చ లింగనాశః।
## స భూయ ఏవేంధన యోనిగృహ్యః
## తద్వోభయం వై ప్రణవేన దేహే ॥13॥

టీక

వహ్నేః = అగ్ని; యథా = ఏవిధముగా; యోని గతస్య = అరణి గతమైన; మూర్తిః = స్వరూపము; న = లేదు; దృశ్యతే = చూడబడును; న = లేదు; ఏవ = మాత్రము; చ = మరియు; లింగనాశః = సూక్ష్మదేహముయొక్క వినాశము; సః = అరణియందు స్థితమైన ఆ యగ్ని భూయః = పునః పునః: ఏవ = మాత్రమే; ఇంధనయోని = ఇంధన రూపమగు కారణముద్వారా; గృహ్యః = మథించుట; తద్ వా ఉభయం = అగ్ని మరియు అగ్నిలింగమువలె; వై = నిజముగ; ప్రణవేన = ఓంకారముపై; దేహే = క్రింది అరణిస్థానీయ దేహమునందు

భావము;

ఆగ్ని తన కారణమగు ఇంధనమునందు గుప్తమై యున్నప్పుడు, మనకు కనబడదు, కాని దాని సూక్ష్మరూపమునకు నాశములేదు, ఏలన. మథించుటవలన, అది మరల దాని కారణమైన యింధనమున చూడబడుచున్నది. అదే విధముగ పవిత్రమైన ఏకాక్షరమును ధ్యానించుటచే ఆత్మ ఈ దేహమున దర్శింపబడుచున్నది.

వివరణము

వంటచెఱకులో అగ్ని గుప్తమైయుంటుంది, కాని అది మన కంటికి కనబడదు. అగ్నికి కారణమైన ఇంధనాన్ని మథిస్తే మరల అగ్ని కనబడుతుంది కాబట్టి అగ్నియొక్క సూక్ష్మరూపానికి వినాశంలేదు అని చెప్పవచ్చు. అగ్ని అరణిలో దాగియుంది. మనదేహం అధర అరణి స్థానంలో ఉండనవచ్చు. మథించడం వల్ల అరణిలో అగ్ని పుట్టుతుంది. ఇంధనాన్ని మథించడం ధ్యానానికి పరిపోతుంది. ధ్యాన మథనం వల్ల దేహారణిలో జ్ఞానాగ్ని ఉద్భవిల్లుతుంది.

ప్రణవాన్ని, ఓంకార వైభవాన్ని సరియైన భావంతో ధ్యానించే వానికి ఆత్మ సాక్షాత్కారం కలుగుతుంది. అతడు ప్రణవ ధ్యానంవల్ల తన హృదయగహ్వారంలో ఆత్మను దర్శిస్తాడు.

"తజ్జపః తదర్థభావనం" దాన్ని జపించాలి, దాన్ని భావంతో ధ్యానించాలి" —ఇలా యోగసూత్రాలలో పాతంజలి మహర్షి చెబుతారు.

కట్టెలను మథిస్తే వాటిలో అగ్ని కనబడుతుంది, అలాగే ప్రణవధ్యానం చేస్తే దేహంలో ఆత్మ దృశ్యమౌతుంది. కావున ధ్యానం ఆత్మసాక్షాత్కారానికి అత్యావశ్యకం ఔతుంది.

ఈ భావాన్నే విశదంగా తరువాతి మంత్రంలో ఋషి వివరిస్తాడు.

---

స్వదేహమరణిం కృత్వా
ప్రణవం చోత్తరారణిమ్।
ధ్యాన నిర్మథనాభ్యాసాత్
దేవం పశ్యేన్నిగూఢవత్ ॥ 14 ॥

టీక

స్వదేహం = తన దేహమును; అరణిం = క్రింది కొయ్యముక్కగ; కృత్వా = చేసి; ప్రణవం = ఓంకారమును; చ = మరియు; ఉత్తర అరణిం పై కొయ్యగ; ధ్యాన నిర్మథన అభ్యాసాత్ = ధ్యానరూపమైన మథనమును అభ్యసించుటవలన; దేవం = భగవంతుని; పశ్యేత్ = చూడబడవలెను; నిగూఢ వత్ = గుప్తమైన నౌకానౌకదాసివలె.

భావము:

తన దేహాన్ని క్రింది అరణిగా జేసుకొని, ఏకాక్షరమైన ఓంకారాన్ని పై అరణిగా జేసుకొని, ధ్యానము అనెడి మథనాన్ని అభ్యసించి, ధ్యాత గుప్తమైయున్న భగవంతుని సాక్షాత్కరించుకొనును.

## వివరణము

కట్టెల మధ్య ఘర్షణాన్ని కలుగజేయడంవల్ల వాటిలోగుప్తమైయున్న అగ్ని కనబడుతుంది అలాగే ధ్యాత ప్రణవ ధ్యానం చేసినప్పుడు జ్యోతి స్వరూపుడైన భగవంతుడు నిగూఢమైన అగ్నివలె మనకు దర్శితుడౌతాడు. కావున మనలో జ్ఞానాగ్ని ఉద్భవిల్లుటకు ధ్యానమథనము ఎంతేని యు ఆవశ్యకమై యున్నది

ఎటువంటి సాధకునిచే ఈ ఆత్మ దర్శింపబడునో తరువాతి మంత్రమున చెప్పబడుచున్నవి.

---

**తిలేషు తైలం దధినీవ సర్పిః**
**ఆపః స్రోతః స్వరణీషు చాగ్నిః।**
**ఏవమాత్మాఽఽత్మని గృహ్యతేఽసౌ**
**సత్యేనైనం తపసా యోఽనుపశ్యతి ॥15॥**

## టీక

తిలేషు = నువ్వులలో; తైలము = నూనె; దధిని = పెరుగులో; ఇవ = వలె; సర్పిః = వెన్న; ఆపః = నీరు; స్రోతఃసు = వదులలో, అంతర్వాహిను లలో; అరణీషు = కట్టెంలో; చ = మరియు; అగ్నిః = నిప్పు; ఏవం = మాత్రము; ఆత్మా = పరమాత్మ; ఆత్మని = మనస్సునందు, బుద్ధియందు; గృహ్యతే = గ్రహింపబడుచున్నది. చూడబడుచున్నది; అసౌ = ఈ; సత్యేన = సత్యముచేత; ఏనం = ఈ: తపసా = తపస్సువలన, యః = ఎవరు: అనుపశ్యతి = దర్శింతురు.

## భావము;

నువ్వుగింజలలోని నూనె చందనమున, పెరుగులోని వెన్న పగది, భూగర్భ స్రోతస్సులలోని నీటి వలె,

కష్టెల లోని అగ్ని పోల్కి ఈ పరమాత్మ — సత్య తపో అనుష్ఠానములచే పరమేశ్వరుని దర్శించు వానిచే — తన స్వాత్మ యందు దర్శింపబడుచున్నది.

## వివరణము

### తిలేషు తైలం.

నువ్వులలోని నూనె లాగా తిలలోనుంచి యంత్ర పీడనంవల్ల తైలం తీయబడుతుంది. "దధినీవ సర్పిః" పెరుగునుండి వెన్నవలె, పెరుగును చిలికితే వెన్నవస్తుంది. "ఆపః స్రోతఃసు" అంతర్వాహినులనుండి లభించు నీటి వలె. నదులందు భూమిని ఖననం చేస్తే నీరు లభిస్తుంది. "అరణీషు చాగ్నిః" కష్టెలలోని నిప్పు చందనమున. కష్టెలలో ఘర్షణ కలుగజేస్తే నిప్పుపుడుతుంది.

తిలలలో తైలం గుప్తమైయుంది. దధిలో నవనీతం వ్యాపించియుంది. నదీ గర్భంలోనీరు గుప్తమైయుంది. కష్టెలలో నిప్పు దాగియుంది ఈ ఉపమానములు మనకు పరమాత్మ సర్వగతమని, సకల భూతములందు నిహితమై యున్నదని చాటుతున్నాయి. ధ్యాన నిర్మథనము వలన మన అంతరంగమున మనము పరమాత్మను దర్శింప వచ్చునను సత్యము ప్రవిశదమగు చున్నది.

### ఏవమాత్మాఽఽత్మని గృహ్యతేఽసౌ.

ఈ పరమాత్మ ధ్యాత స్వాత్మయందు దర్శింప బడుచున్నది. మననం వల్ల పరమాత్మను మన అంతరంగంలో దర్శింపవచ్చు. అన్నమయాది కోశములు, మనో బుద్ధ్యహంకారములు, త్రి శరీరములు, పంచ ప్రాణములు— ఇవి తాను కానని నిర్విశేష పూర్ణానంద స్వరూపమైన పరబ్రహ్మమే తానని ధ్యానించు యోగి స్వాత్మయందు బ్రహ్మమును పరమేశ్వరుని సాక్షాత్కరించు కొనును

... ...

ఏ విధంగా ఆ మహనీయుడు తన అంతరంగమున ఆత్మను సాక్షాత్కరించుకొనునో చెప్పబడుచున్నది.

సత్యేనైనం తపసా యోఽనుపశ్యతి.

ఈ ఆత్మ తపస్సువల్ల, సత్యం వల్ల సాక్షాత్కరిస్తుంది. సత్యేన అనగా సత్యముచే. " సత్యం భూతహితం ప్రోక్తం " ప్రాణికోటికి మేలుచేయడానికోసం సత్యము చెప్పబడినది. సత్యేన అనగా " యథా భూతహితార్థవచనేన భూతహితేన " పలికే మాటలు ప్రాణికోటికి మేలు చేసేవిగ ఉండాలి. తపసా అనగా తపస్సుచే, ఏది నిజమైన తపస్సు? " మనసశ్చేంద్రియాణాం చ ఏకాగ్ర్యం పరం తపః " మనస్సును, ఇంద్రియాలను ఏకాగ్రతను పొందేటట్లు చేయడమే పరమ తపస్సు. కాబట్టి ఈ ఆత్మ తపస్సువల్ల, సత్యంవల్ల సాక్షాత్కరిస్తుంది.

ఈ పరమాత్మ ఏ ప్రకారంగా దర్శింపబడుతుందో తరువాతి మంత్రంలో చెప్పబడుతుంది.

---

సర్వవ్యాపినమాత్మానం
క్షీరే సర్పిరివార్పితం ।
ఆత్మవిద్యాతపోమూలం
తద్బ్రహ్మోపనిషత్పరం ॥
తద్బ్రహ్మోపనిషత్పరం ॥16॥

టీక

సర్వవ్యాపినం = అంతట వ్యాపించియున్నటువంటి; ఆత్మానం = ఆత్మను; క్షీరే = పాలయందు; సర్పిః = వెన్న; ఇవ = వలె; అర్పితం = లీనమైయున్నది; ఆత్మవిద్యాతపోమూలం = ఆత్మ జ్ఞానమువందు తపస్సువందు వెలకొనియున్నటువంటి; తత్ = అది; బ్రహ్మ = బ్రహ్మము; ఉపనిషత్ = ఉపనిషత్తు; పరం = సర్వోత్కృష్టమైనది.

భావము;

పాలయందు వెన్న వ్యాపించియున్న చందమున జంగమ స్థావరాత్మకమైన సకల వస్తువులలో పరమాత్మ వ్యాపించియున్నది. పరబ్రహ్మము ఆత్మజ్ఞానమునందు, తపస్సునందు సుప్రతిష్ఠమైనది. ఇది బ్రహ్మమునకు సంబంధించిన పరమ రహస్యము [ఉపనిషత్తు]. ఇది బ్రహ్మమునకు సంబంధించిన పరమ రహస్యము [ఉపనిషత్తు].

వివరణము

ఆత్మ సర్వవ్యాపి. అది అంతట వ్యాపించియున్నది. దేహేంద్రియములందు మాత్రమే ఆత్మ వ్యాపించియున్నది. అని అనుకొనరాదు. మూలప్రకృతి మొదలుకొని పంచభూతముల పర్యంతము అంతట ఆత్మ సర్వగతమైయున్నది. పాలలో వెన్న వ్యాపించియున్నట్లు సకల చరాచర వస్తువులలో ఆత్మ వ్యాపించియున్నది. పాలలో వెన్న లభ్యమగుటకు మనము దధిని మథనము చేయవలసియున్నది. అలాగే సకల భూత ప్రపంచమున సర్వగతుడైయున్న పరమేశ్వరుని మనము దర్శింపవలెనన్న ధ్యాననిర్మథనము చేయవలెను.

"యః సత్యాదిసాధన సంయుక్తః స ఏనం సర్వవ్యాపినమాత్మానం అనుపశ్యతి." ఎవడు సత్యము, అహింస, బ్రహ్మచర్యము— వీనిని అనుష్ఠించునో అతడు మాత్రమే సర్వగతమైన పరబ్రహ్మమును దర్శించును.

సత్యేన లభ్యః తపసా హ్యేష ఆత్మా ।
సమ్యగ్జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యం ॥

ఈ ఆత్మ సర్వదా సత్యమును, తపస్సు, సమ్యగ్జ్ఞానమును, బ్రహ్మచర్యమును అనుష్ఠించుటచేతనే ప్రాప్తించును.

ఆత్మను పడయుటకు ఆత్మజ్ఞానము, తపస్సు, అత్యంతావశ్యక ములు. ఏలన, ఈ ఆత్మ ఆత్మజ్ఞానమునందు, తపస్సునందు సుప్రతిష్ఠమై యున్నది.

బ్రహ్మోపనిషత్పరం, ఇది బ్రహ్మమునకు సంబంధించిన పరమ రహస్యము (ఉపనిషత్తు) జీవిత గమ్యమైన ఆత్మ సాక్షాత్కారమును పడయుటకు ఋషిపుంగవుడు మనకు సాధనా రహస్యమును తెల్పుచున్నాడు. "ఆత్మవిద్యా తపోమూలం". భగవానుని చేరుటకు ఆత్మజ్ఞానము, తపస్సు అవసరము. ఆత్మజ్ఞానమును పొందుటకు ధ్యానము అవసరము ధ్యానము పొందుటకు ధారణ సరిగానుండుటకు ఇంద్రియములు, మనస్సు నిగ్రహింపబడవలెను. మనస్సును, ఇంద్రియాలను ఏకాగ్రతను పొందునట్లు చేయడమే పరమ తపస్సు.

"బ్రహ్మోపనిషత్పరం, బ్రహ్మోపనిషత్పరం" అని రెండు పర్యాయములు చెప్పుట అధ్యాయ పరిసమాప్తిని సూచిస్తుంది.

ఇతి శ్వేతాశ్వతరోపనిషద్ భాష్యే

ప్రథమోఽధ్యాయః

---



# ద్వితీయ అధ్యాయః

## రెండవ అధ్యాయము

యుంజానః ప్రథమం మనః
తత్త్వాయ సవితా ధియః ।
అగ్నేర్జ్యోతిర్నిచాయ్య
పృథివ్యా అధ్యాభరత్ ॥1॥

టీక

యుంజానః= ధారణయొనర్చుచు: ప్రథమం=ఆరంభమున; మనః= మనస్సును; తత్త్వాయ= తత్త్వమును తెలిసికొనుటకోసము; సవితా= సవితృ సూర్యభగవానుడు; ధియంః = ఇంద్రియములను; అగ్నేర్జ్యోతిః= ప్రకాశించుచున్న అగ్ని; నిచాయ్య= చూచి; పృథివ్యా= భూమినుండి; అధ్యాభరత్= వెలికితీయుగాక.

భావము:

తత్త్వదర్శనార్థము మొట్టమొదట మనస్సును, ఇంద్రియములను బ్రహ్మముపై ధారణయొనర్చి, సవితృదేవత జ్యోతిర్మయ అగ్నిని దర్శించి దానిని భూమినుండి వెలికితీయుగాక!

వివరణము:

"యుంజానః" అనగా ధారణయొనర్చి. "ప్రథమం" అనగా ఆరంభమున. ప్రథమమున అంటే ధ్యానారంభమున యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము —వీని సక్రమాభ్యాసము తరువాత ధారణ, ధ్యాన సమాధులు కలుగును. జిజ్ఞాసువు నిష్కామ కర్మయోగము, జపము, కీర్తన సాత్త్వికాహారము, గురుశుశ్రూష, పేదలసేవ, మున్నగువానిద్వారా తన మనస్సును శుద్ధిచేసుకోవలెను. మొట్టమొదట జిజ్ఞాసువు చేయవలసిన పని యిది. చిత్తశుద్ధిచేకూరిన మీదటనే అతడు ధారణం వలని ప్రయోజనా

లను తెలుసుకో గలుగుతాడు. అతడు ఇంద్రియాలను నిగ్రహించాలి. అతడు ఇంద్రియాలను ఇంద్రియ విషయములనుండి ప్రత్యాహారం చేయాలి. ఇంద్రియాల అదుపులో లేకపోతే చిత్తైకాగ్రత సాధ్యంకాదు. అందువల్ల ఇంద్రియ నిగ్రహం మొట్టమొదటి ఆధ్యాత్మిక అభ్యాసం.

"మనః ధియః" అనగా మనస్సు, ఇంద్రియములు, మనస్సును, ఇంద్రియాల్ని నిగ్రహించాలి. సర్వసాధనల సారము మనోనిగ్రహమే. "తత్త్వాయ" అనగా సత్యమును తెలిసికొను నిమిత్తము. తత్త్వ దర్శనమే జీవిత గమ్యం. సర్వశాస్త్రాలు, అన్ని ఉపనిషత్తులు ఈవిషయాన్ని ఘంటాపథంగా చెప్తుతాయి.

"సవితా" అనగా సవితృదేవత, సూర్యభగవానుడు. రెండవ అధ్యాయంలోని తొలి నాలుగు మంత్రాలు సవితృ స్తవమై యున్నాయి. సవితృ అంటే సూర్యదేవత. ఈ స్తవం చిత్తైకాగ్రత కోసం చేయబడింది. ఈ నాలుగు మంత్రాలు శుక్ల యజుర్వేద సంహితలనుండి గ్రహింప బడ్డాయి. సత్యాన్వేషి మనఃపూర్వకంగా జ్ఞానంకోసం ఆత్మసంయమం కోసం సవితృ దేవతను, సూర్యభగవానుని ఆహ్వానిస్తాడు.

"అగ్నేర్ జ్యోతిః" అనగా ప్రకాశవంతమైన అగ్ని, ఈ అగ్ని విజ్ఞానాగ్ని. ఈ బ్రహ్మజ్ఞానము, అనగా ఆత్మజ్ఞానము అజ్ఞాన తిమిరాన్ని ధ్వంసం చేస్తుంది, కర్మలనన్నింటిని దగ్ధం చేస్తుంది, జీవాత్మ పరమాత్మతో తన తాదాత్మ్యాన్ని తెలుసుకొనేందుకు అతన్ని సమర్థవంతుణ్ణిచేస్తూ, అతనికి జ్ఞానజ్యోతిని ప్రసాదిస్తుంది. "నిచాయ్య" అనగా చూచి జ్యోతిః స్వరూపాగ్నిని గాంచి యని అర్థము. చూచిన పిదప ఏమిచేయవలేను? "పృథివ్యా అధ్యాభరత్" అనగా దానిని (విజ్ఞానాగ్నిని) భూమినుండి వెలికితీయవలెను పృథివి అనగా భూమి పృథివి అనగా ప్రకృతి.

ఈ మంత్రాన్ని సవితృస్తవం అనవచ్చు. జ్ఞానంకోసం, ఇంద్రియ నిగ్రహంకోసం తగు బలాన్ని ఇవ్వవలసినదిగా సవితృ దేవతను బ్రహ్మజిజ్ఞాసువు ప్రార్థిస్తున్నాడు.

ఈ రెండవ అధ్యాయంలో బ్రహ్మధ్యానాన్ని అలవరచుకొనే సాధన విధానం తెలుపబడింది. ఇంద్రియ నిగ్రహము, చిత్తశుద్ధి లేకుండ సరియైన ధారణ చేకూరడం సాధ్యంకాదు. ధారణ లేకుండ ధ్యానం లేదు. ధ్యానం లేకుండ సమాధి సాధ్యంకాదు. అందువల్లనే మంచి ధారణ ప్రాప్తి కోసం జిజ్ఞాసువు సవితృ దేవతను మనఃపూర్వకముగా ప్రార్థిస్తున్నాడు.



## యుక్తేన మనసా వయం
## దేవస్య సవితుః సవే।
## సువర్గేయాయ శక్త్యా ॥2॥

టీక

యుక్తేన మనసా = ఏకాగ్ర చిత్తముతో; వయం = మనము; దేవస్య = దేవుని యొక్క; సవితుః = సవితృ యొక్క; సవే = సూర్యుని యొక్క; సువర్గేయాయ = పరమానంద ప్రాప్తికోసము; శక్త్యా = తీవ్రముగ

భావము:

సవితృ దేవతానుగ్రహముచే మనము ఏకాగ్ర చిత్తముతో పరమానంద ప్రాప్తికోసము తీవ్రముగ సాధన యొనర్తుము గాక!

వివరణము:

"యుక్తేన మనసా వయం" మనము ఏకాగ్ర చిత్తముతో సాధన యొనర్తుము గాక. మనం బ్రహ్మానందాన్ని పొందడానికోసం, తత్త్వజ్ఞానాన్ని పడయడం కోసం మనోనిగ్రహం కలిగియుండాలి. మనో నిగ్రహంకోసం తీవ్ర సాధన చేయాలి; కేవలం సాధనే చాలదు. దేవతానుగ్రహం కూడా మనకు ఉండాలి.

"దేవస్య సవితుః సవే సువర్గేయాయ శక్త్యా". పరమానంద ప్రాప్తికోసము తీవ్ర సాధన యొనర్తుము గాక. శక్త్యా యనగా తీవ్రముగ. ఆత్మసాక్షాత్కా

రాన్ని పొందడానికి అభ్యాసం అత్యవసరం. సంతతమైన తీవ్రసాధన అత్యా వశ్యకము. సక్రమమైన సాధన ఎంతేనియు అవసరం. అనగా జిజ్ఞాసువునకు పురుషార్థం చాలా అవసరం. మనం యథాశక్తి, యావచ్ఛక్తి సాధన చేయాలి. అప్పుడు భగవంతుని సాయం కూడా ఉంటుంది. God helps those who help themselves.

సువర్గేయాయ అనగా పరమానంద ప్రాప్తి కోసము. "పరమాత్మ వచనోఽత్ర సువర్గశబ్దః" ఇచ్చట, ఈ మంత్రమున సువర్గమనగా పర మాత్మ యని, బ్రహ్మానందమని అర్థము.

మనోనిగ్రహం వీలౌతుందా? దానికి మార్గము ఏమిటి? భగవంతుడు గీతలో ఇలా సెలవిస్తాడు:

"అభ్యాసేన చ కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే" ఓ కౌంతేయ, అభ్యాసంవల్ల, వైరాగ్యంవల్ల మనస్సును నిగ్రహింపవచ్చు. పాతంజలి మహర్షి యోగ సూత్రాలలో కూడ ఇదే విధంగ చెప్పబడియుంది; "అభ్యాస వైరాగ్యా భ్యాం తన్నిరోధః" సంతత అభ్యాసంతో మనస్సును నిగ్రహింపవచ్చు సాధ నాభ్యాసానికి చిత్తైకాగ్రత యుండాలి. అమృతత్త్వం దైవానుగ్రహంవల్ల ప్రాప్తిస్తుంది. కావున అమృతత్త్వాన్ని పొందడానికి పురుషార్థం, పరమేశ్వరా నుగ్రహం రెండూ ఉండాలి కావున మనం ఏకాగ్రచిత్తముతో పరమానంద ప్రాప్తికోసం తీవ్రసాధన యొనర్తుముగాక! మన సాధన విజయవంతమగుటకు భగవదనుగ్రహము మనపై సర్వదా యుండుగాక!

•••

యుక్త్వాయ మనసా దేవాన్
సువర్యతో ధియా దివం ।
బృహజ్జ్యోతిః కరిష్యతః
సవితా ప్రసువాతి తాన్ ॥3॥

టీక

యుక్త్వాయ = యోజయిత్వా, నిగ్రహించి; మనసా = మనస్సుయొక్క సహాయ్యముతో; దేవాన్ = ఇంద్రియములను; సువర్యతః = పూర్ణానంద

బ్రహ్మమువైపు చరించు యింద్రియములు; ధియా = బుద్ధి సాహాయ్యముతో; దివం = స్వరము; బృహత్‌జ్యోతిః = అనంత ప్రకాశము; కరిష్యతః = చేయునుగాక: సవితా = సవితృదేవత; ప్రసువాతి = వ్యక్తమగునటుల చేయుగాక; తాన్ = వానిని

భావము:

స్వర్గమును ప్రాప్తింపజేయు ఇంద్రియాలను పరిశుద్ధమైన మనస్సుతోను బుద్ధితోను నిగ్రహించి. సవితృదేవత వానిని అనంతజ్యోతిని అభివ్యక్తము చేయునటుల చేయుగాపుత.

వివరణము:

యుక్త్వాయ అనగా యోజయిత్వా. అనగా నిగ్రహించి అదుపులోనుంచి "దేవాన్" అనగా ఇంద్రియములను. యుక్త్వాయ దేవాన్ అనగా ఇంద్రియములను అదుపులోనుంచి, బాహ్య విషయాల వైపునకు పరుగెత్తడం ఇంద్రియాల సహజ స్వభావం, ఇంద్రియాల బహిర్ముఖ ప్రవృత్తిని సాధకుడు అదుపులో ఉంచాలి. ఇంద్రియాలను నిగ్రహించడానికి అతడు సంయమాన్ని ప్రత్యాహారాన్ని అభ్యసించాలి. అతడు ఇంద్రియాలను విషయాలతో కలియనీయరాదు. అతడు ఇంద్రియాలనుండి మనస్సును వేరుచేయాలి పరమేశ్వరుని రూపాన్ని మనస్సు నిరంతరం ధ్యానించినపుడు అది (అనగా ఇంద్రియములు మనస్సునుండి వేరుగావడం)సాధ్యమౌతుంది. బ్రహ్మముయొక్క గుణములను మనస్సు సదా చింతించినప్పుడే మనస్సు ఇంద్రియములనుండి వేరౌతుంది. మనస్సును ఇంద్రియాలనుండి డిస్‌కనెక్టు చేయడం చాలా గహనమైన సాధన. కాని, మనం మానవ జన్మను దాల్చింది ఈ సాధన చేయడానికే. అందువల్ల మనం దమాన్ని, ప్రత్యాహారాన్ని అభ్యసించాలి. ఈ సాధనాభ్యాసంవల్ల కలిగే ఫలం శాశ్వతమైన శాంతి, అమృతత్వం.

"మనసా ధియా" మనస్సుయొక్క సహాయముతో, బుద్ధియొక్క సహాముతో. ఇంద్రియాలను నిగ్రహించడానికి విశుద్ధమైన మనస్సు, బుద్ధి అవసరం.

పరిశుద్ధమైన మనస్సుతోనే ఇంద్రియాలను నిగ్రహించగలం. పరిశుద్ధమైన బుద్ధితోనే ఇంద్రియాలను నిగ్రహించగలం. మనస్సును, బుద్ధిని విశుద్ధపరచడం ఎలా? వస్త్రాన్ని మురికిని సబ్బు తొలగించునట్లు మనోమాలిన్యాన్ని జపం, వైరాగ్యం, అభ్యాసం తొలగిస్తాయి. ఇంద్రియాల ఆటలకు మనస్సు మూలాధారం. అందువల్ల మనస్సును విశుద్ధపరచి బలిష్ఠమొనర్చినచో ఇంద్రియాలు సులభంగా మన వశంలోకి వస్తాయి.

"దివం" అనగా స్వర్గము. ఇచ్చట స్వర్గము. అనగా బాహ్య వస్తువుల భోగముచే ప్రాప్తించే ఇంద్రియ సుఖం, అనగా విషయ సుఖం. విషయముల వైపునకు పరుగిడే ఇంద్రియాలను ఆత్మాభిముఖం చేయడమే మన ముఖ్య కర్తవ్యం. ఇంద్రియములను పరమాత్మవైపు మళ్ళించునట్లు చేయవలసినదిగ సవితృ దేవతను ప్రార్థించుచున్నాము.

"సువర్యతః బృహత్ జ్యోతిః కరిష్యతః సవితా ప్రసువాతి తాన్" సవితృ దేవత ఆ యింద్రియములను పూర్ణానంద బ్రహ్మమువైపు చరించువానినిగ, అనంత ప్రకాశమును అభివ్యక్తము చేయువానినిగ చేయుగాక. బృహత్ అనగా మహద్ బ్రహ్మ. జ్యోతి అనగా ప్రకాశమును అభివ్యక్తము చేయుగాక బ్రహత్ అనగా మహద్బ్రహ్మ. జ్యోతి అనగా ప్రకాశము. బృహజ్జ్యోతి అంటే ద్యోతన స్వభావం. చైతన్యైకరసంగల బ్రహ్మజ్యోతి, అనగా పూర్ణానంద బ్రహ్మానుభవం. కావున మనం సవితృదేవతను అటువంటి దివ్యానందము మనకు కలుగజేయవలసినదిగ ప్రార్థించుచున్నాము.

"మనస్సు, బుద్ధి విశుద్ధమై, వినిర్మలమై యున్నప్పుడు మాత్రమే ఇంద్రియవశీకరణ, యోగసాధన సుసుఖము, సులభము కాగలవు."

యుంజతే మన ఉత యుంజతే ధియో
విప్రా విప్రస్య బృహతో విపశ్చితః ।
వి హోత్రా దధే వయునావిదేక
ఇన్మహీ దేవస్య సవితుః పరిష్టుతిః ॥4॥

టీక:

యుంజతే = నిగ్రహింతురు; మనః = మనస్సును; ఉత = మరేమి యుంజతే = నిగ్రహింతురు; ధియః = బుద్ధిని; విప్రాః = జ్ఞానులు; విప్రస్య = సర్వవ్యాపకమైన; బృహతః = మహతః; విపశ్చితం = సర్వజ్ఞమైన; వి = క్రమము; హోత్రాః = యాజ్ఞక్రియలను; దధే = విధానముచేయునో; వయునా = సర్వము; విదేక = అన్ని నియమములను తెలిసిన ఏకైక దేవత; ఇన్మహీ = గొప్పదైన; దేవస్య = దేవునియొక్క; సవితుః = సవితృయొక్క పరిష్టులిః = వైభవము, మహిమ.

భావము:

సర్వవ్యాపకుడును, అనంతుడును, సర్వజ్ఞుడును అన్ని నియమములను తెలిసిన ఏకైక దేవుడును, బ్రాహ్మణములచే యజ్ఞాది క్రతువులనుఏర్పాటుచేసినట్టి వాడునునైన సవితృదేవుని వైభవము మహత్తరమైనది. ప్రాజ్ఞులు మనస్సును, బుద్ధిని నిగ్రహించి, ధ్యానమును అభ్యసింతురు.

వివరణము:

జ్ఞానులు తమ మనోబుద్ధులను నిగ్రహించి, ధ్యానము న.్యసింతురు. సవితృ దేవుని వైభవము దివ్యమైనది. అతడు సర్వవ్యాపి. అతడు అనంతము అతడు సర్వవిత్, అతడు సర్వనియమములను తెలిసిన ఏకైక స్వామి, బ్రాహ్మణములలో యజ్ఞయాగాది క్రతువుల విధానమును ఏర్పాటుచేసినది సవితృభగవానుడే. అతడు వేదాంతకృత్. అతడు వేదవిదుడు, అతడు పరమాత్మ పరమాత్మను పడయుటయే జీవిత గమ్యము. ప్రాజ్ఞులు తమ మనస్సును. బుద్ధిని నిగ్రహించి. ఆత్మధ్యానము సల్పుదరు.

యోగులు వృత్తులను నిరోధిస్తారు. వృత్తి యంటే మనస్సునుండి బయలుదేరే సంకల్పతరంగాలు. ఆత్మ శాంత స్వరూపమైనది. ఆత్మసాక్షాత్కారం వృత్తినిరోధం లేకుండ కలుగదు,

ఒకసరస్సు అడుగుభాగం కనబడాలంటే దాని ఉపరితలంపై ఎటువంటి తరంగాలు ఉండకూడదు. మనో సరోవరంపై సంకల్ప తరంగాలు ఉన్నట్లైతే

ఆత్మకనబడదు. అందువల్లనే యోగులు మనోవికారములైన వృత్తులను లేకుండా చేస్తారు. పాతంజలి మహర్షి తన యోగ సూత్రాలలో "యోగః చిత్తవృత్తి నిరోధః" అని వివరిస్తారు. మనోవికారములను నిగ్రహించడాన్ని యోగ మంటారు. Yaga is the restraint of the modifications of the mind. వృత్తులను నిగ్రహించి యోగితన సచ్చిదానంద స్వరూపంలో విశ్రమిస్తాడు. కాబట్టి మనం ధ్యానాన్ని అభ్యసించి, చిత్తవృత్తి నిరోధం జేయడానికి తగిన బలం చేకూర్చవలసినదిగ సవితృను ప్రార్థింతము గాక!

ఎల్లరూ, అంటే మానవులు దేవతలు అందరూ బ్రహ్మజ్ఞానాన్ని పడయ దానికి యత్నించవలసినదిగ తరువాతి మంత్రంలో ఋషి ఉపదేశిస్తున్నాడు.

యుజే వాం బ్రహ్మ పూర్వ్యం నమోభిః
విశ్లోక ఏతు పథ్యేవ సూరేః।
శృణ్వంతు విశ్వే అమృతస్య పుత్రా
ఆ యే ధామాని దివ్యాని తస్థుః ॥5॥

టీక:

యుజే=పూజింతును; వాం= నీయొక్క; బ్రహ్మ= పరబ్రహ్మమును; పూర్వ్యం - పురాణమైన; నమోభిః= నమస్కారముద్వారా; విశ్లోకః = నా శ్లోకములు, మంత్రములు; ఏతు= ఆయంతి, చనును; పథ్యేవ = సూర్య పథమున, సన్మార్గమున; సూరేః = సూర్యులయొక్క; శృణ్వంతు = వినెదరు గాక: విశ్వే = విశ్వమునందలి; అమృతస్య పుత్రాః = అమృతపుత్రులు; ఆయే = వారుసైతము: ధామాని = ప్రదేశములు, లోకములు; దివ్యాని= దివ్యమైన: తస్థుః = నివాసస్థులు.

భావము: నీదు పురాణ బ్రహ్మమును భక్తి ప్రపత్తులలో పూజింతును. తమ యానములలో గమించు సూర్యులవలె నా శ్లోకములు వెలువడును. నా ఉపదేశమును అమృత పుత్రులు, దేవలోకవాసులు సైతము ఆల కింతురు గాక!

వివరణము: "యుజే వాం బ్రహ్మపూర్వ్యం నమోభిః" నీదు పురాణ బ్రహ్మమును భక్తి ప్రపత్తులలో పూజింతును. శ్వేతాశ్వతరుడు ఆత్మసాక్షాత్కారము పడసిన ఋషిపుంగవుడు. అతడు బ్రహ్మానందాన్ని పొందినాడు. అతనికి దుఃఖనివృత్తి. పరమానంద ప్రాప్తికలిగింది. ఆ పరమఋషి ఈ పరమోత్కృష్ట స్థితిని పడయవలసినదిగ ఇతరులకు ఉపదేశ మొసగుచున్నాడు. ఆత్మ సాక్షాత్కారానికై శ్రమించవలసినదని, సాధన మొనర్పవలసిదని అతడు దేవలోక వాసులనుగూడ ప్రభోధిస్తున్నాడు. స్వర్గలోకంలోని సుఖంకూడ నశ్వరమైనదే అదియూ ఇంద్రియ సుఖమే. స్వర్గసుఖం సూక్ష్మతరమైనది, మిక్కిలి తీవ్రమైనది. అది అనంత ఆనందంకాదు. బ్రహ్మ సాక్షాత్కారమునొందిన మహాత్ముడు అనుభవించే ఆనందంతో దేవతల స్వర్గసుఖాన్ని పోలిస్తే అది శూన్యమే ఔతుంది. కాబట్టి ఋషీశ్వరుడు దేవతలనుకూడ బ్రహ్మానంద ప్రాప్తికై యత్నించవలసినదని వారికి సలహా ఇస్తున్నాడు.

బ్రహ్మ పూర్వ్యం అనగా పురాణ బ్రహ్మమును. శ్వేతాశ్వతర ఋషిపుంగవుడు పరబ్రహ్మమును ఆరాధించుచున్నాడు. అతడు భక్తి ప్రపత్తులతో బ్రహ్మమును ధ్యానించుచున్నాడు. అతడు బ్రహ్మమును సాక్షత్కరించుకొనెను. అతడు పరమేశ్వరుని సాక్షత్కరించుకొనెను. కావున అతని వాక్కు సత్యసంయుతము, దివ్యము, అమోఘము. కావుననే ఋషీశ్వరుడు తన శ్లోకములు సూర్యులు ఆకసమున ప్రభలతో పయనించునట్లుగ కీర్తనియములగునని చెప్పుచున్నాడు. ఋషులు సత్యద్రిష్టలు కావున వారివచనములుసుశ్లోకములు. బ్రహ్మజ్ఞానాన్ని గురించి అతడు లోకాలకు చాటి చెప్పుచున్నాడు.

అమృతపుత్రులు ఎవరు? అందరూ అమృతపుత్రులే. సర్వజీవకోటి అమృత బ్రహ్మమునుండే ఉద్భవించింది కావున అందరూ అమృతపుత్రులే (Children of immortality) బ్రహ్మము సర్వస్వమునకు ఆది మూలము, అతడే మూలకారణం.

శ్రీ శ్వేతాశ్వతర ఋషిపుంగవుడు తాను సాక్షాత్కరించుకొనిన పర బ్రహ్మమును మానవాళికూడ సాక్షాత్కారము పడయవలెనని, వారికిబ్రహ్మ జ్ఞానముకలుగుటకై యోగత్రియమును (జ్ఞాన, రాజ, కర్మ, భక్తియోగములను) అనగా మహాయోగమును. యోగసంయోగమును (Yoga of Synthesis) మానవుని సర్వతోముఖాభివృద్ధిని ఉద్దేశించు పరమ యోగమును తరువాతి మంత్రమున చక్కటి ఉపమానములతో ఉపదేశించుచున్నాడు.

అగ్నిర్యత్రాభిమథ్యతే
వాయుర్యత్రాధిరుధ్యతే।
సోమో యత్రాతిరిచ్యతే
తత్ర సంజాయతే మనః ॥6॥

టీక: అగ్నిః = అగ్ని; యత్ర = ఎచ్చట; అభిమథ్యతే = బాగుగ మథింపబడినచో; వాయుః = గాలి; యత్ర = ఎచ్చట; అధిరుధ్యతే = నిగ్రహింపబడినదో, నిరోధింపబడినదో; సోమః = సోమరసము; యత్ర = ఎచ్చట; అతిరిచ్యతే = పొంగి పొరలునో; తత్ర = అచ్చట; సంజాయతే = సముత్పద్యతే, పుట్టుచున్నది; మనః = మనస్సు.

భావము: ఎచ్చట అగ్ని మథింపబడుచున్నదో, ఎచ్చట వాయువు నిరోధించబడుచున్నదో. ఎచ్చట సోమరసముపొంగి పొరలుచున్నదో అచ్చట మనస్సు ఉదయించును.

వివరణము; "అగ్నిర్యత్రాభి మధ్యతే" అనగా ఎచ్చట అగ్నిమథింపబడు చున్నదో, అగ్ని అంటే ఆత్మజ్ఞానమనెడి అగ్ని. పరబ్రహ్మమే అగ్ని. ఈ అగ్నిని కలుగజేసేది ఎలాగు? మథించడం వల్ల అగ్ని కలుగ జేయబడు తుంది. ఆత్మజ్ఞాన సంబంధమైన పవిత్ర గ్రంథాలను చదవడం, బ్రహ్మ విచారం సలుపడం — ఇవే మథించడం ఔతుంది, సద్గురువుయొక్క చర ణాంబుజములను ఆశ్రయించి ఆధ్యాత్మిక విద్యను అభ్యసించాలి. జ్ఞానాన్ని గుర్వనుగ్రహంవల్ల ప్రజ్వరిల్లుతుంది. గురువు ఉత్తర అరణి. శిష్యుడు

అధర అరణి, ధ్యానం మథించడం. ప్రణవధ్యానం ద్వారా మన దేహంలో కలిగిన ఈ జ్ఞానాగ్ని సకల విధములైన అజ్ఞానాన్ని, అ విద్యను అంతమొందిస్తుంది, భస్మీపటలం చేస్తుంది.

"వాయుర్యత్రాధిరుధ్యతే" అనగా ఎచ్చట వాయువు నిరోధింపబడుచున్నదో అనగా ఎచ్చట ప్రాణాయామము అభ్యసింపబడునో. ప్రాణాయామ అభ్యాసంవల్ల బ్రహ్మజిజ్ఞాసువు అనాహత శబ్దాలను వింటాడు. అప్పుడతడు ఆత్మసాక్షాత్కారాన్ని పొందుతాడు.

ప్రాణాయామ విశుద్ధాత్మా
యస్మాత్ పశ్యతి తత్పరం ।
తస్మాన్నాతః పరం కించిత్
ప్రాణాయామాదితి శ్రుతిః ॥

ప్రాణాయామాభ్యాసంచే విశుద్ధమైన మనస్సును పొందినయోగి పరమాత్మ సాక్షాత్కారాన్ని పొందుతాడు. ప్రాణాయామాభ్యాసానికి మించినది మరేదియు లేదని శ్రుతి ఘోషించుచున్నది. కాబట్టి మనో నిగ్రహానికి ప్రాణాయామం తోడ్పడుతుంది.

"సోమో యత్రాతిరిచ్యతే" అనగా సోమరసము ఎచ్చట పొంగి పొరలునో. సోమః అనగా సోమరసము. సోమ యజ్ఞంలో అగ్నిని మథించి, దాన్ని వాయువుచే రగుల్కొల్పిన యనంతరము కవులు సోమరసాన్ని పానంచేస్తారు. వారు భావావేశంలో నూతన గీతాలను రచిస్తారు. సోమరసాన్ని పానంచేయడం అంటే ఏమిటి ? సాధకుడు కర్మలను స్వార్థం మాని ఆచరించాలి. అతడు ఆత్మభావంతో, నారాయణ భావంతో మానవకోటిని సేవించాలి. అతడు తన కర్మలను, కర్మఫలాలను పరమేశ్వరునకు అర్పించాలి. అప్పుడు అతనిలో అధికోత్సాహం, ఆనందం పెల్లుబుకుతాయి. దీన్నే సోమరసం అంటారు. "సోమో యత్ర అతిరిచ్యతే అనేక జన్మ సేవయా తత్ర తస్మిన్ యజ్ఞ దాన తపః ప్రాణాయామ సమాధి విశుద్ధ అంతఃకరణే సంజాయతే పరిపూర్ణ ఆనంద అద్వితీయ బ్రహ్మకారం మనః సముత్పద్యతే, న అన్యత్ర అశుద్ధ అంతః కరణే".

అనేక జన్మలలో ఆచరించిన అగ్ని సేవ వలన సోమము వృద్ధి యగును. యజ్ఞము, దానము, తపము, ప్రాణాయామము, సమాధి మొదలగు వానిచే విశుద్ధమొనర్పబడిన అంతఃకరణములోనే పూర్ణ ఆనంద అద్వితీయ బ్రహ్మాకారమైన మనస్సు (మనోవృత్తి) ఉదయిస్తుంది. అన్యత్ర, అనగా అశుద్ధమైన మనస్సుతో అంతఃకరణంలో అది అసంభవము.

"యత్ర సంజాయతే మనః" అనగా అచ్చట మనస్సు ఉదయిస్తుంది. ఇచ్చట మనస్సు అంటే విశుద్ధాంతః కరణం, విశుద్ధమైన మనస్సు. ఈ విశుద్ధమైన పరమాత్మను, మనస్సుతో ధ్యానించవలయును.

జన్మాంతర సహస్రేషు
తపోజ్ఞాన సమాధిభిః ।
నరాణాం క్షీణ పాపానాం
కృష్ణే భక్తిః ప్రజాయతే ॥

వేలకొలది జన్మలలో ఒనరించిన తపోఫలితంగా, జ్ఞానఫలితంగా సమాధి ఫలితంగా ఏ నరుని పాపం క్షయమౌతుందో ఆ పురుషునకు శ్రీ కృష్ణ పరమాత్మయందు భక్తి కలుగుతుంది

జిజ్ఞాసువు యజ్ఞంతో సాధన ప్రారంభిస్తాడు తరువాత అతడు యోగాన్ని అభ్యసిస్తాడు కట్టకడపట అతడు నిర్వికల్ప సమాధిని. పరిపూర్ణ జ్ఞానాన్ని. నిత్యానందాన్ని పొందుతాడు.

రెండవ అధ్యాయమునందలి 6,7 మంత్రములలో జ్ఞానయోగ, రాజయోగ, కర్మయోగ, భక్తి యోగ సంయోగ ప్రబోధింపబడింది "అగ్నిర్యత్రాభిమథ్యతే ఇందు బ్రహ్మధ్యానము సూచింపబడినది, ఇది జ్ఞానయోగము. వాయుర్యత్రాధిరుధ్యతే" ఇందు ప్రాణాయామాభ్యాసం ఉపదేశింపబడింది ఇదిరాజయోగ సాధన. సోమోయత్రాతిరిచ్యతే, ఇందు యజ్ఞ,దాన, తపః కర్మల ఆచరణ శాశింపబడినది ఇది కర్మయోగసాధన, "జుషేత బ్రహ్మ పూర్వ్యం. చిరంతన బ్రహ్మమును

ప్రేమింతుముగాక. ఇది భక్తియోగ సాధన. శ్రీ శివానందయతివరేణ్యులు ప్రబోధించిన మహాయోగము. (Yoga of Synthesis)కూడా ఇదియే. కర్మ యోగం హృదయాన్ని నిర్మలంచేస్తుంది, మనశ్శుద్ధిని కలుగజేస్తుంది. రాజ యోగం మనోవిక్షేపాన్ని తొలగిస్తుంది, మనస్సును నిశ్చలపరుస్తుంది. జ్ఞాన యోగం అజ్ఞానఆవరణాన్ని (veil of ignorance)తొలగిస్తుంది, అవిద్యను నిర్మూలిస్తుంది భక్తియోగం భగవదనుగ్రహాన్ని, బ్రహ్మజ్ఞానప్రాప్తి ని కలుగ జేస్తుంది, అన్ని యోగాలకు కేంద్రము అధిష్ఠానము జ్ఞానయోగమని చెప్పాలి. ఇతర యోగాలన్నీ సహకారులని చేప్పాలి

---

సవిత్రా ప్రసవేన
జుషేత బ్రహ్మ పూర్వ్యం।
తత్ర యోనిం కృణ్వతే
నహితే పూర్వమక్షిపత్ ॥7॥

టీక : సవిత్రా = సవితృదేవత యొక్క అనుగ్రహముచే, ప్రసవేన = పుట్టినటువంటి; జుషేత = సేవింపబడిన; బ్రహ్మ = బ్రహ్మము; పూర్వ్యం = చిరంతనమైనది ప్రాచీనమైనది, పురాతనమైనది; తత్ర=అచ్చట: యోనిం = ఉత్పత్తిస్థానమును, బ్రహ్మమును; కృణ్వతే (కృణవసే) = కురుష్వ, చేయుము; నహితే = ఇకెన్నటికి బంధముండదు; పూర్వం = తొలికర్మలు: అక్షిపత్ = పతనము, బంధము.

భావము: సవితృ దేవతానుగ్రహముచే మనము చిరంతన బ్రహ్మమును ప్రేమింతుము గాక! నీవు అచ్చట నీ యుత్పత్తి స్థానము (బ్రహ్మము) ను పడసినచో నీ పూర్వకర్మ నిన్నెటికిని బంధింపజాలదు.

వివరణము: "సవిత్రా ప్రసవేన జుషేతబ్రహ్మ పూర్వ్యం" మనము సవితృ దేవతానుగ్రహముచే చిరంతన పరబ్రహ్మమునుభజింతముగాక! జుషేతఅనగా

సేవింతుముగాక, ప్రేమింపుముగాక, భజింతముగాక, సవితృ అనుగ్రహముచే మనము పరబ్రహ్మమును భజింతముగాక. ఈ మంత్రము భక్తి యోగమును ఉపదేశించుచున్నది. ఆరు, ఏడు మంత్రములు సంయోగ యోగమును అనగా మహాయోగమును (Yoga of Synthesis) ను శాశించుచున్నవి జ్ఞానయోగము, రాజయోగము, కర్మయోగము, భక్తియోగము—ఈ నాల్గు యోగముల సమన్వయాభ్యాసము సూచింపబడినది. ఇదియే * మహాయోగము

భక్తిలేకుండ భగవదనుగ్రహం కలుగదు. భగవదనుగ్రహం లేకుండ బ్రహ్మజ్ఞానం కలుగదు. అందువల్ల భక్తిచే భగవదనుగ్రహాన్ని, తద్వారా బ్రహ్మమును పొందాలి.

"తత్ర యోనిః కృణవసే నహితే పూర్వమక్షిపత్". అచ్చట సీ యుత్పత్తిస్థానమును నీవు పొందినచో నిన్ను పూర్వ కర్మ ఎన్నటికిని బంధింప జాలదు. బ్రహ్మము అన్నిటికి ఉత్పత్తిస్థానము. బ్రహ్మమును పొందినవానిని అతని పూర్వ కర్మలు (former actions) అతనిని బంధింపవు. జ్ఞానాగ్నిసకల కర్మబీజములను దగ్ధం చేస్తుంది. "జ్ఞానాగ్నిః సర్వ కర్మాణి భస్మసాత్ కురుతే తథా". జ్ఞానాగ్ని సమస్త కర్మలను భస్మంచేస్తుంది అందువల్లజ్ఞాని పునర్జన్మనుపడయడు. ఈ మంత్రంలో భక్తియోగ ప్రాముఖ్యత తెలుపబడింది.

తరువాతి మంత్రాలలో యోగ నియమాలు, యోగ ఫలాలు విశదీకరింపబడ్డాయి.

త్రిరున్నతం స్థాప్య సమం శరీరం
హృదీంద్రియాణి మనసా సంనిరుధ్య ।
బ్రహ్మోడుపేన ప్రతరేత విద్వాన్
స్రోతాంసి సర్వాణి భయావహాని ॥ 8 ॥

---

* ఉపోద్ఘాతములో మహాయోగమును చూడుము.

టీక : త్రిరున్నతం = వక్షము, మెడ, తల— వీనివి నిట్రముచేసి; స్థాప్య = ఉంచి; సమం = సరళరేఖలోనుంచి; శరీరం = దేహమును; హృదీంద్రియాణి = మనస్సును, ఇంద్రియములను; మనసా = హృదయ. ములోనికి; సంనివుధ్య = సంనివేశ్య, సంవియమ్య ప్రత్యాహార మొనర్చి; బ్రహోమ్డుపేన = బ్రహ్మము అనెడి తరణసాధనము (తెప్ప)చే; ప్రత రేత = అతిక్రామేత్, దాటవలెను; విద్వాన్ = జ్ఞాని; స్రోతాంసి = సరిత్తులను, ప్రవాహములను; సర్వాణి = అన్నింటిని; భయావహాని = భయంకరమైన, ఘోరమైన.

భావము : తన శరీరమును సమముగ నుంచి; వక్షమును, గ్రీవమును, శిరస్సును నిట్రముగ నుంచి; ఇంద్రియములను, మనస్సును హృదయములోనికి ప్రత్యాహారము చేసి; ప్రాజ్ఞుడు పరబ్రహ్మమనెడి పడవసాయముతో భీకరమైన సంసార సరిత్తులను దాటవలెను.

వివరణము : "త్రిరున్నతం స్థాప్య సమం శరీరం. "వక్షము, గ్రీవము శిరము-వీటిని ఉన్నతపరచి కాయమును సమముగ నుంచవలెను

సమం కాయశిరోగ్రీవం
ధారయన్ అచలం స్థిరః।
సంప్రేక్ష నాసికాగ్రం స్వం
దిశశ్చా నవలోకయన్॥ గీతా

వక్షాన్ని, కంఠాన్ని, శిరాన్ని ఉన్నతపరచి; శరీరాన్ని సరళరేఖలో నుంచి; అచలుడై, స్థిరుడై ఆసీనుడై; దిక్కులను చూడక; దృష్టిని నాసికాగ్రమున నిల్పి ఏకాగ్రత నొందించవలెను,

"హృదీంద్రియాణి మనసా సంనిరుధ్య"అనగా మనస్సును, ఇంద్రియములను హృదయములోనికి ప్రత్యాహారము చేసి. మనస్సు, ఇంద్రియములు బహిర్ముఖ ప్రవృత్తి గలవి. మనస్సు, ఇంద్రియములు బాహ్య వస్తువులవైపు

వకు పరుగిడుతాయి అది వాటి సహజ ప్రవృత్తి. దీన్ని బహిర్ముఖ వృత్తి అంటారు. సాధకుడు ఇంద్రియాల్ని మనస్సును బాహ్య వస్తువుల కురంగటకు పోనీకుండ మాటిమాటికి వాటిని ప్రత్యాహారం చూస్తూండాలి, మనస్సును హృదయంలో విల్వాలి. అనగా సాధకుడు అంతర్ముఖ వృత్తిని అలవరుచుకోవాలి

"స్రోతాంసి సర్వాణి భయావహాని" అనగా భీకరమైన సకల సంసార సరిత్తులను. ఈ భయంకరములైన ప్రవాహాలు ఏవి? రాగద్వేషాలు, వాసనలు తృష్ణలు, అభినివేశము మొదలగునవి భయంకరమైన సంసార ప్రవాహాలు ఈ ప్రవాహాలలో కొట్టుకొనిపోయి, అజ్ఞాని జనన మరణ మహాసముద్రంలో పడిపోతాడు. ఇక సముద్రం నుండి బయటపడడం ఎలా?

"బ్రహ్మోడుపేన ప్రతరేత విద్వాన్" అనగా జ్ఞాని బ్రహ్మము అనెడి నావచే దాటవలెను. భయంకరమైన సంసార మహోదధిని దాటుటకు బ్రహ్మము గొప్ప తెప్ప. బ్రహ్మము అనగా ప్రణవము కాకాక్షి గోళ న్యాయముగ సంసార సరిత్తును దాటుటకుఉపయోగపడునౌక బ్రహ్మము, లేక ప్రణవము. ఈ ప్రణవనావనుఎలావాడాలి? జపసహిత ప్రణవ ధ్యానం చేయాలి ప్రణవార్థ సహితమైనధ్యానయోగాన్ని అభ్యసించాలి. అప్పుడు ప్రణవం సంసార మహాసాగరాన్ని దాటేందుకు తోడ్పడుతుంది. ప్రణవ జపం, ప్రణవ ధ్యానం సాధకుని జనన మరణ చక్రాన్నుండి విమోచితుని చేస్తాయి.

"ఈ మంత్రంలో ధ్యానానికి ఎలా కూర్చోవాలో, ఏవిధంగా మనస్సును ఏకాగ్రపరచాలో, ఏవిధంగా జపధ్యానములు సలుపాలో, ఎలా ప్రణవ పోతాన్ని వినియోగించుకొని భయంకరమైన సంసార ప్రవాహాల్ని దాటాలో తెలుపబడింది. అంటే ధ్యానాభ్యాసం ప్రధానంగా ఇందు చెప్పబడింది జ్ఞానయోగం. తరువాత మంత్రంలో రాజయోగ అభ్యాసం (ప్రాణాయామం ఎలా చేయాలి) గురించి తెలుపబడింది.

ప్రాణాన్ ప్రపీడ్యేహ సంయుక్తచేష్టః
క్షీణే ప్రాణే నాసిక యోచ్ఛ్వసీత ।
దుష్టాశ్వయుక్తమివ వాహమేనం
విద్వాన్మనో ధారయేతాప్రమత్తః ॥ 9 ॥

టీక : ప్రాణాన్ = ప్రాణములను. ఇంద్రియములను; ప్రపీడ్య = నిగ్రహించి; ఇహ = ఇచ్చట; సంయుక్తచేష్టః = యుక్తాహారవిహారములు గలి; క్షీణే ప్రాణే = గాలిని మెల్లగా పీల్చుచు; నాసికయా ఉచ్ఛ్వసీత = నాసికా రంధ్రములగుండ శ్వాసించుచు; దుష్ట = దుష్టమైన; అశ్వయుక్తం ఇవ = గుర్రములను పూన్చినదానివలె; వాహం = పగ్గములు; ఏనం = ఈః; విద్వాన్ = ప్రాజ్ఞుడు; మనః = మనస్సును; ధారయేత = నిరోధింపవలెను; అప్రమత్తః = ఏ ప్రతిబంధకములు లేకుండ, మెలకువతో.

భావము : "ఇంద్రియములను నిగ్రహించుచు; శ్వాసలను నిరోధించుచు క్రమబద్ధముచేయుచు; దేహచలనములను అదుపులోనుంచుచు, నాసికా రంధ్రముల గుండ మెల్లగా శ్వాసించుచు, ప్రాజ్ఞుడు మెలకువతో తన మనస్సును, దుష్టాశ్వములతోపూన్చిన అరథమును నిరోధింపవలెను".

వివరణము ; "ప్రాణాన్ ప్రపీడ్య ఇహ" అనగా ప్రాణములను, ఇంద్రియములను నిగ్రహించుచు. ఈమంత్రమున ప్రాణాయామ అభ్యాసాన్ని గురించి విశదీకరింపబడినది. ప్రాణాయామం అష్టాంగ యోగంలో నాల్గవ సోపానం, ప్రాణాయామం వల్ల మనోమలం క్షీణిస్తుంది, చిత్తం బ్రహ్మములో స్థితమౌతుంది. అందుకోసమే ఋషి ఇచ్చట "ప్రాణాయామాన్ని వర్ణిస్తున్నాడు. ప్రథమం నాడీశోధనం కర్తవ్యమ్. తతః ప్రాణాయామే అధికారః. మొదట్లో నాడీ శోధనం చేసుకోవాలి. ఆ పిమ్మట ప్రాణాయామాభ్యాసానికి అధికారం కలుగుతుంది.

ప్రాణాయామమంటే శ్వాసను నిగ్రహించడం. ప్రాణ అపానముల సంయోగాన్ని ప్రాణాయామం అంటారు. ప్రాణాయామ అభ్యాసంవల్ల సంయుక్తమైన ప్రాణ-అపానం సుషుమ్న నాడిద్వారా పయనిస్తుంది. మన హిందూమతంలో ప్రాణాయామానికి అధిక ప్రాముఖ్యత ఇవ్వబడింది. ప్రాణం మనస్సుతో సంబంధం కలిగియుంది; మనస్సుద్వారా అది ఇచ్ఛాశక్తి (will) తో సంబంధం కలిగియుంది; ఇచ్ఛాశక్తి ద్వారా అది జీవాత్మతో సంబంధం కలిగియుంది; జీవాత్మద్వారా అది పరమాత్మతో సంబంధం కలిగియుంది. మనస్సుద్వారా పనిచేసేటటువంటి చిన్నచిన్న ప్రాణతరంగాలను విగ్రహించడం ఎలాగో తెలుసుకొంటే ప్రాణాన్ని నిగ్రహించే రహస్యం మనకు అవగతమౌతుంది. ప్రాణాయామ అభ్యాసంవల్ల మనదేహంలోని నాడీప్రవాహాలు మన అదుపులో ఉంటాయి. ప్రాణాయామం వల్ల మనం సుఖవుగా, సత్వరంగా దేహాన్ని, మనస్సును, ఆత్మను అభివృద్ధిపరచుకోవచ్చు. ప్రాణాన్నినిగ్రహిస్తే. నిగ్రిస్తే దేహము; మనస్సుకూడ నిగ్రహింపబడతాయి. (If the prana is controlled the mind is controlled)

"సంయుక్త చేష్టః" ప్రాణాయామ అభ్యాసకులు ఆహారవిహారములలో మితాన్ని (moderation) పాటించాలి. వారు సాత్త్వికాహారం పుచ్చుకోవాలి. వారు బ్రహ్మచర్యాన్ని అనుష్టించాలి. ఈ నియమాలను పాటించకుండా ఎన్నో ఏండ్లు ప్రాణాయామం అభ్యసించినప్పటికి వారికి అధిక ప్రయోజనం ఉండదు సాధారణ ఆరోగ్యంకోసం కొద్దిగా ప్రాణాయామాన్ని అభ్యసింపవచ్చు.

"క్షీణే ప్రాణే నాసికయా ఉచ్ఛ్వసీత" అనగా నాసికారంధ్రముల గుండ మెల్లగా గాలిని పీలుస్తూ, వదలుతూ, ప్రాణాయామాన్ని ఎలా అభ్యసించాలో తెలుపబడింది. పద్మాసనంపై కూర్చుండాలి. అలా కూర్చోలేనివారు సిద్ధాసనం మీద కూర్చోవాలి. కుడి అంగుష్టంతో కుడి నాసికారంధ్రాన్ని మూయాలి. ఎడమ నాసికారంధ్రంగుండా మెల్లగా గాలిని లోనికి పీల్చాలి. "దీన్ని పూరకము అంటారు." తరువాత ఎడమ నాసికారంధ్రాన్నికూడ కుడిచేతి చిటికెన-

ఉంగరపు వ్రేళ్ళతో మూసి. శ్వాసను ఎంతసేపు మనం సుఖంగా, సౌకర్యంగా నిరోధించగలమో అంతసేపు శ్వాసను విడువకుండా ఉంచాలి. "దీన్ని కుంభకం అంటారు." తరువాత కుడి అంగుష్ఠాన్ని వదలి, కుడి నాసారంధ్రం గుండా మెల్లగా, మెల్లగా గాలిని బయటకు వదలాలి, "దీన్ని రేచకం అంటారు" మరల కుడి నాసారంధ్రం ద్వారా శ్వాసను పీల్చాలి, మరల కుడి అంగుష్ఠంతో నాసారంధ్రాన్ని మూసి. శ్వాసను ఎంతసేపు సుఖవుగ, సుఖముగ నిరోధించ గలమో అంతసేపు కుంభకం చేయాలి. తరువాత చిటికెన వ్రేలు, ఉంగరపు వ్రేలు వదలి ఎడమ నాసారంధ్రం గుండా శ్వాసను మెల్లగా బయటకు వదలాలి, "ఇది ఒక ప్రాణాయామం, ప్రారంభంలో మనం ఐదు ప్రాణాయామాలు చేయవచ్చు. తరువాత క్రమేపి దాన్ని ఇరువది చేయవచ్చు.

"దుష్టాశ్వయుక్తమివ వాహమేనం" అనగా ఉగ్రమైన గుర్రాలకు తగిలించిన పగ్గాలవలే, ఈలాంటి రూపకం (వర్ణణ) మనకు కఠోపనిషత్తులో కానవస్తుంది.

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు।
బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ॥"

ఆత్మ ఈ రథానికి ప్రభువనియు, దేహమును స్యందనమనియు, బుద్ధిని రథ సారథియనియు, మనస్సును పగ్గములనియు తెలిసికొమ్ము.

గహనమైన విషయాన్ని సులభంగా మనం అర్థం చేసుకోవడానికి ఈ మంత్రంలో రథంయొక్క సాదృశ్యం తీసుకోవడం జరిగింది. కర్మ ఫలాలను అనుభవిస్తూ, అవిద్యాప్రాబల్యం వల్ల ఈ సంసారంలో బద్ధుడైన జీవాత్మను దేహస్యందనానికి ప్రభువుఅని తెలుసుకోవాలి, రథాన్ని అశ్వాలు లాగుతాయి. ఇక ఈ శరీరరథాన్ని ఏ గుర్రాలు లాగుతాయి? దేహమనిడి ఈ రథాన్ని ఇంద్రియములనెడి గుర్రాలు లాగుతాయి. ఆ కారణంచేతనే శరీరాన్ని రథానికి పోల్చారు. రథాన్ని మెలకువతో సారథి తోలుతాడు. వివేక పూర్వకమైన బుద్ధియనెడి డ్రైవరు దేహమనెడి రథాన్ని నడుపుతాడు, బుద్ధి దర్శకత్వంలోనే దేహం అన్ని పనులు చేస్తుంది. రౌతు తన చేతిలో పగ్గాలు పట్టుకుంటే

గుఱ్ఱాలు పరుగిడుతాయి. మనస్సు తనచేతిలో పగ్గాలు పట్టుకొంటే ఇంద్రియాలు తమపనులు నిర్వర్తిస్తాయి చెవులు, చర్మము, కన్నులు, నాలుక, నాసిక— ఇవి ఇంద్రియాలు. ఈ ఇంద్రియాలను గుఱ్ఱాలు అన్నారు. శబ్దము, స్పర్శ రూపము, రసము, గంధము—ఇవి విషయాలు. ఈ విషయాలనెడి రోడ్లపై ఇంద్రియాలనెడి గుఱ్ఱాలు పరుగెడుతాయి. అసమర్థుడైన సారథి దుష్టాశ్వాలను అదుపులో నుంచలేని విధమున దేహస్యందనాన్ని నడిపే డ్రైవరు అసమర్థుడైతే (బుద్ధికి వివేకశక్తి లేకపోతే) అతడు ఇంద్రియములనెడి గుఱ్ఱాలను నిగ్రహింపలేడు, శమర్థుడైన చోదకుడు చాకచక్యంతో పగ్గాలనుపట్టి గుఱ్ఱాలను అదుపులోనుంచు తెరగున సమర్థుడైన దేహస్యందన చోదకుడు సదవగాహన సదసత్ వివేకము, ఇచ్ఛాశక్తులతో ఇంద్రియాలను బాగుగా నిగ్రహిస్తాడు. విచారం, వివేకం విజ్ఞానం లేనివాడు, మనోనిగ్రహం, ఇంద్రియ నిగ్రహంలేని వాడు, అశుచిమంతుడు గమ్యాన్ని చేరలేడు. అతడు జననమరణ చక్రంలో తగుల్కొంటాడు

"విద్వాన్ మనో ధారమేత అప్రమత్త" అనగా ప్రాజ్ఞుడు అతిమెలకువతో మనస్సును నిగ్రహింపవలెను వివేకముగల సాధకుడు అప్రమత్తుడై ప్రాణాయామాభ్యాసం చేసి, ప్రాణాన్ని నిగ్రహించి, తద్వార మనస్సును నిగ్రహించాలి. మనస్సు నిగ్రహింప బడినపుడే గుర్రాలు (ఇంద్రియములు) బాటపై సరిగా పరుగిడుతాయి, జీవాత్మ గమ్యాన్ని చేరుతాడు. అనగా అతడు మోక్షధామమును పొందుతాడు,

సమే శు చౌ శర్కరావహ్నివాలుకా
వివర్జితే శబ్దజలాశ్రయాదిభిః ।
మనోఽనుకూలే న తు చక్షుపీడనే
గుహానివాతాశ్రయణే ప్రయోజయేత్ ॥10॥

టీక: సమే = భూమి సమతలముగానున్న చోట; శుచౌ = పరిశుద్ధమైన; శర్కరా = గులకరాళ్ళు; వహ్ని = అగ్ని; వాలుకా = దుమ్ము;

వివర్జితే = లేని; శబ్దజలాశ్రియాదిభిః = ఆకులు ధ్వనులు, ఆర్ద్రితమున్న గునవి; మనః అనుకూలే = మనోధారణకు తోడ్పడునట్టి; న = లేదు; తు = నిజముగ; చక్షః పీడనే = చూచుటకు బాధకలిగించెడి; గుహా నివాత ఆశ్రియణే = లతా మండపములు, గుహలు, మంచి జలాశయములు గలచోట; ప్రియోజయేత్ = చిత్తమును పరమాత్మయందు లగ్నముచేయవలెను.

భావము: "సమతలముగల శుభ్రమైన ప్రదేశమున; గులకరాళ్ళు, నిప్పు, దుమ్ము కలహాది ధ్వనులు, చిత్తడి ప్రదేశము లేనిచోట; మనోధారణ కు ఉపయుక్తమగు ఏకాంత ప్రదేశమున; నేత్రానందము గొల్పు రమ్యమైన దృశ్యములు గలచోట లతా మండపములు, గుహలు, జలాశయములుగల చోట సాధకుడు ధారణాభ్యాసములు సలుపవలెను."

వివరణము: "ప్రాణాయామం చేసేదానికి అనుకూల ప్రదేశం, ఉపయుక్తమైన వాతావరణం తెలుపబడింది.

"సమే శుచౌ శర్కరావహ్నివాలుకా వివర్జితే శబ్దజలాశ్రియాదిభిః" అనగా సమతలముగ ప్రదెశమున, శుద్ధి యొనర్పబడిన ప్రదేశమున గులకరాళ్ళు, నిప్పు, దుమ్ములేనిచోట, మనస్సుకు కలత కలిగించు ధ్వనులు లేని చోట. చిత్తడి ప్రదేశము కాని చోట ప్రాణాయామాభ్యాసము సలుప వలయును. సమతలముగ గల ప్రదేశంలో కూర్చోవాలి. అప్పుడే వక్షాన్ని, గ్రీవాన్ని, శిరస్సును నిటారంగా ఉంచి ప్రాణా యామాభ్యాసం సాధ్యం ఔతుంది. అభ్యాసానికి కూర్చుండే ప్రదేశం శుచిగా ఉండాలి. గులకరాళ్ళు, దుమ్ము, గులకరాళ్ళు, ధూళిఉండే చోట అభ్యాసానికి కూర్చుండే ప్రదేశం శుచిగా ఉండాలి. గులకరాళ్ళు, దుమ్ము, దూళి ఉండే చోట అభ్యాసానికి కూర్చుండరాదు. రాళ్లు గుచ్చుకుంటాయి. అందువల్ల ఆ స్థలం స్థిరంగా వుండదు దుమ్ము ఊపిరితిత్తుల లోకి పోతుంది, అందు వల్ల దుమ్ములేని చోటు ఎన్నుకోవాలి, నిప్పు సమీపాన కూర్చుండి ప్రాణా యామం చేయకూడదు. అభ్యాసకుడు వంటింటిలో కూర్చుండి ప్రాణాయామం చేయకూడదు. ఎందువలన అంటే ప్రాణామాయాభ్యాసకునికి చల్లని

సమ శీతోష్ణ మండల వాతావరణం అనుకూలమైనది. కలహాది ధ్వనులు వుండే చోట ప్రాణాయామ అభ్యాసానికి కూర్చుంటే మనస్సుకు ధారణ కదురదు కలహాది ధ్వనులు మనస్సులో ఆకులాన్ని తెచ్చిపెడుతాయి. అందు వలన యోగాభ్యాసానికి సాధ్యమైనంత ఏకాంతవంతమైన వాతావరణం అవసరం. చి తడి ప్రదేశములలో మశకాది బాధ ఎక్కువగ ఉంటుంది. మరియు ఆర్ద్రత ఎక్కువ గల క్లిష్టమైన వాతావరణముగల ప్రదేశాలు అభ్యాసానికి పనిరాదు.

"మనోఽనుకూలే న తు చక్షుపీడనే" అనగా మనస్సునకు అహ్లాద మిచ్చే నేత్రానందకరమైన చోటు ప్రాణాయామాభ్యాసానికి తగినది. ప్రాణాయామం, ధారణ, ధ్యానం అభ్యసించేందుకు తగిన వాతావరణం ఉంటే అభ్యాసం చురుకుగా, అనాయాసంగా సాగుతుంది. ఆధ్యాత్మికాభ్యాసానికి నిర్దేశమైన ప్రదేశం మనోరమ్యంగా ఉంటే, దృశ్యం నయనానందంగా ఉంటే. ఆధ్యాత్మి స్పందనాలు ఉత్తేజకంగా ఉంటే, ధ్యానప్రదేశం ఏకాంతంగ. ప్రశాంతంగ ఉంటే జిజ్ఞాసువునకు ధారణ సులభంగా, సత్వరంగా కుదురుతుంది

"గుహా నివాతాశ్రయణే ప్రయోజయేత్" మంచి లతామండపాలు, పొద రిండ్లు, చక్కటిగుహలు, సుందర సరోవర తీరాలు, నదీతటాలు, ఏకాంత ప్రదేశాలు, పాములు, తేళ్ళు, పులులు లేని వనాలు—ఇవి దారణకు అనుకూలమైన ప్రదేశాలు.

1. హృషీకేశము (హరిద్వారమునకు సమీపమున గలదు.) 2. స్వర్గాశ్రమము (ఋషీకేశమున గలదు.) 3. ఉత్తరకాశి (టిహ్రీగుండా ప్రయాణించాలి) 4. కంఖల్ (హరిద్వార సమీపమునగలదు) 5. బదరీ నారాయణము (హిమాలయములందు గలదు) 6. దేవప్రయాగ 7 గంగోత్రి 8. అయోధ్య 9. ఆబుపర్వతము 10. నాసికాత్ర్యంబకము 11. వారణాసి 12. బృందావనము 13. శ్రీ రమణాశ్రమము 14. శ్రీ అరవిందాశ్రమము 15. శ్రీవ్యాసాశ్రమము 16. కైలాసనాధ జలపాతఆశ్రమము (పుత్తూరు). 17. గంగానదీతటము 18. కావేరి నదీ తటము 19. తామ్రపర్ణి నదీ తటము

20. గోదావరినదీ తటము 21. శీతోష్ణస్థితి చల్లగానున్న ప్రదేశములు — ఈ ధారణాభ్యాసమునకు అనుకూలపడును.

నీహార ధూమార్కానిలానలానాం
ఖద్యోత విద్యుత్స్ఫటిక శశీనామ్।
ఏతాని రూపాణి పురఃసరాణి
బ్రహ్మణ్యభివ్యక్తికరాణి యోగే ॥11॥

టీక: నీహార = తుషారము, మంచు; ధూమ = పొగ; అర్క = సూర్యుడు; అనిల = వాయువు; అనలానాం = అగ్నియొక్క; ఖద్యోత = మిడుగురుపురుగు, జ్యోతిరింగణము; విద్యుత్ = మెరపు; స్ఫటిక = స్ఫటికము, సితోపలము; శశీనామ్ = చంద్రునియొక్క; ఏతాని = ఈ; రూపాణి= రూపములు; పురఃసరాణి = అగ్రగామిణి, ముందుచనును; బ్రహ్మణి = బ్రహ్మమునందు; అభివ్యక్తి = వ్యక్తరూపము; కరాణి = అభ్యాసముచేయుచున్నప్పుడు; యోగే = యోగమునందు, యోగాభ్యాసమునందు.

భావము: యోగము ఆచరింపబడుచున్నపుడు తుషారము, ధూమము, భానుడు, అనలము, అనిలము, ఖద్యోతము, మెరపు, స్ఫటికమణి, చంద్రుడు— ఇవి కనబడుతాయి. బ్రహ్మము అభివ్యక్తమగుటకు మునుపు ఇవి ధ్యానానుభవములతో కనబడుతాయి.

వివరణము: "నీహార - ధుమ - అర్క - అనిల - అనలానాం - ఖద్యోత - విద్యుత్ - స్ఫటిక - శశీనామ్" అనగా మంచు, పొగ, సూర్యుడు, వాయువు, అగ్ని, శలభము, మెరుపు, స్ఫటికము, చంద్రుడు. బ్రహ్మసాక్షాత్కారానికి ముందు ఈ రూపములు కనబడును. ధ్యాన సమయమున సాధకులకు పై రూపములు కనబడుతూంటాయి.

"ఏతాని రూపాణి పురఃసరాణి బ్రహ్మణ్యభివ్యక్తి కరాణి యోగే" అనగా బ్రహ్మము అభివ్యక్తమగుటకు మునుపు ఈ రూపములు (మంచు,

ధూమము, అర్కుడు, వాయువు, అగ్ని, మిణుగురుపురుగు, మెరుపు, స్ఫటిక మణి, చంద్రుడు కనబడును. ఇలా కనబడితే ధ్యాత ధ్యానంలో ముందుకు పోతున్నాడని అర్థము. అతడుత్తరలో ఆత్మసాక్షాత్కారాన్ని పొందబోవు చున్నాడని అర్థము. ఈ రూపాలు ధారణలోని వివిధ అంతస్థులను సూచిస్తాయి.

యోగాభ్యాసము నభ్యసించు కొందరి జిజ్ఞాసువుల ధ్యానానుభవములను ఇచ్చట తెలపడం సమంజసమని భావిస్తున్నాను. ఈ ధ్యానానుభవములు విచిత్రంగా ఉంటాయి.

1. ధారణయొనర్చు సమయములో నేను అసాధారణమైన కమ్మటి సువాసనను, పరిమళమును ఘ్రాణించుచుంటిని.

2. ధ్యానమువందు నా త్రికూటమున ప్రజ్వలించుచున్న సూర్యుని మిరుమిట్లు గొల్పు జ్యోతిని, కాంతిగల నక్షత్రమును చూచుచుంటిని. ఆ దర్శనం నిలకడగ ఉండలేదు.

3. ధారణచేయునట్టి సమయమున నా త్రికూటమునందు నేను కొందరి ఋషులను దర్శించితిని. నా యిష్టమైన కృష్ణభగవానుని, వేణువును హస్తమున దాల్చిన స్వామిని నేను దర్శించితిని.

4. నాధ్యాన సమయమున అప్పుడప్పుడు నా త్రికూటమున రంగుల జ్యోతులను, ఎర్రని, ఆకుపచ్చని, నీలవర్ణమైన, తెల్లని కాంతులను దర్శించుచుంటిని. నేను కొన్నిపర్యాయములు నీలాకాశమును త్రాటకము చేయుచుంటిని. ఆ నీలాకాశమునందు నేను ఒక చుక్కగ కనబడితిని.

5. ధారణచేయు సమయమున నా ఎదుట ఒక పెద్ద ప్రకాశవలయమును చూచుచుంటిని.

6. నా ధ్యానములో నేను రాజభవనములను, నదులను, పర్వతములను, ఉద్యానవనములను వీక్షించుచుంటిని.

7. నేను ఉన్మీలిత నేత్రములతో ధ్యానించుచుంటిని. ఒక రాత్రి నేను నా ఎదుట కాంతిమయ జ్యోతిని చూచితిని. ఆ ప్రకాశము నడుమ వేణువును

హ స్తమున నిడుకొనిన కృష్ణభగవానుని కనుగొంటిని. నా రోమములు నిక్కబొడుచుకొనినవి. నా నోటమాట రాలేదు, నేను విస్మయాశ్చర్య హతుడనైతిని. అప్పుడు ప్రాతఃకాలము 3 గంటలు.

8. నే నొక మాసము ప్రాణాయామము నాచరించితిని తదుపరి కొన్ని మధుర శబ్దములను, వివిధ రకములైన నాదములను విన నారంభించితిని. అవేవనగా: వేణువు, వీణ, గంట, మృదంగము, గెజ్జలగంటలు, శంఖము, ఢంకా, కులిశము—వీటి శబ్దములు వింటిని. కొన్ని సార్లు కుడిచెవినుండి, మరి కొన్ని సార్లు ఎడమ చెవినుండి, మరికొన్నిసార్లు రెండు చెవులనుంచి నాదమును విననారంభించితిని.

9. మూడు సంవత్సరముల క్రితము నా సూర్యనాడి చెంత ఒక వినూత్నమైన సంవేదనమును పొందితిని. నేను ఫ్లైవీలు (fly - wheel) యొక్క గిర్రున భ్రమించు సంవేదనము పొందితిని.

10 నాఆఫీసులో నేను ఏకదృష్టితో పనిచేయునపుడు దివ్యమైన ధవళ కాంతులు నా నేత్రములకు అడ్డముగ మెరయును, కొన్ని సమయములందు నా పుస్తకములపై చిన్ని కాంతి స్ఫులింగములు చూచితిని. ఇవి కనబడినపుడు నాకు అపూర్వ సంతోషము కలుగును. నేను 'శ్రీరామ జయరామ జయ జయ రామ' యని శ్రీరామ నామమును గానముచేయుటకు మొదలిడుదును. ప్రస్తుత నా ఆఫీసుకు సైకిలుపై పోవుచున్నప్పుడు కందుకమువలె నుండు ఒకగుండ్రని వెలుగు అగపడును. నేను ఆఫీసు చేరునంతవరకు ఆ గుండ్రని వెలుగు దృశ్యముగ నుండును. నేను ఒక్కొక్కప్పుడు ఆకాశమును చూచుచున్నప్పుడు ఇదేదృశ్యము కనబడుతుంది.

> పృథ్వ్యప్తేజోఽనిలఖే సముత్థితే
> పంచాత్మకే యోగగుణే ప్రవృత్తే ।
> న తస్య రోగో న జరా న మృత్యుః
> ప్రాప్తస్య యోగాగ్నిమయం శరీరం ॥12॥

టీక; పృథివి అప్ తేజః అనిల ఖే = భూమి, నీరు, అగ్ని వాయువు. ఆకాశము—వీని నుండి; సముత్థితే = ఉదయించిన; పంచాత్మకే = అయిదు విధములైన; యోగగుణే = యోగము యొక్క గుణములు; ప్రవృత్తే జనించినపుడు; న = లేదు; తస్య = వానికి: రోగః = వ్యాధి; న = లేదు; మృత్యుః = మరణము; ప్రాప్తస్య = పొందిన; యోగాగ్ని మయం = యోగాగ్నివలన బలిష్ఠ మొనర్చబడిన; శరీరం = దేహమును.

భావము: భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము — వీనినుండి యుదయించిన అయిదు విధములైన యోగగుణములు ఉత్పత్తియైన పిదప యోగాగ్నిచే బలిష్ఠ మొనర్చబడిన వజ్రకాయ సంపన్నుడగును. అందువలన ఆతడు వ్యాధిచేగాని, ముసలితనముచేగాని, మృత్యువుచేగాని బాధితుడు గాడు.

వివరణము: "పృథివి అప్ తేజః అనిల ఖే," పృథివి, అప్పు, తేజస్సు, వాయువు ఆకాశము. వీనిని పంచభూతములు అంటారు. ఈ ప్రపంచము పంచభూతాత్మకమైనది. మన శరీరము పాంచభౌతికమైనది.

"సముత్థితే పంచాత్మకే యోగగుణే ప్రవృత్తే" ఈ పంచభూతముల నుండి యుదయించిన అయిదు రకములైన యోగగుణములు ఉత్పత్తియైన పిదప. యోగగుణే అనగా యోగముయొక్క గుణములు. యోగగుణే అంటే పంచభూతముల యొక్క గుణములు. భూమియొక్క గుణము వాసన (Smell) నీటియొక్క గుణం రుచి (Taste) . అగ్నియొక్క గుణం రూపం (Form). వాయువుయొక్క గుణం స్పర్శ (Touch). ఆకాశంయొక్క గుణం శబ్దము (Sound). శబ్దము, స్పర్శ, రూపము రసము, గంధము క్రమముగా పృథ్వి (Earth). అప్పు (Water), అగ్ని (Fire), వాయువు (Air), ఆకాశము (Ether) అనెడి పంచభూతముల యొక్క యోగ గుణాలు.

మనస్సును నాసికాగ్రం మీద లగ్నంచేయడంచేత యోగి ఇంద్రియాతీతమైన దివ్య "గంధాన్ని" అనుభవిస్తాడు. మనస్సును తన జిహ్వాగ్రమున

లగ్నంచేయడంవల్ల యోగి దివ్యమైన "రుచిని" అనుభవిస్తాడు. యోగి తన మనస్సును తాళువుపై లగ్నంచేయడంవల్ల దివ్య "రూపాన్ని" దర్శిస్తాడు. నాలుక మధ్యభాగంపై మనస్సును లగ్నంచేయడంవల్ల యోగి దివ్యమైన "స్పర్శను" పొందుతాడు. జిహ్వయొక్క మూలమున మనస్సును లగ్నం చేయడంవల్ల యోగి దివ్య "నాదాన్ని" వింటాడు. ఈ దివ్యానుభూతులవల్ల మనస్సు నిశ్చలమౌతుంది. ఈ దివ్యానుభూతులవల్ల మనస్సు బాహ్యవస్తువులచే ఆకర్షితము గాదు. అందువల్ల మనస్సు ప్రశాంతతను పొందుతుంది.

న తస్య రోగో న జరా న మృత్యుః

"ప్రాప్తస్య యోగాగ్నిమయం శరీరం." యోగి యోగాగ్ని వలన బలిష్ఠమొనర్చబడిన వజ్రకాయము పొంది, వ్యాధిచేతగాని, ముసలితనముచేతగాని, మృత్యువుచేతగాని బాధితుడుకాడు. ప్రాప్తస్య అనగా పొంది. ప్రాణాయామాభ్యాసంవల్ల, ధారణాభ్యాసంవల్ల, యోగక్రియల అభ్యాసంవల్ల యోగి ద్రఢిష్టమైన, బలిష్టమైన, సౌష్టవమైన వజ్రకాయాన్ని పొందుతాడు. అతన్ని రోగంకాని, వార్ధక్యంకాని, మృత్యువుకాని సమీపించజాలదు. యోగాగ్నిచే బలిష్టమొనర్చబడిన దేహముతో యోగి ప్రకాశించును. మహారాష్ట్రానికి చెందిన చాంగ్ దేవ్ యోగిపుంగవుడు తన దేహాన్ని పదునాలుగు వందల ఏండ్లు వజ్రకాయంగా ఉంచాడు.

ఈ అద్భుతమైన దివ్యశక్తుల్ని యోగులు ప్రాణాయామ, ధారణ, ధ్యానాదుల సంతతాభ్యాసం చేత పొందుతారు. జ్ఞానదేవునివంటి మహనీయులు యోగీశ్వరులు పంచభూతములను, ప్రకృతిని శాసింపగలరు.

లఘుత్వమారోగ్యమలోలుపత్వం
వర్ణప్రసాదం స్వరసౌష్ఠవం చ।
గంధః శుభో మూత్రపురీషమల్పం
యోగప్రవృత్తిం ప్రథమాం వదంతి ॥13॥

టీక: లఘుత్వం = తేలికతనం; ఆరోగ్యం = ఆరోగ్యము; అలోలుపత్వం = కోరికలు లేకుండుట; వర్ణప్రసాదం = మంచి దేహ కాంతి; స్వరసౌష్ఠవం = కమ్మని కంఠధ్వని; చ = మరియు; గంధః = వాసన; శుభః = ఇంపైన; మూత్రపురీషం = మలమూత్రములు; అల్పం= తక్కువ; యోగప్రవృత్తిం = యోగమునందు ప్రవేశించు చిహ్నాలు; ప్రథమాం = మొదటిది; వదంతి = చెప్పెదరు.

భావము: దేహము తేలికగ, ఆరోగ్యముగ నున్నపుడు, మనస్సు నిశ్చలత నొందినపుడు, మంచి దేహకాంతి యున్నపుడు, కమ్మని కంఠధ్వని, ఇంపైన వాసన యున్నపుడు, మూత్రపురీషములు అల్పముగ నున్నపుడు యోగములో ప్రవేశించు మొదటి చిహ్నములు అతడు పొందెనని పూర్ణయోగులు నుడివెదరు.

వివరణము: "లఘుత్వం ఆరోగ్యం అలోలుపత్వం" అనగా తేలిక తనం, ఆరోగ్యం, కోరికలు లేకుండుట. ప్రాణాయామాభ్యాసంచే యోగి శరీరం బలిష్టమౌతుంది. ఆరోగ్యవంతంగా ఉంటుంది. దేహం తేలికగా ఉంటుంది. దేహంలోని అధికమైన క్రొవ్వుపదార్థం తగ్గుతుంది.

"వర్ణప్రసాదం స్వరసౌష్ఠవం చ" అనగా మంచి దేహకాంతి, కమ్మని కంఠధ్వని. ప్రాణాయామ అభ్యాసకునకు ముఖంలో మంచి వర్చస్సు ఉంటుంది. అతని కన్నులు వజ్రాలులాగా మెరిస్తాయి. అభ్యాసకుడు బహుసుందరరూపుడౌతాడు. అతని గొంతు మృదుమధురంగా శోభిల్లుతుంది. అతనికి అంతర అనాహత నాదాలు స్పష్టంగా వినబడుతాయి. అతనికే రోగాలురావు. అతడు బ్రహ్మచర్యంలో సుప్రతిష్ఠితుడౌతాడు. అతనిలో జఠరాగ్ని ప్రదీప్తమౌతుంది. బాగా ఆకలివేస్తుంది అతనికి. వానిలో నాడీ శుద్ధి జరుగుతుంది. మనస్సు సమాధానం పొందుతుంది. రజస్సు, తమస్సు నిర్మూలింపబడుతాయి. మనస్సు ఏకాగ్రత చెందుతుంది. ధారణ, ధ్యాన అభ్యాసాలకు మనస్సు సిద్ధమౌతుంది.

"గంధః శుభో మూత్రపురీషమల్పం." అతని దేహంనుండి ఇంపైన

సువాసన వెలువడును. అతని మల మూత్రములు స్వల్పముగ నుండును. ప్రాణాయామాన్ని సక్రమంగా, నిలకడగా అభ్యసించడంవల్ల అంతర ఆధ్యాత్మిక బలం కలుగుతుంది. ఈ లక్షణములు ఉన్నయోగి యోగములో ప్రవేశించు మొదటి చిహ్నములు పడసెనని పూర్ణయోగులు నుడివెదరు.

ప్రాణాయామ అభ్యాసం పరమ సంతోషాన్ని, ఆధ్యాత్మిక జ్ఞానాన్ని, మనశ్శాంతిని కలుగజేస్తుంది. ప్రాణాయామ అభ్యాసం యోగిని బ్రహ్మచర్యానుష్ఠానంలో సిద్ధిని పొందేటట్లు చేస్తుంది. ఒక అప్సరాంగన అతనిని మరలు కొల్పడానికి ఏతెంచినా అతడు అణుమాత్రం కూడా చలింపని దృఢసంకల్ప శక్తిని ప్రాణాయామం కలుగజేస్తుంది. అతన్ని ఊర్ధ్వరేత యోగిగ చేస్తుంది. ప్రాణాయామంలో సిద్ధులైన మహాయోగులకు అణిమాది అష్టసిద్ధులు, ముప్పది ఆరు చిన్న సిద్ధులు, కలుగుతాయి. అట్టి యోగులు తాము కోరుకొన్నంత కాలము జీవింపగలుగుతారు.

---

యథైవ బింబం మృదయోపలిప్తం
తేజోమయం భ్రాజతే తత్సుధాంతమ్ ।
తద్వాత్మతత్త్వం ప్రసమీక్ష్య దేహీ
ఏకః కృతార్థో భవతే వీతశోకః ॥14॥

టీక: యథాఏవ = ఏ విధముగ; బింబం = లోహచక్రము, అద్దము; మృదయోపలిప్తం = మృదయా; ఉపలిప్తం = మృదాదినా మలినీకృతం. దుమ్ముతో మరకపడిన; తేజోమయం = చాల ప్రకాశవంతముగ: భ్రాజతే = ప్రకాశించును; తత్ = అది: సుధాంతం = సుధౌతం, శుభ్రము చేయబడినపుడు; తద్వా = ఆవిధముగ; ఆత్మతత్త్వం = ఆత్మయొక్క అసలు స్వభావమును; ప్రసమీక్ష్య = చూచి; దేహీ = జీవాత్మ; ఏకః = ఒంటరియైన, ఒకటియైన; కృతార్థః = పొందబడిన గమ్యము గలవాడు, కృతార్థుడు; భవతే = అగుచున్నాడు; వీతశోకః = శోకములేనివాడు, శోకరహితుడు.

భావము: ఇంతకు ముందు మట్టితో, దుమ్ముతో కళంకమైన దర్పణము. దానిని శుభ్రపరచిన తరువాత అది ఏవిధంగా ప్రకాశవంతముగా మెరయునో; అదే విధముగ జీవాత్మ పరమాత్మయొక్క అసలు తత్త్వాన్ని తెలిసికొన్నప్పుడు ఏకత్వాన్ని పడసి, గమ్యాన్ని పొంది, శోకాన్ని తరిస్తాడు

"యథా ఏవ బింబం మృదయా ఉపలిప్తం తేజోమయం భ్రాజతే తత్ సుధాంతమ్." మట్టి మరకలతో నున్నటువంటి దర్పణము శుభ్రపడిన అనంతరము ఎలాగున ప్రకాశవంతముగ మెరయునో. బింబం అంటే దర్పణం, అద్దం. బింబం అంటే బంగారు పిండం, లేక వెండి పిండం. బింబం అంటే లోహపు చక్రం. ఆ బింబంపై మట్టిమళానము పేరుకొనియుంటే అది ప్రకాశించదు. అట్టి బింబములో మన ప్రతిబింబము కనబడదు. ఎందువల్లనంటే దానిపై మట్టి. దుమ్ము పేరుకొనియుంది. అందువల్ల ఆ దర్పణంలో ఎటువంటి పరావర్తనం జరుగదు. కాని, అద్దముపైన ఉండే మలినాన్ని తొలగించిన తరువాత, అనగా అద్దమును బాగుగ శుభ్రపరచిన పిదప ఆ అద్దం బాగా ప్రకాశిస్తుంది. అప్పుడు దానిలో మన ప్రతిబింబం స్పష్టంగా కనబడుతుంది. బంగారు పిండంకాని, వెండి పిండంకాని అగ్నిలోకాల్చబడి, విమలీకృతం అయిన తరువాత అది తేజోమయంగా ప్రకాశిస్తుంది. అది వన్నెతీరి ప్రకాశిస్తుంది. దానిలో ప్రతిబింబం బాగా కానవస్తుంది.

"తద్వా ఆత్మతత్త్వం ప్రసమీక్ష్య దేహీ ఏకః"

"కృతార్థః భవతే వీతశోకః" అద్దాని శుభ్రపరచిన తరువాత దానిలో మన ప్రతిబింబం బాగా కనబడుతుంది. అలాగే జీవాత్మ పరమాత్మయొక్క అసలు తత్త్వాన్ని తెలిసికొన్నప్పుడు అతడు ఏకత్వాన్ని పడసి, గమ్యాన్ని పొంది, శోకాన్ని తరిస్తాడు. దేహీ అనగా జీవాత్మ 'అజ్ఞాన మలినంతో' అవిద్యా గంధంతో లిప్తమైయుండినపుడు జీవాత్మ దుఃఖాన్ని, శోకాన్ని అనుభవిస్తాడు. అహంత, మమతయనెడి పంకాన్ని పూసుకొన్నప్పుడు జీవుడు దుఃఖశోకాలకు గురియౌతాడు. దేహతాదాత్మ్యం అనే మట్టిని అతడు శరీరానికి పట్టించినపుడు

గురుతర దుఃఖాల్ని అనుభవిస్తాడు. ఆత్మయొక్క అసలు స్వభావాన్ని తెలుసుకోగానే, అనగా అతనికి అవిద్యాగంధం తొలగగానే అన్ని దుఃఖాలు అంతమొందుతాయి. జీవుడు పరమాత్మతో తన ఏకత్వాన్ని తెలుసుకోగానే సర్వ దుఃఖాలు మటుమాయమౌతాయి. దేహతాదాత్మ్యం తొలగి, బ్రహ్మతాదాత్మ్యం కలిగినప్పుడు జీవాత్మ నిత్యానందమును, అఖండ శాంతిని అనుభవిస్తాడు. ఇది ఈ మంత్రం యొక్క అభిప్రాయము.

---

యదాత్మతత్త్వేన తు బ్రహ్మతత్త్వం
దీపోపమేనేహ యుక్తః ప్రపశ్యేత్।
అజం ధ్రువం సర్వతత్త్వైర్ విశుద్ధం
జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః ॥15॥

టీక: యదా = ఎప్పుడు; ఆత్మతత్త్వేన = ఆత్మతత్త్వముతో, ఆత్మయొక్క అసలు స్వభావముతో; తు = నిశ్చయముగ, నిజముగ; బ్రహ్మతత్త్వం = పరబ్రహ్మముయొక్క అసలు స్వభావమును; దీపోపమేన = దీపమువలె; ఇహ = ఇచ్చట; యుక్తః = యోగి; ప్రపశ్యేత్ = దర్శించునో; అజం = పుట్టుకలేని; ధ్రువం = నిత్యమైన; సర్వ తత్త్వైర్ విశుద్ధం = సకల విధములైన ప్రకృతి వికారములనుండి ముక్తుడై; జ్ఞాత్వా = తెలుసుకొని; దేవం = భగవంతుని; ముచ్యతే = విడివడును; సర్వపాశైః = అన్నిపాపముల నుండి, సకల బంధనముల నుండి

భావము: యోగ యుక్తుడు ఆత్మయొక్క యథార్థ స్వభావముతో దీపమువలె, అనగా ప్రకాశస్వరూపముతో పరబ్రహ్మముయొక్క వాస్తవ స్వరూపమును దర్శించినప్పుడు అతడు పరమేశ్వరుని (పరమేశ్వరుడు సకల విధములైన ప్రకృతి వికారములు లేనివాడు, అతడు అజుడు, నిత్యుడు)

తెలిసికొని సర్వ పాపముల నుండి, సకల బంధనముల నుండి ముక్తుడగును.

వివరణము: పరాత్పరుని ఎట్లు తెలిసికొని యోగయుక్తుడు వీతశోకు డగు చున్నాడో ఈ మంత్రమున తెలుపబడినది.

"యదా ఆత్మ తత్త్వేన తు బ్రహ్మతత్త్వం దీప ఉపమేన ఇహ యుక్తః ప్రపశ్యేత్" ఏ స్థితియందు యోగయుక్తుడు స్వకీయ ఆత్మస్వరూప ముతో (ప్రకాశ స్వరూపముతో) బ్రహ్మతత్త్వమును చూచునో. యదా అనగా ఎప్పుడైతే ఎప్పుడైతే అనగా ఏ సమయమున. ఏ సమయమున అనగా ఏ అవస్థయందు, ఏ స్థితియందు. ఏ స్థితియందు యోగి ఆత్మతత్త్వము తో దర్శించునో; అనగా ఏదశలో యోగ యుక్తుడు స్వకీయ ఆత్మరూపము తో బ్రహ్మతత్త్వమును చూచునో, ఎటువంటి ఆత్మస్వరూపముతో చూచు ను? దీపోపమ, అనగా దీపము వంటి దీపస్థానీయేన ప్రకాశ స్వరూపేణ బ్రహ్మతత్త్వం ప్రపశ్యేత్, అనగా యోగయుక్తుడు ప్రకాశ స్వరూపముతో బ్రహ్మతత్త్వమును చూచును. 'తు' శబ్దోఽవధారణే 'తు' శబ్దము నిశ్చయార్థకము. పరమాత్మానం ఆత్మనైవ జానీయాత్ ఇతి అర్థః. పరమాత్మను ఆత్మ భావముతోనే తెలిసికొనవలెనని అర్థము, తదాత్మానమేవా వేదహం బ్రహ్మాస్మి. ఆ ఆత్మను తెలిసికొనుటకే నేను బ్రహ్మమును. కీదృశమ్, ఎటువంటి బ్రహ్మమును సాక్షాత్కరించుకొనును? అస్యస్మాత్ అజాయమానం ధ్రువం అప్రచ్యుత స్వరూపం సర్వతత్త్వైః అవిద్యా తత్కార్యైః విశుద్ధం అసంస్పృష్టం జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః అవిద్యాదిభిః" అన్యమునుండి ఉత్పత్తి కానటువంటిది; తన స్వరూపము నుండి నాశము లేనిది; సర్వవిధములైన ప్రకృతి వికారముల నుండి, అవిద్య నుండి, దాని కార్యములనుండి ముక్తమైనది; విశుద్ధమైనది; అసంస్పృష్టమైనది అగు పరమాత్మను (భగవంతుని) తెలిసికొని అవిద్యాది సర్వ బంధనముల నుండి, పాపములనుండి యోగ యుక్తుడు విముక్తుడగును.

"అజం ధ్రువం సర్వసత్త్వైః విశుద్ధం జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వ పాశైః."

"బ్రహ్మతత్త్వం అనగా బ్రహ్మము యొక్క యథార్థ స్వభావము". (The real nature of Brahman). 'తత్త్వం' అనే పదం సాంఖ్యవేదాంతానికి సంబంధించినది. తత్త్వం అంటే మూలతత్త్వం (Principle). ఒకదానిలో నుంచి మరొకటి ఉత్పన్నం కావడం. ఒక వస్తువు యొక్క తత్త్వాన్ని తత్త్వమంటారు.

పర బ్రహ్మతత్త్వానికి. ప్రకృతికి అతీతమైనది, అది త్రిగుణములకు అతీతమైనది. యోగి ఆత్మను సాక్షాత్కరించుకొనినపుడు అతడు కర్మబంధనములనుండి ముక్తుడగును.

ఆత్మ సాక్షాత్కారము మానవ జీవిత గమ్యము. ఈ పరమసత్యాన్ని ఉపనిషత్తులు పునః పునః ప్రబోధించుచున్నవి.

---

ఏష హ దేవః ప్రదిశోఽను సర్వాః
పూర్వో హ జాతః స ఉ గర్భే అంతః ।
స ఏవ జాతః స జనిష్యమాణః
ప్రత్యంగ్ జనాస్తిష్ఠతి సర్వతోముఖః ॥16॥

టీక: ఏషః = అతడు; హ = నిశ్చయార్థకము; దేవః = భగవంతుడు; ప్రదిశః = దిక్కులు; అను = సమీపమున; సర్వాః = అన్ని; పూర్వః = మొట్టమొదట; హ = నిజముగ; జాతః = పుట్టినవాడు; సః = అతడు; ఉ = నిశ్చయార్థకము; గర్భే = గర్భమున; అంతః = లోపల; సః = అతడు; ఏవ = నిశ్చయార్థకము; జాతః = పుట్టినవాడు; సః = అతడు; జనిష్యమాణః = పుట్టబోవువాడు; ప్రత్యంగ్ జనాః తిష్ఠతి = అంతర్యామిగ సకల జనులలో నిలచును; సర్వతోముఖః = సర్వత్ర చూచుచు. తన ముఖమును అన్ని దిక్కులయందు కలిగియుండుచు.

భావము: "అతడు వాస్తవములో సర్వప్రదేశములను వ్యాపించియుండు భగవంతుడు. అతడు మొట్టమొదట పుట్టినవాడు (హిరణ్యగర్భుడు). అతడు గర్భములోనికి ప్రవేశించియున్నాడు. అతడే పుట్టిన వాడుమరియు పుట్టబోవువాడు. అతడు విశ్వతో ముఖుడై, సకల జనులయందు అంతర్యామియై వెలయుచుండును.

వివరణము: "ఏష హ దేవః" అతడు వాస్తవములో సర్వప్రదేశములను వ్యాపించియుండు దేవుడు. పరమేశ్వరుడు వెలుగులకు వెలుగు. అతడు సచ్చిదానంద స్వరూపుడు. అతడు సత్యస్వరూపి. అతడు ప్రేమమయుడు, అతడుచైతన్య స్వరూపుడు, అతడు సర్వహృదయాంతర్వాసి. అతడు సర్వసాక్షి. అతడు సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు, సర్వగతుడు, పరమేశ్వరుడు విశ్వానికి, వేదాలకు యోని. అతడు సంకల్పప్రేరకుడు, అతడు జ్ఞానము, వైరాగ్యము, సౌందర్యము, ఐశ్వర్యము, కీర్తి, శ్రీ—వీనితో సదా అలరారు భగవంతుడు. అతడు భూత, భవిష్యత్, వర్తమానములలో ఎటువంటి మార్పులేనివాడు. అతడు నిత్యుడు శాశ్వతుడు, అవ్యయుడు, అవినాశి. అతడు తన స్వీయంలీల కోసము స్వప్రయోజన అభావే, సత్త్వరజస్తమోగుణముల ద్వారా ఈ జగత్తును సృష్టించెను. అతడు స్వతంత్రుడు, సత్యకాముడు, సత్యసంకల్పుడు. అతడు జీవుల కర్మఫల ప్రదాత. అతడు ప్రేమమయుడు, కరుణామయుడు. పరమేశ్వరుని శక్తి వలననే మనము చూచుచున్నాము, వినుచున్నాము, నడచుచున్నాము, అవిద్యవల్ల, అభిమానంవల్ల మన పరమేశ్వరుని మరచాం.

"ప్రదిశః అను సర్వాః" అతడు అన్ని దిక్కులందు వ్యాపించియున్నాడు అతడు సర్వగతుడు అతడు సర్వత్ర ఉన్నాడు. అతడు మనహృదంతరాళాల్లో ఉన్న స్వామి. అతని సామీప్యాన్ని మనం అనుభవించాలి. ఆ స్వామి సాక్షాత్కారంవల్లనే సంసార చక్రభ్రమణం ఆగుతుంది.

"పూర్వో హ జాతః" అతడే మొట్టమొదట పుట్టిన వాడు. అతడు హిరణ్యగర్భుడు. ఈశ్వరుడు కారణ బ్రహ్మము, హిరణ్యగర్భుడు కార్య

బ్రహ్మము. అన్ని జీవాత్మల. మొత్తాన్ని హిరణ్యగర్భుడు అంటారు. హిరణ్యగర్భుని సూత్రాత్మయని, కార్యబ్రహ్మమని పిలుస్తారు. హిరణ్యగర్భుడు, ప్రతి ప్రాణిలో నివసిస్తాడు.

"స ఉ గర్భే అంతః స ఏవ జాతః స జనిష్యమాణః ప్రత్యంగ్ జనాన్ తిష్ఠతి సర్వతోముఖః" అతడు గర్భములోన ప్రవేశించియున్నాడు. అతడే పుట్టినవాడు మరియు పుట్టబోవునాడు. అతడు విశ్వతోముఖుడై సకల ప్రాణికోటిలో అంతర్యామియై వెలయుచున్నాడు. హిరణ్యగర్భుడు మొట్ట మొదట పుట్టినవాడు. అతడు సర్వవ్యాపిగావున సర్వతోముఖుడని పిలువబడివాడు. గర్భములోనికి ప్రవేశించినవాడు. పుట్టినివాడు, పుట్టబోయేవాడు అన్నియూ అతడే. సర్వజనులలో అంతర్యామైయుండువాడు అతడే. అతడు సర్వతోముఖుడు కూడ.

భగవానుడు ఏ స్వార్థంతో ఈ సృష్టిచేశాడు? దయాసాగరుడగు ప్రభువు భగవానుడు, అతనిలో ఏ స్వార్థంలేదు. ఆ కరుణాసాగరుని ప్రేమయే ఈ సృష్టికి కారణం.

Thc act of creation is not motivated by any selfish. interest. It is spontaneous the overylow of god's nature (Swab hava) even as it is the nature of man to breathe in and out. God cannot help creating. the work of the world is not the result of chance or thoughtlessness, but is simply the outcome of god's nature Out of the fullness of his joy, God scatters abroad life and Power.

—— Swami Sivananda

సృష్టికార్యానికి వెనుక ఎటువంటి స్వార్థాసక్తి లేదు. మానవునకు ఊపిరి పీల్చడం, వదలడం ఎలా నైజమో, అలాగే సృష్టియనేది పరమేశ్వరుని ప్రేమ స్వభావము యొక్క నిర్విరోధ ప్రవాహమని చెప్పాలి. భగవంతుడు సృష్టిచేయకుండ ఉండలేడు జగత్ సృష్టి అనుకోకుండ జరిగినది కాదు. తెలివి

తక్కువగ జేసిన పని కాదు. అది కేవలం పరమేశ్వరుని ప్రేమ ప్రవాహం. ఆనందం పొంగి పొరలి, భగవంతుడు ప్రాణాన్ని, ప్రభావాన్ని అంతటా వెదజల్లినాడు.

—స్వామిశివానంద

సర్వాంతర్యామియైన పరమేశ్వరునకు ఋషిపుంగవుడు ఇట్లు హృదయ పూర్వక అభివాదము చేయుచున్నాడు.

యో దేవో అగ్నౌ యో అప్సు
యో విశ్వం భువనమావివేశ ।
యో ఓషధీషు యో వనస్పతిషు
తస్మై దేవాయ నమో నమః ॥ 17 ॥

టీక: యః = ఏ; దేవః = దేవుడు, భగవంతుడు; అగ్నౌ = అగ్ని యందు; యః = ఎవరు; అప్సు = నీటియందు; యః = ఎవరు; విశ్వం = సర్వము: భువనం = విశ్వమును; ఆవివేశ = ప్రవేశించినదో; యః = ఎవరు ఓషధీషు = వృక్షములలో; యః = ఎవరు; వనస్పతిషు = చెట్లలో; తస్మై = ఆ; దేవాయ = దేవునకు; నమోనమః = నమస్కారములు, వందనములు

భావము: అగ్నియందు, జలమునందు, ఓషధులందు, వృక్షములందు వెలసి, యావద్ విశ్వమును వ్యాపించియున్న పరమేశ్వరునకు నమస్కృతులు, వందనములు"

వివరణము: "యో దేవో అగ్నౌ యో అప్సు యో ఒషధీషు యో వనస్పతిషు" పరమేశ్వరుడు అగ్నియందు, జలమునందు, ఓషధులందు, వృక్షములందు అంతర్యామియై యున్నాడు. దశమాధ్యాయంలో కృష్ణ భగవానుడు ఇలా సెలవిస్తారు.

"వసూనాం పావకశ్చాస్మి". అష్ట వసువులలో నేనే అగ్నిహోత్రుడను "రసోహమప్సు కౌంతేయ" ఓకౌంతేయ! జలమునందు నేను రసమై (రుచియై)యున్నాను. "స్వధాఽహమహమౌషధం. నేనే స్వధా అను అన్నము. నేనే ఔషధము రోగమును శాంతింప జేయుటకు వైద్యులొసగు ద్రవ్యమును ఔషధమంటారు. ప్రాణులు భుజించు వరి, యవలు మొదలగు జీవులకు సామాన్యమైయుండు ఆహారమునుకూడ ఔషధమంటారు.
"అశ్వత్థః సర్వవృక్షాణాం." అన్ని వృక్షములలో అశ్వత్థవృక్షమును నేను

యో విశ్వం భువనం ఆవివేశ, ఎవరు యావద్ విశ్వమును వ్యాపించి యున్నాడో, అన్ని భూతములకు పరమేశ్వరుడే మూలబీజము,

"విష్ఠ భ్యాహమిదం కృత్స్నం ఎకాంశేస స్థితో జగత్" —గీతా. నేను ఈ విశ్వమునంతటిని ఒక్క అంశముచే వ్యాపించియున్నాను. Having Pervaded this entire universe with one fragment of Myself, I remain "తస్మై దేవాయ నమోనమః". ఆ పరమేశ్వరునకు నమస్కృతులు, వందనములు.

ఋషిపుంగవుడు పరాత్పరుని ఇలా ప్రార్థించుచున్నాడు.

"హే పరమ ప్రేమ స్వరూపా, దయాసాగరా,
హే అనంత పరమ శాంతి మహాసాగరా.
నీవే వరుణ ఇంద్ర బ్రహ్మరుద్రాదులు;
నీవే బంధు మిత్ర మాతా పితరులు,
నీవే నీలాకాశము, తారా చంద్రులు.
జేజేలు పలుమారులు నీకు జేజేలు.
నీవు వెలుపల, లోన, పైన, పాతాళాన.
ముందు, వెనుక, చుట్టు, అన్ని దిక్కులలోన.
అంతర్యామివై, సాక్షివై, యున్నావు.
నీకు జయము, ప్రభూ, జయము జయము నీకు

నీవు సర్వవ్యాపివి, సర్వగాత్రుడవు.
పూలమాలలోని దారమువలె సూత్రాత్మవు.
నీవే ప్రాణము. చేతనము. చైతన్యము
సర్వనామ రూపములలో నిన్ను చూడనిమ్ము.
దేవాదిదేవ, అనంతజ్యోతీ, చిద్ఘన స్వరూపా,
నా దృష్టిని కప్పిన అజ్ఞానపు తెరను తొలగించు.
నీతో నేను ఏకత్వాన్ని పొందుటకు నన్ను అనుగ్రహించు.

నమః నమః అని రెండుసార్లు చెప్పడం అధ్యాయ పరిసమాప్తిని సూచిస్తుంది.

నమః పురస్తాదథ పృష్ఠ తస్తే
నమోఽస్తుతే సర్వత ఏవ సర్వ ।
అనంత వీర్యామిత విక్రమస్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః ॥

— గీతా

ఓ విశ్వరూపా! నీకు పురోభాగమున నమస్కృతులు. నీకు పృష్ఠ భాగమున నమస్కృతులు. నీకు అన్ని కడల నమస్కృతులు, నీవు అనంత వీర్యుడవు నీవు అమిత విక్రముడవు. నీవు అంతట వ్యాపించి సకల స్వరూపుడవై యున్నావు,

బ్రహ్మము ఈ సకల దృగ్విషయముల వెనుక యున్నాడు. అతడు సర్వ నామ రూపము లందున్నాడు. అతడు సమస్తానికి అధిష్ఠానం, అతడు సర్వానికి ఆధారం, ఆలంబనం, అందువల్ల అందరి కర్తవ్యం ఆ పరమేశ్వరుని ధ్యానించుటయే.

న ధనం న జనం న సుందరీం
కవితాం వా జగదీశ కామయే ।
మమ జన్మని జన్మనీశ్వరే
భవతు తద్భక్తిర్ అహైతుక త్వయి ॥

ఓ విశ్వనాథా! నేను ధనాన్ని కోరడం లేదు; జనాన్ని కావాలనడం లేదు; సురూపవతిని వాంఛించడం లేదు; కవిని కావాలి అని అనుకోవడంలేదు జన్మజన్మాలలో. ఓ పరాత్పరా. నీ పాదకమలములందు నాకు నిష్కామ భక్తి ఉండాలని నేను ఆక్రోశిస్తున్నాను.

ఇతి శ్వేతాశ్వతరోపనిషద్ భాష్యే
ద్వితీయోఽధ్యాయః

# తృతీయ అధ్యాయః

## మూడవ అధ్యాయము

యఏకో జాలవానీశత ఈశనీభిః
సర్వాం ల్లోకానీశత ఈశనీభిః ।
య ఏవైక ఉద్భవే సంభవే చ
య ఏతద్విదురమృతాస్తే భవంతి ॥1॥

టీక: యః = ఎవడు; ఏకః = ఒకటి, పరమాత్మ; జాలవాన్ = మాయావి; (జాలం = మాయ); ఈశత = పరిపాలించును; ఈశనీభిః = తన శక్తుల ద్వారా; సర్వాన్ = సమస్త, అన్ని; లోకాన్ = ప్రపంచములను; ఈశత = ఏలును; ఈశనీభిః = తన ఈశ్వరీయ శక్తులతో; యః = ఎవడు; ఏవ = మాత్రము; ఏక = ఒకటి; ఉద్భవే = సృష్టి సమయమున; సంభవే = ప్రళయకాలమున; చ = మరియు; యః ఎవడు; ఏతత్ = ఆతనిని; విదుః = తెలిసికొనును; అమృతాః = అమరులు, అమృతులు; తే = వారు; భవంతి = అగుదురు.

భావము: కేవలము తన పరమ శక్తులతో ఎవడు పరిపాలించునో, సర్వ లోకములను తన అద్భుత శక్తులతో ఎవడు పరిపాలించునో, యీ జగత్తుల సృష్టి సమయమున, సంహారకాలమున ఎవడు అద్వయుడై వెలుగొందునో— ఆతనిని (ఆ పరమాత్మను) తెలుసుకొనువారు అమృతులగుదురు.

వివరణము; ఈ అధ్యాయంలో పరమాత్మ రుద్రుడుగా, ఈశుడుగా సూచింపబడినాడు. పరబ్రహ్మము స్వీయ మాయా సృజనాత్మక శక్తులతో విలసిల్లి ఈశుడుగా వర్ణింపబడినాడు.

"యః ఏకః జాలవాన్ ఈశత ఈశనీభిః" ఏ మాయావియగు పరమాత్మ తన పరమశక్తులతో పాలించున్నో యః ఏకః అనగా ఎవడు అద్వితీయుడో, అనగా అద్వితీయుడగు పరమాత్మయో ఆ పరమాత్మ జాలవాన్. అతడు మాయావి. జాలము అనగా"వల. 'జాలము' అంటే మాయ. అది దాటశక్యము కానిది కనుక దానిని జాలం అనడం సమంజసం. మాయ దురత్యయ మైనది. అది దాటుటకు శక్యముకానిది, భగవానుడు గీతలో ఇలా సెలవిస్తారు: "మమ మాయా దురత్యయా" నా మాయ ఎవరికిని దాటశక్యము కానిది. పరమేశ్వరుడు మాయావి. అతడు మాయతో గూడినవాడు, మాయ సర్వదా అతని వశంలో ఉంటుంది. "ఈశత" అంటే పరిపాలించు. పరమేశ్వరుడు, అనగా అద్వితీయ బ్రహ్మము ఈ విశ్వాన్ని ఎలా పరిపాలిస్తాడు? "ఈశనీభిః" అంటే తన స్వంత పరమశక్తులతో పరిపాలిస్తాడు పరమేశ్వరుడు సర్వశక్తి మంతుడు అతడు ఏకైక పాలకుడు.

"సర్వాన్ లోకాన్ ఈశత ఈశనీభిః. ఎవడు సర్వలోకములను తన అద్భుత శక్తులతో పరిపాలించునో. "సర్వాన్ లోకాన్" అంటే అన్ని లోకాలను. పరమేశ్వరుడు సకల లోకాల్ని తన అద్భుతమైన శక్తులద్వారా పరిపాలిస్తాడు. అతడు సకల భువన పాలకుడు.

"యః ఏవ ఏక ఉద్భవే సంభవే చ" ఎవడు ఈ జగత్తుల సృష్టి సమయమున; సంహార కాలమున అద్వయుడై వెలుగొందునో. పరమేశ్వరుడు 'ఏకః'

అతడు అద్వయుడు. అవిక్రియుడు, అనగా ఎటువంటి వికారము, మార్పులేనటువంటివాడు, 'ఉద్భవే సంభవే చ' అనగా ప్రపంచ సృష్టి సమయంలోగాని దాని ప్రళయ వేళలోగాని, పరమేశ్వరుడు ఈ ప్రపంచాల్ని సృష్టించేటప్పుడు గాని, వాటిని సంహారమొనర్చునప్పుడు గాని అతడు ఎటువంటి వికారాన్ని మార్పును పొందడు. అతడు సర్వదా అఖండ వైభవంతో అవిక్రియుడై యుంటాడు. అతడు దేశ కాల కారణాలచే అపరిచ్ఛిన్నుడై శోభిలుతాడు.

"యః ఏతత్ విదుః అమృతాః తే భవంతి." ఎవరు ఆ పరమాత్మను తెలుసుకొందురో వారు అమృతులు అగుదురు. "యః ఏతత్ విదుః" ఎవరు ఈ విషయమును తెలుసుకొందురో, అనగా ఎవరు పరమేశ్వరుని సాక్షాత్కారం చేసుకొంటారో వారు అమృతాః భవంతి, అమృతులు అగుదురు. అటుల పరమేశ్వరుని సాక్షాత్కారము చేసుకొనినవారు అమృతత్త్వమును పొందుదురు.

"జాలవాన్" అంటే సగుణ బ్రహ్మము. మాయాసహితుడు సగుణ బ్రహ్మము మాయ సగుణ బ్రహ్మమునకు ఉపాధి. మాయ సగుణ బ్రహ్మమునకు కారణ శరీరం. సగుణ బ్రహ్మము సోపాధిక బ్రహ్మము. మాయ ఎల్లప్పుడూ సగుణ బ్రహ్మము వశంలో ఉంటుంది. "వాస్తవంలో సగుణ బ్రహ్మము నిర్గుణ బ్రహ్మము ఒకటే, తాదాత్మ్యమే. సత్—చిత్—ఆనందము బ్రహ్మమునకు స్వరూప లక్షణము. సర్వజ్ఞత్వం, సర్వవ్యాపిత్వం, సర్వశక్తిమత్వం మొదలగునవి బ్రహ్మమునకు తటస్థ లక్షణాలు.

నిర్గుణ బ్రహ్మము మాయారహితుడు. అతనికి ఏ యుపాధి లేదు అతడు నిరుపాధిక బ్రహ్మము. ఇటువంటి నిర్గుణ, నిరుపాధిక, మాయారహిత, అద్వితీయ పరబ్రహ్మము సగుణ, సోపాధిక, మాయా సహిత ఈశ్వరుడుగ ఎందులకు అయ్యాడు? ఈ ప్రశ్నకు సమాధానం: భాగవతోత్తముల పవిత్రమైన ధ్యానంకోసం నిర్గుణ బ్రహ్మము సగుణ బ్రహ్మము ఔతడు. the same Impersonl Absolute becames the personal God for the pious meditation of the devotees. మాయ అనేది పరమేశ్వరుని అనిర్వచనీయశక్తి అది ఈ జగత్తుకు కారణం.

ఏకో హి రుద్రో న ద్వితీయాయ తస్థుః
య ఇమాంల్లోకానీశత ఈశనీభిః।
ప్రత్యంగ్ జనాం స్తిష్ఠతి సంచుకోచాంతకాలే
సంసృజ్య విశ్వా భువనాని గోపాః ॥2॥

టీక: ఏక = ఒక; హి = నిశ్చయముగ; రుద్రః = రుద్రుడు; న = లేదు; ద్వితీయాయ = మరొకటి; తస్థుః = ఉన్నాడు; యః = ఎవడు; ఇమాన్ = ఈ; లోకాన్ = జగత్తులను; ఈశత = నియమించు' పాలించు; ఈశనీభిః = తనయొక్క అకుంఠిత శక్తులచే; ప్రత్యంగ్ = సర్వుల; జనాన్ = జనులలో; తిష్ఠతి = నిలుచున్నాడు; సంచుకోచ = తనలోనికి లాగుకొను; అంతకాలే = ప్రళయకాలమున; సంసృజ్య = సృష్టించి; విశ్వా = సమస్తమైన; భువనాని = ప్రపంచములను; గోపాః = కాపాడును.

భావము: తన యఖండమైన, అప్రమేయమైన శక్తులతో సకల జగత్తులను పరిపాలించునట్టి రుద్రుడు ఒక్కడే. రెండవవాడు అతని ప్రక్కన మరొకడు లేడు. అతడు సకల ప్రాణుల హృదయములలో ఉన్నాడు. అతడు సమస్త లోకములను సృష్టించి, వాటిని కాపాడి, తుట్టతుదియందు వాటిని తన లోనికి లాగుకొను చున్నాడు.

వివరణము: ఏకః హి రుద్రః. నిశ్చయముగ ఉన్నది రుద్రుడొకడే. రుద్రః అంటే రుద్రుడు, ఈ మంత్రంలో రుద్రుడు అంటే పరిపూర్ణుడు, అనంతుడు. పరమాత్మ, పరబ్రహ్మము. శివునకు మరొకపేరు రుద్రుడు, భక్తులయొక్క పాపాలను ధ్వంసంచేసి, వారి కష్టాలను తొలగించి, వారికి జ్ఞానాన్ని, ఆనందాన్ని ప్రసాదించేవాడు రుద్రుడు. సర్వహృదయాంతర్వాసి రుద్రుడు, అతడు మానవులకర్మల్ని, సంకల్పాల్ని సాక్షిమాత్రుడుగ చూస్తుంటాడు. అతడు మానవులకు వారికర్మఫలాలను పంచిపెడుతాడు. బ్రహ్మవిదులు ఈ ఏకైక రుద్రునే ఆశిస్తారు వారు అన్య దేవతలను కోరరు.

"న ద్వితీయాయ తస్థుః" అనగా పరమార్థ దర్శిములు రుద్రునకు అన్యముగ మరొక దానిని కోరరు, చూడరు. ఉన్నది రుద్రుడొకడే. ద్వితీయము అన్యము, ఇతరము లేదు. ఆ రుద్రుడే (పరమాత్మయే) తన అమోఘ శక్తుల ద్వారా భువనముల నన్నింటిని పాలిస్తాడు. "యః ఇమాన్ లోకాన్ ఈశత ఈశనీభిః"

"ప్రత్యంగ్ జనాన్ తిష్ఠతి." ఆ రుద్రభగవానుడు సర్వజనులలో ఉంటున్నాడు. అతడు సర్వులలో భాసించుచున్నాడు. "రూపం రూపం ప్రతి రూపో బభూవ" రుద్రపరమాత్మ సర్వనామ రూపములందున్నాడు.

"సంచుకోచ అంతకాలే" రుద్రపరమాత్మ ప్రళయ కాలమున సమస్త భువనములను తనలోనికి లాగుకొనును.

"సంసృజ్య విశ్వా భువనాని గోపాః" రుద్రుడు సకల భువనాలను సృష్టిస్తాడు. అతడు వాటిని కాపాడుతాడు, రక్షిస్తాడు. తరువాత ప్రళయకాలంలో వానిని సంచుకోచ, తనలో లీనంచేసుకొంటాడు; అతడు ఇదంతా తన యచింత్య మాయాశక్తి ద్వారా చేస్తాడు.

తరువాతి మంత్రంలో విరాట్ రూపుని స్థితి, జగత్ కర్తృత్వము ప్రతిపాదింపబడుతున్నాయి.

---

విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో
విశ్వతోబాహురుత విశ్వతస్పాత్ ।
సంబాహుభ్యాం ధమతి సంపతత్రైః
ద్యావాభూమీ జనయన్దేవ ఏకః ॥3॥

టీక: విశ్వతః చక్షు = ప్రతిచోట కన్నులుగల్గి; ఉత = అహో ఆశ్చర్యకరము; విశ్వతోముఖః = ప్రతిచోట ముఖముగల్గి; విశ్వతఃబాహు: = ప్రతిచోట బాహువులుగల్గి; ఉత = అహో; విశ్వతఃపాత్ = ప్రతిచోట పాదములుగల్గి; సంబాహుభ్యాం = బాహువులతో; ధమతి = సంయోజయతి, కూర్చును; సంపతత్రైః = రెక్కలతో; ద్యావాభూమీ = స్వర్గమును; భూమిని; జనయన్ = పుట్టించునపుడు; దేవ = దేవుడు; ఏకః = అయేకైక.

భావము: సర్వత్ర తన నేత్రములు, తన వదనము, తన బాహువులు, తన పాదములు కల్గి ఆ యేకైక దేవుడు స్వర్గ మర్త్యలోకములను సృజించునపుడు, వానిని తన బాహువులతోను, తన పక్షములతోను సంయోజన మొనర్చును

వివరణము: "విశ్వతః చక్షుః ఉత". అనగా అన్నిచోట్ల కన్నులు గలవాడు "సర్వప్రాణిగతాని చక్షూంసి అస్యేతి విశ్వతః చక్షుః" సమస్త ప్రాణుల నేత్రములు ఈ పరమాత్మవే అయిఉన్నవి. అందువల్ల ఆతడు విశ్వతః చక్షువు అనబడుచున్నాడు. "అతః స్వేచ్ఛయైవ సర్వత్ర చక్షూ రూపాదౌ సామర్థ్యం విద్యత ఇతి విశ్వతః చక్షుః" అతనియొక్క కేవల సంకల్పమువలననే అన్నిచోట్ల నేత్రములకు రూపాదులను చూచు సామర్థ్యం గలవగుటచే అతడు విశ్వతః చక్షువు అనబడు చున్నాడు.

"విశ్వతోముఖః విశ్వతోబాహుః ఉత విశ్వతః పాత్." సర్వత్ర ముఖములు గలవాడు, ఎల్లెడల బహువులు గలవాడు, ప్రతిచోట పాదములు గలవాడు, సమస్త ప్రాణుల వదనములు ఈ పరమాత్మవే అయి వున్నవి. అందువల్ల అతడు విశ్వతోముఖుడు అనబడు చున్నాడు. సకల ప్రాణుల బాహువులు ఈ పరమాత్మవే అయివున్నవి. అందువల్ల అతడు విశ్వతో బాహువు అనబడుచున్నాడు. అన్ని జీవరాసుల పాదములు ఈ పరమాత్మవే అయివున్నవి. అందువల్ల అతడు విశ్వతఃపాత్ అని పిలువబడుచున్నాడు.

"సంబాహుభ్యాం ధమతి సంపతత్రైః అనగా తన బాహువులతోను, తన పత్రములతోను అతడు సంయోజన మొనర్చును. "పక్షిణశ్చ ధమతి ద్విపదో మనుష్యాదీంశ్చ పతత్రైః. పరమేశ్వరుడు తన బాహువులతో మనుష్యలను కలుపుతాడు. అలాగే అతడు పక్షులను తన పక్షములతో కలుపుతాడు "ధమతి" అనే పదం యొక్క ధాతువునకు అనేక అర్థాలు ఉన్నాయి, ఇచ్చట దానికి అర్థం "సంయోజయతి" అని చెప్పుకోవాలి. సంయోజయతి అంటే కూర్చు, కలుపు, ఒకటిచేయు. ధమతి అంటే Join fuse,

"ద్యావాభూమీ జనయన్ దేవ ఏకః." ఆ యేకైక దేవుడు స్వర్గాన్ని, మర్త్యాని సృష్టిస్తాడు, "ద్యావాపృథివీ జనయన్ దేవ ఏకః విరాజం సృష్టవాన్ ఇతి అర్థః." అతడు స్వర్గలోకాన్ని, భూలోకాన్ని. సృష్టియొనర్చిన వాడు. అతడు ఏకమాత్ర దేవుడు, విరాట్ పురుషుడు, అతని రచన యిది యంతా.

విరాట్టు ఈ ప్రపంచానికి సృష్టికర్త. అన్ని నేత్రాలు, అన్ని ముఖాలు, అన్ని చేతులు, అని కాళ్ళు, అతనివే, సకల జీవులయొక్క అన్ని స్థూలదేహాల వెరసియే విరాట్‌పురుషుడు. Virat Purusha is the sum total of all Physical bodies of Jivas.

యో దేవానాం ప్రభవశ్చోద్భవశ్చ
విశ్వాధిపో రుద్రో మహర్షిః ।
హిరణ్యగర్భం జనయామాస పూర్వం
స నో బుద్ధ్యా శుభయా సంయునక్తు ॥4॥

టీక: యః = ఎవడు; దేవానాం = దేవతలకు; ప్రభవః = సృష్టికర్త; చ = మరియు; ఉద్భవః = ఆధారభూతుడు; చ = మరియు: విశ్వాధిపః = అందరికి ప్రభువు; రుద్రః = రుద్రుడు; మాహర్షి = గొప్ప

ఋషి; హిరణ్యగర్భం = హిరణ్యగర్భుని జనయామాస = పుట్టించెనో; పూర్వం = మొట్టమొదట; సః = ఆతడు న = మాకు; బుద్ధ్యా = బుద్ధితో: మేధస్సుతో; శుభయా = పరిశుద్ధమైన, నిర్మలమైన; సం యునక్తు = సంయుతుల మగునట్లు చేయుగాక.

భావము: దేవతలను సృష్టించినట్టియు వారిని కాపాడునట్టియు; మహాద్రష్టయు, విశ్వాధిపుడును, ఆదిలో హిరణ్యగర్భుని పుట్టించినట్టియు రుద్ర భగవానుడు మమ్ములను సత్సంకల్ప సంయుతులమగునట్లు (పరిశుద్ధమైన బుద్ధి సమన్వితులమగునట్లు) చేయుగాక!

వివరణము: "యః దేవానాం ప్రభవం చ ఉద్భవః చ", ఎవడు దేవతల యుత్పత్తికి, ఆధారమునకు హేతువో దేవతల ఉత్పత్తికి రుద్రభగవానుడు. దేవతలు అంటే ఇంద్రియములు. అనగా రుద్రుడు ఇంద్రియాదుల ఉత్పత్తికి, ఉద్భవమునకు హేతువై యున్నాడు.

"విశ్వాధిపః రుద్రః మహర్షిః". అతడు అందరికి ప్రభువు. రుద్రుడు మహర్షి. విశ్వాధిపః అనగా సర్వమునకు ప్రభువు, రుద్రుడు విశ్వమున కంతటికి స్వామి అతడువిశ్వనాధుడు. అతడు సమస్త భువనములను పాలించు స్వామి. అతడు జగన్నాధుడు, లోకనాధుడు. రుద్రః అనగా రుద్రుడు. భక్తుల పాపములను నాశమొనర్చి, వారి కడగండ్లను బాపు స్వామి రుద్రుడు. అంతియే గాదు. తన భక్తులకు విజ్ఞాన ఆనందములను అందించు స్వామి రుద్రుడు. శివునకు మరొకపేరు రుద్రుడు. ఈ మంత్రమున రుద్రుడు అనగా పరబ్రహ్మము. మహర్షి అనగా సర్వజ్ఞుడైన ద్రష్ట. అతడు గొప్ప దర్శనుడు. అతడు క్రాంత దర్శి. అతడు సర్వవిత్ అతడు మానవుల సంకల్పములను సాక్షియై చూచును. అందువల్ల జీవుల కర్మఫలాలను న్యాయమైన రీతిలో పంచగలిగిన స్వామి యతడు.

"హిరణగర్భం జనయామాస పూర్వం," అనగా సర్గాదౌ (సృష్టియారంభములో) రుద్రుడు హిరణ్యగర్భుని పుట్టించెను. "హితం రమణీయం అతి ఉజ్జ్వలం జ్ఞానం గర్భః అంతఃసారో యస్య తం (హిరణ్యగర్భం)

జనయామాస పూర్వం సర్గాదౌ." ఏవని గర్భము, అనగా అంతస్సారము రమణీయమైన, అనగా అత్యంత ఉజ్జ్వల జ్ఞానమయి యున్నదో అతడు హిరణ్యగర్భుడు అతనిని పరమేశ్వరుడు సృష్ట్యారంభముననే తొలుదొల్త సృజించెను, హిరణ్యగర్భుడు విశ్వాత్మ. అతడు విశ్వమనస్సు. అతడు విశ్వప్రాణము. అతడు బంగారు అండము అతడు బ్రహ్మ.

"సః నః బుద్ధ్యా శుభయా సంయునక్తు" అతడు మమ్ము శుభ బుద్ధి సమన్వితులమగునట్లు చేయుగాక. ఇది బ్రహ్మజిజ్ఞాసువు రుద్రునకు చేయుచున్న ప్రార్థన. ఉపాసకుడు పరిశుద్ధమైన, మంగళకరమైన, సూక్ష్మమైన బుద్ధిని తనకు ప్రసాదించవలసినదిగ రుద్ర పరమాత్మను ప్రార్థించుచున్నాడు. సత్యాన్వేషి నిర్మలమైన, కుశాగ్రమైన, సుసూక్ష్మమైన బుద్ధితో మాత్రమే సుసూక్ష్మమైన నిరంజనమైన, పరమాత్మను దర్శింపగలడు. 'ఈ ఆత్మ సర్వ భూతములలో (ప్రాణులలో) దాగియున్నది, అందుచే అది ప్రకాశింపదు, వ్యక్తము కాదు, కాని, దానిని సూక్ష్మదర్శనులైన వారు తమ సునిశితమైన, సుసూక్ష్మబుద్ధిచే దర్శింపగలుగుచున్నారు' అని కఠోపనిషత్తునందు తెలియ జేయబడియున్నది.

ఏష సర్వేషు భూతేషు
గూఢోఽఽత్మా న ప్రకాశతే ।
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా
సూక్ష్మయా సూక్ష్మ దర్శిభిః ॥ **III** - 12 కఠోపనిషత్తు.

తరువాతి రెండు మంత్రములు సైతము రుద్రునకొనర్చు ప్రార్థనా మంత్రములై యున్నవి.

ఇదే మంత్రము, అనగా మూడవ అధ్యాయమునందలి నాల్గవ మంత్రం, నాలుగ అధ్యాయములో (12 వ మంత్రము చూడుము) పునర్వచింపబడినది.



యా తే రుద్ర శివా
తనూరఘోరాఽ పాపకాశినీ ।
తయా నస్తనువా శంతమయా
గిరి శంతాభిచాకశీ హి ॥5॥

టీక: యా = ఏమి; తే = నీ యొక్క; రుద్ర = ఓ రుద్ర భగవన్; శివా = మంగళకరమైన, శుభప్రదమైన; తనుః = శరీరము; అఘోరా = భయంకరము కానటువంటి; అ పాపకాశినీ = పుణ్యమగు దానిని వ్యక్తమొనర్చు నట్టి; తయా = దానిచే; నః = మాకు; తనువా = ఆకారమును; శంతమయా = శాంతమయమయిన, అనుగ్రహప్రదమైన; గిరిశంతా = పర్వతములలో నివశించు స్వామీ; అభిచాకశీహి = మాకు దర్శన మిమ్ము, మాకు కనబడుము ,మమ్ము చూడుము.

భావము. ఓ రుద్రపరమాత్మా! మంగళప్రదమైన, ప్రశాంతమైన, పుణ్యప్రకాశమైన నీదు దివ్యానుగ్రహ ప్రదాయక సుస్వరూపముతో, ఓ గిరిశంతా! మాకు దర్శనమిమ్ము.

వివరణము: "యా తే రుద్ర శివా తనుః అఘోరా అ పాపకాశినీ" హే రుద్ర భగవన్, నీదు దివ్యస్వరూపము శుభప్రదమైనది, ప్రశాంతమైనది. పుణ్యప్రకాశనమైనది. రుద్ర. అనగా ఓరుద్ర పరమాత్మా రుద్రునకు రెండు రూపాలు ఉన్నాయి. ఒకటి ప్రశాంతకరమైన శాంత స్వరూపము. రెండవది భయంకరమైన ఘోర రూపము, "ఉక్తం చైతస్యైతే తనువౌ ఘోరాన్యా శివాన్యా" ఇతి'' 'శివా' అనగా శుభదాయకమైన. శివా అనగా శుద్ధమైనది, అవిద్యనుండియు. దాని కార్యములనుండియు వినిర్ముక్తమైన సచ్చిదానంద అద్వితీయ బ్రహ్మరూపము అది. మరియు అది వికృతమైనది, భయంకర మైనది, ఘోరమైనది కాదు. ఆ రుద్రుని రూపము పూర్ణ చంద్ర బింబము వోలె ఆహ్లాదకరమైనది, అపాపకాశినీ, అనగా పాపములను నాశమొందించు

నట్టిది. "స్మృతిమాత్ర అఘ నాశినీ, పుణ్య అభివ్యక్తకరీ" స్మరణమాత్రముచే పాపములను నాశముచేయునది, పుణ్యమును అభివ్యక్తము చేయునది.

"తయా నః తనువా శంతమయా గిరిశంతా అభి చాకశీహి" ఓ పర్వతమున నివసించు స్వామీ, మాకు నీదు దివ్యానుగ్రహ ప్రదాయకమైన శాంతమయ స్వరూపముతో దర్శనమిమ్ము. 'గిరిశంత' అనగా పర్వతనివాసీ. "హే గిరిశంత గిరౌ స్థిత్వా శం సుఖం తనోతీతి", ఓ గిరిశంత, పర్వతమున నుండి సుఖములను కలుగజేయువాడవు నీవు. హిమాలయములందలి హిమ శిఖరాలతోగూడిన కైలాస పర్వతమున నివసిస్తాడు శివుడు. అందువల్ల సత్యాన్వేషి పరమేశ్వరుని హే గిరిశంత యని సంబోధిస్తున్నాడు. అభి చాకశీహి అనగా దర్శనమొసగుము. "అభిచాకశీహి అభిపశ్య నిరీక్షస్వ శ్రేయసా నియోజయస్వ ఇత్యర్థః, మమ్ములను చూడుము, మాపై నీదు కరుణారస దృష్టిని ప్రసరింపుము. మమ్ము కల్యాణ మార్గములో సంయుక్త పరచుము. మరియు, ఓ ప్రభో

యామిషుం గిరిశంత
హస్తే బిభర్ష్యస్తవే ।
శివాం గిరిత్ర తాం కురు
మా హింసీః పురుషం జగత్ ॥6॥

టీక: యాం = ఏమి; ఇషుం = బాణము; గిరిశంత = గిరౌ స్థిత్వాసుఖం తనోతి. పర్వతమున నివసిస్తూ, సుఖమును పంచువాడా; హస్తే = నీ చేతియందు; బిభర్షి = దాల్చియున్నావు, ధరించి యున్నావు; అస్తవే = బాణమును వేయుటకు; శివాం = మంగళ ప్రదమైన; గిరిత్ర = పర్వత రక్షకా; తాం = దానిని; కురు = చేయుము; మా = వద్దు; హింసీః = హింసించు; పురుషం = మానవుని; జగత్ = ప్రపంచమును.

భావము: ఓ పర్వత స్వామీ! ప్రయోగార్థము సిద్ధముగ నీదు హస్తమున నున్న బాణమును మాకు శుభంకర మొనర్పుము. ఓ గిరిరక్షకా! మానవుని గాని! ఈ ప్రపంచమును గాని. హింసింపకుము.

వివరణము: "యాం ఇషుం గిరిశంత హస్తే బిభర్షి అస్తవే", హేగిరిశంత, బాణమును వేయుటకు సిద్ధమై నీ హస్తమున సాయకమును ధరించి యున్నావు. 'ఇషుం' అనగా బాణమును. ఇది ఏమి బాణము? ఇది 'తత్వమసి' మహావాక్యం అనే బాణము ఉపనిషత్తులలో నాలుగు మహా వాక్యాలు ఉన్నాయి, మొదటిది: "ప్రజ్ఞానం బ్రహ్మ" (చైతన్యమే బ్రహ్మము) దీన్ని స్వరూప బోధవాక్యం అంటారు. అనగా ఈ మహావాక్యం బ్రహ్మము యొక్క స్వభావాన్ని వివరిస్తుంది. ఇది ఋగ్వేదానికి సంబంధించిన ఐతరేయ ఉపనిషత్తులో ఉంది.

రెండవది: "అహం బ్రహ్మాస్మి" (నేను బ్రహ్మమును) దీన్ని అనుసంధాన వాక్యం అంటారు జిజ్ఞాసువు తన మనస్సును 'నేను బ్రహ్మము' అనే అభిప్రాయంపై లగ్నం చేయడానికి యత్నిస్తాడు ఇది యజుర్వేదాంతర్గత బృహదారణ్యక ఉపనిషత్తులో ఉంది.

మూడవది: "తత్త్వమసి" (అదియే నీవు). దీన్ని ఉపనిషద్ వాక్యం అంటారు. గురు తన శిష్యునకు ఇలా బోధచేస్తాడు: 'వత్సా, నీవు అదియే. తత్వమసి, నీవు బ్రహ్మము. దీన్ని తెలుసుకొని ముక్తుడవగుము.' ఈ మహా వాక్యం సామవేదానికి సంబంధించిన ఛాందోగ్యోపనిషత్తులో ఉంది.

నాల్గవది: "అయం ఆత్మా బ్రహ్మ" (ఈ ఆత్మ బ్రహ్మము), దీన్ని అనుభ బోధ వాక్యం అంటారు. ఇది జీవ బ్రహ్మైక్యాన్ని తెలుపుతుంది. నిది ధ్యాసనము ద్వారా జిజ్ఞాసువు పడసిన అపరోక్షానుభూతిని వచిస్తుంది ఈ మహా వాక్యం. అథర్వ వేదానికి చెందిన మాండూక్య ఉపనిషత్తులలో ఈ మహా వాక్యం ఉంది.

లేదా ఈబాణాన్ని ఓంకారమని కూడచేప్పవచ్చు. పరిశుద్ధ హృదయంతో ఓం (ఓంకారమే పరమాత్మ) ద్వారా తన మనస్సును పరమాత్మపై లగ్నం చేయాలి. ఓంకారము. బ్రహ్మము ఆత్మ తాదాత్మ్యమని ఉపనిషత్తులు ఉద్ఘోషిస్తున్నాయి.

మహావాక్య అనుసంధానం కాని, ప్రణవ ధ్యానం కాని అజ్ఞానాన్ని తొలగిస్తుంది భక్తుల అజ్ఞానాన్ని నాశం భగవంతుని ప్రబలాయుధం ఈ బాణం' తత్త్వమసి బాణం. ప్రణావశరం.

"గిరిశంత" అనగా ఓ పర్వతముల ప్రభూ. శివుడు కైలాసాధిపతి. అతడు భక్తుల అజ్ఞానాన్ని నాశం చేసేందుకు చేత దాల్చిన అమోఘ ఆయుధం ప్రణావశరం, తత్త్వమసి బాణం.

గిరిత్ర అనగా పర్వతాన్ని రక్షించువాడు. గిరత్ర గిరిం త్రాయత ఇతి గిరిత్ర. గిరిశంత యని సంబోధించుచు భక్తుడు పరమేశ్వరుని శాంతింపగోరు చున్నాడు, అనుగ్రహించ వేడుచున్నాడు నరులనుగాని, ప్రపంచాన్ని గాని హింసింపవలదని భగవంతుని వేడుకొనుచున్నాడు.

"సాకారం బ్రహ్మ ప్రదర్శయేతి అభిప్రేతం అర్థం ప్రార్థితవాన్." మాకుసాకార బ్రహ్మదర్శనము కలుగజేయుము' అని ఈ ప్రార్థనాభి ప్రాయము.

సగుణబ్రహ్మమును సాక్షాత్కరించుకొనినవాడు క్రమ ముక్తిని పద యునని తరువాతి మంత్రమున చెప్పబడుచున్నది.

తతః పరం బ్రహ్మపరం బృహంతం
యథానికాయం సర్వభూతేషు గూఢమ్ ।
విశ్వస్యైకం పరివేష్టితారం
ఈశం తం జ్ఞాత్వా అమృతా భవంతి ॥7॥

టీక: తతః = దానికంటె, సగుణ పర బ్రహ్మము కంటె; పరం = శ్రేష్ఠమైనది; బ్రహ్మ = బ్రహ్మము; పరం = ఉన్నతతరమైన; బృహంతం = అనంతము; యథానికాయం = దేహముల ప్రకారము; సర్వభూతేషు = అన్ని ప్రాణులలో; గూఢం = నిహితమైయున్నది. దాగియున్నది; విశ్వస్య = విశ్వముయొక్క; ఏకం = ఏకైక. ఒకటే; పరివేష్టితారం = వ్యాపకుడు; ఈశం = ప్రభువును, భగవంతుని; తం = అతనిని; జ్ఞాత్వా = తెలిసికొని; అమృతా = అమరుడు, అమృతుడు; భవంతి = అగును.

భావము: ఈ సగుణ బ్రహ్మమున కంటే ఉత్కృష్టతరమైనది పరబ్రహ్మము ఆ పరబ్రహ్మము అనంతుడు. అతడు సర్వప్రాణులలో వాటి దేహముల ననుసరించి దాగియున్నాడు. అతడొక్కడే ఈ సమస్త విశ్వమును వ్యాపించియున్నాడు. అతనిని పరమేశ్వరునిగ తెలుసుకొని మానవుడు అమృతుడగును.

వివరణము: "తతః పరం" అనగా దానికంటె పరమైనది. అనగా పురుషయుక్త జగత్తుకంటే హిరణ్యగర్భుడు పరుడై యున్నాడు. ఏలన అతడు కార్యబ్రహ్మము. అతడు ఈ జగత్తుకు కారణమైయున్నాడు. అతడు జగత్స్వరూపుడై విరాజిలుచున్నాడు

"బ్రహ్మపరం బృహంతం" అనగా హిరణ్యగర్భ రూపుడైన కార్యబ్రహ్మముకంటే పరుడగుట వలన, వ్యాపకుడగుటవలన బృహత్ అనియు. అనంతుడనియు పిలువబడుచున్నాడు. అతడు జీవుల శరీరానుసారము వాటిలో అంతః స్థితుడైయున్నాడు. మరియు అతడు విశ్వమునకు ఏకైక పరివేష్ట. అతడు జగత్తునందు నిండి నిబిడీకృతుడైయున్నాడు. అటువంటి ఈశుని, పరమేశ్వరుని తెలిసికొని జీవుడు అమరుడగును.

"యథా నికాయం సర్వభూతేషు గూఢం, విశ్వస్య ఏకం పరివేష్టితారం ఈశం తం జ్ఞాత్వా అమృతాః భవంతి." సగుణ బ్రహ్మమును ప్రత్యక్షము చేసికొన్నవాడు క్రమముక్తిని పొందుతాడు. అతడు బ్రహ్మలోకమును చేరుతాడు. తరువాత అతడు బ్రహ్మముతో పాటు ముక్తిని పొందుతాడు. సగుణ బ్రహ్మము (PERSONAL GOD) మాయా సహితం కాబట్టి అతడు క్రమ

ముక్తిని పొందుతాడు. కాని, ఎవడు నిర్గుణ పరబ్రహ్మంతో తన అభేదత్వాన్ని తెలుసుకొంటాడో అతడు కైవల్య మోక్షాన్ని పొందతాడు. నిర్గుణ బ్రహ్మము మాయముక్తము కాబట్టి అతనికి సర్వోత్కృష్టమైన సాక్షాత్కారం కలుగుతుంది.

సగుణ బ్రహ్మోపాసన చాల ఆవశ్యకం. పరబ్రహ్మ సాక్షాత్కారం పొందాలంటె సగుణ బ్రహ్మముయొక్క అనుగ్రహం ఉండాలి వాస్తవంలో సగుణ బ్రహ్మము (PERSONAL ABSOLUTE). నిర్గుణ బ్రహ్మము (IMPERSONAL ABSOLUTE) వేర్వేరు కావు. అవి రెండుకావు. అవి విభిన్నములు కావు, అవి ఒకే తత్త్వంయొక్క రెండు అంశాలు (They are only two aspects of the same deity) సగుణ బ్రహ్మము ఎందుకు ఏర్పడవలసి వచ్చింది? భగవంతుడు భక్తుల దాసుడు. భక్తుడు భక్తి పారవశ్యంలో, విరహంతో ప్రేమాశ్రువులు గార్చుచు ఏ మూర్తిని ధ్యానిస్తాడో భగవంతుడు ఆ మూర్తిగా తాను రూపాన్ని ధరించవలసి యుండును, పరమేశ్వరుడు భక్త పరాధీనుడు గదా!

---

వేదాహమేతం పురుషం మహాంతం
ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ ।
తమేవ విదిత్వా అతిమృత్యుమేతి
నాన్యః పంథా విద్యతేఽయనాయ ॥8॥

టీక: వేద = తెలియుదును; అహం = నేను; ఏతం = ఈ; పురుషం = పురుషుని; మహాంతం = చాల గొప్పదైన; ఆదిత్యవర్ణం = సూర్యునివలె ప్రకాశవంతమైన; తమసః = చీకటియొక్క; పరస్తాత్ = ఆవల: తమ్ ఏవ = అతనినే; విదిత్వా = తెలిసికొని; అతిమృత్యుమ్ ఏతి = మరణమునకు ఆవల వెళ్ళును; న = లేదు; అన్యః = ఇతరమైన; పంథా = మార్గము; విద్యతే = ఉన్నది; అయనాయ = దీనికోసము

భావము: తమస్సునకు ఆవల సూర్యునివలె భ్రాజమానముగ వెలుంగు ఈ మహత్తమమైన, పరాత్పరమంతమైన పురుషుని నే నెరుంగుదును. అతనిని సాక్షాత్కరించు కొనుటవలననే నరుడు మృత్యువును అతిక్రమింప గలడు. విమోచనము పడయుటకు వేరొక మార్గము లేదు."

వివరణము: "వేద అహం ఏతం పురుషం మహాంతం" నేను ఈ మహత్తమమైన పురుషుని ఎరుంగుదును. వేద అనగా ఎరుంగుదును. శ్వేతాశ్వతరుడు, ఋషిపుంగవుడు కడుధైర్యముగా తనకు తెలియునని ప్రకటన చేయుచున్నాడు. అతనికి ఆవంత సంశయము లేదు. ఏ పాశ్చాత్య తత్త్వశాస్త్రజ్ఞుడైనా ఈ విధంగా మహాధైర్యంగా తనకు పరమాత్మ తెలియునని ప్రకటన చేయగలిగాడా? పాశ్చాత్య వేదాంతులు వేదాంతపై పెద్ద పెద్ద పుస్తకాలు చాలా చాలా వ్రాస్తారు. కట్టకడపట వారు తేల్చేది ఏమిటంటే" పరమాత్మను మనం సాక్షాత్కారించుకోలేము "అని, బుద్ధికి మించి ఇంకేమీ లేదు." అని. ఎందువల్ల వారు అలా చెబుతూన్నారు? వారికి ఆత్మ సాక్షాత్కారం లేదు కాబట్టి. వారికి పరిశుద్ధమైన, సుసూక్ష్మమైన, సునిశితమైన బుద్ధిలేదు గాబట్టి. వారు ఎటువంటి తీవ్రమైన తపస్సుగాని, ధ్యానముగాని, చేయలేదు కాబట్టి. వారు తమ మనస్సును, ఇంద్రియాలను నిగ్రహింపలేదు కాబట్టి. అహం అనగా నేను. అనగా శ్వేతాశ్వతర ఋషిని హిందూ ఋషులు నిర్వికల్ప సమాధిలో పరమాత్మయొక్క ప్రత్యక్ష సాక్షాత్కారం కలుగుతుంది వారి అనుభవం ప్రత్యక్షమైనది. అందువల్లనే శ్రీ శ్వేతాశ్వతర ఋషిపుంగవుడు గభీరస్వనములో 'వేదాహమేతం' (నేను ఈ మహాపురుషుని ఎరుంగుదును.'KNOW THIS MIGHTY BEING.)" అని ఎలుగెత్తి చాటుచున్నాడు'

"ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" అనగా సూర్యునివలె భ్రాజమానముగ వెలుంగనది. తమస్సునకు ఆవలనుండునది. పరమాత్మ అనంత ప్రకాశ స్వరూపమైనది. అది వెలుగులకు వెలుగు "జ్యోతిషామపి తత్ జ్యోతిః." ఆ అనంత ప్రకాశము తమస్సునకు ఆవల నున్నది. తమస్సు అనగా చీకటి. ఈ అవిద్యయనెడి చీకటి, యే జననమరణములకు మూలకారణము. ఆత్మ జ్ఞానము, లేక బ్రహ్మజ్ఞాన మొక్కటే అజ్ఞాన తిమిరమును నశింపజేసి.

మనలను జనన మరణ చక్రమునుండి విడివడునట్లు చేయగలదు.

"తం ఏవ విదిత్వా అతిమృత్యుం ఏతి." అతనిని తెలిసికొనుటవలననే మానవుడు మృత్యువును అతిక్రమింపగలడు పరమాత్మ జనన మరణ రహితుడు. పరమాత్మ అమృతుడు. పరమాత్మను తెలిసికొనుట యనగా పరమాత్మయగుటయే. కావున పరమాత్మను తెలిసికొని యోగి అమృతత్వమును పడయును.

"నాన్యః పంథా విద్యతే అయనాయ," పరమపద ప్రాప్తి కోసము వేరొక మార్గము లేదు. అంటే జనన మరణ చక్ర భ్రమణం నుండి తప్పించుకొనేందుకు వేరొక మార్గము లేదు. ఈ సంసార నివృత్తికి, దుఃఖ నివృత్తికి బ్రహ్మసాక్షాత్కారము ఒక్కటియే రాచబాట. వేరొక మార్గము లేదు. ఈ పరమ రహస్యాన్ని జ్ఞానులు స్వానుభవంతో చాటినారు.

కావున నరజన్మ నొందిన వారెల్లరు ఆత్మసాక్షాత్కారమునకై జీవితమున అనుక్షణము యత్నమొనర్పవలెను.



**యస్మాత్ పరం నాపరమస్తి కించిత్**
**యస్మాత్ నాణీయో న జ్యాయోఽస్తి కశ్చిత్ ।**
**వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేకః**
**తేనేదం పూర్ణం పురుషేణ సర్వం ॥ 9 ॥**

టీక: యస్మాత్ = ఎవనికంటె; పరం = ఉత్కృష్టము; న = లేదు, అపరం = భిన్నమైన, వేరైన; అస్తి = ఉన్నది; కించిత్ = ఏదియు; యస్మాత్ = ఎవనికంటె; న = లేదు; అణీయః = అణుతరము; న = లేదు; జ్యాయః = జ్యేష్ఠమైన; అస్తి = కలదు; కశ్చిత్ = ఎవడై

వను; వృక్ష ఇవ = చెట్టువలె; స్తబ్ధః = అచలము; దివి = స్వర్గము న; తిష్ఠతి = నిలుచున్నాడు; ఏకః = ఒకటి; తేన = దానిచే; ఇదం = ఈ; పూర్ణం = నిండియున్నది; పురుషేణ = పురుషునిచే; సర్వం = సకలము, అంతయు,

భావము: "పరమాత్మకంటె పరమోత్కృష్టమైనది మరొకటి లేదు. పరమాత్మకంటె అన్యమైనది మరొకటి లేదు. పరమాత్మకంటె అణుతరమైనది మరొకటి లేదు. పరమాత్మ కంటె మహత్తరమైనది మరొకటి లేదు. అతడే వృక్షమువలె దివియందు అద్వితీయుడై, నిశ్చలుడై వెలయుచున్నాడు. ఈ యావత్ప్రపంచము ఆపురుషునిచే నిండియున్నది."

వివరణము: "యస్మాత్ పరం అపరం నాస్తి కించిత్" అనగా పరమాత్మ కంటె ఉత్కృష్టతరమైనదిగాని, అన్యమైనదిగాని ఏదియు లేదు. పరబ్రహ్మము అన్నింటికి ఉద్గమస్థానము. పరమాత్మ సర్వానికి ఉత్పత్తి స్థానము. పరమాత్మ సకలానికి యోని. అనగా పరమాత్మ అన్నింటికి మూల కారణము. అటువంటప్పుడు పరమాత్మకంటె ఏది ఉత్కృష్టతరంగా ఉండ గలదు? దానికంటె ఏది భిన్నంగా ఉండగలదు?

"యస్మాత్ న అణీయః" పరమాత్మకంటె అణుతరమైనది మరొ కటి లేదు. అతడు పిపీలికయొక్క ఆత్మ. అటువంటప్పుడు పరమాత్మకంటె సూక్ష్మతరమైనది, అణుతరమైనది మరొకటి ఎలా ఉండగలదు? పరమాత్మ అన్నింటిని వ్యాపించియుంటాడు. అతడు ప్రాణానికంటె, మనస్సుకంటె, ఆకాశానికంటె, సూక్ష్మతరుడు.

"న జ్యాయోఽస్తి కశ్చిత్" అనగా పరమాత్మకంటె మహత్తర మైనది మరొకటి లేదు. పరమాత్మ అనంత వస్తువు. అది పరిపూర్ణము

"వృక్ష ఇవ స్తబ్ధః దివి తిష్ఠతి ఏకః అతడే వృక్షమువలె దివి యందు అద్వితీయుడై, అచలుడై యున్నాడు. పరమాత్మ అనంతము, రెండు

అనంతాలు ఉండేందుకు వీలులేదు. అందువల్ల అతడు అద్వితీయుడు. అతడు అనంతమగుటచే సర్వవ్యాపి. సర్వగతుడగుటచే అచలుడు. "వృక్ష ఇవ స్తబ్ధః నిశ్చలః దివి ద్యోత నాత్మని స్వే మహిమ్ని తిష్ఠతి ఏకః అద్వితీయః పరమాత్మా తేన అద్వితీయేన పరమాత్మన ఇదం సర్వం పూర్ణ మైరంతర్యేణ వ్యాప్తం పురుషేణ పూర్ణేన" ఆ అద్వితీయ పరమాత్మ స్వర్గమున అనగా తన ద్యోతనాత్మక మహిమయందు వృక్షముతో సమానమైన నిశ్చల భావముతో స్థితుడై యున్నాడు ఆ అద్వితీయ పరమాత్మచే ఈ యావత్తు బాహ్యాభ్యంతరములందు సంపూర్ణముగ వ్యాపింపబడియున్నది.

"తేన ఇదం పూర్ణం పురుషేణ సర్వం" అనగా ఈ యావత్ ప్రపంచము పురుషునిచే నిండియున్నది. ఈ విశ్వము బాహ్యాభ్యంతరములందు పరమాత్మచే నిండియున్నది. అందువల్ల అతడు పరిపూర్ణుడు అనబడుచున్నాడు. మనం ఒక చిన్నపాత్ర నిండా నీరు పోసి, దానిని నీరుండే మరొక పెద్ద పాత్రలో ఉంచితే, చిన్న పాత్ర లోపల, వెలుపల పరిపూర్ణమౌతుంది. అలాగా పరబ్రహ్మము పరిపూర్ణుడు.

> తతో యదుత్తరతరం
> తదరూపమనామయం ।
> య ఏతద్విదురమృతాస్తే
> భవంత్యథేతరే దుఃఖమేవాపియంతి ॥ 10 ॥

టీక: తతః = దానికంటె; యత్ = ఏది; ఉత్తరతరం = చాల శ్రేష్ఠమైనది, ఉత్కృష్టతరమైనది; తత్ = అది; అరూపం = నిరాకారము; అనామయం = రోగములేనిది, బాధనెరుగనిది; యః = ఎవడు; ఏతత్ = దీనిని; విదుః = తెలిసికొందురో; అమృతాః = అమరులు, చావులేనివారు; తే = వారు; భవంతి = అగుదురు; అథః = కాని, ఇతరే = అన్యులు; దుఃఖం = బాధ; ఏవ = మాత్రమే; అపియంతి = బాధపడుదురు.

భావము: పరబ్రహ్మము ఈ విశ్వమునకు అతీతమైనది. అది నిరాకారము, అనామయము. దానిని తెలుసుకొన్నవారు అమృతులగుదురు. కాని, అన్యులు అట్లగుటకు బదులు దుఃఖము ననుభవింతురు.

వివరణము: "తతః" అనగా దాని కంటె అనగా విశ్వమున కంటె. "తత ఇదం శబ్దవాచ్యాత్ జగత ఉత్తరం కారణం తతః అత్యుత్తరం కార్య కారణ వినిర్ముక్తం బ్రహ్మైవ ఇత్యర్థః" దానికంటె, అనగా ఈ శబ్దవాచ్య జగత్తుకంటె ఉత్కృష్టమై, దానికారణమై యున్నదానికంటె కూడ ఉత్కృష్టతరమైన కార్య-కారణకూన్య బ్రహ్మమైయున్నది.

"యదుత్తరతరం." బ్రహ్మము ఈ విశ్వానికి అతీతమైయున్నది ఈ ప్రపంచం నామరూపాలతో కూడియుంది. బ్రహ్మము ఈ నామరూప ప్రపంచాన్ని అతిక్రమిస్తాడు. అతనికి ఈ విశ్వంతో సంబంధం లేదు. ఎందువల్లనంటే అతడు శుద్ధ చైతన్యము (PURE CONSCIOUSNESS). ప్రకృతి పురుషుల మధ్య నిజమైన సంబంధం ఎలా ఉండగలదు? కాని, అతడు ఈ ప్రపంచానికి, ప్రకృతికి ఆధారం. ఇది అద్భుతమైన విచిత్రం.

బ్రహ్మము కండ్లు లేకుండ చూస్తాడు. కర్ణములు లేకుండ వింటాడు నాసికలేకుండ ఆఘ్రాణిస్తాడు, నోరులేకుండ భుజిస్తాడు, చర్మం లేకుండ స్పర్శను పొందుతాడు, చేతులులేకుండ పట్టుకుంటాడు. కాళ్ళులేకుండ నడుస్తాడు, అతడు కనబడని ద్రష్ట, వినబడని శ్రోత, అచింత్యమైన ధ్యాత అతడు అంతర్యామి, పరమాత్మ, అమృతుడు.

బ్రహ్మము అంతీంద్రియము అవ్యక్తము. కాని, అది బాహ్యేంద్రియములు, అంతరింద్రియములు అనెడి ఉపాధుల ద్వారా వ్యక్త స్వరూపం పొందుతుంది. దానికి ఇంద్రియము లేవు కాబట్టి అది అసక్తము. అది అసక్తమైనప్పటికి అన్నిటిని భరిస్తుంది, అది ఈ సమస్తానికి ఆధారం, అధిష్ఠానం, దానికి ప్రకృతి గుణాలు లేవు. కాని, అది ఈ గుణాలను అనుభవించే భోక్తగ ఉంది. బ్రహ్మము నిజముగ ఆశ్చర్యకరమైనది.

"తదరూపమనామయం" దానికి రూపముగాని, దుఃఖముగాని లేదు,

బ్రహ్మము అనంతము, అంఖడము, అప్రమేయము, నిరవయవము, సర్వగతము సుసూక్ష్మము, అందువల్ల ఇటువంటి నిరుపమ బ్రహ్మమునకు రూపము ఉండజాలదు. అందువల్లనే "తత్ అరూపం" (అది ఆకారములేనిది) అని చెప్పబడినది. స్థూల వస్తువులకు మాత్రమే రూపము ఉండును. బ్రహ్మము సూక్ష్మత్వాత్ నిరాకారము. బ్రహ్మము మూడు విధములైన బాధలులేనివాడు. రోగాదులైన ఆధ్యాత్మిక తాపము అతనిని అంటదు. పాము, పులి మున్నగు భూతములనుండి ఎటువంటి అధిభౌతిక తాపము ఆతనికి కలుగదు దేవతల నుండి కల్గు పిడుగుపాటు, వర్షము మున్నగు అధిదైవిక తాపము అతనిని స్పృశింపజాలదు అందువల్లనే "తత్ అనామయం" (అదిబాధ నెరుగనిది) అని చెప్పబడినది. ACC NO - 137 38

"యః ఏతత్ విదుః అమృతాః తే భవంతి." ఈ అనామయమైన, అరూపమైన, విశ్వాతీతమైన పరబ్రహ్మమును ఎవరు తెలిసికొందురో వారు అమృతులౌతారు." బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవంతి." బ్రహ్మమును తెలిసికొన్న వారు బ్రహ్మముఔతారు. అందుచేత అమృత బ్రహ్మమును తెలిసికొన్నవారు అమృతత్వమును పొందుతారు. 294.592 RAD 18200

"అథః ఇతరే దుఃఖం ఏవ అపియంతి" కాని, ఇతరులు దుఃఖాన్నే అనుభవిస్తారు. ఆత్మసాక్షాత్కారం పొందని వానికి దుఃఖం ఉండనే ఉంది. ఆత్మసాక్షాత్కారం పొందినవానికి మాత్రమే సకలవిధ దుఃఖ నివృత్తి కలుగుతుంది. ఆనందం భగవంతునిలోనే లభ్యమౌతుంది. (PEACE CAN BE HAD ONLY IN GOD.) పరమానంద ప్రాప్తి, దుఃఖనివృత్తి పరమేశ్వరుని పొందడంవల్లనే కల్గుతాయి. ఈ జీవితగమ్యాన్ని పొందడానికి మరొక మార్గం లేదు బ్రహ్మజ్ఞానం ఒక్కటే మార్గం ఈ సత్యాన్ని అన్ని ఉపనిషత్తులు పదే పదే చెబుతూంటాయి. బ్రహ్మజ్ఞానాన్ని పొందేందుకు మనం మన జీవితంలోని అనుక్షణం శ్రమింతుము గాక!

---

సర్వానన శిరోగ్రీవః

సర్వభూతగుహాశయః ।

సర్వవ్యాపీ స భగవాన్
తస్మాత్ సర్వగతః శివః ॥ 11 ॥

టీక: సర్వ ఆనన = అందరి యొక్క వదనములు; సర్వశిరః = అందరి యొక్క శిరస్సులు; సర్వగ్రీవః = అందరి యొక్క మెడలు; సర్వభూతగుహాశయః = సర్వుల హృదయమునందు నివసించును; సర్వవ్యాపీ = అంతట వ్యాపించియున్నవాడు; సః = అతడు; భగవాన్ = భగవంతుడు; తస్మాత్ = కాబట్టి; సర్వగతః = అంతట పరివ్యాప్తమైన; శివః = మంగళప్రదమైన; శుభంకరమైన.

భావము: "అతడు (భగవానుడు) అందరియొక్క ముఖము, తల, మెడ. అతడు సకల ప్రాణుల హృదయమందు నివసించును. అతడు అన్నింటిని వ్యాపించియుండును. కాబట్టి, అతడు సర్వగతుడు, మంగళప్రదుడు.

వివరణము: "సర్వానన శిరోగ్రీవః" అతడు అందరియొక్క ఆననము, శిరస్సు, కంఠము. "సర్వాణ్యాననాని శిరాంసి గ్రీవాశ్చ అస్యేతి సర్వానన శిరోగ్రీవః". అన్ని ముఖములు, అన్నిశిరములు, అన్ని కంఠములు భగవంతునివే అతడు విరాట్ పురుషుడు.

"సర్వభూతగుహాశయః" అతడు అందరి హృదయములందు నివసించును. "సర్వేషాం భూతానాం గుహాయాం బుద్ధౌ శేత ఇతి సర్వభూతగుహాశయః అతడు అంతర్యామి, అతడు అన్ని ప్రాణుల హృదయములందు వసించును. అందువల్ల ఆ అంతర్యామి ఇంద్రియములకు, మనస్సునకు, బుద్ధికి, కర్మలకు దారిచూపును.

జ్ఞాన వైరాగ్యయోశ్చైవ
షణ్ణాం భగ ఇతీరణా ॥ (విష్ణు పురాణం)

ఈ యారు దివ్యగుణములను కలవాడు భగవానుడు. 1. ఐశ్వర్యము (విభూతులు, శక్తులు, ప్రభావములు) 2 వీర్యము (ధర్మము, బలము) 3 యశస్సు (ప్రఖ్యాతి, కీర్తి) 4. శ్రీ (సౌభాగ్యము, లక్ష్మి) 5. జ్ఞానము (విజ్ఞానము) 6. వైరాగ్యము(వైరాశ్యము), ఈఆరుగుణములను భగము అందురు. షడ్గుణైశ్వర్యసంపన్నుడగుటచే పరమేశ్వరుడు భగవంతుడని పిలువబడినాడు.

"తస్మాత్ సర్వగతః శివః" కాబట్టి అతడు సర్వగతుడు, మంగళప్రదుడు. భగవానుడు షడ్గుణైశ్వర సంపన్నుడు. అతడు సర్వవ్యాపి. అందువల్ల అతడు సర్వగతుడు, శివుడు. అతడు అంతటా నిండియున్నాడు అతడుశుభప్రదుడు, మంగళప్రదుడు.

పూర్వ మంత్రంలో "తతో యదుత్తరతరం" అని పరబ్రహ్మమును గురించి తెలుపబడింది' ఈ మంత్రంలో "సర్వానన శిరోగ్రీవః'' అని సగుణ బ్రహ్మమును గురించి తెలుపబడింది. ఈ యుపనిషత్తులో సగుణ బ్రహ్మము, నిర్గుణ బ్రహ్మము— వీనినిగురించిన అభిప్రాయాలు మంజులంగా సమన్వయం చేయబడ్డాయి. ఒకే నీరు నీటియావిరిగా, హిమముగా ఎలా మారుతుందో అలాగే నిర్గుణ (నిరాకార) బ్రహ్మము భక్తులను తృప్తిపరచు నిమిత్తము అనేక ఆకృతులను ధరిస్తుంది.

**మహాన్ ప్రభుర్వై పురుషః**
**సత్త్వస్యైష ప్రవర్తకః ।**
**సునిర్మలామిమాం ప్రాప్తిం**
**ఈశానో జ్యోతిరవ్యయః ॥ 12 ॥**

టీక: మహాన్ = చాలగొప్పదైన; ప్రభుః = భగవానుడు; వై = వాస్తవముగ; పురుషః = పురుషుడు; సత్త్వస్య = అన్ని ప్రాణులబుద్ధి యొక్క; ఏషః = అతడు; ప్రవర్తకః = మార్గదర్శి; సునిర్మలాం = అత్యంతనిర్మలమైన; ఇమాం = దీనిని; ప్రాప్తిం = పొందు, ప్రాప్తి పడయుట; ఈశానః = శాసించువాడు, విగ్రహించువాడు; జ్యోతిః =

వెలుగు; అవ్యయః = శాశ్వతుడు, నాశము లేనివాడు, అక్షరుడు.

భావము: ఆ పురుషుడు వాస్తవములో మహాప్రభువు. అతడు అన్నింటిని నియమించును. అతడు పరం జ్యోతి. అతడు శాశ్వతుడు. అత్యంత నిర్మలమైన స్థితిని (అనగా మోక్షమును) పడయుటకు అతడు అన్ని జీవ రాశుల బుద్ధికి మార్గముజూపును

వివరణము: "మహాన్ ప్రభుః వై పురుషః" ఆ పురుషుడు వాస్తవములో మహాప్రభువు. అతడు ఈశానుడు, అందువల్లనే అతడు అన్నింటిని నియమిస్తాడు.

"సత్త్వస్య ఏషః ప్రవర్తకః" అతడు సర్వజీవకోటి బుద్ధికి దారి చూపును. మనస్సు సునిర్మలమైనప్పుడు తత్త్వాన్వేషకుడు భగవంతుని అనుగ్రహ హస్తమును పొందుతాడు. పరమేశ్వరుడు బుద్ధియందు, హృదయమున నివసిస్తున్నాడు కాబట్టి పరిశుద్ధ మనస్కుడు పరమేశ్వరుని సహాయాన్ని పొందుతాడు. భగవంతుడు పరిశుద్ధ హృదయునికి మార్గము చూపుతాడు. పరాత్పరుడు బ్రహ్మజిజ్ఞాసువును సత్పథంలో పయనించేలా చూస్తాడు.

"సునిర్మలాం ఇమాం ప్రాప్తిం" పరమేశ్వరుడు ప్రయతాత్ముని పరిశుద్ధమైన పదమును (మోక్షమును) పడయునటుల గావించును. సర్వగుహాశయుడైన మహాప్రభువు జిజ్ఞాసువుయొక్క అజ్ఞానపు తెరను తొలగించి అతనిని సునిర్మలమైన మహదానందమయ స్థితిని (అనగా మోక్షమును. ముక్తిని అంత్య విమోచనమును) పడయునటుల జేయును.

"ఈశానః జ్యోతిః అవ్యయః" భగవంతుడు ఈశానుడు, నియామకుడు, నిగ్రహించువాడు. అతడు పరంజ్యోతి, వెలుగులకు వెలుగు. స్వయం ప్రకాశకుడు. అతడు అవ్యయుడు, అవిక్రయుడు, అవినాశి. జీవాత్మ మనస్సుపైనున్న అజ్ఞానమనెడి తెరను అతడు తొలగించును. అతడు జ్ఞాన జ్యోతిని ప్రసాదించి జిజ్ఞాసువుయొక్క అజ్ఞాన తిమిరమును నిర్మూలించును. అతడు తన భక్తులకు అవ్యయపదమును ప్రసాదించును.

అంగుష్ఠమాత్రః పురుషోఽంతరాత్మా
సదా జనానాం హృదయే సంనివిష్టః ।
హృదా మనీషా మనసాభిక్లృప్తో
య ఏతద్ విదురమృతాస్తే భవంతి ॥ 13 ॥

టీక: అంగుష్ఠమాత్రః = బొటనవ్రేలి పరిమాణపు; పురుషః = పురుషుడు; అంతరాత్మా = ప్రత్యగాత్మ; సదా = ఎల్లప్పుడు; జనానాం = ప్రాణులయొక్క; హృదయే = హృదయమునందు; సంనివిష్టః = నివసించును; హృదా = హృదయముచేత: మనీషా = బుద్ధిచేత; మనసా = మరియు మనస్సుచేతను; అభిక్లృప్తః = (ఎవ్వడు) దాగి యున్నాడో; యః = ఎవడు; ఏతత్ = దీనిని; విదుః = తెలిసికొందురు; అమృతాః = అమృతులు; తే = వారు; భవంతి = అగుదురు.

భావము: "బొటనవ్రేలి పరిమాణపు పురుషుడు ప్రాణికోటి హృదయములందు సర్వదా వాటి అంతరాత్మ (ప్రత్యగాత్మ)గ నివసించును. ఆ పురుషుడు హృదయముచే. బుద్ధిచే. మనస్సుచే. అభిగుప్తమైయున్నాడు. ఎవరు అప్పురమపురుషుని తెలుసుకొందురో వారు అమృతులు అగుదురు.

వివరణము: "అంగుష్ఠమాత్రః పురుషః" బొటనవ్రేలియంత పరిమాణముగల పురుషుడు (THE PURUSHA WHO IS OF THE SIZE OF A THUMB). ఇదే మంత్రం కఠోపనిషత్తులో చతుర్థ వల్లిలో కానవగును

"అంగుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి"।
ఈశానో భూతభవ్యస్య న తతో విజుగుప్సతే।
ఏతద్ వై తత్॥ —కఠోపనిషత్తు IV. 12

ఆ పురుషుడు బొటనవ్రేలియంత పరిమాణముతో దేహమధ్యమున ఉండును. అతడు భూత, భవిష్యత్తులకు ప్రభువు. అతనిని తెలిసికొన్న పిదప భయమేలేదు. ఇది వాస్తవముగ అదే.

అంగుష్ఠమాత్రః పురుషో జ్యోతిరివాధూమకః ।
ఈశానో భూతభవ్యస్య స ఏవాద్య స ఉ శ్వః ।
ఏతద్ వై తత్ ॥ — కఠోపనిషత్తు IV - 13

అంగుష్ఠప్ర పరిమాణముగల పురుషుడు పొగలేని జ్వాలవలె నున్నాడు. అతడు గతానికి, రాబోవుకాలానికి ప్రభువు. అతడే ఈనాడు ఉండేది, రేపు ఉండబోయేది. ఇది వాస్తవములో ఉది.

పురుషః అనగా పురుషుడు, ఆత్మ. " పురుషః పూర్ణత్వాత్ పురి శయనాద్ వా " పూర్ణత్వమువలన పురుషుడు అనబడుతాడు లేక శరీరరూప పురమునందు శయనించుటచే ఆత్మ పురుషుడనబడుచున్నాడు. ఆత్మచే సర్వము వ్యాపింపబడి యున్నందునకూడా ఆత్మను పురుషుడు అంటారు. ప్రపంచమంతా ఆత్మచే నిండినిబిడీకృతమై యున్నందున ఆత్మను పురుషుడు అంటారు. ఈ, దేహమనే పురములో ఆత్మ ఉంటుంది కాబట్టి ఆత్మను పురుషుడు అంటారు.

"అంగుష్ఠమాత్రః" అనగా బొటనవ్రేలియంత పరిమాణము. ప్రతి మానవుని హృదయగుహ, హృదయ కమలం. అతనియొక్క అంగుష్ఠ పరిమాణం ఉంటుంది. కారణ శరీరంలోని జీవుని శరీరం కూడ ఇంతే సైజు (పరిమాణం) అని చెప్పబడియుంది. ఆత్మకు సైజు లేదు. అది అపరిమితం. అప్రమేయం. అయితే ఆత్మను అంగుష్ఠమాత్రమని ఎందుకు చెప్పారు? ప్రారంభకులు ధ్యానంలో సౌకర్యం పొందేందుకు ఇలా చెప్పారు. ప్రారంభంలో బ్రహ్మజిజ్ఞాసువులు ఆత్మను తమ హృదయ గహ్వరంలో అంగుష్ఠ పరిమాణపు జ్యోతి (దీపము) గ ధ్యానిస్తారు.

"అంతరాత్మా" అనగా ప్రత్యగాత్మ. పురుషుడు సదా సకల ప్రాణికోటి, అంతరాత్మగా వెలయుచున్నాడు. ఈ పరమాత్మను తెలుసుకోవడం చాల గహనమైన విషయం.

"సదా జనానాం హృదయే సన్నివిష్టః" అతడు అనవరతము ప్రాణికోటి హృదయసీమలో అసీనుడై యున్నాడు.

" సర్వస్య చాహం హృది సన్నివిష్టః — భగవద్గీత.
అహం ఆత్మా గుడాకేశ సర్వభూతాశయ స్థితః — భగవద్గీత.

ఈశ్వరః సర్వభూతానాం. హృద్దేశేఽర్జున తిష్ఠతి — భగవద్గీత.

భగవంతుడు మానవుని హృదయమందిరములో ఉంటాడు.

"హృదా మనీషా మనసాభిక్లప్తః" హృదయం, బుద్ధి

మనస్సు—వీనిచే ఆత్మ మరుగుచేయబడియుంది. భగవంతునకు మనకు మధ్యయుండే కుడ్యము మనస్సు. ఈ గోడను పగులగొట్టితే, అనగా మనస్సును నాశంచేస్తే భగవత్సాక్షాత్కారం సిద్ధిస్తుంది. మనస్సును నాశనం చేయడం ఎలాగు? మనస్సు అనెడి గోడను భేదించడానికి బ్రహ్మధ్యానము అనేది ప్రబలాయుధము. ఆత్మచింతనచే మనస్సు ధ్వంసమౌతుంది. బ్రహ్మధ్యానంచే మనస్సు కృశిస్తుంది, నశిస్తుంది. మనో నాశనమే మోక్షము.

"య ఏతత్ విదుః అమృతాః తే భవంతి," ఎవరు ఆత్మను తెలిసికొంటారో వారు అమృతులు ఔతారు, ఆత్మను తెలిసికొన్న పిదప మనకిక సంసార సాగర భయం అదృశ్యమౌతుంది. ఈ ఆత్మజ్ఞానం పొందాలంటే మార్గము ధ్యానమే. ప్రారంభకులైన జిజ్ఞాసువులకు నిర్గుణధ్యానం చాల కష్టమైనపని. మనస్సును నిరాకారమైన అనంత వస్తువుపై లగ్నం చేయడం వారికి కష్టతమ విషయం. అందువల్లనే ఆరురుక్షువులు కనులు మూసుకొని, తమ హృదయ పుండరీకంలో అంగుష్టమాత్రపు జ్యోతి రూపమున భాసించు అంతరాత్మపై ధ్యానించాలి. మొట్టమొదట సగుణ ధ్యానం ఆరంభించి క్రమేణ నిర్గుణ ధాన్యంలోకి పోవాలి.

---

సహస్రశీర్షా పురుషః
సహస్రాక్షః సహస్రపాత్।
స భూమిం విశ్వతో వృత్వా
అత్యతిష్ఠత్ దశాంగుళమ్ ॥ 14 ॥

టీక :

సహస్ర శీర్షాః = వేయి తలలుగల; పురుషః = పురుషుడు; సహస్రాక్షః = వేయి నేత్రములుగల; సహస్రపాత్ = వేయి పాదములుగల;

సః = అతడు; భూమిం = ప్రపంచమును; విశ్వతః = అన్నివైపుల; వృత్వా = చుట్టి, కప్పి, వ్యాపించి; అత్యతిష్ఠత్ = ఇంకా ఆవలికి వ్యాపించును; దశాంగుళమ్ = పదివ్రేళ్ళు.

భావము : పురుషునకు వేయి తలలు, వేయి కన్నులు, వేయి పాదములు గలవు అతడు ఈ యావద్విశ్వమును అన్ని దిశల పరివేష్టించి యుండుటయేగాక, దానికి ఆవలగూడ పది అంగుళముల ప్రమాణము విస్తరించి యున్నాడు.

వివరణము : "సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్" విరాట్ పురుషునకువేయి తలలు, వేయి కన్నులు, వేయి పాదములుగలవు. "పురుషః పూర్ణః" పురుషుడు అనగా పూర్ణుడు "సహస్రాణి అనంతాని శీర్షాణి అస్యేతి సహస్రశీర్షా" వేయి అనగా అనంతం అనంతములైన తలలు గలవాడు సహస్రశీర్షుడు. పూర్ణుడైన పురుషునకు అనంతములైన తలలు, నయనములు, పాదములు గలవు.

విరాట్ పురుషునకు అసంఖ్యేయములైన శిరస్సులున్నాయి. అన్ని తలలు, అన్నికన్నులు, అన్నిచేతులు, అన్నికాళ్ళు భగవంతునివే, ఆ ప్రభువే సకల హస్తముల గుండా పనిచేస్తాడు. అతడే అన్ని వక్త్రములగుండా భుజిస్తాడు. అతడే అన్ని నయనములగుండా దర్శిస్తాడు, అతడే అన్ని కర్ణముల గుండా ఆకర్ణిస్తాడు, అతడే అన్ని పాదములద్వారా గమిస్తాడు. అతడే అన్ని మనస్సుల గుండా సంకల్పిస్తాడు

"స భూమిం విశ్వతో వృత్వా" అనగా అతడు అన్ని దిశలనుండి భూమిని వ్యాపించియున్నాడు. అతడు ఈ భువనములను వెలుపల, లోపల వ్యాపించి యున్నాడు అంతేగాదు దానిని అతిక్రమించియున్నాడు.

"అత్యతిష్ఠత్ దశాంగులమ్." అతడు ఇంకా పదివ్రేళ్ళు ఇంకా ఆవలికి వ్యాపించియున్నాడు. "దశాంగుల అనంతం అపారం ఇత్యర్థః." దశాంగుళం అనగా అనంతమైన, అపారమైన. అనంత స్వరూపుడైన పురుషుడు ఈ ప్రపంచమును అతిక్రమించును. "అథవా నాభేరుపరి దశాంగులం హృదయం తత్ర అధితిష్ఠతి. లేకబొడ్డునకు పది అంగుళములపైన ఉన్నటు

వంటి హృదయమునందు స్థితుడై యున్నాడని అర్థము. అతడు అందరి హృదయములందు ఉండును. అతడు మహత్తముడు, అనంతుడు అయినప్పటికి, అతడు ఈ విశ్వానికి ఆత్మయైనప్పటికిని అతడు సకల ప్రాణికోటి హృదయమున వాటి ప్రత్యగాత్మగ నివసించును.

"సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్" — మంత్రము యొక్క మొదటి భాగం పరమేశ్వరుని వ్యాపనాన్ని వర్ణిస్తుంది.

"స భూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠత్ దశాంగులమ్" — మంత్రము యొక్క రెండవ భాగం పరబ్రహ్మము యొక్క అతిక్రమణత్వాన్ని వర్ణిస్తుంది. (The first half of the mantra describes the immanence of the Lord, The second half of the mantra describes the transcendence of Para Brahman)

ఈ మంత్రం పురుషసూక్తంలో వస్తుంది. ఇది పురుష సూక్తంలో మొదటి మంత్రం. ఇది ఋగ్వేదంలోని ముఖ్యమైన మంత్రం ఈ మంత్రాన్ని మనం నిరంతరం స్మరిస్తూంటే అహంకారం అదృశ్యమౌతుంది మనకు విరాట్ పురుషునితో తాదాత్మ్య అనుభవం కలుగుతుంది. మనకు విశాల హృదయం, చిత్త విశాలత ఏర్పడుతుంది మనకు మనోహరమైన, మనోజ్ఞమైన. మహత్తరమైన అనుభూతి కలుగుతుంది. మన మెల్లరం పురుషసూక్తాన్ని పారాయణం చేసి. భగవత్కృపను పడయుదుము గాక!

---

**పురుష ఏవేదగ్ం సర్వం**
**యద్భూతం యచ్చ భవ్యం।**
**ఉతామృతత్వస్యే శానో**
**యదన్నే నాతిరోహతి॥ 15 ॥**

టీక: పురుషః = పురుషుడు; ఏవ = మాత్రమే; ఇదం = ఈ; సర్వ = అంతయు; యద్భూతం = ఏదియుండినదో; యత్ చ భవ్యం = ఏది రాబోవుకాలమున ఉండునో; ఉత = కూడ; అమృతత్వస్య = అమృతత్వముయొక్క; ఈశానః = ప్రభువు; యత్ అన్నేన అతిరోహతి = ఎయ్యది ఆహారముచే వృద్ధినొందుచున్నదో అది అతడు.

భావము: ఇదంతయూ ఆ పురుషుడే. ఏది యుండినదో, ఏది యుండబోవునో అదంతయూ అతడే. అతడు అమృతత్వమునకు ప్రభువు కూడ. ఏది అన్నముచే వృద్ధినొందునో అదియూ అతడే.

వివరణము: "పురుష ఏవ ఇదం సర్వం" ఈ సమస్తము ఆ పురుషుడే అతడు ఈ విశ్వముగా తాను వ్యక్తీకరించినాడు. అతడు అమృతత్వాధిపతి. ఇట్లుండియు అతడు ఏ దోషము లేనివాడు. అతడు నిర్లిప్తుడు, అసక్తుడు, అసంగుడు. 'అసంగో౽యం పురుషః' అని శ్రుతులు ప్రకటించుచున్నవి.

"యద్ భూతం యత్ చ భవ్యం" గతంలో ఉండినదియూ, భవిష్యత్తులో ఉండునదియూ. అనంతమైన భూతకాలము, అనంతమైన భవిష్యత్తు అతనికి స్వల్పవ్యవధి, అతడు త్రికాలములందుండును. అతడు కాలము నతిక్రమించును అతడు సత్యవస్తువు కావున నిత్యుడు.

"ఉత అమృతత్వస్య ఈశానః" అనగా అతడు అమృతత్వమునకు ప్రభువు కూడ. 'అమృతత్వస్య ఈశానః' అనుటకు శ్రీ సాయనులవారు ఇంకొక విధంగా అర్థం చెప్పుతారు, అతడు దేవతలకు సైతము ప్రభువనివారు అర్థం చెప్పుతారు. ఆ దేవతలు ఆహారమూలంగా, ఆహారం కోసం, తాము ఉన్నత స్థితిలోనికి పెరుగుతారు. ఆ కారణంచేత పురుషుడు దేవతలకు కూడ ప్రభువ వివర్ణింపబడినాడు.

"యత్ అన్నేన అతిరోహతి" ఏది అన్నముచే వృద్ధినొందునో అదియూ అతడే అన్నంఅంటే ఆహారము. మరియు అన్నంఅంటే ప్రకృతి, లేక ప్రపంచం, ప్రపంచంలోని ప్రాణులకు అన్నం భోజ్యమైనట్లు పురుషునకు (పరమేశ్వరునకు) ఈ ప్రపంచం భోజ్యవస్తువు. పరమేశ్వరుడు తన స్వకీయ లీల కోసం ఈ ప్రపంచాన్ని విజృంభింపజేస్తాడు. ఆత్మ క్రీడార్థం, స్వప్రయోజన అభావే, పరమేశ్వరుడు ఈ సృష్టి సల్పినాడు. 'లోకవత్ తు లీలా కైవల్యం' 'పురుష ఏ వేదగ్ం సర్వం' అనే మంత్రం పురుష సూక్తంలో రెండవ మంత్రము. పురుష సూక్తమును పఠింపవలసినదిగా పఠితలను హృదయ పూర్వకంగా ప్రార్థిస్తున్నాను.

సర్వతః పాణిపాదం
తత్సర్వతోఽక్షి శిరోముఖం ।
సర్వతః శ్రుతిమల్లోకే
సర్వమావృత్య తిష్ఠతి ॥ 16 ॥

టీక: సర్వతః = ఎల్ల చోట్ల; పాణిపాదం = చేతులతో, కాళ్ళతో; తత్ = అది; సర్వతః = అన్నిచోట్ల; అక్షి శిరోముఖం = కన్నులతో, శిరస్సులతో, నోళ్ళతో; సర్వతః = సర్వత్ర; శ్రుతిమత్ = చెవులతో, లోకే = ప్రపంచంలో; సర్వం = అంతయు; ఆవృత్య = పరివేష్టించి; తిష్ఠతి = ఉన్నది.

భావము: ఎల్లచోట్ల కాలుసేతులు కలిగి, అన్నిచోట్ల కన్నులు, తలలు, నోర్లు కలిగి, సర్వత్ర కర్ణములు కలిగి అతడు ఈ ప్రపంచమున అంతటిని ఆవృతమొనర్చుచు వెలయుచున్నాడు.

వివరణము: సర్వతః పాణిపాదం తత్ సర్వతః అక్షి శిరః ముఖం " అది ఎల్లెడల కాలుసేతులు, అంతట కన్నులు, తలలు ముఖములు కలిగి యున్నది. తత్ అనగా అది, తత్ అనగా పరబ్రహ్మము, క్షేత్రజ్ఞుడు. పరబ్రహ్మముతో ఈ ప్రపంచం నింపబడియుంది. పరబ్రహ్మముతో ఈ ప్రపంచం వ్యాపింపబడియుంది. పరబ్రహ్మము సమస్తమును వ్యాపించి, ఈ విశ్వంలో ఉంది.

"సర్వతః పాణిపాదం." అన్నిచోట్ల చేతులు, కాళ్ళు కలిగిన. పరబ్రహ్మము సత్ కాదు, అసత్ కాదు. అందువల్ల అజ్ఞులు దాన్ని అభావమని, శూన్యమని, ఖాళీయని అనుకోవచ్చు. ఈ అపోహను తొలగించేందుకు పరమేశ్వరునకు సర్వత్ర పాణిపాదాలున్నాయని చెప్పబడింది. అది (పరబ్రహ్మము) మనస్సును, ఇంద్రియాల్ని వాటి వాటి పనులను నిర్వర్తించేటట్టు చూస్తుంది. ఇది సగుణ బ్రహ్మముయొక్క వ్యక్తస్వరూపం మాత్రమే.

"సర్వతః అక్షి శిరః ముఖం." అంతట కన్నులతో, శిరములతో, వదనములతో, ఈ మంత్రంలో దివ్య విభూతులు తెలుపబడ్డాయి. పరమేశ్వరుని

వ్యాపకత్వం ఎర్ణించబడింది. అన్నిచేతులు, అన్నిపాదాలు, అన్నినయనాలు, అన్ని శిరస్సులు, అన్నిముఖాలు పరమేశ్వరునివే. అన్ని శ్రోత్రాలు పరమేశ్వరునివే. ఈ ఉపనిషత్తులోని విచిత్ర లక్షణం ఏమిటంటే సగుణ బ్రహ్మము. నిర్గుణ బ్రహ్మము—వీటి భావనలయొక్క అందమైన సంయోగమే.

"సర్వతః శ్రుతిమత్ లోకే" అన్నిచోట్ల చెవులతో ఈ ప్రపంచమున లోకే అనగా లోకమునందు. "లోకే ప్రాణినికాయే" లోకే అనగా ప్రాణుల యొక్క దేహమునందు అని శ్రీ శంకరులవారు చెబుతారు. పరమేశ్వరుడు ఈ దేహమనే యంత్రాన్ని నడుపుతాడు. పరమేశ్వరుడు అంతర్యామి. అంతరాత్మ, అతడు ఈ ప్రపంచానికి దేహానికి, మనస్సుకు, ప్రాణానికి, ఇంద్రియాలకు పట్టుగొమ్మ, ఆధారం, అధిష్ఠానం, ఆలంబనం. దేహేంద్రియ మనస్సుల ఉనికవ (the existence of body, senses and mind) బ్రహ్మముయొక్క ఉనికవ (the existence of Brahman) ను నిర్ధారణ చేస్తాయి. ఎందువల్లనంటే దేహేంద్రియ మనోబుద్ధుల చేష్టలవెనుక ఆత్మ చైతన్యం (self-consciousness) ఉండితీరాలి. అందుచేతనే బ్రహ్మమును అసత్ (non-existence) అనడానికి వీలులేదు.

అధ్యారోపితమైనటువంటి మిథ్యా సర్పంయొక్క దోషాలచేగాని, గుణాలచేగాని రజ్జువునకు (దారమునకు) చేటు లేదు. అలాగా క్షేత్రజ్ఞుడైన పరబ్రహ్మమునకు ఈ అధ్యారోపిత ప్రపంచంవల్ల, దేహేంద్రియ మనోబుద్ధులవల్ల, పంచప్రాణాలవల్ల ఎటువంటి కళంకం లేదు. అన్ని ప్రాణులలో, దేహాలలో ఒకే ఒక చైతన్యం ఉంది. ఆచైతన్యం నిత్యమైంది, స్వయం ప్రకాశమైనది, సర్వగతమైంది, ఆచైతన్యమే పరబ్రహ్మము. (That common consciousness is Para Brahman) దేహము, మనస్సు, బుద్ధి, ఇంద్రియములు, ప్రాణము — ఇవి స్వభావతః జడములు. కేవలం బ్రహ్మముయొక్క సమ్ముఖంవల్ల అవి తమ తమ పనులుచేస్తాయి. అయస్కాంతం సన్నిధిలో ఇనుము అయస్కాంతం రూపాన్నిధరించినలాగా, మిథ్యా ఉపాధులైన దేహము, మనస్సు ఇంద్రియములు,ప్రాణము— ఇవి చైతన్య రూపాన్ని ధరిస్తాయి.

పామును రజ్జువుమీద ఏవిధంగా ఆరోపితం చేస్తామో ఆవిధంగా ప్రపంచాన్ని అంతా బ్రహ్మము మీద ఆరోపించాము. దీన్ని అధ్యారోపం అంటారు.

అధ్యారోపము (Super - imposition) ను అపవాదయుక్తి (The Method of negation) చే తొలగించుకోవాలి.

ఈ మంత్రం భగవద్గీతలో, పదమూడవ అధ్యాయంలో, పదమూడవ శ్లోకంగా వస్తుంది.

---

సర్వేంద్రియగుణాభాసం
సర్వేంద్రియ వివర్జితం ।
సర్వస్య ప్రభుమీశానం
సర్వస్య శరణం సుహృత్ ॥ 17 ॥

టీక: సర్వ ఇంద్రియ గుణ ఆభాసం = అన్ని ఇంద్రియముల చేష్టలద్వారా ప్రకాశించుచు; సర్వ ఇంద్రియ వివర్జితం = సకలేంద్రియ రహితమై; సర్వస్య = అందరియొక్క; ప్రభుం = ప్రభువును; ఈశానం = పాలకుడును; సర్వస్య = అందరియొక్క; శరణం = ఆశ్రయము; సుహృత్ = స్నేహితుడు.

భావము: అతడు సకల ఇంద్రియ గుణములలో ప్రకాశించును; అయినప్పటికి అతడు సర్వేంద్రియములు లేనివాడే. అతడు సర్వులకు ప్రభువు. అతడు అందరకు పాలకుడు. అతడు అందరికి శరణ్యము. అతడు అందరకు సుహృత్తు.

వివరణము: సర్వేంద్రియ గుణాభాసం అన్ని ఇంద్రియముల చేష్టలచే ప్రకాశించుచు (Shining by the functions of all the senses). "సర్వాణి చ తాని ఇంద్రియాణి శ్రోత్రాదీని ఇంద్రియాణి అంతఃకరణ పర్యంతాని సర్వేంద్రియ గ్రహణేన గృహ్యంతే". చెవులు కన్నులు మొదలగు ఇంద్రియములు మొదలుకొని అంతఃకరణ పర్యంతము ఉన్న సకలేంద్రియములు సర్వేంద్రియ అను పదముచే సూచితమగుచున్నది.. "అంతఃకరణ బహిష్కరణ ఉపాధిభూతైః సర్వేంద్రియ గుణైః అధ్యవసాయ సంకల్ప శ్రవణాదిభిః గుణవత్ అభాసత ఇతి సర్వేంద్రియ గుణాభాసమ్". పరమాత్మకు అంతఃకరణము (మనస్సు) బాహ్యేంద్రియములు ఉపాధులు, శబ్దము, రంగు, రుచి, స్పర్శ, వాసన, సంశయము, నిశ్చయము మొదలగునవి ఇంద్రియముల యొక్క గుణములు. పర

మాత్ర శ్రవణాది గుణములతో భాసించుటచే సర్వేంద్రియ గుణాభాసుడగు చున్నాడు.

సర్వేంద్రియములు ఏవి? ఐదు జ్ఞానేంద్రియములు. ఐదు కర్మేంద్రియములు. అంతరింద్రియములు, మనస్సు, బుద్ధి—వీటిని సర్వేంద్రియములు అననగును. జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు— ఇవి మనోబుద్ధులతో గూడ పనిచేస్తాయి. అవి స్వతంత్రంగా పనిచేయలేవు. అందువల్ల సర్వేంద్రియములు అనే పదంలో మనస్సు. ఇంద్రియములు ఇమిడియున్నాయి.

"సర్వేంద్రియ వివర్జితం." సకల ఇంద్రియ రహితమై. "సర్వేంద్రియ వివర్జితం సర్వ కరణరహితం ఇత్యర్థః. అతోన కరణవ్యాపారైః వ్యాపృతం తద్ జ్ఞేయమ్." సర్వేంద్రియ వివర్జితం అంటే సమస్త ఇంద్రియములు లేనిది. అందువల్ల వాస్తవంలో ఇంద్రియవ్యాపారములు లేనిది.

పరమేశ్వరుడు కన్నులు లేకుండా చూస్తాడు. అతడు చెవులు లేకుండా వింటాడు, ముక్కు లేకుండా వాసన చూస్తాడు, నోరు లేకుండా భుజిస్తాడు; చర్మం లేకుండా స్పృశిస్తాడు; చేతులు లేకుండా గ్రహిస్తాడు; కాళ్ళు లేకుండా నడుస్తాడు. "అతడు కనపడని ద్రష్ట, వినబడని శ్రోత, అసంకల్పిత ధ్యాత. అతడు తప్ప మరొక ద్రష్ట లేడు, మరొక శ్రోతలేడు, మరొక ధ్యాత లేడు, అతడు పరమాత్మ, అంతర్యామి, అమృతము" అని బృహదారణ్యక ఉపనిషత్తు వర్ణిస్తుంది అతడు శుద్ధ చైతన్యం (PURE CONSCIOUSNESS) కాబట్టి అతనికి ఇంద్రియాలు లేకుండానే సమస్తం విదితమౌతుంది (As he is pure consciousness He knows everything without the organs of perception).

"సర్వస్య ప్రభుం ఈశానమ్." అతడు అందరకు ప్రభువు. పాలకుడు. అతడు సర్వేంద్రియములకు నాధుడు, అతడు హృషీకేశుడు. అతడు సర్వులను నియమిస్తాడు, అతడు త్రిలోకాధిపతి అతడు త్రిజగములకు ఏకాధిపతి. అతడు పురుషోత్తముడు, అతడు అంతర్యామి. [sic: అంతర్పాలకుడు]

"సర్వస్య శరణం సుహృత్." అతడు అందరికీ స్నేహితుడు. అతడు అందరికి ఆశ్రయము, అతడు దుఃఖితులకు, ఆర్తులకు ఆశ్రయము. అతడు

కష్టాలలో ఉండేవారికి శరణ్యము. పరమేశ్వరునిలో ఆశ్రయం గొన్నవారిని కడగండ్లనుండి అతడు కాపాడుతాడు. పరమేశ్వరుడు సంకష్టనాశన పరాయణుడు, అతడు ప్రాణ ప్రయాణ ధమ విఘ్న వినాశకుడు. అతడు జగన్మిత్రుడు. అతడు నిజమైన సుహృత్తు, అతడు యధార్థమైన స్నేహితుడు ఎవరు ప్రతిఫలాపేక్ష లేకుండా మేలు చేస్తారో వారు స్నేహితులు. భగవంతుడు నిజమైన చెలికాడు. అతడు మనలనుండి ఏ ఫలాన్ని ఎదురుచూడడు, స్వప్రయోజన అభావే అతడు లోకానికి మేలుచేస్తాడు. అందువల్ల అతడు పరమ సుహృత్తు. అందువల్ల నేమనం పరమేశ్వరుని పాదాలు శరణు వేడుదాం,

ఈ మంత్రంలో మొదటి సగభాగం భగవద్గీతలోని పదుమూడవ అధ్యాయమునందలి పదునెనవ శ్లోకంలో వస్తుంది.

---

నవ ద్వారే పురే దేహీ
హంసో లోలాయతే బహిః ।
వశీ సర్వస్య లోకస్య
స్థావరస్య చరస్య చ ॥ 18 ॥

టీక: నవద్వారే పురే = తొమ్మిది ద్వారములు గల పురములో; దేహీ = విజ్ఞానాత్మ, దేహభృత్; హంసః = మరాళము, ఆత్మ; లోలాయతే = క్రీడించును; బహిః = వెలుపల; వశీ = నియామకుడు; సర్వస్య లోకస్య = సర్వప్రపంచముయొక్క; స్థావరస్య = స్థిరమైనవాటియొక్క; చరస్య = జంగమమైనవాటియొక్క; చ = మరియు;

భావము: అతడు తొమ్మిది ద్వారములుగల దేహ నగరమున నివసించును. అతడు బాహ్య ప్రపంచములో క్రీడించు హంస (ఆత్మ). అతడు జంగమ స్థావరాత్మకమైన సకల భూత ప్రపంచము నెల్ల నియమించు స్వామి,

వివరణము: "నవద్వారే పురే." తొమ్మిది ద్వారములుగల నగరములో, అనగా నవద్వారములు గలిగిన శరీరమనెడి పురములో శరీరంలోని

తొమ్మిది ద్వారాలు ఏవి? "నవద్వారే శిరసి సప్తద్వారాణి ద్వే అవాచీ పురే"· ఏడు ద్వారాలు (రెండు కన్నులు, రెండు చెవులు. రెండు నాసికా రంధ్రాలు, ఒక నోరు) శిరోభాగంలోను, రెండు ద్వారాలు (గుదము, లింగము) నిమ్న భాగంలోను ఉన్న నవద్వార పురము అనెడి శరీరములో.

పురమేకాదశద్వారమ జస్యావక్ర చేతసః ।
అనుష్ఠాయ న శోచతి విముక్తశ్చ విముచ్యత ।
ఏతత్ వై తత్ ॥ — కఠోపనిషత్తు.

శాశ్వత జ్ఞానముగల అజుని (బ్రహ్మముయొక్క) పురమునకు పదునొకండు ద్వారములు గలవు. ఆ బ్రహ్మమును అర్చించినవాడు శోకమును పొందడు· అతడు సకల అజ్ఞాన బంధములనుండి విడివడి ముక్తుడగును. ఇది వాస్త వములో అది. కఠోపనిషత్తులో 'పురం ఏకాదశ ద్వారం', (CITY WITH ELEVEN GATES), 'పదునొకండు ద్వారములుగల నగరం' అనిచెప్ప బడింది. దేహపురానికి ద్వారాలు పదునొకండు అని చెప్పబడింది. అవేవనః రెండు కనులు, రెండు వీనులు, రెండు నాసారంధ్రములు, నోరు, బొడ్డు గుదము, లింగము, కపాలమందలి బ్రహ్మరంధ్రము.

"దేహీ" విజ్ఞానాత్మ, దేహధారి. ఈదేహం పురంలాంటిది పురానికి అను బంధాలు ఉన్నట్లే ఈదేహానికి అనుబంధాలు ఉన్నాయి. పురానికి ద్వారపాలకులు· వారినినియమించేవారు ప్రభృతులు ఉంటారు దేహంలోని చక్షువులు మున్నగునవి ద్వారాలుగ ఉన్నాయి. ఈ ఇంద్రియముల అధిష్ఠాన దేవతలు వాటి నియామకు లుగ ఉన్నారు. పురం ఒక రాజు అధీనంలో ఉంటుంది. అ రాజు స్వతం త్రుడై యుంటాడు. రాజు పురంతో కలియడు, రాజు వేరు, పురం వేరు, రాజు· పురం ఒకటి గాదు. అలాగే ఈ దేహం ఒక రాజుకు (ఆత్మకు) చెందినది ఆత్మ స్వతంత్రమైనది. అది దేహంతో మిశ్రమం కాదు. ఈ దేహపురం అజుడైన బ్రహ్మమునకు చెందినది అతడు దేహము గురియగు షడ్ భావ వికారములు లేనివాడు. ఆత్మ రాజుస్థానము ఆక్రమిస్తుంది. ఈ దేహనగరము నకు స్వామియైన రాజు ఆత్మ.

"హంసః లోలాయతే బహిః." హంస బాహ్య ప్రపంచములో

క్రీడించును. అతడు (ఆత్మ) ఆ విద్యా కార్యమును నాశముచేయుటచే హంసయని పిలువబడినాడు. అతడు పథముపై ప్రయాణించుటచే ఇంతకు మునుపు హంసయని పిలువబడినాడు. హంస అంటే పక్షిశ్రేష్ఠమైన మరాళం. హంస సరోవరంలో క్రీడిస్తుంది దానికి నీటివలన ఏదోషం కలుగదు. అలాగే పరమేశ్వరు ఈ విశ్వంలో క్రీడ సలుపుతాడు (లోలాయతే). అతడు తన లీలచే నిర్లిప్తుడుగా ఉంటాడు. తొమ్మిది ద్వారాల పట్టణంలో దేహియై జీవాత్మ (హంస) యావద్ విశ్వాన్ని, అనగా సచరాచర జగత్తును వశంచేసుకొంటూ బహ్యవస్తువులను కురంగటకు చలిస్తుంది.

"వశీ సర్వస్య లోకస్య స్థావరస్య చరస్య చ." అతడు జంగమ స్థావరాత్మకమైన సకల భూత ప్రపంచమునెల్ల నియమించును.

సర్వ కర్మాణి మనసా
సంన్యస్యాస్తే సుఖం వశీ ।
నవ ద్వారే పురే దేహీ
నైవ కుర్వన్ న కారయన్ ॥ — గీతా.

Mentally renouncing all actions and self-controlled, the embodied one rests happily in the nine-gated City, neithear acting nor causing body and senses to act.

మానసికముగ అన్ని కర్మలను విడిచిపెట్టి- ఆత్మ నిగ్రహము గలవాడై. దేహి తొమ్మిది ద్వారముల నగరమున సుఖముగా విశ్రమించును. తానేమియు చేయక. దేహేంద్రియములచే చేయింపక యుండును.

ఇంద్రియాలను నిగ్రహించిన యోగిపుంగవుడు వివేకంతో సర్వకర్మల్ని త్యజిస్తాడు. అతడు కర్మలో అకర్మను చూస్తాడు. అతడు తొమ్మిది రంధ్రాలు గలిగిన ఈ దేహంలో హాయిగా విశ్రమిస్తాడు. అతనికి చింతలు, బాధలు, ఆవేదన, భయము లేదు. అతని మనస్సు ప్రశాంతంగా ఉంటుంది. అతడు బ్రహ్మానందాన్ని అనుభవిస్తాడు. ఈ నవ ద్వార పురానికి పరమాత్మ ప్రభువు, ఆ పురవాసులు ఇంద్రియాలు, మనస్సు, చిత్తము, బుద్ధి.

పామరుడు(అజ్ఞాని)తానుకుర్చీలో విశ్రమిస్తున్నాను అనిఅంటాడు. ఆత్మ పంచభూతాత్మకమైన దేహమునుండి వేరైనది యని తెలుసుకొన్న జ్ఞాని తాను

ఈ దేహంలో విశ్రమిస్తున్నాను అని అంటాడు.

"వశీ సర్వస్య లోకస్య స్థావరస్య చరస్య చ." అతడు జంగమ స్థావరాత్మకమైన సకల భూత ప్రపంచమునెల్ల నియమించును.

ఆత్మజ్ఞానాన్ని పడయుటకు సుసమాహితుడై యుండాలి. వివేకపూర్వక వైరాగ్యంతో సర్వకర్మల్ని త్యజించి, దేహతాదాత్మ్య భావనను విడనాడి, అనవరతము బ్రహ్మధ్యానము సలుపాలి. జ్ఞానమును పడిసి ఆత్మానందమును పొందాలి.

శ్వేతాశ్వతరోపనిషతులో, భగవద్గీతలో దేహము నవద్వారపురమని వర్ణితమైనది, కఠోపనిషత్తులో దేహాన్ని ఏకాదశద్వారపురమని చెప్పబడింది. బొడ్డును, బ్రహ్మరంధ్రాన్ని మినహాయిస్తే ఈ దేహం నవద్వార పురం ఔతుంది.

భగవంతుని మనము ఎందువలన అది, మహాపురుషుడనుచున్నామో దానికి కారణము తరువాతి మంత్రమున చెప్పబడుచున్నది.

**అపాణిపాదో జవనో గ్రహీతా**
**పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః ।**
**స వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా**
**తమాహురగ్ర్యం పురుషం మహాంతమ్ ॥ 19 ॥**

టీక; అపాణిపాదః = చేతులు, కాళ్ళులేకుండ; జవనః = దూరగామీ, వేగముగపోవును; గ్రహీతా = సర్వగ్రాహీ, గ్రహించును, పట్టుకొనును; పశ్యతి అచక్షుః = నేత్రములులేకుండ దర్శించును; సః = అతడు; శృణోతి అకర్ణః = చెవులు లేకుండ వినును; సః = అతడు వేత్తి = తెలిసికొనును; వేద్యం = తెలిసికొవలసినది; న = లేదు: చ = మరియు; తస్య = అతనియొక్క; అస్తి = ఉన్నాడు; వేత్తా = తెలిసినవాడు; తమ్ = అతనిని; ఆహుః = చెప్పుదురు; అగ్ర్యం = ప్రథమం, మొదటిది; పురుషం = పురుషుని; మహాంతం = గొప్పవాడైన.

భావము: కాళ్ళు, చేతులు లేకుండ అతడు దూరగామి, సర్వగ్రాహి.. నేత్రాలు లేకుండ అతడు చూచును. కర్ణములు లేకుండ అతడు వినును

తెలియవలసినదంతయు అతడెరుంగును. అతనిని తెలిసికొన్న వారెవరు లేరు అతనిని ప్రధముడని, పురుషోత్తముడని పిలుతురు.

వివరణము: "అపాణిపాదః జవనః గ్రహీతా", అతడు చేతులు లేకుండ అన్నిటిని గ్రహిస్తాడు. కాళ్ళులేకుండా చాలా దూరం పయనిస్తాడు. "పశ్యతి అచక్షుః సః శృణోతి అకర్ణః". అతడు కండ్లు లేకుండ సర్వం చూస్తాడు. అతడు వీనులు లేకుండ అంతావింటాడు.

అనగా భగవానుడు ఇంద్రియములు లేకుండా గ్రహిస్తాడు, నడుస్తాడు, చూస్తాడు, వింటాడు. ఇంద్రియములు లేకుండా ఇవి ఎలా సాధ్యమౌతాయి? పరమేశ్వరుడు సర్వశక్తిమంతుడు కాబట్టి, పరమేశ్వరుడు చిత్‌స్వరూపుడు (EMBODIMENT OF PURE CONSCIOUSNESS) కాబట్టి ఇది సాధ్యం. పరాత్పరునకు, ఏది చేయవలెనన్నా ఏ పనిముట్టులుగాని, ఏసాధనాలుగాని, ఏకరణాలుగాని, ఏఅవయవాలు గాని అవసరములేదు

"సః వేత్తి వేద్యం" అతడు తెలియవలసినదంతయు ఎరుంగును. అతడు సర్వజ్ఞుడు, భూత, భవిష్యత్ వర్తమానములు అన్నియు అతడెరుంగును, అతడు పరమజ్ఞాన స్వరూపుడుగావున, వేదములకు యోని గావున అతడు తెలియవలసినదంతయు తెలిసినవాడని వర్ణింపబడినాడు.

"న చ తస్య అస్తి వేత్తా" అతనిని తెలుసికొన్న వారెవరు లేరు. అతని ఉనుకవను తెలుసికొన్నవారు లేరు. "వేద న చైవ కశ్చిత్ (None understands it at all), ఎవరు దాన్ని (ఆత్మను) అర్థం చేసుకోలేరు. వజ్రాలు, వైడూర్యాలు, మణులు, ముత్యాలు కొనేవారు చాలా స్వల్ప సంఖ్యలో ఉంటారు M. A., లు, M. Sc, లు చదివేవారు తక్కువ సంఖ్యలో ఉంటారు. అలాగే ఆత్మసాక్షాత్కారం కోసం యత్నించేవారు, వాస్తవంలో సత్యాన్ని దర్శించినవారు బహు స్వల్పసంఖ్యలో ఉంటారు. నిజమైన సాధకులు కూడ చాలా అరుదుగా ఉంటారు. అదువల్లనే భగవద్గీతలో భగవంతుడు ఇలా అంటాడు.

మనుష్యాణాం సహస్రేషు
కశ్చిద్ యతతి సిద్ధయే ।

యతతామపి సిద్ధానాం
కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥ —గీతా

వేలకొలది మనుజులలో ఏ ఒక్కడో సిద్ధికోసం యత్నిస్తాడు. ఆ విజయో పేతులైన సిద్ధులలోకూడ ఏ ఒక్కడో నన్ను తత్త్వతః తెలిసికొంటాడు.

అందువల్ల బ్రహ్మమును తత్త్వతః తెలుసుకోవడం, బ్రహ్మజ్ఞానాన్ని పడయడం ఎంత కష్టమైన విషయమో గ్రహింపవచ్చు. కాని, సాధన చతుష్టయ సంపన్నుడైన, శ్రద్ధాళువైన, భక్తి తత్పరుడైన, దృఢనిశ్చయుడైన, సుశీలుడైన, సువ్రతుడైన, అయఃసంకల్పుడైన సాధకుడు ఆత్మజ్ఞానాన్ని సుసుఖంగా సులభంగా, పడయవచ్చు

"తం ఆహుః అగ్ర్యం పురుషం మహాంతం అతనిని ప్రథముడని, పురుషోత్తముడని పిలుతురు. దేవతలకు, మహర్షులకు భగవంతుడు ఆదికారణుడు. దేవతలు, మహర్షులు అతని పుట్టువును ఎరుగరు. కావున భగవంతుని ప్రథముడందురు అతడు సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు, సర్వవ్యాపి, చిత్స్వరూపము అగుటచే అతనిని పురుషోత్తముడను చున్నారు

ఆత్మసాక్షాత్కార ప్రాప్తికి భగవదనుగ్రహము యొక్క ఆవశ్యకత తరువాతి శ్లోకమున తెలుపబడుచున్నది.

**అణోరణీయాన్ మహతో మహీయాన్**
**ఆత్మా గుహాయాం నిహితోఽస్య జంతోః ।**
**తమక్రతుం పశ్యతి వీతశోకో**
**ధాతుః ప్రసాదాన్మహిమానమీశమ్ ॥ 20 ॥**

టీక: అణోరణీయాన్ = అణోః అణీయాన్ = సూక్ష్మతమమైన దానికంటే సూక్ష్మతరమైనది; మహతః మహీయాన్ = మహత్తమమైన దానికంటే మహత్తరమైనది; ఆత్మా = పరమాత్మ; గుహాయాం = హృదయమునందు; నిహితః = గూఢమైయున్నది, దాగియున్నది; అస్యజంతోః = ఈ ప్రాణియొక్క; తమ = అతనిని; అక్రతుం = కోరికలు లేని; పశ్యతి = చూచును; వీతశోకః = శోకరహితుడు; ధాతుః = సృష్టికర్తయొక్క;

ప్రసాదాత్ = అనుగ్రహము వలన; మహిమానం = గొప్పదైన; ఈశమ్ = ప్రభువును

భావము: సూక్ష్మతమమైన దానికంటె సూక్ష్మతరమైనట్టియు, మహత్తమమైన దానికంటె మహత్తరమైనట్టియు ఆత్మ ప్రాణికోటి హృత్సీమలో నిహితమైయున్నది కోరికలులేని సృష్టికర్తయొక్క అనుగ్రహమువలన నరుడు సర్వశోకములనుండియు ఈ షణ్మల నుండియు ముక్తుడై, అతనిని మహిమాన్వితుడైన ప్రభువుగ తెలిసికొనును.

వివరణము: "అణోః అణీయాన్ మహతః మహీయాన్" ఆత్మ సూక్ష్మానికంటె సూక్ష్మమైంది, గొప్పదానికంటే గొప్పదైంది. ఏకైక ఆత్మ సమస్త విశ్వాన్ని వ్యాపించి యుంది. అది అనంతం, అందుచేత ఆత్మ సూక్ష్మని కంటె సూక్ష్మమైనది, గొప్పదానికంటె గొప్పదైనది.

"ఆత్మా గుహాయాం నిహితః అస్య జంతోః" ఆత్మ ప్రాణికోటి ప్రతి హృదయంలో నిహితమైయుంది (The Atman is hidden in the heart of each living being) "అహం ఆత్మా గుడాకేశః సర్వభూతాశయ స్థితః ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి" ఈ భావములపై బ్రహ్మ జిజ్ఞాసువులు సదా ధ్యానించుచుందురు. బ్రహ్మము మొదలుకొని పిపీలిక వరకు ప్రతి ప్రాణియొక్క హృదయంలో ఆత్మ ఆసీనమై యుంది. చీమయొక్క ఆత్మ ఏనుగు యొక్క ఆత్మ ఒక్కటే. అన్ని ప్రాణులలో ఒకే ఒక చైతన్యం ఉంది, ఈ ప్రపంచములో ఉండేవస్తువుల కన్నిటికి ఆధారంఆత్మయే. పాము దారముమీద అధ్యారోపితమైనట్లు ఈ ప్రపంచమంతయు పరమాత్మపై ఆరోపింపబడినది. ప్రపంచానికి ఆత్మనుండి వేరైన స్వతంత్రమైన అస్తిత్వము లేదు.

"తం అక్రతుం పశ్యతి వీతశోకః". కోరికలనుండి ముక్తుడైనవాడు, తనమనస్సును, ఇంద్రియములను శాంతింపజేసి ఆత్మయొక్క దివ్యవైభవాన్ని దర్శించి, శోకరహితుడౌతాడు. (He who has given up all desires for enjoyments of this ephemeral world and the cther worlds and who has restrained his mind and senses and rendered

them serve and calm, attains self-realisation and hence, is freed from sorrow of grief. ఇహలోక పరలోకభోగ వాంఛల నన్నింటిని త్యజించినవాడు; మనస్సును, ఇంద్రియాలను నిగ్రహించిన వాడు, వానిని ప్రశాంతపరచినవాడు ఆత్మ సాక్షాత్కారమును పడయును. అందుచేత అతడు సకల విధ దుఃఖనివృత్తిని పొందుతాడు. అతడు శోకమును దాటుతాడు.

"ధాతుః ప్రసాదాత్ మహిమానం ఈశమ్," పరమేశ్వరుని అనుగ్రహము వలన అతనిని మహిమాన్వితుడైన ప్రభువుగ తెలిసికొనును."ఇంద్రియాల్ని, మనస్సును ధాతువులు అని పిలుస్తారు." అవి దేహానికి ఆధారముగ ఉంటాయి. కావున వానిని ధాతువులు అన్నారు, ధాతుః ప్రసాదాత్ అనగా సృష్టికర్త యొక్క అనుగ్రహము వలన పరమేశ్వరుని అనుగ్రహంవల్ల అతడు ఆత్మ వైభవాన్ని దర్శిస్తాడు, ఈ మంత్రం చాల ముఖ్యమైనది. అద్వైత సాక్షాత్కారానికి పరమేశ్వరుని అనుగ్రహం చాల అవసరం, అనుగ్రహం సిద్ధాంతం (The doctrine of grace) ప్రప్రథమంగా స్పష్టం చేయబడింది. ఇది ద్వైతపరమైన వ్యాఖ్య.

శ్రీ శంకరులవారు "ధాతుః ప్రసాదాత్" అనే దాన్ని ధాతుః సంప్రసాదాత్ అని వివరణ చేస్తారు. ధాతుః సంప్రసాదాత్ అనగా మనస్సుయొక్క, ఇంద్రియముల యొక్క ప్రశాంతతవలన, మనస్సు, ఇంద్రియములు ప్రశాంతమైన పిదప యోగి సంతత గాఢ ధ్యానమున లీనుడగును. ఆ సమాధి స్థితి యందు మహిమాన్వితుడైన భగవంతుని సాక్షాత్కరించుకొనును.

ఇదే మంత్రం కఠోపనిషత్తులో రెండవ వళ్ళిలో, ఇరువదవ మంత్రంగా వస్తుంది, అలాగే మహానారాయణోపనిషత్తులో గూడ ఇదే మంత్రం వస్తుంది.

తరువాతి మంత్రము మంత్రద్రష్టయొక్క అనుభవమును చాటుచున్నది

**వేదాహమేతమజరం పురాణం**
**సర్వాత్మానం సర్వగతం విభుత్వాత్ ।**
**జన్మనిరోధం ప్రవదంతి యస్య**
**బ్రహ్మవాదినో హి ప్రవదంతి నిత్యమ్ ॥ 2 ॥**

టీక: వేద = తెలియుదును; అహం = నేను; ఏతం = అతనిని; అజరం = ముసలితనములేని; పురాణం = ప్రాచీనమైన, సనాతనమైన; సర్వ ఆత్మానం = అందరియొక్క ఆత్మ; సర్వగతం = సర్వవ్యాపియైన; విభుత్వాత్ = అతనియొక్క సర్వవ్యాపిక స్వభావమువలన; జన్మనిరోధం = జన్మరహితమైన; ప్రవదంతి = ప్రకటింతురు, పల్కుదురు; యస్య = ఎవనియొక్క; బ్రహ్మవాదినః = బ్రహ్మమును తెలిసినవారు; హి = నిజముగా; ప్రవదంతి = వక్కాణింతురు; నిత్యమ్ = నిత్యమైన, శాశ్వతమైన.

భావము: ఎవనిని బ్రహ్మవిదులు జన్మరహితుడనియు, నిత్యుడనియు, ప్రకటింతురో, ఎవడు సర్వవ్యాపనశీలత్వాత్ సర్వగతుడో అటువంటి ఈఅజరమైన. పురాతనమైన, అందరికి ఆత్మయైన బ్రహ్మమును నేను ఎరుంగుదును.

వివరణము: "వేదాహమేతం." వేద అహం ఏతం. నేను అతనిని ఎరుంగుదును I Know Him నేను అనగా శ్వేతాశ్వతర ఈ పరమఋషి ఆత్మను తెలిసికొన్నాడు. అతడు ఆత్మసాక్షాత్కారం పొందినాడు. అతడు తత్త్వదర్శి. అతడు పరమేశ్వరుని అనుగ్రహము, గురుకృపాకటాక్షము పడసిన మహా తపస్వి. అందువల్లనే అతడు ధైర్యంగా "వేదాహమేతం" అనినుడువుచున్నాడు. అతడు బ్రహ్మవిదుడు, కావున అతడు సత్యమున, తన ఆధ్యాత్మిక అనుభవమును జగతికి ప్రకటించుచున్నాడు.

"అజరం పురాణం" అతడు ముసలితనములేనివాడు, పురాతనమైనవాడు. దేహం పుట్టుతుంది, పెరుగుతుంది, క్షీణిస్తుంది. చస్తుంది, దానికి షడ్భావవికారాలు ఉన్నాయి. అది సప్తధాతు నిర్మితం, అది పంచభూతాత్మకం దాన్ని ఎంత జాగ్రత్తగా పోషించినప్పటికి అది శ్లథసంధి జర్జరమై పడిపోతుంది. ఆత్మ అజరమైంది. దానికి పుట్టుకలేదు. దానికి అవయవాలు లేవు. అది అఖండం అది అశరీరం. అది అనంతం. అది అవ్యయం. అది నిత్యం. అనంతాత్మకు, సర్వవ్యాపియగు ఆత్మకు పుట్టుక క్షీణత ముసలితనము, చావు ఎలా ఉండగలవు? పురాణం అనగా పురాతనమైన, బ్రహ్మము పురాతనమైనది. హిరణ్యగర్భుడు, మనువు, ఋషులు, దేవతలు — వీరిపుట్టుకకు

ముందే బ్రహ్మము. బ్రహ్మము సర్వమునకు యోని, అది ఆది కారణము, అందువల్ల బ్రహ్మము పురాణమైనది, పురాతనమైనది. కావున బ్రహ్మమును ఆదిపురుషుడు అంటారు.

"సర్వాత్మానం" అనగా అందరి యొక్క ఆత్మ. మనం బ్రహ్మము యొక్క అస్తిత్వాన్ని ఒప్పుకొన్నా, ఒప్పుకోక పోయినా అతడు వెలుగొందు చున్నాడు. అతడు సర్వ భూతాంతరాత్మయై భాసిల్లుచున్నాడు.

"సర్వగతం విభుత్వాత్" పరమేశ్వరుడు వ్యాపన శీలముగలవాడగు టచే అతడు సర్వగతుడైనాడు, పరమేశ్వరుడు అంతట నిండి నిబిడీకృతమై యున్నాడు, అతడు లేనిచోటు లేదు. అతడు లేని అణువు లేదు. అతడు సర్వ వ్యాపి. అతడు అప్రమేయుడు; అతడు అనంతుడు; అతడు అద్వైత వస్తువు.

"జన్మనిరోధం ప్రవదంతి యస్య బ్రహ్మవాదినః హి ప్రవదంతి నిత్యమ్" బహ్మవిదులు అతనిని జన్మరహితుడనియు, నిత్యుడనియు ప్రక టింతురు. "జన్మనిరోధం" జన్మరహితమైన అని అర్థము ఆత్మకు పుట్టుక లేదు. ఆత్మ స్వయంభువు. ఆత్మ సర్వమునకు యోని. మూలకారణం. జన్మ గలదానికి మృత్యువు ఉంటుంది. ఆత్మ అమృతమైనది. అది అనాది ఇక దానికి పుట్టుక ఎలా ఉండగలదు?

బహ్మవాదినులు ఆత్మకు జన్మలేదని ప్రకటింతురు. బ్రహ్మము అజము, అజరము, అమరము. బ్రహ్మమునకు పుట్టుకగాని, ముసలితనము గాని, మృత్యువుగాని లేదు. అదిశాశ్వతము, పురాణము, అనంతము. మనము మన అన్వేషణ ప్రారంభించుటకు పూర్వమే అతడు (బ్రహ్మము) ఉన్నాడు. అతడే విచారించువాడు. అతడే విచారణీయ వస్తువు, అతడే విచారణా విధా నం కూడ.

బ్రహ్మవిదులు బ్రహ్మమును నిత్యమని పల్కుదురు. బ్రహ్మము సత్య వస్తువు. అది సార వస్తువు. అది సర్వమునకు అధిష్ఠానము. సత్య మునకు త్రికాలములందు మార్పులేదు. మారుచున్న వస్తువు సత్యముకానేరదు. పరిపూర్ణ సత్యమునకు ఏ వికారముగాని, మార్పుగాని, మృత్యువు గానిలేదు. What is unchanging must be real. What is changing is unreal

బ్రహ్మము సత్ పదార్థము. ఆదిసత్యము. కావున బ్రహ్మము మార్పులేనిది. అది అవిక్రియము. అది అవిక్రియము కావున నిత్యమైనది. బ్రహ్మము అది నిత్యము, సత్యము.

ఈ మంత్రమునందలి రెండవ అర్థభాగములో ప్రవదంతి, ప్రవదంతి అని రెండుసార్లు రావడం అధ్యాయ పరిసమాప్తిని స్ఫురింపజేస్తుంది.

"ఇతి శ్వేతాశ్వతరోపనిషద్ భాష్యే"

తృతీయోఽధ్యాయః

# చతుర్థోఽధ్యాయః

## నాలుగవ అధ్యాయము

య ఏకోఽవర్ణో బహుధా శక్తియోగాత్
వర్ణాననేకాన్ నిహితార్థో దధాతి ।
విచైతి చాంతే విశ్వమాదౌ చదేవః
స నో బుద్ధ్యా శుభయా సంయునక్తు ॥ 1 ॥

టీక: యః = ఎవరు; ఏకః = ఒకటి; అవర్ణః = వర్ణరహితమైన. రంగులేని. జాత్యాదిరహితమైన; బహుధా = అనేక విధములలో, శక్తియోగాత్ = తన స్వీయశక్తి వలన; వర్ణాన్ = రంగులు; అనేకాన్ = వివిధములైన; నిహితార్థః = అగృహీత ప్రయోజనముతో; దధాతి = సృష్టించును; విచైతి; = లయమొనరించును; చ = మరియు; అంతే = అంతమున; విశ్వం = ప్రపంచమును; ఆదౌ = మొదట; చ = మరియు దేవః ఏజ్ఞానైకరస పరమాత్మ: సః - అతడు; నః = మమ్ములను: బుద్ధ్యా = బుద్ధితో, శుభయా = నిష్కలమైన, మంగళ ప్రదమైన. పరిశుద్ధమైన. నిర్మలమైన, నిరంజనమైన; సంయునక్తు = సంయోజయత్, సంయుక్తపరచుగాక,

భావము; అద్వితీయుడైన భగవంతుడు తాను అవర్ణుడై యున్నప్పటికిని తనని స్వకీయ శక్తితో, స్వార్థాపేక్షారహితుడై, వివిధ భంగులలో నానా రకములైన రంగులను సృజించును, తుదియందు యావత్ప్రపంచమును తన

యందు అతడు లీనము గావించుకొనును. ఆ పరమేశ్వరుడు మమ్ము పరిశుద్ధ బుద్ధి సమన్వితులను చేయుగాక.

వివరణము: "యః ఏకః అవర్ణః" ఎవడు అద్వితీయుడో, అవర్ణుడో, పరమాత్మ ఒక్కడే, అతడు అద్వితీయుడు. పరమాత్మ అనంతము, అనంతము ఒక్కటే. రెండు అనంతములు ఉండవు. కావున పరమాత్మ ఏకము. అతడు అవర్ణుడు. అతడు జాత్యాదిరహితుడు. అతడు నిర్విశేషుడు. కాంతికిరణానికి రంగులేదు. కాని, అది పట్టకం (Prism) గుండా వెళ్ళేటప్పుడు అనేక వర్ణాలుగ విశ్లేషింపబడుతుంది. బ్రహ్మము అవర్ణుడు. అనగా అతడు నిరాకారుడు నిరాకార బ్రహ్మము తన స్వయం లీలకోసము అనేక రూపాలు ధరిస్తాడు.

"బహుధా శక్తియోగాత్ వర్ణాన్ అనేకాన్" అనేక విధములలో తన స్వీయ శక్తివలన, అనేక విధములలో పరమాత్మ అనేక వర్ణాలను సృష్టిస్తాడు. ఈ సృష్టి ఎలా జరుగుతుంది? అనేక శక్తులతో తన సంయోగము వలన ఈ విభిన్న వర్ణాదులు జనిస్తాయి.

"నిహితార్థః దధాతి విచైతి చ అంతే విశ్వం ఆదౌ చ దేవః" విజ్ఞానైకరస పరమాత్మ అగృహీత ప్రయోజనముతో విశ్వమును సృష్టించి, రక్షించి, తుదియందు లయమొనర్చును. పరమాత్మకు స్వార్థాపేక్ష ఏమియూ లేదు స్వయం లీలకోసం ఈ విశ్వాన్ని సృజిస్తాడు, పోషిస్తాడు, కట్టకడపట తనలో లయం చేసుకొంటాడు భగవంతుడు అనగా దేవ, తన స్వభావుడైన విజ్ఞానైకరస పరమాత్మ. దేవుడు ప్రకాశస్వరూపుడు. అతడు అజ్ఞాన తిమిరమును తొలగించు స్వామి

"సః నః బుద్ధ్యా శుభయా సంయునక్తు." అతడు మమ్ము పరిశుద్ధ బుద్ధి శోభితుల నొనర్చుగాక. ఆత్మసాక్షాత్కారానికి సుసూక్ష్మమైన, పరిశుద్ధమైన బుద్ధి, అంతఃకరణం అవసరం. అందువల్ల అటువంటి బుద్ధిని కలుగజేయవలసినదని ప్రార్థింప బడుచున్నది.

---

తదేవాగ్నిః తదాదిత్యః
తద్వాయుః తదు చంద్రమాః ।

తదేవ శుక్రం తద్బ్రహ్మ
తదాపః తత్ ప్రజాపతిః ॥ 2 ॥

టీక : తత్ ఏవ = అదియే; అగ్నిః = అగ్ని; తత్ = అదియే; ఆదిత్యః = సూర్యుడు; తత్ = అదియే; వాయుః = వాయువు; తత్ = అదియే; ఉ = నిజముగా; చంద్రమాః = చంద్రుడు; తత్ ఏవ = అదియే; శుక్రం = నక్షత్ర ప్రకాశిత ఆకాశము; తత్ = అదియే; బ్రహ్మ = హిరణ్యగర్భుడు; తత్ = అదియే; ఆపః = నీరు; తత్ = అదియే; ప్రజాపతిః = ప్రజాపతి.

భావము: అదియే అగ్ని. అదియే ఆదిత్యుడు. అదియే వాయువు. అదియే చంద్రుడు. అదియే నక్షత్ర ప్రకాశిత ఆకాశము. అదియే హిరణ్యగర్భుడు. అదియే ఆపస్సు. అదియే ప్రజాపతి.

వివరణము : "తత్ ఏవ అగ్నిః తత్ ఆదిత్యః తత్ వాయుః తత్ ఉ చంద్రమాః" ఆ ఆత్మతత్త్వమే అగ్ని, సూర్యుడు, వాయువు, చంద్రుడు

"తదేవ" అనగా ఆ ఆత్మతత్త్వమే. తదేవ అనగా అదియే, ఆ ఆత్మతత్త్వమే పరమాత్మను నిర్దేశించుటకు ఋషీశ్వరులు పులింగ సర్వనామములను నపుంసకలింగ సర్వనామములను ఉపయోగించారు. ఒకే ఒక పరమాత్మయొక్క భిన్న భిన్నాంశములు అనేక విధములైన దేవతలు. అగ్ని, సూర్యుడు. వాయువు చంద్రుడు. నక్షత్రప్రకాశిత ఆకాశము, హిరణ్యగర్భుడు, ఆపస్సు, ప్రజాపతి —ఇవియన్నియు (వీరందరు) ఒకే ఒక ఆత్మతత్త్వము యొక్క విభిన్నాంశములు (Agni, Aditya etc, are only the different aspects of one and the same Divinity) తదేవాగ్నిః ఆ ఆత్మతత్త్వమే అగ్ని. అగ్నిదేవుడుపరబ్రహ్మాంశము ఇట్లే సూర్యుడు, వాయువు, చంద్రుడు మున్నగు దేవతలకూడ పరబ్రహ్మాంశములే.

"తత్ ఏవ శుక్రం" నక్షత్రప్రకాశితమైన ఆకాశము కూడ అదియే. ఆకాశముపైతము పరమాత్మయొక్క అంశమే, ఆఆత్మతత్త్వమే సర్వమూ.

"తత్ బ్రహ్మ" అదియే బ్రహ్మ. అదియే హిరణ్యగర్భుడు. సూక్ష్మశరీరములు నన్నింటిని వ్యాపించియున్న విశ్వాత్మయే హిరణ్యగర్భుడు.

"తత్ ఆపః తత్ ప్రజాపతిః." అదియే ఆపస్సు. అదియే ప్రజాపతి. ఆ ఆత్మయే ప్రజాపతి. సకల స్థూల దేహాలను వ్యాపించియున్న విశ్వాత్మయే విరాట్ పురుషుడే ప్రజాపతి. శ్రీ శంకరులవారు బ్రహ్మయనగా హిరణ్యగర్భుడనియు, ప్రజాపతియనగా విరాట్ పురుషుడనియు వివరించినారు.

ఈ అధ్యాయములోని రెండవ, మూడవ, నాలుగవ మంత్రములు పరమాత్మయొక్క సర్వరూపతను వర్ణించుచున్నవి

త్వం స్త్రీ త్వం పుమానసి
త్వం కుమార ఉత వా కుమారీ।
త్వం జీర్ణో దండేన వంచసి
త్వం జాతో భవసి విశ్వతోముఖః ॥ 3 ॥

టీక: త్వం = నీవు; స్త్రీ = ఇంతివి; త్వం = నీవు; పుమాన్ = పురుషుడవు; అసి = ఉన్నావు; త్వం = నీవు; కుమారః = యువకుడవు; ఉత = నిజముగ; వా = కూడ; కుమారీ = కన్యవు; త్వం = నీవు; జీర్ణః = ముదుసలివై, దండేన = ఊతకర్రతో, వంచసి = తూలుచున్నావు; త్వం = నీవు; జాతః = జన్మించితివి; భవసి = ఆగుచున్నావు; విశ్వతో ముఖః = సర్వత్ర నీ ముఖమును త్రిప్పియున్నవాడవు.

భావము: నీవు స్త్రీవి. నీవు పురుషుడవు. నీవు యువకుడవు. నీవు యువతివి; ఊతకర్ర నూని తూలుచు నడచు వృద్ధుడవుకూడ నీవు. విశ్వతో వదనుడవై నీవు జన్మించితివి.

వివరణము: స్త్రీలు, పురుషులు, బాలురు బాలికలు, యువకులు, యువతులు, చిన్నలు, పెద్దలు, శిశువులు, వృద్ధులు, ప్రపంచమునందలి సకల వస్తువులు బ్రహ్మముయొక్క వ్యక్తరూపములే (manifestations of Brahman only) వాస్తవములో అంతయూ బ్రహ్మమే. సర్వం ఖలు ఇదం బ్రహ్మ (All indeed is this Brahman).

"త్వం జాతః భవసి విశ్వతోముఖః" నీవు విశ్వతో ముఖుడవగుచు జన్మించితివి. బ్రహ్మముయొక్క వదనము ఎటుచూచినను కనబడును. అతని వదనము అన్నిదిక్కుల త్రిప్పబడియున్నది. అనగా బ్రహ్మము సర్వ

వ్యాపి విశ్వతో ముఖఃఅనుట పరమేశ్వరుని వ్యాపకత్వమును. విభుత్వమును సూచించును. (Viswathomukha indicates the immanence or omnipresence of the Lord).

ఈ మంత్రం మనల్ని ఉత్తేజితుల్ని చేస్తుంది. దీన్ని నిరంతరం స్మరిస్తూంటే మన మనస్సు ఉన్నత పరుపబడుతుంది. మనకు రాగద్వేషాలు తొలగుతాయి. ప్రపంచములో బ్రహ్మముకానిది ఏముంది? సర్వమూ బ్రహ్మమయమే. "సర్వం బ్రహ్మమయం రే రే సర్వం బ్రహ్మమయం" మనం ఈ మంత్రాన్ని స్మరిస్తూంటే ఆత్మైకాన్ని పొందుతాము. మనము అన్ని వదనాలలో పరమేశ్వరుని చూడగలుగుతాము.

నీలః పతంగో హరితో లోహితాక్షః
తడిద్గర్భ ఋతవః సముద్రాః ।
అనాదిమత్ త్వం విభుత్వేన వర్తసే
యతో జాతాని భువనాని విశ్వా ॥ 4 ॥

టీక: నీలః = నీలివర్ణముగల: పతంగః = ఈగ; హరితః = ఆకుపచ్చని చిలుక; లోహితాక్షః = ఎర్రని కన్నులు గలది; తడిద్ గర్భః = పిడుగు మేఘము; ఋతవః = ఋతువులు; సముద్రాః = మహాసముద్రములు; అనాదిమత్ = ఆదిలేనివాడు; త్వం = నీవు; విభుత్వేన = ఐశ్వర్యమున; వర్తసే = వెలయుచున్నావు. ఉన్నావు; యతః = దేని నుండి; జాతాని = జన్మించినవి; భువనాని = ప్రపంచములు; విశ్వా = అన్ని సమస్తము

భావము: నీవు నీలివర్ణముగల పతంగమవు: నీవుఎర్రని లోచనములు గల ఆకుపచ్చని చిలుకవు నీవు గర్జించు మేఘమవు. నీవు ఋతువులు, మహాసముద్రములు. నీకు ఆదిలేదు. నీవు అనంతుడవు. సకల భువనములు నీ నుండియే ఉద్భవించినది.

వివరణము: "నీలః పతంగో..............ఋతవః సముద్రాః"
ఈగ, చిలుక, మేఘము, ఋతువులు, సముద్రములు—ఇవన్నియు

భగవంతుని వ్యక్తస్వరూపములే. ఈగకు, చిలుకకు, మేఘానికి, కాలములకు, సముద్రములకు పరమకారణము పరబ్రహ్మమే. మన గోచరించు వస్తువు లన్నియు పరమేశ్వరుని విభూతే. వ్యక్తస్వరూపములే. సర్వం బ్రహ్మమయం రేరే అంతయూ బ్రహ్మమే, అన్నీ మనుష్యుల వాసుదేవుడే

"అనాదిమత్ త్వం విభుత్వేన వర్తసే", నీవు ఆదిలేనివాడవు ఐశ్వర్యముతో వెలయుచున్నావు. పరమేశ్వరుడు అనాదిమత్ అతడు ఆదిలేని వాడు. భగవంతుడు విశ్వతోముఖుడు. అతడు సర్వవ్యాపి. అతడు అనంతుడు. అనంతునకు ఆది ఎలా ఉంటుంది కార్యాలకు మాత్రమే ఆది యుండ గలదు. కారణ రహితకారణమైన పరమేశ్వరునకు ఆది ఎలా ఉండగలదు? అనంతుడైన పరమాత్మకు ఆది యుండడం ఎలా సాధ్యం పరమాత్మ అన్నిటికి పరమ కారణమే.

"యతో జాతాని భువనాని విశ్వా" అన్నిలోకములు ఆ పరమాత్మ నుండియే పుట్టినవి పరమేశ్వరుడు పరమ యోని. అతడు అన్నింటికి మూల కారణము. ఆ పరమేశ్వరుని నుండియే అఖిల జగములు ఉద్భవించుచున్నవి. పరమేశ్వరుడు అన్ని విశ్వములను ఒక్క అంశముతో భరించుచున్నాడు

"విష్టభ్యాహం ఇదం కృత్స్నం ఏకాంశేన స్థితో జగత్"—గీతా నేను ఈ జగత్తు నంతయును ఒక్కస్వల్పాంశముచే వ్యాపించియున్నాను. "పాదోఽస్య విశ్వా భూతాని" సర్వభూతములు ఈతని యొక్క ఒక్కపాదమని మంత్ర వర్ణము తెల్పుచున్నది.

అఖండ వస్తువు, అనంతము, పరిపూర్ణము అయినటువంటి పరమేశ్వరునిలో (పరమాత్మలో) భాగాలు, అంశాలు లేవు. ఈఅంశాలు కల్పితములు, ఊహితములు (These ports or partions in Brahman are fictitions and imaginary)

అజామేకాం లోహితశుక్లకృష్ణాం
బహ్వీః ప్రజాః సృజమానాం సరూపాః ।
అజో హ్యేకో జుషమాణోఽనుశేతే
జహాత్యేనాం భుక్తభోగామజోఽన్యః ॥ 5 ॥

టీక: అజాం = పుట్టుకలేని స్త్రీ; ఏకాం = ఒకటి; లోహిత శుక్ల కృష్ణాం = ఎఱుపు, తెలుపు, నలుపు రంగులు; బహ్వీః = అనేక; ప్రజాః = సంతానము. బిడ్డలు; సృజమానాం = పుట్టించునది; సరూపాః అదేరూపముల; అజః = పుట్టుకలేని పురుషుడు; హి = నిజముగ; ఏకః = ఒకడు; జుషమాణః = ఆకర్షింపబడి, ప్రేమింపబడి: అనుశేతే = ఆమె ప్రక్కన పరుండును; జహాతి = త్యజించును; ఏనాం = ఆమెను; భుక్త భోగాః = ఆమెను అనుభవించి, అజః = పుట్టుకలేని పురుషుడు; అన్యః = ఇతరుడు.

భావము: పుట్టుకలేని ఇంతి ఒకతె గలదు. ఆమె ఎరుపు, తెలుపు, నలుపు వర్ణములతో శోభిల్లును. ఆమె తనవంటి ఆకారముగల అనేక ప్రజలను (బిడ్డలను) సృజించును. పుట్టుకలేని పురుషుడు ఒకడు ఆమెను ప్రేమించి, ఆమె ప్రక్కన పరుండును. అజుడైన (పుట్టుకలేని) మరొక పురుషుడు ఆమెను అనుభవించును తదుపరి ఆమెను వదలివేయును.

వివరణము: "అజాం ఏకాం" పుట్టుకలేని స్త్రీ యొకతె. ఈ స్త్రీకి పుట్టుకలేదు ఈమె ఎవరు? ఈమె మూల ప్రకృతి (Primordial Nature) దేహ క్షేత్రంలోని దశేంద్రియాలను పది వృషభాలు అనవచ్చు ఈ ఎద్దులు ఇంద్రియ విషయాలనెడి పొలంలో అహర్నిశములు ఎడతెగక పనిచేస్తాయి పంచ ప్రాణాలు ఐదుగురు సేద్యగాండ్రు. మనస్సును పర్యవేక్షకుడని, జీవాత్మను రైతు అని చెప్పవచ్చు క్షేత్రానికి యజమానురాలు మూల ప్రకృతి. క్షేత్రం ఆమె ఆస్తి. ఆమె తనస్వంత ఆస్తియైన క్షేత్రాన్ని బహుజాగ్రత్తగ చూస్తూం టుంది ఆమె త్రిగుణములతో అలరారుతూంటుంది. ఆ మూడు గుణాలను సత్త్వము. రజస్సు, తమస్సు అంటారు. రజస్సు పొలంలో విత్తనం నాటు తుంది, సత్త్వం దాన్ని పరిరక్షిస్తుంది; తమస్సు కోస్తుంది, మహత్ తత్త్వం (COSMIC MIND) అనెడి వనభూమిమీద కాలం అనెడి వృషభసాయంతో ఆమె (మూలప్రకృతి) ధ్యానాన్ని నూరుస్తుంది, జీవాత్మ దుష్కర్మలు చేసి యుంటే అది పాపమనెడి విత్తనాలు నాటుతుంది, పొలానికి చెడు అనెడి ఎరువు వేస్తుంది, పాపమనెడి పంటను కోస్తుంది; సంసార దుఃఖాలను

అనుభవిస్తుంది. దుష్కార్యాలొనరించిన జీవాత్మ జన్మను, క్షీణతను ముదుసలి తనాన్ని, వ్యాధులను, ఆధ్యాత్మిక, అధిదైవిక, అధిభౌతిక తాపములను అనుభవిస్తుంది. జీవాత్మ పుణ్యకర్మలను చేసియుంటే అది సద్గుణము అనెడి మంచి విత్తనాలను చల్లి, ఆనంద మనెడి పంటను పొందుతుంది.

"లోహిత శుక్ల కృష్ణాం." ఎరుపు తెలుపు, నలుపు, రంగులతో నొప్పారు ప్రకృతి. సత్త్వము, రజస్సు, తమస్సు అనెడి మూడు గుణములతో ప్రకృతి యుంటుంది సత్త్వము, శుచిత్వము, రజస్సు కామము, తమస్సు తిమిరము సత్త్వము తెలుపురంగు. రజస్సు ఎరుపురంగు, తమస్సు నలుపురంగు కొందరు వ్యాఖ్యాతలు అగ్ని ఎరుపురంగు అనియు, నీరు తెలుపురంగు అనియు, భూమి నలుపురంగు అనియు వివరిస్తారు. పృథివి, అప్పు, తేజస్సు—ఇవి మూల భూతాలు.

"అజామేకాం లోహిత శుక్ల కృష్ణాం" అనగా త్రిగుణాత్మక మాయా శక్తి, లేక ప్రకృతి.

"బహ్వీః ప్రజాః సృజమానాం సరూపాః" ఆమె తనను పోలిన బిడ్డలను అనేకులను సృజిస్తుంది. ప్రకృతిలో మనకు కనబడు వివిధ వస్తువుల్ని అసంఖ్యేయములైన ప్రకృతి సంతానం అనవచ్చు. బిడ్డలు తల్లి ప్రకృతిని పోలియుంటారు. ఆ సంతానం ప్రకృతి జన్యం కాబట్టి, ప్రకృతి కార్యాలు కాబట్టి తల్లిప్రకృతి రూపంలో (సరూపాః) ఉండడం సహజమే గదా! ప్రకృతిలోని మూలాంశాలే ఈ బిడ్డలలోకూడ ఉన్నాయి. అందువల్ల పిల్లలకు తల్లి పోలిక వచ్చింది. పిల్లలు అంటే సృష్టిలోని వస్తువులు. తల్లియంటే మూలప్రకృతి.

"అజః హి ఏకః జుషమాణః అనుశేతే" ఇంకొక పుట్టుకలేని పురుషుడు ఆమెచే ఆకర్షితుడై, ఆమెను ప్రేమించి, ఆమె ప్రక్కన పరుండును ఈ పురుషుడెవరు? ప్రకృతిమాతను ప్రేమించు ఇతడు విశ్వవ్యక్తి. ఇతడు సర్వప్రాణికోటికి తండ్రి. అతడు హిరణ్యగర్భుడు, బ్రహ్మ ఈ పురుషునికి బద్ధుడైన జీవాత్మగ కూడ భావించనగును.

"జహాతి ఏనాం భుక్త భోగాం అజః అన్యః" మరియు నింకొక పుట్టుక లేని పురుషుడు ఆమెను అనుభవించిన. తరువాత ఆమెను వదలివేయును.

మరియొక ప్రస్తుకలేని ఈ పురుషుడెవరు? ఇతడు ప్రకృతి బంధమునుండి ముక్తి నొందిన జీవాత్మ, అతడు జీవన్ముక్తుడు, అతడు మాయావశుడుగాక, పరమేశ్వరుని ధ్యానించి ఆత్మసాక్షాత్కారాన్ని పడసిన ధన్యజీవు.

ఈ మంత్రంయొక్క తాత్పర్యం ఏంటి ?

జీవాత్మ వస్తువును వదలి ఛాయవెంబడి పరుగెత్తుతాడు. అతడు ఇంద్రియ సుఖములవెంట పరుగెత్తుతాడు. అతడు ఘాటా దెబ్బలు తింటాడు. ఇంద్రియ భోగాలు దుఃఖ మిశ్రితాలు అని తెలుసుకొంటాడు. వాటి మిథ్యా స్వభావాన్ని అర్థం చేసుకొంటాడు అతడు మనుష్యత్వం యొక్క గొప్పతనాన్ని, పాత్రము ఖ్యాతను గ్రహిస్తాడు. అతడు మహాపురుషులతో సాంగత్యం చేస్తాడు. అతడు వారినుండి బోధ పొందుతాడు. అతడు ఆత్మసాక్షాత్కారాన్ని కాంక్షించి, పరమేశ్వరుని ధ్యానిస్తాడు. అతడు ప్రకృతిని, ప్రకృతి జన్యవస్తువుల్ని త్యజిస్తాడు. అంటే అతడు విషయసుఖాల్ని విడిచిపెడ్తాడు. అతడు అవిక్రయమైన తనదు సచ్చిదానంద స్వరూపంలో విశ్రమిస్తాడు. ఇది ఈ మంత్ర భావం.

**ద్వా సుపర్ణా సయుజా సఖాయా**
**సమానం వక్షం పరిషస్వజాతే ।**
**తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి**
**అనశ్నన్ అన్యో అభిచాకశీతి ॥ 6 ॥**

టీక: ద్వా = ద్వౌ, రెండు; సువర్ణా = అందమైన ఈకలుగల పక్షులు; సయుజా = సర్వదా సంయుక్తౌ, ఎలప్పుడు ఒకటిగ ఉండునవి, ఎడబాటు లేనివి; సఖాయా = స్నేహితులు; సమానం = ఒకటే; వృక్షం = చెట్టు ; పరిషస్వజాతే = నివసించును; తయోః = వాటిలో; అన్యః = ఒకటి; పిప్పలం = (కర్మ) ఫలమును; స్వాదు = తీయని; అత్తి = తినును; అనశ్నన్ = తినకుండ; అన్య = మరొకటి; అభిచాకశీతి = సర్వమపి పశ్యన్, ఆస్తే, అన్నింటిని చూచుచుండును.

భావము: అందమైన ఈకలుగల రెండు పక్షులు సర్వదా సంయుక్తమై సఖులుగ నున్నవి. అవి ఒకే వృక్షమున వసించుచున్నవి. ఆ రెండు పక్షులలో ఒకటి తీయటి ఫలమును తినును. ఇంకొక సుపర్ణము దానిని తినకుండ ఊరక చూచుచుండును.

వివరణము: "ద్వా సుపర్ణా". రెండు పక్షులని అర్థము. విజ్ఞానాత్మ, పరమాత్మ—ఇవి రెండు పక్షులు. జీవాత్మ. పరమాత్మ అనేవి రెండు పక్షులుగ చెప్పబడినవి.

"సయుజా" ఎడబాటులేని. ఒకటిగ నున్నటువంటి జీవాత్మ పరమాత్మ యొక్క పరావర్తనము,(The individual soul is the reflicticn of the supreme soul . అందువల్ల అవి అనగా జీవాత్మ, పరమాత్మ ఎడబాటులేనివి అవి ఒకటియే.

"సఖాయా". స్నేహితులు. ఈ రెండు పక్షులు అందమైన ఈకలు కలిగియున్నవి. ఆ సుపర్ణములు సఖులుగ పేర్కొనబడినవి. సఖులు కావున అవి ఒక దానిని నొకటి వీడవు.

"సమానం వృక్షం పరిషస్వజాతే." ఆ పక్షులు ఒకే ఒక వృక్షంపైన నివసిస్తున్నాయి. జీవాత్మ, పరమాత్మ అనెడి సుపర్ణాలు నివసిస్తూన్న చెట్టు ఏది? జీవాత్మ. పరమాత్మ దేహమనెడి వృక్షంలో నివసిస్తున్నారు ఈ రెండు సుపర్ణాలు దేహవృక్షంలో వసిస్తున్నారు.

"పిప్పలం స్వాదు అత్తి." అది తీయని పండును భుజించును. దేహ వృక్షము కాచే ఫలాలేవి? అవి సుఖదుఃఖములు అవి దేహవృక్ష ఫలాలు. అవి పూర్వకర్మల ఫలాలు అత్తి అనగా తినును. ఆ సుపర్ణాలలో ఒకటి తీయటి పండును తింటుంది. అది ప్రేయస్సును కోరుకొంటుంది. జీవాత్మ తనను దేహంతో తాదాత్మ్యం చేసుకొంటాడు. అతడు ప్రతి ఫలాపేక్షతో, కర్మఫలాపేక్షతో, కర్మలొనరుస్తాడు. అతనికి 'నేను కర్తను' అనే అభిప్రాయం ఉంది. అతనికి కర్తృత్వాభిమానం ఉంది. అందువల్ల అతడు తన కర్మఫలాలను అనుభవించాలి. అతడు పునర్జన్మను పొందాల్సియుంటుంది.

"అనశ్నన్ (న + అశ్నన్) అన్యః" ఇంకొకటి ఫలాన్ని తినదు. ఆసుపర్ణాలలో ఒకటి పండును తినదు. అది ఫలాన్ని కోరదు. అది ప్రేయస్సును వర్జిస్తుంది. ఈ రెండవ సుపర్ణము పరమాత్మ. అతడు అసంగుడు. అతడు అకర్త. అతడు ఫలమును భుజించక దానిని ఊరక చూస్తూంటాడు. అతడు కేవలం సాక్షిమాత్రుడుగ ఉంటాడు.

"అపిచాకశీతి." చూచుచుండును. పరమాత్మ సాక్షిమాత్రుడై అన్నిటిని చూస్తుంటాడు. అతన్ని కర్మ బంధింపజాలదు ఏలన అతడు అసంగుడు, అకర్త. అతడు సర్వదా ముక్తుడు, శుద్ధుడు. అతడు ఎల్లప్పుడు సంతోషంతో ఉంటాడు.

జీవాత్మ దేహ తాదాత్మ్యంతో బద్ధుడై, కర్మఫలాలను అనుభవిస్తాడు. అతడు సుఖ దుఃఖాలకు లోనౌతాడు. అతడు మోహితుడై, అశక్తుడౌతాడు. పరమాత్మ సాక్షిమాత్రుడై, అకర్తృత్వ భావంతో, ఫలాపేక్షను వర్జించి సర్వదా ఆనంద ఘనుడై ఉంటాడు.

సమానే వృక్షే పురుషో నిమగ్నో
అనీశయా శోచతి ముహ్యమానః ।
జుష్టం యదా పశ్యత్యన్యమీశం
అస్య మహిమానమితి వీతశోకః ॥ 7 ॥

టీక: సమానే వృక్షే = ఒకే వృక్షమున; పురుషః = పురుషుడు, జీవాత్మ; నిమగ్నః = చిక్కుకొనును; అనీశయా = తన స్వభావమును విస్మరించి; శోచతి = శోకించును; ముహ్యమానః = మోహితుడై; జుష్టం = అందరిచే అర్చింపబడువాడు; యదా = ఎప్పుడు; పశ్యతి = చూచును; అన్యం = వేరొక; ఈశం = ప్రభువును; అస్య = అతని యొక్క; మహిమానం = వైభవము, మహిమ; ఇతి = ఇట్లు; వీతశోకః = ముక్తుడగును

భావము. అదే వృక్షమున జీవాత్మ తగుల్కొని, మోహితుడై తన నిర్వీర్యత్వమును గూర్చి విలపించును. అతడు వేరొకనిని, అనగా ప్రభువును చూచినప్పుడు, తృప్తుడై, ఆ పరమేశ్వరుని వైభవమును తెలిసికొని, శోకము నుండి ముక్తుడగును

వివరణము: "సమానే వృక్షే పురుషః నిమగ్నః అనీశయా శోచతి ముహ్యమానః". అదేచెట్టుననివసించుచు జీవాత్మ సంసారపు వలలో చిక్కుకొని, ఇడుముల ననుభవించును, మోహితుడై తన అశక్తతను గూర్చి విలపించును

జీవాత్మ దేహవృక్షంలో నివసిస్తూ, అతడు దేహాన్ని ఆత్మయని అను కొంటాడు. అతడు కామంవల్ల, సంగంవల్ల కర్మఫలకాంక్షవల్ల మోహితు డౌతాడు. అతడు దేహ తాదాత్మ్యాన్ని రూఢీచేసికొని, ఇలా విలపిస్తాడు. నేను ఫలా నావారి కుమరుణ్ణి. నేను సన్నగా ఉన్నాను. నేను కష్టపడుతూన్నాను. నేను లావుగా ఉన్నాను నేను హాయిగా ఉన్నాను. నేను అవని చేశాను. నేను అసి పోగొట్టుకొన్నాను. నేను పలానా, ఫలాను అనుభవిస్తాను. నేను అశక్తు డనైయున్నాను అతడు ఈ విధంగా నిస్సహాయుడై విలపిస్తాడు అతడు కర్మఫలాపేక్షవలన ఈ ప్రపంచంలో మాటి మాటికి జనిస్తూంటాడు.

"ముహ్యమానః" మోహితుడు మానవుడు అజ్ఞానంవల్ల తన పరమార్థ దివ్య స్వభావాన్ని విస్మరించినప్పుడు, అతడు నిస్సహాయుడై (అనీశయా Im-potent) మోహితుడౌతాడు. అతడు అహంకార పూరితుడై, కామప్రేరితుడై నప్పుడు విషయములచే ఆకర్షింపబడినప్పుడు. అతడు వాంఛిత విషయాలకోసం కర్తృత్వ భావంతో ప్రయాసపడినప్పుడు అతడు సంసారపు సుడిగుండంలో చిక్కుకో పోతాడు.

"జుష్టం యదా పశ్యతి అన్యం ఈశం అస్య మహిమానం ఇతి వీతశోకః". పరమేశ్వరుని దర్శనముతో, పరమాత్మసాక్షాత్కారముతో అతడు తృప్తుడై, ఆతని వైభవమును గాంచి శోకమునుండి ముక్తుడగును.

పూర్వ జన్మ పుణ్య విశేషంచేత అతడు కరుణాసింధువైన ఆచార్యుని దర్శిస్తాడు. ఆచార్యవర్యుడు అతనికి ఆధ్యాత్మికోపదేశం చెస్తాడు. అందు మీదట అతడు తన మనస్సును, ఇంద్రియాలను విగ్రహిస్తాడు. అతడు అమానిత్వము, అదంభిత్వము మున్నగు సుగుణాలను అలవరచుకొంటాడు అతడు ఆత్మను ధ్యానిస్తాడు. తదుపరి అతడు అనుభవాన్ని పొందుతాడు. 'పుణ్యాపాపాలకు, సుఖదుఃఖాలకు అతీతమైన అమృత ఆత్మను నేను' అనెడి స్వానుభవం పొందుతాడు. పిమ్మట అతడు శోకమునుండి, బాధలమండి. మృత్యువునుండి ముక్తిని పొంది. నిత్యానందాన్ని అనుభవిస్తాడు.

"వీతశోకః" శోకరహితుడు. అతడు సంగాన్నుండి, అహంకారా మ్నుండి తన్నుతాను విడిపించుకొన్నప్పుడు, అతడు బ్రహ్మచర్య అనుష్ఠానం

ద్వారా, ధ్యానం ద్వారా పరమేశ్వర సాక్షాత్కారం పడసినప్పుడు, అతడు శోకమునుండి, దుఃఖమునుండి, ముక్తుడై శాశ్వతానందాన్ని, అమృతత్వాన్ని పొందుతాడు.

ఋచో అక్షరే పరమే వ్యోమన్
యస్మిన్ దేవా అధివిశ్వే నిషేదుః ।
యస్తం న వేద కిమృచా కరిష్యతి
య ఇత్తద్విదుస్త ఇమే సమాసతే ॥ 8 ॥

టీక: ఋచః = వేదములు; అక్షరే = అవినాశియైన; పరమే = సర్వోత్కృష్టమైన; వ్యోమన్ = ఆకాశ సదృశ బ్రహ్మము నందు: యస్మిన్ = ఎవని యందు; దేవాః = దేవతలు; విశ్వే = అందరు; అధి నిషేదుః = ఉందురో; యః = ఎవని; తం = అతనిని; న = లేదు: వేద = తెలిసికొను; కిం = ఏమి; ఋచాః = వేదములు; కరిష్యతి = చేయును; యః = ఎవడు: ఇత్ = మాత్రమే; తత్ = అది; విదుః = తెలిసి కొందురు; త ఇమే = వీనిని; సమాసతే = తృప్తితో విశ్రమింతురు.

భావము: వేదములు, సకల దేవతలు అవినాశియైన, సర్వోత్కృష్టమైన, ఆకాశసదృశ బ్రహ్మమునందు నివసించును (నివసింతురు). ఆ అవినాశియైన పరబ్రహ్మమును తెలియని వానికి వేదములవలన ఏమి ప్రయోజనము? దానిని (బ్రహ్మమును) తెలిసికొన్నవారు మాత్రమే కృతార్థులై యుండగలరు.

వివరణము: "ఋచః అక్షరే పరమే వ్యోమన్". అవినాశియైన, సర్వోత్కృష్టమైన, ఆకాశ (అనంత) బ్రహ్మమునందు వేదము ఉండును పరబ్రహ్మము అక్షరుడు, పరుడు. ఆకాశ కల్పుడు. అతడు అనంతుడు అతని యందే సకల వేదములు దేవతాగణములు విశ్రమించును (విశ్రమింతురు).

"యస్తం న వేద కిం ఋచాః కరిష్యతి". పరబ్రహ్మమును తెలియని వారికి వేదములవలన ఏమి ప్రయోజనము? బ్రహ్మమును గూర్చి పరోక్ష జ్ఞానం పొందిన మాత్రంచేత లాభం లేదు ఆత్మ సాక్షాత్కారాన్ని పొందడానికి పరోక్ష జ్ఞానం మాత్రమే చాలదు. అపరోక్ష జ్ఞానం, అనగా పరమాత్మయొక్క

ప్రత్యక్ష సందర్శనం పొందినవారు మాత్రమే పరమానందాన్ని, నిత్య తృప్తిని పడయగలరు.

"యః ఇత్తత్ విదుః త ఇమే సమాసతే" దాన్ని (పరబ్రహ్మమును) తెలిసికొన్నవారు మాత్రమే పరమానందాన్ని, నిత్యతృప్తిని పడయగలరు. ఆత్మజ్ఞానం వినా, పరబ్రహ్మ సాక్షాత్కారం వినా నిత్యతృప్తి పరమానందం మనకు లభ్యం కాదు. ఈ సత్యాన్ని అన్ని ఉపనిషత్తులు చాటుతున్నాయి. ఆనందం పరమేశ్వరునియందే పొందగలం. ఈ సత్యాన్ని అందరూ గ్రహించాలి మనకెన్ని సంపదలు, శారీరక సౌందర్యం, మేధా సామర్థ్యాలు ఉన్నప్పటికి పరబ్రహ్మ స్వరూపమైన గురుదేవుని పాదపద్మముల యందు మనస్సు లగ్నం కానిచో మన జీవితం నిష్ప్రయోజనమౌతుంది. శ్రీ శంకరులవారు గుర్వష్టకంలో ఇలా చెబుతారు.

షడంగాది వేదో ముఖే శాస్త్ర విద్యా
కవిత్వాది గద్యం సుపద్యం కరోతి ।
గురోరంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం
తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్॥

ఎంతటి బ్రహ్మాండమైన వేదపండితుడైనను, గద్యపద్యాలలో ఆరితేరిన దిట్టయైనను, సర్వశాస్త్ర ప్రవీణుడైననుఅతనిమనస్సు గురువర్యుని పాద సరోరుహములందు లగ్నము కానిచో ఏంలాభం. ఏంలాభం, ఏంలాభం, ఏంలాభం?

కావున అపరోక్ష బ్రహ్మజ్ఞానములేని వానికి ఎన్ని విద్యలున్నను అవి నిష్ప్రయోజనములే. అపరోక్ష బ్రహ్మజ్ఞానముగలవారు మాత్రమే పరమశాంతిని నిత్యతుష్టిని పడయగలరు.

ఛందాంసి యజ్ఞాః క్రతవో వ్రతాని
భూతం భవ్యం యచ్చ వేదా వదంతి ।
అస్మాన్మాయీ సృజతే విశ్వమేతత్
తస్మింశ్చాన్యో మాయయా సంనిరుద్ధః ॥ 9 ॥

టీక: ఛందాంసి = నాలుగు వేదములు; యజ్ఞాః = యజ్ఞములు; క్రతవః = క్రతువులు; వ్రతాని = వ్రతములు; భూతం = జరిగిపోయినది; భవ్యం = జరుగనున్నది; యత్ = ఏదియో; చ = మరియు; వేదాః = వేదములు; వదంతి = ప్రకటించుచున్నవి; అస్మాన్ = మనముసహా ఇవన్నియు; మాయీ = మాయాధిపతి; సృజతే = సృష్టించును; విశ్వం ప్రపంచము; ఏతత్ = ఈ; తస్మిన్ = దీనిలో; చ = మరియు; అన్యః = మరొకడు; మాయయా = మాయచే; సంనిరుద్ధః = బంధితుడు.

భావము: నాలుగు వేదములను, యజ్ఞములను, క్రతువులను, వ్రతములను, భూత భవిష్యత్తులను, వేద ప్రకాశిత జ్ఞాన సర్వస్వమును మనతో గూడిన ఈ యావత్ ప్రపంచమును మాయాధిపతి సృజించును. దీనిలో మరొకడు మాయచే బద్ధుడగుచున్నాడు.

వివరణము: "ఛందాంసి యజ్ఞాః క్రతవః వ్రతాని భూతం భవ్యం యత్ చ వేదాః వదంతి" వేదాలు, యజ్ఞాలు, క్రతువులు, వ్రతాలు, జరిగిపోయినవి, జరుగబోవునవి, వేద విజ్ఞాన సర్వస్వం ఇవన్నీ అక్షర బ్రహ్మము నుండియే ఉత్పన్నమయినవి.

"ఛందాంసి" అనగా వేదములు. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణ వేదము అనునవి నాలుగు వేదములు. ఇవి పరమేశ్వరునిచే సృజింపబడినవి. యజ్ఞాః అనగా యజ్ఞములు. "దేవయజ్ఞా దయో యూప సంబంధ రహిత విహిత క్రియాశ్చ యజ్ఞాః." యూప సంబంధంలేని

*దేవ యజ్ఞాది విహిత కర్మలను యజ్ఞము అంటారు. క్రతవః అనగా క్రతువులు. జ్యోతిష్టోమాదయః క్రతవః జ్యోతిష్టోమము మున్నగు యాగములను క్రతువులు అంటారు. వ్రతాని అనగా వ్రతములు. వ్రతాని చాంద్రాయణాదీని చాంద్రాయణాది వ్రతములను వతములు అంటారు. భూతం అనగా జరిగినది. భూతం అతీతం. గతమైన దానిని భూతం అంటారు. భవ్యం అనగా జరుగనున్నది. భవ్యం భవిష్యం. భవ్యం అనగా భవిష్యము. రాబోవు కాలములో జరుగునది "యత్ చ వేదాః వదంతి," వేదములు ఏమి ప్రకటించునో అదంతయు. అనగా వేద విజ్ఞాన సర్వస్వము.

వేదములు, వివిధ యజ్ఞములు, నానారకముల క్రతువులు, వ్రతములు, భూత భవిష్యత్తులు, వేదవిజ్ఞాన సర్వస్వం— వీటన్నిటినీ పరమేశ్వరుడు సృష్టించాడు: మాయను వశీకృతము చేసుకొన్న పరబ్రహ్మము. తన స్వశక్తి చే దేవాత్మశక్తి చే ఈ సర్వస్వాన్ని సృజించాడు.

అవికారి, కూటస్థుడు అయిన బ్రహ్మము ఈ ప్రపంచానికి ఉపాదాన కారణం ఎలా అయ్యాడు? దానికి శ్రుతి ఇలా చెబుతుంది:

---

* దేవ యజ్ఞము బ్రహ్మయజ్ఞనము (ఋషి యజ్ఞము). పితృ యజ్ఞము నృ యజ్ఞము, భూత యజ్ఞము" అనువవి పంచ మహాయజ్ఞములు. దేవతలను తృప్తిపరచు ఆహుతులను వారికి అర్పించుటను దేవయజ్ఞం అంటారు. బ్రహ్మమును ఋషులను తృప్తిపరచు యోట శాస్త్రములను బోధించుటను పారాయణము చేయుటను బ్రహ్మ యజ్ఞము అంటారు. పితృదేవతలను తృప్తిపరచునటువంటి పిండ, ఉదక క్రియలను వారికి అర్పించుటను పితృ యజ్ఞం అంటారు. ఆకలిగొన్నవారికి, అతిథులకు అన్నమిడుటను నృ యజ్ఞము, లేక మనుష్య యజ్ఞం అంటారు. మృగములు పక్షులు మున్నగు ప్రాణికోటికి ఆహార మొసంగుటను భూత యజ్ఞం అంటారు. గృహస్థు ఈ పంచ మహాయజ్ఞములు ఆచరించుట వలన తాను చేయు పాపముల నుండి శోధితుడౌతాడు. ముఖ్యంగా ద్విజులు ఈ మహా యజ్ఞాలు ఆచరించవలసి యున్నారు.

"మా యాతి కూటస్థస్యాపి స్వశక్తివశాత్ సర్వస్రష్టుత్వం ఉపపన్నం ఇత్యేతత్." కూటస్థుడైనప్పటికి తన శక్తిచే అన్నింటిని పరమేశ్వరుడు సృజింపగలిగాడు.

"అస్మాన్మాయీ సృజతే విశ్వం ఏతత్" మన యందరితో గూడిన ఈ ప్రపంచాన్ని మాయాధిపతి సృష్టించాడు. నాగుబాముకు తన విషం ఏమీ చేయదు. అలాగే ఈశ్వరుణ్ణి తన మాయ ఏమీ చేయదు. ఈశ్వరుడు ఈ యావత్ ప్రపంచాన్ని సృష్టిస్తాడు. కాని. సృష్టించిన కారణమున దానిచే అతడు బద్ధుడు కాడు పరమేశ్వరునకు కర్మఫలములపై ఆసక్తిలేదు. అతనికి అహంకార పూర్వక కర్తృత్వభావన లేదు. ఈ కారణములచే సృష్టి· స్థితి. లయ సంబంధమైన పనులు అతనిని బంధింపవు. "న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ.— గీతా, ఓ అర్జునా, నన్ను ఈ కర్మలు బంధింపవు.

"తస్మిన్ చ అన్యః మాయయా సంనిరుద్ధః." దీనియందు ఇంకొకడు మాయచే బద్ధుడగును. జీవాత్మ మాయచే బద్ధుడగు చున్నాడు. అతడు తాను చేయు కర్మలయందు ఫలాసక్తిని. కర్తృత్వ భావనను. అహంకారమును చూపుటచే అతడు బద్ధుడగుచున్నాడు. "స్వమాయయా కల్పితే తస్మిన్ భూతాది ప్రపంచే మాయయైవాన్య ఇవ సంనిరుద్ధః సంబద్ధో అవిద్యావశగో భూత్వా సంసారసముద్రే భ్రమతి ఇత్యర్థః" తన మాయచే కల్పింపబడిన ఈ పంచభూత నిర్మిత ప్రపంచంలో, అతడు మాయనుండే వేరగుట వల్ల జీవాత్మ బద్ధుడగుచున్నాడు. అంటే అతడు అవిద్యా ప్రాబల్యానికి లోనై (మాయావశుడై) సంసార సముద్రపు సుడిగుండంలో గిర్రున భ్రమిస్తున్నాడు

---

మాయాం తు ప్రకృతిం విద్ధి
మాయినం తు మహేశ్వరం ।
తస్యావయవ భూతైస్తు
వ్యాప్తం సర్వమిదం జగత్ ॥ 10 ॥

టీక: మాయాం = మాయను; తు = నిజముగా; ప్రకృతిం = ప్రకృతిని; విద్ధి = విద్యాత్, తెలిసికొనుము; మాయినం = మాయ యొక్క ప్రభువును; తు = నిజముగా; మహేశ్వరం = మహాప్రభువును; తస్య = అతనియొక్క; అవయవ భూతైః = తన అవయవములైన ప్రాణులచే; అస్తు = ఉన్నది; వ్యాప్తం = వ్యాపించబడి; సర్వం = అంతయు; ఇదం = ఈ; జగత్ = ప్రపంచము

భావము; ప్రకృతిని మాయయని తెలిసికొనుము, మహేశ్వరుని మాయయొక్క ప్రభువు అని తెలిసికొనుము. ఈ యావత్ ప్రపంచము పరమేశ్వరుని అవయవములైన ప్రాణులచే వ్యాపింపబడియున్నది.

వివరణము: "మాయాం తు ప్రకృతిం విద్ధి." ప్రకృతిని మాయయని తెలిసికొనుము. "మాయాం తు ప్రకృతిం విద్యాత్" అని పాఠాంతరము. ప్రకృతి అంటే ఏమిటి? ప్రకృతి త్రిగుణములతో నిర్మితము. ప్రకృతి త్రిగుణాత్మకమైనది. జీవాత్మ తన రెండు లక్ష్యాలను, అనగా భోగాన్ని, అపవర్గాన్ని పొందే నిమిత్తం ప్రకృతి దేహంగాను, ఇంద్రియాలుగాను, విషయాలుగాను మార్పు చెందుతుంది. సాంఖ్య సిద్ధాంతం 24 తత్త్వాలు చెప్పుతుంది. అవేవన; 1-5 పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము అనెడి మహాభూతములు (సూక్ష్మమైనవి): 6 అహంకారము; 7. బుద్ధి; 8. మూలప్రకృతి; 9-13 చెవులు, చర్మము, కన్నులు, నాలుక, ముక్కు అనెడి జ్ఞానేంద్రియములు; 14-18 చేతులు, కాళ్ళు, నోరు, గుదము ఉపస్థ అనెడి కర్మేంద్రియములు; 19, మనస్సు; 20-24 శబ్దము, స్పర్శ, రూపము, రంగు రసము, గంధము అనెడి విషయములు, అన్ని మహాభూతములు, అహంకారము, బుద్ధి మనస్సు, ఇంద్రియములు ఇవన్నీ ప్రళయ కాలంలో అవ్యక్తంలో లీనమౌతాయి.

"మాయినం తు మహేశ్వరం" పరమేశ్వరుడు మాయను తన వశమందు ఉంచుకొనును. పరమేశ్వరుడు మాయకు అధిష్ఠానము, పరమేశ్వరుడు మాయకు ప్రేరకుడు. కేవలం పరమేశ్వరుని సమ్ముఖ ప్రభావంవల్ల మాయ పనిచేయ మొదలిడుతుంది.

"మయాఽధ్యక్షేణ ప్రకృతిం సూయతే సచరాచరమ్ ।
హేతునాఽనేన కౌంతేయ జగద్విపరివర్తతే ॥ – గీతా

భగవంతుడు కేవలం సాక్షిమాత్రుడై అధ్యక్షత వహిస్తాడు. ప్రకృతి అంతా చేస్తుంది. భగవంతుని సామీప్య కారణం వల్ల, అతని సన్నిధిలో సమక్షంలో, సమ్ముఖంలో ప్రకృతి చరాచర వస్తువుల్ని సృజిస్తుంది. ఈ సృష్టికి మూలకారణం ప్రకృతియే. పరమేశ్వరుని అధిష్టానంగా చేసుకొని ప్రకృతి అంతా చేస్తుంది. సూర్యకాంతి సహాయంతో మన మెన్నో పనులు చేస్తాం. కాని, సూర్యుడు ఆపనులు చేశాడు అనలేం. అలాగే పరమేశ్వరుని సాయంతో ప్రకృతి అంతా పని చేసినప్పటికి పరమేశ్వరుడు కర్మలు ఆచరించినవాడు కాజాలడు.

"తస్య అవయవ భూతైః అస్తు వ్యాప్తం సర్వం ఇదం జగత్". This hole world is pervaded by beings who are His parts భగవంతుని అవయవములైన ప్రాణులచే ఈ జగత్తు అంతయు వ్యాపింపబడి యున్నది, ఆత్మ నిరవయవము. భగవంతునిలో (పరమాత్మలో) భాగాలు అనేవి లేవు. భాగాలు, అవయవాలు, అంశాలు అనేవి మన స్వకీయ అజ్ఞాన మూలంగా, ఉపాధి మూలంగా కలిగినటు వంటి ఊహ, లేక కల్పన అనాలి. వాస్తవంలో పరబ్రహ్మమునకు అటువంటి అవయవాలు ఏమిలేవు. అతడు నిరాకారుడు. పరమేశ్వరుడు మాయిన్ (Illusion-Maker) పరమేశ్వరుడు అంతట వ్యాపించి యున్నాడు. ఆ పరాత్పరుని తెలిసికొనుటకే మనము జీవింపనగును. పరమేశ్వరుని సాక్షాత్కారము వలననే మనకు అనంత శాంతి లభ్యమగును. ఈ విషయమే తరువాతి శ్లోకములో, మంత్రములో తెలియజేయబడు చున్నది

ఈ మంత్రంలో వేదాంతుల సిద్ధాంతానికి, పొందిక గలుగ జేయడానికి యత్నం సలుప బడింది.

---

యో యోనిం యోనిం అధితిష్ఠత్యేకో
యస్మిన్నిదం సంచ విచైతి సర్వం ।
తమీశానం వరదం దేవమీడ్యం
నిచాయ్యేమాం శాంతిమత్యంతమేతి ॥ 11 ॥

టీక: యః = ఎవడు; యోనిం యోనిమ్ = ప్రకృతియొక్క వివిధాంశములను; అధితిష్ఠతి = అధ్యక్షత వహించునో; ఏకః = ఒకటి; యస్మిన్ = ఎవనిలో; ఇదం = ఈ; సంచ విచైతి = కనబడును మరియు లీనమగును; సర్వం = అంతయు; తమ్ = అతనిని; ఈశానం = ప్రభువును; వరదం = అనుగ్రహ ప్రదాతను; దేవం = ప్రకాశస్వరూపుని ఈడ్యం = వేదాదులచే స్తుతింపబడు వానిని; నిచాయ్య = అపరోక్షీకృత్య సాక్షాత్కారముపొంది; ఇమాం = దీనిని; శాంతిం = శాంతిని; అత్యంతం = నిత్యమైన; ఏతి = పొందును.

భావము: ఎవడు అద్వయుడై యుండియు ప్రకృతియొక్క వివిధాంశములపై అధ్యక్షత వహించునో, ఎవనియందు ఈ విశ్వము లయమగుచున్నదో ఎవనిలో ఈ విశ్వము నానా రూపములలో కనబడుచున్నదో ఆ ప్రభువును. ఆ సర్వేశ్వరుని. ఆ వరప్రదాతను వేదాదులచే స్తుతింపబడు ఆ దైవమును సాక్షాత్కరించుకొనినపుడు జీవుడు అనంత శాంతిని పొందును.

వివరణము: "యో యోనిం యోనిం అధితిష్ఠతి ఏకః" ఏ అద్వితీయుడు ప్రకృతి యొక్క వివిధాంశములపై అధ్యక్షత వహించునో. పరమేశ్వరుడు మాయా వినిర్ముక్తుడు. అతడు మాయాతీతుడు. అతడు ఆనందైక ఘనుడు. అతడు విశుద్ధ ఆనంద ఘనుడు. మూల ప్రకృతి రూపమున నున్న మాయ. అవాంతర ప్రకృతి రూపమున నున్న ఆకాశాదులు —ఈ రెండు ప్రకృతులు "యోనిం యోనిం" చే సూచింప బడుతున్నాయి. భగవానుడు ఈ రెండు విధములైన ప్రకృతులయొక్క సత్తా స్ఫూర్తి ప్రద రూపముతో అధిష్ఠితుడై. అంతర్యామి రూపముతో స్థితుడై యున్నాడు

"యస్మిన్నిదం సంచ విచైతిసర్వం." ఎవనియందు ఈ విశ్వము నానా రూపములతో కనబడుచున్నదో. ఎవనిలో ఈ విశ్వము లయ మగుచున్నదో. భగవానుడు అద్వితీయుడు. అతడు మాయకు అధిష్ఠానము. జగత్తు సమస్తము ప్రళయ కాలమున పరమేశ్వరునిలో లయించును. మరియు సృష్టికాలమున ఈ జగత్తు ఆకాశాది రూపములతో నానా ఆకారములలో కనబడును. అందుచే పరమేశ్వరు సర్వశక్తిమంతుడు.

"తమ్ ఈశానం వరదం దేవం ఈడ్యమ్" ఆ ప్రభువును. ఆ సర్వేశ్వరుని, ఆ అనుగ్రహ ప్రదాతను, వేదాదులచే స్తుతింపబడు జ్యోతిః స్వరూపుని భగవానుడు సర్వమునకు అధిష్ఠాత. అతడు ఈశానుడు. అనగా అతడు సర్వమును నియమించు ప్రభువు. అతడు వరదుడు అనగా అతడు శ్రేష్ఠమైన దానిని (మోక్షమును) ఇచ్చువాడు. అతడు దేవుడు. అనగా అతడు ప్రకాశస్వరూపుడు అతడు పరంజ్యోతి, అతడు స్తవనీయుడు (ఈడ్యం). అతడు వేదాదులచే స్తుతింపబడువాడు.

అటువంటి దేవుడే (బ్రహ్మమే) నేను (అహం బ్రహ్మాస్మి) అని సాధకరత్నము అపరోక్షానుభవము పొందవలెను. పరమేశ్వర సాక్షాత్కారము శాంతి ప్రదము. ఆ సాక్షాత్కార అనుభవము సర్వజన హితకారిణి యగును. అది సర్వదుఃఖ శూన్యసుఖైక తానతారూపమగు ముక్తిని ప్రసాదించును. శ్రీ గురుభగవానులు ఉపదేశించు "తత్త్వమసి" మహావాక్యమును అనుసంధానము చేయుటవల్ల ఉత్పన్నమైన పరిపూర్ణ తత్త్వజ్ఞానముచే సాధకుడు, అవిద్యను. తత్కార్యములను నిర్మూలించి అనగా మాయావినిర్ముక్తుడై ఏక బ్రహ్మస్వరూపమును పొందును.

"నిచాయ్య ఇమాం శాంతిం అత్యంతం ఏతి" కాబట్టి పరమేశ్వర సాక్షాత్కారము పడసిన వానికే అత్యంత దుఃఖనివృత్తి కలిగి, పరమానంద ప్రాప్తిలభిస్తుంది

సాంఖ్యుల సిద్ధాంతము ప్రకారము మొదటి యోని అవ్యక్తము (ప్రకృతి) మహత్తు, అహంకారము, మనస్సు, తన్మాత్రులు, పంచభూతములు ప్రకృతి వికారములు

---

యో దేవానాం ప్రభవశ్చోద్భవశ్చ
విశ్వాధిపో రుద్రో మహర్షిః ।
హిరణ్యగర్భం పశ్యత జాయమానం
స నో బుద్ధ్యా శుభయా సంయునక్తు ॥ 12 ॥

టీక: యః = ఎవడు; దేవానాం = దేవతలయొక్క; ప్రభవః = సృష్టికర్త; చ = మరియు; ఉద్భవః = ఆలంబనము; చ = మరియు; విశ్వాధిపః = అందరకు ప్రభువు; రుద్రః = రుద్రుడు; మహర్షిః = గొప్పఋషి, ద్రష్ట; హిరణ్యగర్భం = హిరణ్యగర్భుని; పశ్యత = చూచెను. జాయమానం = పుట్టుచుండగ; సః = అతడు; నః = మమ్ములను; బుద్ధ్యా = బుద్ధితో; శుభయా = పరిశుద్ధమైన, మంగళప్రదమైన, శుభప్రదమైన; సంయునక్తు = సంపన్నుల నొనర్చుగాక.

భావము: సకల దేవతలకు సృష్టికర్తయు, వారికి భర్తయు, మహాద్రష్టయు, సర్వమునకు ప్రభువును, హిరణ్యగర్భుని పుట్టువును చూచినవాడును నైన రుద్రపరమాత్మ మమ్ము మంగళప్రదమైన బుద్ధిసంపన్నులనొనర్చుగాక!

వివరణము: ఈ మంత్రంలో రుద్రుడు అంటే పరమాత్మ, పరబ్రహ్మము.

"అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః" సర్వవిధముల అందర దేవతలకు, అందర ఋషులకు — గీతా. నేను మూలకారణమును. పరమేశ్వరుడు, రుద్రపరమాత్మ సురులకు, ఋషులకు సర్వులకు మూలము. వారు ఆతని ప్రభవమును తెలుసుకోలేరు. అతడు అందరికి కర్మఫలప్రదాత. అతడు సర్వులకు మార్గదర్శి అతడు అందరియందలి అంతర్యామి.

రుద్రపరమాత్మ హిరణ్యగర్భుని జననాన్ని ఆలోకించెను. అతడు హిరణ్యగర్భునకు తదితర దేవతలకు, ఋషులకు ఆది కావున అతనికి ఆదిలేదు. అందువల్ల అతడు అనాది. మరియు పరమాత్మ సర్వభువనాలకు మూలాకారణము. అందువల్ల అతడు అనాది, అతడు అనాది కావున అజుడు. అతడు సర్వభువనములకు మహాప్రభువు.

'మమ్మ పరిశుద్ధ బుద్ధి యుక్తులగ జేయుగాక' అని ఈ మంత్రములో ప్రార్థన సలుపబడుచున్నది. పరమేశ్వరానుగ్రహమువల్లనే భగవంతునివైపు మన మనస్సు మరలుతుంది. పరిశుద్ధమనస్సు ;పరిశుద్ధ అంతఃకరణముగలవాడే నిశ్చల మనస్సు కలిగియుంటాడు. నిశ్చల మనస్సుగలవాడే పరమేశ్వరుని నిరంతరం ధ్యానించగలడు. సక్రమంగా ధ్యానించేవానికే, సుషమా

హితుడై పరమాత్మను ధ్యానించేవానికే సాక్షాత్కారం కలుగుతుంది. ఆత్మ సాక్షాత్కారం కలిగినమీదటే అత్యంత దుఃఖ నివృత్తి సాధ్యమౌతుంది. అందువల్ల సాధకునకు శుద్ధ బుద్ధి చాలా అవసరం. విశుద్ధ హృదయం అత్యంతా వశ్యకము. అటువంటి పరిశుద్ధాంతఃకరణము దైవానుగ్రహంవల్ల పురుషార్థం వల్ల సిద్ధిస్తుంది.

మూడవ అధ్యాయంలోని నాలుగవ మంత్రం ఈ అధ్యాయంలో (పన్నెండవ మంత్రము) పునర్వ్యాఖ్యానించబడింది.

---

**యో దేవనామధిపో**
**యస్మిన్ల్లోకా అధిశ్రితాః ।**
**య ఈశే అస్య ద్విపదశ్చతుష్పదః**
**కస్మై దేవాయ హవిషా విధేమ ॥ 13 ॥**

టీక; యః = ఎవడు; దేవానాం = దేవతలయొక్క; అధిపః = ప్రభువు: యస్మిన్ = ఎవనిలో; లోకాః = ప్రపంచములు; అధిశ్రితాః = విశ్రమించును; యః = ఎవడు; ఈశే = ఈశతే, పరిపాలించును; అస్య = దీనియొక్క ద్విపదః = రెండు పాదముల జంతువులు; చతుష్పదః = నాలుగు కాళ్ళ జంతువులు; కస్మై దేవాయ = ఆ దేవునకు: హవిషా = హవిస్సుతో; విధేమ = అర్చింతుము గాక.

భావము: ఎవడు దేవతలకు ప్రభువో, ఎవనిలో లోకములన్నియు విశ్రమించునో, ఎవడు ద్విపాద జంతువులను, నాలుగుకాళ్ళ జంతువులను పాలించునో ఆ ఆనందమయ దేవునకు భక్తి ప్రపత్తులతో మనము హవిస్సులతో పూజలొనర్తుముగాక.

వివరణము: "యః దేవానాం అధిపః" ఎవడు దేవతలకు అధిపుడో పరమేశ్వరుడు బ్రహ్మాది దేవతలకు ఈశ్వరుడు, స్వామి

"యస్మిన్ లోకాః అధిష్ఠితాః, ఎవనిలో లోకములన్నియు విశ్రమించునో. పరమేశ్వరుడు సర్వమునకు మూల కారణము. ఆ పరమేశ్వరునిలో

అన్ని లోకములు మనుచున్నవి. అతడు సర్వ భువనములకు ఆలంబనము, అధిష్ఠానము, రక్షకుడు. శాస్త్రిత,

"యః ఈశే (ఈశతే) అస్య ద్విపదః చతుష్పదః." అతడు ద్విపాద జంతువులను చతుష్పాద పశువులను పాలించును. అతడు నరపతి, పశుపతి. అతడు సర్వ సృష్టిని నియమించును.

"కస్మై (తస్మై) దేవాయ హవిషా విధేమ." అటువంటి ప్రకాశ స్వరూపుడైన దేవునకు మనము హవిస్సులతో పూజలొనరుముగాక. అటువంటి ఆనందమయ రుద్రునకు మనము చరుపురోడశాది ద్రవ్యములతో పూజ లర్పింతము గాక. ఆనందఘనుడు, దేవతాధిపతి, నరాధిపతి, పశుపతి, విశ్వాధిపతియైన ఆ పరమేశ్వరునకు మనము మనః పూర్వకమైన పంచరత్నములు, నమస్సులను అర్పింతము గాక! ఆ ఆనంద ఘనుని మనము సాక్షాత్కరించుకొని అనంతమైన శాంతిని పడయుదుము గాక!

---

సూక్ష్మాతిసూక్ష్మం కలిలస్య మధ్యే
విశ్వస్య స్రష్టారమనేకరూపమ్ ।
విశ్వస్యైకం పరివేష్టితారం
జ్ఞాత్వా శివం శాంతిమత్యంతమేతి ॥ 14 ॥

టీక: సూక్ష్మాతిసూక్ష్మం = సూక్ష్మతమమైన దానికంటె సూక్ష్మతరమైనది; కలిలస్య మధ్యే = గందరగోళము మధ్య; విశ్వస్య = ప్రపంచము యొక్క; స్రష్టారం = సృష్టికర్తను; అనేకరూపం = వివిధ రూపములను ధరించునట్టి; విశ్వస్య = ప్రపంచము యొక్క; ఏకం = ఒకటి; పరివేష్టితారం = పరివేష్టించునట్టి వానిని; జ్ఞాత్వా = తెలిసికొని; శివం = ఆనందమయుని; శాంతిం = శాంతిని; అత్యంతం = అనంతమైన; ఏతి = పొందును.

భావము: సూక్ష్మతమమైన దానికంటె సూక్ష్మతముడును, తమోంధకారము మధ్య జగత్తును సృష్టించినవాడును, నానారూపములను దాల్చువాడును,

ఈ విశ్వమును పరివేష్టించియున్న ఏకైక స్వామియునైన ఆనందమయదేవుని తెలిసికొనినవాడు అనంతమైన శాంతిని పొందును.

వివరణము: "సూక్ష్మాతి సూక్ష్మం." సూక్ష్మతమమైనదానికంటె సూక్ష్మతరుడు. పరమేశ్వరుడు అణువు కన్న అణుతరుడు అతనిని తెలిసికొనుట కష్టము. సూక్ష్మత్వాత్ అవిజ్ఞేయం. భౌతిక దేహం స్థూలమైనది. అది బాహ్యమైనది. పరిమితమైనది. దేహంతో ఇంద్రియాలను పోలిస్తే అవి సూక్ష్మతరమైనవి. మనస్సు సహాయం లేకుండ ఇంద్రియాలు స్వతంత్రించి ఏపనిని చేయలేవు అందుచేత మనస్సును ఇంద్రియాలతో పోలిస్తే అది ఇంద్రియాలకంటె సూక్షతరమైనది. మనస్సు సందిగ్ధావస్థలో ఉండేటప్పుడు వివేచనచేయగల బుద్ధి దాన్ని ఆదుకొంటుంది. కాబట్టి బుద్ధిని మనస్సుతో పోలిస్తే అది మనస్సు కంటె సూక్ష్మతరమైనది. బుద్ధి తన వెలుగుకోసం ఆత్మపై ఆధారపడుతుంది. కావున సాక్షిమాత్రమైన ఆత్మ బుద్ధికంటె కూడ సూక్ష్మతరమైనది.

"కలిలస్య మధ్యే విశ్వస్య స్రష్టారం అనేక రూపం." గందరగోళము మధ్య 'కలిలస్య మధ్యే'—దీనికి టీకాకారులు అనేక రకాలుగ అర్థవివరణం చేశారు. శ్రీ శంకరులవారి ప్రకారము తమోంధకారము మధ్యయని అర్థము. కలిలస్య మధ్యే అనగా అజ్ఞానాంధకారము మధ్య (పరమేశ్వరుడు ఈ విశ్వాన్ని సృష్టించాడు).

శ్రీ రామానుజాచార్యుల వారి విశిష్టాద్వైతం ప్రకారం ఈ ప్రపంచం బ్రహ్మముయొక్క పరిణామం. పాలు పెరుగుగా మారినట్లు బ్రహ్మము ఈ ప్రపంచంగా మారినాడు. ఇది పరిణామ వాదం. ఈ పరిణామ వాదంలో పెద్ద లోపం కనిపిస్తుంది. పూర్ణ పర బ్రహ్మములో మార్పు ఎలా ఉదయించగలదు? కాల పరిధిలో దేశ పరిధిలో మాత్రమే మార్పునకు వీలుకలుగుతుంది. బ్రహ్మము దేశ కాల కారణాలకు అతీతుడు. అయితే మారుతూండే దృగ్విషయం మనకందరముందు గోచరమౌతూంది. కదా? దీన్ని ఎలా వివరించడం?

శ్రీ శంకరులవారు వివర్తవాదాన్ని, అధ్యారోపణ సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తారు ఈ సిద్ధాంతం ప్రకారం సృష్టి సల్పుట కోసం బ్రహ్మము ఎటువంటి మార్పును పొందదు. బ్రహ్మములో అంచింత్యమైన. విచిత్రమైన, విహితమైన ఒక

మిథ్యాశక్తి ఉంది. ఈ అంచిత్యశక్తిని మాయఅంటారు. ఈమాయయే ఈ సృష్టిని తెచ్చిపెడుతుంది, బ్రహ్మము ఈ మాయాశక్తి ద్వారానే తాను సృష్టించిన విశ్వాన్ని ప్రవేశిస్తాడు స్థావరపదార్థాల మొదలుకొని హిరణ్యగర్భుని వరకు సకల రూపాలను, శరీరాలను సృష్టించి. తాను సృష్టించిన ఆ రూపాలలోనికి పరమాత్మ ప్రవేశించడం అనేది వట్టి ఊహ, అది వాస్తవికంకాదు అది ఆలంకారికము. (The entrance is merely figurative)

"విశ్వస్య ఏకం పరివేష్టితారం" యావత్ ప్రపంచము ఆ ఏకైక పరమేశ్వరునిచే అవృతమై యుంది. పరమేశ్వరుడు సర్వవ్యాపి యగుటచే యావత్ ప్రపంచము అతనిలోనే యుంటుంది. అతడులేని అణువుచేదు. (He is the only one that envelops the world ).

"జ్ఞాత్వా శివం శాంతిం అత్యంతం ఏతి." ఆనందమయుడగు దేవుని తెలిసికొని అనంత శాంతిని పొందును. శివుడు ఆనందమయుడు, అతడు అణువుకన్న అణుతరుడు, అతడు సృష్టికర్త, అతడు నానారూపధారి. అతడు సర్వగతుడు. అతనిని తెలుసుకొనుట వల్లనే అనంత శాంతి లభ్యమౌతుంది. శివుని తెలిసికొనుట యంటే శివుడు అగుటయే. శివుడు అనగా చిద్ఘనుడైన పరమాత్మ. బ్రహ్మమును తెలిసికొన్నవాడు బ్రహ్మమే అగుచున్నాడు. బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి. మరియు తరతి శోకం ఆత్మవిత్. ఆత్మను తెలిసికొన్నవాడు శోకమును దాటును. అనగా ఆత్మసాక్షాత్కారము పొందినవాడు పరమానందమును. అనంత శాంతిని పడయును,

స ఏవ కాలే భువనస్య గోప్తా
విశ్వాధిపః సర్వభూతేషు గూఢః ।
యస్మిన్ యుక్తా బ్రహ్మర్షయో దేవతాశ్చ
తమేవం జ్ఞాత్వా మృత్యుపాశాంశ్ఛినత్తి ॥ 15 ॥

టీక: సః = అతడు; ఏవ = మాత్రమే; కాలే = సకాలమున, సరియైన సమయమున; భువనస్య = ప్రపంచము యొక్క; గోప్తా =

రక్షకుడు, కాపాడువాడు; విశ్వాధిపః = ప్రపంచమునకు ప్రభువు; సర్వ భూతేషు = అన్ని ప్రాణులలో; గూఢః = నిహితుడు, దాగియున్నాడు; యస్మిన్ = ఎవనిలో; యుక్తాః = లీనమైయుందురు; బ్రహ్మర్షయః = మహర్షులు; దేవతాః = దేవతలు; చ = మరియు; తమ్ = అతనిని; ఏవం = ఇట్లు; జ్ఞాత్వా = తెలుసుకొని; మృత్యుపాశాన్ = మరణబంధములను; ఛినత్తి = ఖండించివేయును; నరికివేయును.

భావము: అతడొకడే ఈ ప్రపంచమునకు సకాలమున రక్షణ నొసగువాడు. అతడు సకల జీవరాశులలో దాగియున్న భువన భర్త. అతనిలో బ్రహ్మర్షులు దేవతలు లీనమైయుందురు. ఆ పరమేశ్వరుని ఇట్లు తెలుసుకొనునతడు మరణ బంధనములను తెగనరకి వేయును.

వివరణము: "సః ఏవ కాలే భువనస్య గోప్తా". పరమేశ్వరుడు సకాలంలో మనల్ని, సర్వభూత కోటిని రక్షిస్తాడు. జీవుల సంచిత కర్మలు పరిపక్వమయ్యే సమయంలో, విభిన్న జీవులను వారి వారి కర్మానుసారం కాపాడుతాడు. పరమేశ్వరుడు దయాసాగరుడు. అందువల్ల అతడు జగద్రక్షకుడు. "గోప్తా" అనగా రక్షకుడు (Saviour). అతడు భువనస్య గోప్తా, అతడు కర్మఫల ప్రదాత. ఏ కర్మకు ఎట్టి ఫలమో పరమేశ్వరునకే తెలియును. అందువల్లనే అతడు భువనస్య గోప్తా లోక రక్షకుడు. అతడు సకాలమున ఆయా జీవులకు వారి వారి కర్మానుసారము ఫలముల నొసగును.

"విశ్వాధిపః సర్వభూతేషు గూఢః" పరమేశ్వరుడు సర్వ జీవకోటి హృదయములలో భాసించుచున్నాడు. అతడు సర్వ భూతములందు దాగియున్నాడు. బ్రహ్మ మొదలుకొని గడ్డిపరక వరకు అతడు సాక్షిమాత్రుడై అంతట దాగియున్నాడు. అతడు అట్లు అణువణువున నిహితమై యుండియు విశ్వాధిపుడై వెలయుచున్నాడు. విశ్వాధిపుడనగా "విశ్వస్య స్వామీ" (ప్రపంచమునకు ప్రభువు)

"యస్మిన్ యుక్తా బ్రహ్మర్షయో దేవతాః చ అతనితో యుక్తులైన వారు బ్రహ్మఋషులు, దేవతలు. పరమేశ్వరుడు చిద్ఘనానంద విగ్రహుడు.

బ్రహ్మర్షులు. దేవతలు ఆ పరాత్పరునితో ఐక్యభావమును పొందినారు వసిష్ఠ సనకాదులు బ్రహ్మఋషులు. బ్రహ్మాదులు దేవతలు.

"తమ్ ఏవం జ్ఞాత్వా". అతనిని ఇట్లు తెలుసుకొని. అనగా పరమేశ్వరుని తెలుసుకొని. "అహం బ్రహ్మాస్మి" (నేను బ్రహ్మమును) అని సాక్షాత్కారము పడసి మృత్యు పాశములను ఛేదించును. అపరోక్షానుభూతి పడయుట వలననే అమృతత్వము పడయునగును.

"మృత్యుపాశాన్ ఛినత్తి". అతడు మరణ బంధనములను తెగనరికి వేయును. మృత్యువు అంటే మరణము (చావు). ఏది నిజమైన చావు? అవిద్యయే చావు. తమస్సే మృత్యువు. అజ్ఞానమే మరణము. అంధకారమే మృత్యువు. రూపాది విషయములు పాశములు. బృహదారణ్యక ఉపనిషత్తులో మృత్యుర్వై తమః అని చెప్పబడియుంది. తమస్సే మృత్యువని అర్థము. అజ్ఞానమె చావు అని భావము. పరమేశ్వరుని తెలుసుకొన్నవాడు కామ కర్మలను ఛేదించును. అతడు మూడు గ్రంథులను తెగద్రెంచును. అవిద్య, కామము, కర్మ — ఇవి జీవుని బంధించు పాశపు ముడులు. పరమేశ్వర సాక్షాత్కారముచే ఆ ముడులు నాశనము చెందును. "అహం బ్రహ్మాస్మి" మహావాక్య ప్రత్యక్షానుభూతి పడసి, అనగా ఆత్మసాక్షాత్కారమును పొంది. అతడు ఐక్యరూప స్వప్రకాశాగ్నిచే సర్వ కామములను, సర్వ కర్మలను, అజ్ఞానమును భస్మీభూతము చేయును

> ఘృతాత్ పరం మండ మివాతి సూక్ష్మం
> జ్ఞాత్వా శివం సర్వభూతేషు గూఢః ।
> విశ్వస్యైకం పరివేష్టితారం
> జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః ॥ 16 ॥

టీక: ఘృతాత్ – నేతికంటె; పరం = సూక్ష్మతరమైన, మండం = సారము, ఇవ = వలె; అతి సూక్ష్మం = మిక్కిలి సూక్ష్మము; జ్ఞాత్వా = తెలిసికొని; శివం = ఆనందమయుని; సర్వభూతేషు = అన్ని ప్రాణులలో; గూఢం = దాగియున్నవానిని; విశ్వస్య =

విశ్వస్య = విశ్వముయొక్క; ఏకం = మాత్రమే; పరివేష్టితారం = ఆవృతమై యుండువానిని; జ్ఞాత్వా = తెలిసికొని; దేవం = దేవుని; ముచ్యతే = విడుదలనొందును; సర్వపాశైః = అన్నిబంధనముల నుండి

భావము: నేతి సారము కంటె మిక్కిలి సూక్ష్మమైనవానిని, సర్వ భూతముల యందు అతి సూక్ష్మ రూపమున నిహితమైయున్న ఆనందమయుని విశ్వమంతటిని ఆవృతమొనర్చియున్న ఏకైక పరమేశ్వరుని సాక్షాత్కరించు కొనినవాడు సకల బంధనములనుండి ముక్తుడగును.

వివరణము: "ఘృతాత్ పరం మండం ఇవ అతి సూక్ష్మం జ్ఞాత్వా శివం సర్వభూతేషు గూఢం" నేతి సారము కన్న అత్యంత సూక్ష్మమైన నట్టియు, అన్ని ప్రాణులలో అతి సూక్ష్మరూపమున దాగియునట్టియు ఆనంద మయుని తెలిసికొని (సాధకుడు సర్వ పాశములనుండి విముక్తి నొందును) వెన్న క్షీరములో సూక్ష్మ లేశముల రూపమున, అణువుల రూపమున కంటికి కనబడ కుండ దాగియున్నది. అలాగే పరమేశ్వరుడు సర్వప్రాణులలో సూక్ష్మ రూపములో దాగియున్నాడు. పాలను చిలికిన పిదప దానియందలి వెన్న కంటికి కనబడును. అలాగే పరమేశ్వరుని ధ్యానించిన యనంతరము ఆత్మ అవగత మగుచున్నది. వెన్నకోసము పాలను (పెరుగును) ఎలా చిలుకుచున్నామో అలాగే పరమానంద ప్రాప్తి కోసము మనము పరాత్పరుని ధ్యానింపవలెను. కావున సర్వ భూతముల హృదయములలో నున్న పరమాత్మను దర్శించు టకు ధ్యానమే మార్గము.

"విశ్వస్య ఏకం పరివేష్టితారం జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః". విశ్వమంతటిని పరివేష్టించియున్న ఆ ఏకైక స్వామిని తెలిసికొన్నవాడు సకల పాశములనుండి విడివడును సూక్ష్మాతి సూక్ష్మమైన పరమాత్మ ప్రపం చమంతటిని వ్యాపించియున్నాడు. ఆత్మ బహు సూక్ష్మమైనది అగుటవలన తెలియబడకున్నది. ఆత్మ నిరాకారము, అది ఆనందఘనము. అది చిద్ఘనము, ఆత్మను తెలిసికొనుటకే మనము. జన్మించినాము. ఈ అనిత్యమైన, దుఃఖాలయమైన లోకమున మనము జన్మించితిమి కావున మనము పరమేశ్వరుని భజించి, నిత్యజీవితమును, పరమానందమును

పొందవలెను. ఆ పరమేశ్వరుని పొందుటవలననే, అనగా ఆత్మ సాక్షాత్కార మువలననే జీవుడు సర్వ బంధనముల నుండి, అనగా కామ బంధమునుండి, అవిద్యా శృంఖలమునుండి, కర్మపాశమునుండి ముక్తుడగును. ఆత్మ సాక్షాత్కారమునకు మార్గమేమి? ధ్యానమే. బ్రహ్మధ్యానమే దానికి మార్గము.

ఏష దేవో విశ్వకర్మా మహాత్మా
సదా జనానాం హృదయే సన్నివిష్టః ।
హృదా మనీషా మనసాఽభిక్లృప్తో
య ఏతద్ విదురమృతాస్తే భవంతి ॥ 17 ॥

టీక: ఏషః = ఈ; దేవః = భగవంతుడు; విశ్వకర్మా = విశ్వముయొక్క సృష్టికర్త; మహాత్మా = పరమాత్మ; సదా = ఎల్లప్పుడు; జనానాం = ప్రాణులయొక్క; హృదయే = హృదయములందు; సన్నివిష్టః = నివసించును; హృదా = హృదయముచేతను; మనీషా = బుద్ధిచేతను; మనసా = మనస్సుచేతను; అభిక్లృప్తః = పరిమితుడగుటవలన; యః = ఎవరు; ఏతద్ = దీనిని; విదుః = తెలిసికొందురు; అమృతాః = అమృతులు, మరణములేనివారు; తే = వారు; భవంతి = అగుచున్నారు.

భావము; పరమేశ్వరుడు, విశ్వసృష్టికర్త, పరమాత్మ (హృదయము చేతను, బుద్ధిచేతను, మనస్సుచేతను పరిమితుడగుటచే) సర్వప్రాణుల హృత్పద్మమయందు ఎల్లప్పుడు నివసించును. దీనిని తెలిసికొన్నవారు అమృతులగుదురు.

వివరణము: "ఏషః దేవః విశ్వకర్మా మహాత్మా". ఈ భగవంతుడు విశ్వమును సృష్టించిన పరమాత్మ. ఏషఃదేవః అనగా ఈ దేవుడు. దేవుడు అనే పదం "దివ్" అనే ధాతువు నుండి వచ్చింది. "దివ్" అనగా ప్రకాశించు. దేవుడు ద్యోతనాత్మక పరమాత్ముడు. అతడు వెలుగులకు వెలుగు అతడు పరంజ్యోతి. అతడు జ్ఞాన స్వరూపుడు. అతడు చిద్ఘనమూ

పిస్తున్నాము. "విశ్వకరా" అనగా విశ్వమును సృష్టించినవాడు. మహదాది విశ్వమును సృష్టించుటచే మనము అతనిని విశ్వకర్మ యని పిలుచుచున్నాము. మాయయొక్క సంసర్గ వశమున పరమాత్ముడు విశ్వరూపమును ధరించుటచే విశ్వకర్మ యనబడుచున్నాడు మహాత్మా యనగా పరమాత్మ. భగవానుడు "మహాన్" (గొప్పవాడు) అగుటచేతను "ఆత్మా" (బ్రహ్మము) అగుటచేతను "మహాత్మా" అని పిలువబడినాడు. మహాత్మా యనగా సర్వవ్యాపి. అతడు అంతట వ్యాపియైన పరమాత్మ.

"సదా జనానాం హృదయే సన్నివిష్టః. భగవానుడు సర్వదా సకల ప్రాణికోటి హృత్పద్మయందు నివసించును. (The Lord always dwells in the hearts of all beings). అతడు హృదయాకాశంలో ప్రకాశిస్తాడు. జలాది ఉపాధులలో సూర్యప్రతిబింబం భాసించినట్లుగ భగవంతుడు సకల జీవుల హృదయాలలో స్థితుడైయున్నాడు. అతడు మన హృదయంలో సాక్షీ రూపంలో ఉన్నాడు.

"హృదా మనీషా మనసా అభిక్లృప్త". పరమేశ్వరుడు హృదయముచేతను. బుద్ధిచేతను. మనస్సుచేతను. అభిక్లృప్తుడు (పరిమితుడు, ప్రకాశితుడు-అభివ్యక్తుడు) "హృదా" అనగా హృదయముచే 'హృ' ధాతువునకు "హరించు" అని అర్థము. (హృదా.హృంజ్-హరణే). భగవానుడు "నేతి-నేతి" (ఇది కాదు, ఇది కాదు) మొదలగు నిషేధ ఉపదేశంచే అభివ్యక్తుడౌతాడు. "మనీషా" అనగా బుద్ధిచేత, "ఇది ఆత్మ, ఇది అనాత్మ." "ఇది పురుషార్థము" అని వివేచన చేయగల బుద్ధిచే భగవానుడు అభివ్యక్తుడౌతాడు. "మనసా" అనగా మనస్సుతో. విచారసాధ్య ఏకత్వ జ్ఞానంతో భగవానుడు ప్రకాశితుడౌతాడు అభిక్లృప్తః అనగా పరిమితుడు. అభిక్లృప్తః అనగా ప్రకాశిత, అభివ్యక్త అని అర్థము. భగవానుడు అఖండైక రస స్వరూపంతో అభివ్యక్తుడౌతాడు.

"యః ఏతద్ విదుః అమృతాః తే భవంతి". ఎవరు దీనిని తెలుసుకొందురో వారు అమృతులు అగుదురు. (Those who know this become immortal ). అహం బ్రహ్మాస్మి (నేను పరబ్రహ్మమును)అనే అపరోక్షజ్ఞానం పొందినటువంటి జ్ఞానులు అమృతత్వమును, అనగా మోక్షమును

పొందుతారు. సాధన చతుష్టయ సంపన్నులైన సంన్యాసులు భగవంతుడు సర్వ ప్రాణికోటి హృత్పద్మమునందు సన్నివిష్టుడై యుండుట తెలిసికొంటారు. వారు 'తత్త్వమసి' మహావాక్యా నుసంధానం చేసి, 'అహం బ్రహ్మాస్మి' అపరోక్షానుభవం పడసి, జ్ఞానులై జననరావృత్తిరహితులౌతారు. వారు అమృతులౌతారు

యదాఽతమస్తన్న దివా న రాత్రిః
న సన్న చాసచ్ఛివ ఏవ కేవలః ।
తదక్షరం తత్ సవితుర్ వరేణ్యం
ప్రజ్ఞా చ తస్మాత్ ప్రసృతా పురాణీ ॥ 18 ॥

టీక: యదా = ఎప్పుడు: అతమః = తమస్సులేమి; తత్ = అప్పుడు; న = లేదు; దివా = పగలు; న = లేదు; రాత్రిః = రాత్రి; న = లేదు సత్ = భావము, ఉండుట, సత్తు; న = లేదు; చ = మరియు; అసత్ = అభావము, లేకుండుట, అసత్తు; శివ ఏవ కేవలః = సర్వమంగళ ప్రదుడు (శివుడు) ఒకడే ఉన్నాడు; తత్ = ఆ; అక్షరం = క్షరములేని నాశరహితమైన; తత్ = అది; సవితుర్; వరేణ్యం = సవితృయొక్క భజనీయ ప్రకాశము; ప్రజ్ఞా = విజ్ఞానము; చ = మరియు; తస్మాత్ = అతని నుండి; ప్రసృతా = బయలుదేరెను, వ్యాపించెను; పురాణీ = అనాది సిద్ధము-ప్రాచీనమైనది, పురాతనమైనది.

భావము: ఎప్పుడు అజ్ఞానము అదృశ్యమగునో అప్పుడు పగలు లేదు; రాత్రిలేదు; భావము లేదు, అభావము లేదు. అప్పుడు అక్షరుడైన, సర్వమంగళ ప్రదుడైన, సవితృయొక్క భజనీయ తేజస్సు అయిన శివుడు ఒక్కడే యుండును. అప్పరమేశ్వరుని నుండి ప్రాచీన విజ్ఞానము బయలు దేరినది.

వివరణము: "యదా అతమః". ఎప్పుడు అజ్ఞానము తొలగునో అజ్ఞాన మనెడి అంధకారం, మిథ్యాజ్ఞానం తొలగినపుడు అన్ని విధములైన వ్యత్యాసాలు, విభేదాలు అదృశ్యమౌతాయి.

"తత్ న దివా న రాత్రిః న సత్ న చ అసత్." అజ్ఞాన మదృశ్యమైన యనంతరం పగలు లేదు, రాత్రి లేదు, సత్తు లేదు,

మెప్పుడు అంతమొందును? తత్త్వమసి మున్నగు మహా వాక్యములను అనుసంధానము చేయుటవలన జనించిన జ్ఞానముతో అవిద్య దగ్ధమగును. అనగా అజ్ఞానము, తమస్సు తొలగును. అప్పుడు పగటి యొక్క ఆరోపంగాని రాత్రిఆరోపంగాని ఉండదు. అలాగే భావ ఆరోపంగాని, అభావ ఆరోపంగాని ఉండదు. అవిద్యయనే చీకటి తొలగినప్పుడు సత్తుగాని, అసత్తుగాని ఉండదు. దీనినంతయు పఠించి బ్రహ్మము కేవలం శూన్యమని భావింపరాదు. దీనిచేత సూచితమయ్యే అభిప్రాయం ఏమిటి? బ్రహ్మము ఈ ప్రపంచమునకు సంబంధించిన సకలవిధములైన సాపేక్షములకు అతీతమై యుంటుంది. అందువల్లనే.

"శివ ఏవ కేవలః తదక్షరం తత్ సవితుర్ వరేణ్యం" అని చెప్పబడింది. అతడు శుభప్రదుడైన శివుడు. అతడు అక్షరుడు అతడు స్తవనీయ పరంజ్యోతి, శివుడు ఒక్కడే యున్నాడు. అతడు శుద్ధస్వభావుడు అతడు పరమాత్మ అతడు శూన్యుడు కాడు. అతని స్వరూపము అక్షరము అతని జ్యోతిస్స్వరూపము భజనీయమైనది

"ప్రజ్ఞా చ తస్మాత్ ప్రసృతా పురాణీ." ఆ ఆనందమయ శివుని నుండి ప్రాచీన విజ్ఞానము బయలుదేరినది. ప్రజ్ఞయనగా విజ్ఞానము, వేదములకు బ్రహ్మము ఉద్గమ స్థానము. వేదములు అతని యొక్క శ్వాస. అతడు పురాణ విజ్ఞానమునకు మూలము, ఆ ప్రాచీన విజ్ఞానము వేదముల రూపమున మనకు పరంపరగా అందజేయబడినది గురువరేణ్యులు శిష్యునకు 'తత్త్వమసి' మున్నగు మహావాక్యాలను ఉపదేశిస్తారు. ఆ మహావాక్యాలను అనుసంధానం చేయగా బుద్ధి వికసిస్తుంది.

---

నైనమూర్ధ్వం న తిర్యంచం
న మధ్యే పరిజగ్రభత్ ।
న తస్య ప్రతిమా అస్తి
యస్య నామ మహద్ యశః ॥ 19 ॥

టీక: న = లేదు; ఏనం = అతనిని; ఊర్ధ్వం = ఉపరిభాగమును; న = లేదు; తిర్యంచం = అడ్డముగ; న = లేదు;

మధ్యే= మధ్యభాగమున; పరిజగ్రభత్= పట్టుకొనగలరు; న= లేదు; తస్య= అతనియొక్క; ప్రతిమా = ప్రతిమ, పోలిక; అస్తి= కలదు; యస్య = ఎవని యొక్క; నామ = అభిధానము, పేరు; మహత్ = గొప్ప; యశః = యశస్సు, వైభవము, కీర్తి.

భావము: బ్రహ్మమును పైనుండి గాని, అడ్డముగా గాని పట్టుకొనుటకు సాధ్యపడదు. అతనితో పోలిక కలిగినది మరొకటి లేదు. అతని అభిధానము, మహద్ యశస్సు (మహాకీర్తి)

వివరణము. "న ఏనం ఊర్ధ్వం న తిర్యంచం న మధ్యే పరిజగ్రభత్" బ్రహ్మమును పైనుండిగాని, అడ్డముగాగాని మధ్యలోగాని, ఎవరును పట్టుకొనలేరు, "పరిగ్రహీతుం న శక్నుయాత్" బ్రహ్మమును పట్టుకొనుటకు సాధ్యపడదు. ఎందువల్ల? "ఏనం ప్రకృతిం అపరిచ్ఛిన్న రూపత్వాత్ నిరంశత్వాత్ నిరవయత్వాత్ చ ఊర్ధ్వాదిషు దిక్షు కశ్చిదపి న పరిజగ్రభత్ పరిగ్రహీతుం న శక్నుయాత్" పరబ్రహ్మము అతి సూక్ష్మ స్వరూపుడు, అపరిచ్ఛిన్నుడు, నిరంశుడు, నిరవయోపేతుడు ఈ కారణంవల్ల బ్రహ్మమును ఏలాగుననైనను పట్టుకొనుటకు సాధ్యపడదు. మన శరీరావయవములతో మనము పరమేశ్వరుని పట్టుకొనుటకు వీలుపడదు.

"న తస్య ప్రతిమా అస్తి." తస్య ప్రతిమా నాస్తి (there is no likeness of him). అతని సాటి మరొకటి లేదు. కొందరు వ్యాఖ్యాతలు 'అతని యొక్క ప్రతిమ లేదు,' అని అర్థము చెప్పుదురు. ఏకారణముచేత అతనిని పోలినది మరొకటి లేదు? "తస్య తస్య ఏవ ఈశ్వరస్య అఖండ సుఖఅనుభవత్వాత్ ఏతాదృశ ద్వితీయ అభావాత్ ప్రతిమా ఉపమా నాస్తి." అఖండానంద అనుభవ రూపమగుటచే ఈశ్వరునకు సమానమైనది రెండవది లేకుండుటచే అతనికి పోలికయుండజాలదు.

"యస్య నామ మహద్ యశః". అతని పేరు మహాకీర్తి. అతని అభిధానము 'గొప్ప యశస్సు'. "యస్య ఈశ్వరస్య నామ అభిధానం మహత్ దిగాది అనవచ్ఛిన్నం సర్వత్ర పరిపూర్ణం యశః కీర్తిః." పరమేశ్వరుని

పేరు దిగాదులకంటె అపరిమితమైనది. అతడు సర్వత్ర పూర్ణయశుడైన వాడు, అతడు దిగాది అనవచ్ఛిన్న కీర్తిమంతుడు.

భగవన్నామము భయంకరమైన సంసారతరంగిణిని తరించుటకు ఒక సురక్షితమైన నౌక. నామము, నామి ఒకటే. భగవన్నామము, భగవంతుడు ఒకటే. ఈ కలియుగమున మానవుడు భగవన్నామమును ఆశ్రయించి నిత్యానందము పొందనగును. పరమేశ్వరుని పడయుటకు భగవన్నామ జపమే సులభతరమైన, శీఘ్రతరమైన, అపాయమైన, నిశ్చయమైన మార్గము. భగవంతునికి జయము! భగవన్నామమునకు జయము!

---

న సందృశే తిష్ఠతి రూపమస్య
న చక్షుషా పశ్యతి కశ్చనైనమ్ ।
హృదా హృదిస్థం మనసా య ఏనం
ఏవం విదురమృతాస్తే భవంతి ॥ 20 ॥

టీక: న = లేదు; సందృశే = చక్షురాది గ్రహణ యోగ్య ప్రదేశే, నేత్రాది ఇంద్రియములతో గ్రహించుటకు యోగ్యమైన ప్రదేశమందు, సందర్శన క్షేత్రమునందు; తిష్ఠతి = నిలబడును; రూపం = ఆకృతి, ఆకారము రూపము; అస్య = దానియొక్క; న చక్షుషా పశ్యతి = కన్నులతో చూడబడదు; కశ్చన = ఏదేని; ఏనం = దీనిని; హృదా = హృదయముచే; హృదిస్థం = హృదయములో ఆసీనమైనయుండు; మనసా = మనస్సుచే; యః = ఎవడు; ఏనం = దీనిని; ఏవం = ఇట్లు; విదుః = తెలిసికొనును; అమృతాః = అమృతులు; తే = వారు; భవంతి = అగుదురు.

భావము: అతని రూపము నయన గోచరము కాదు. ఎవరును అతనిని చక్షువులతో దర్శింపజాలరు. హృదయములో ఆసీనమైయుండు నతుల ఎవరు అతనిని జ్ఞాన చక్షువుతో తెలిసికొందురో వారు అమృతులగుదురు.

వివరణము: "న సందృశే తిష్ఠతి రూపం అస్య." అనగా అతని రూపము సందర్శన క్షేత్రములో లేదు. అతని రూపము దర్శింపబడజాలదు. రూపాన్ని చూడడానికి నేత్రాలు అవసరం. కాని, ఇతని రూపాన్ని దర్శించ డానికి కన్నులు చాలవు. ఎవరు అతనిని భౌతిక చక్షువులతో, చర్మనయనా లతో చూడజాలరు.

"న చక్షుషా పశ్యతి కశ్చన ఏనమ్." ఇతనిని ఎవరు కన్నులతో చూడలేరు. సూక్ష్మమైన పదార్థాన్ని మనం మైక్రొస్కోప్ ద్వారా భౌతిక చక్షువులతో చూడగలము. కాని, ఈ ఆత్మను ఎటువంటి మైక్రో స్కోప్‌తో గూడ దర్శింపజాలము. అది సూక్ష్మాతి సూక్ష్మము. పరమేశ్వ రుని రూపాన్ని మాంసపు నేత్రాలు చూడలేవు. అందువల్లనే కృష్ణ భగవానుడు అర్జునునితో ఇలా అంటారు:

న తు మాం శక్యసే ద్రష్టుం అనేనైవ స్వచక్షుషా ।
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరం ॥ — గీతా.

ఈ నీ స్వనేత్రాలతో నన్ను చూచుటకు నీవు అశక్తుడవు: నేను నీకు దివ్య చక్షువును ప్రసాదింతును. దానిచే నీవు నా అద్భుత యోగ ప్రభావమును వీక్షింపుము.

ఇచ్చట పాఠకులు ఒక విషయం జాగ్రత్తగా గ్రహించాలి. మన స్సుతో గాని భౌతిక చక్షువులతో గాని దేవుని రూపాన్ని చూడలేము అది బాహ్యానుభవము కాదు అది అంతరానుభవము (Inner Experience).

"హృదా హృదిస్థం మనసా యః ఏవం ఏవం విదుః అమృతాః తే భవంతి." పరమేశ్వరుని హృత్పద్మమందు ఆసీనుడైయున్నట్లు ఎవరు తెలిసి కొందురో వారు అమృతులగుదురు. "హృదా మనసా." హృదయముచే, మనస్సుచే అని అర్థము. దీనినే దివ్య చక్షువుచే యనియు, జ్ఞాన నేత్రముచే యనియు, బ్రహ్మాకారవృత్తిచే యనియు అందురు. బ్రహ్మ చింతన వలన మనోవృత్తులన్నియు అణగిపోయినప్పుడు బ్రహ్మాకారవృత్తి జనిస్తుంది. ధ్యాత బ్రహ్మాకారవృత్తిచే బ్రహ్మమును సాక్షాత్కారం చేసుకొంటాడు. బ్రహ్మా కారవృత్తి జ్ఞానచక్షువును (The eye of intuition) సూచించును.

సాధన చతుష్టయ సంపన్నుడై, "తత్త్వమసి" మహా వాక్యాన్ని అనుసంధానం చేసే ధ్యాత యొక్క సాత్త్విక అంతః కరణం నుండి ఈ బ్రహ్మాకారవృత్తి ఉదయిస్తుంది. ఈ బ్రహ్మాకారవృత్తి అజ్ఞానపు తెరను నిర్మూలిస్తుంది. అది ఆవరణమును అంతమొందిస్తుంది. అప్పుడు. బ్రహ్మము తనంతట తాను ప్రకాశిస్తాడు. జీవాత్మ పరమాత్మతో తన అభేదత్వాన్ని తెలిసికొని, పరమాత్మలో లీనమౌతాడు.

జీవాత్మ పరమాత్మల అభేదత్వమును ప్రత్యక్షము చేసికొన్న ధ్యాతలు అమృతులౌతురు. వారు అమరణ ధర్మాన్ని పొందుతారు. వారు మృత్యుపాశములను ఛేదిస్తారు. అజ్ఞానం (అవిద్య) మరణానికి హేతువు. తత్త్వజ్ఞానాగ్నిచే (తత్త్వజ్ఞానం అనెడి అగ్నిచే) వారు అవిద్యను దగ్ధం చేస్తారు. దేహాంతరానికి కారణం అవిద్య కాబట్టి అవిద్య అంతమొందితే అన్య దేహధారణ లేదు 'అహంబ్రహ్మాస్మి' అను అపరోక్ష జ్ఞాన మహిమవల్ల, జీవబ్రహ్మైక్యమును పడసి ధ్యాతలు అమృతులౌతారు.

అజాత ఇత్యేవం
కశ్చిద్భీరుః ప్రపద్యతే ।
రుద్ర యత్తే దక్షిణం ముఖం
తేన మాం పాహి నిత్యమ్ ॥ 21 ॥

టీక: అజాత ఇతి ఏవం = పుట్టుకలేనివాడవని; కశ్చిత్భీరుః = భయపడిన ఒకానొకడు; ప్రపద్యతే = సమీపించును; రుద్ర = హేరుద్ర, ఓరుద్ర పరమాత్మ, యత్ = ఏది; తే = నీయొక్క; దక్షిణం = ప్రసన్నమైన, దయగల, ఉపకారమొనర్చెడు, అనుగ్రహపూర్వకమైన; ముఖం = వదనము; తేన = దానితో; మాం = నన్ను; పాహి = రక్షింపుము; నిత్యం = ఎన్నటికి, ఎప్పటికి, సర్వదా, సతతము.

భావము; నిన్ను అభవుడచును సంసార భయకంపితులు కొందరు నిన్ను దరియుదురు. హే రుద్రభగవన్, ప్రసన్నవదనుడవై నన్ను అనవరతము రక్షింపుము.

వివరణము: "అజాత ఇతి ఏవం కశ్చిత్ భీరుః ప్రపద్యతే." నిన్ను పుట్టువులేనివానిగ భావించిన కొందరు భయకంపితులు నిన్ను సమీపింతురు. వివేక వైరాగ్య సంపన్నులైన కొందరు జిజ్ఞాసువులు మాయనుగురించి చాల భయపడు తారు.వారు సంసారమునుజూచి బహుభీతిల్లెదరు. వారు జననమరణ మహోదధిని సత్వరంగా దాటాలని కోరుకొంటారు. తృష్ణయే ఈ సంసారసాగరంలోని నీరు మోహమే సాగరపు అలలు. కామమే ఆ సముద్రంపై వీచేటటువంటి పెను గాలి. భార్యయే సముద్రంలోని భయంకరమైన సుడిగుండం. తనయులే సహజమైన పట్టువిడువని ఘోరమైన నక్రములు మోక్షప్రియులు ఇటువంటి సంసార మహోదధి నుండి బయటపడడానికి పరమేశ్వరుని తమకు భక్తి నావను ప్రసాదించవలసినదిగ ప్రార్థన చేయుదురు.

సాధన చతుష్టయ సంపన్నులు, సంసార సాగరమును సత్వరముగా దాటగోరు మోక్షప్రియులు పరమేశ్వరుని "పాహి మాం, పాహి మాం" అని సమీపింతురు. వారు భగవంతుని భక్తి ప్రపత్తులతో ప్రార్థింతురు.వారు పరమేశ్వరుని నిశ్చల చిత్తముతో ధ్యానింతురు. వారు భగవంతుని సతతము కీర్తింతురు. వారు భగవన్నామమును గానము చేయుదురు. క్రమేణ వారు భగవంతుని పొందుదురు. వారు పరమేశ్వరునిలో లీనమయ్యెదరు. వారు పరమేశ్వరునితో తాదాత్మ్యము పొందెదరు. వారు బ్రహ్మైక్యమును పడయుదురు.

"రుద్ర యత్ తే దక్షిణం ముఖం తేన మాం పాహి నిత్యమ్" ఓ రుద్ర, నీ ప్రసన్న వదనముతో నన్ను సర్వదా కాపాడుము. దక్షిణ ముఖము అనగా ప్రసన్న వదనము. రుద్రునియొక్క దక్షిణ ముఖము చాల ఉత్సాహజనకమైనది. రుద్రుడు ధ్యానించువారికి ఆహ్లాదం కలుగజేస్తాడు జిజ్ఞాసువు రుద్రుని శరణు వేడుచున్నాడు. "నిన్ను శరణువేడిన నన్ను కాపాడుము" అని ఇట్లు ప్రార్థించును;

జరా జన్మ దుఃఖౌఘ తాతప్యమానం
ప్రభో పాహి ఆపన్నం మామ్ ఈశ శంభో.

ముసలితనము, పుట్టుక, దుఃఖము, పాపములచే నేను తపించి పోవుచున్నాను. ఓ పరమేశ్వరా, రుద్రా, నిన్ను శరణు జొచ్చిన నన్ను కాపాడుము, రక్షింపుము

మా నస్తోకే తనయే మా న ఆయుషి.
మా నో గోషు మా న అశ్వేషు రీరిషః ।
వీరాన్ మా నో రుద్ర భామితో
వధీర్హవిష్మంతః సదమిత్ త్వా హవామహే ॥ 22 ॥

టీక: మా = వద్దు; నః = మాకు; తోకే = బిడ్డలలో; తనయే = మనుమలలో; మా = వద్దు; నః = మాయొక్క; ఆయుషి = జీవిత పరిమితిలో; మా = వద్దు; నః = మాయొక్క; మా = వద్దు; నః = మాయొక్క; గోషు = ఆవులలో; మా = వద్దు; నః = మాయొక్క; అశ్వేషు = గుర్రములలో; రీరిషః = బాధకలిగించు; వీరాన్ = వీరులను; మా = వద్దు; నః = మా యొక్క; రుద్ర = ఓ రుద్ర. భామితః = కోపముతో; వధీః = చంపు; హవిష్మంతః = హవిస్సులతో; సదమిత్ = ఎల్లప్పుడు; త్వా = నిన్ను; హవామహే = ప్రార్థించుచున్నాము

భావము: ఓ రుద్ర, మా బిడ్డలను హింసించకుము. హే భగవన్, మా మనుమలను గాని, మా జీవితములను గాని, ఆవులను గాని, గుర్రములను గాని బాధింపకుము. మరియు నీ కోపములో మా వీరులను సంహరింపకుము. మేము నిన్ను సదా హవిస్సులతో (నైవేద్యములతో) ప్రార్థించుచున్నాము.

వివరణము: "మా నః తోకే తనయే మా నః ఆయుషి మా నః గోషు మా నః అశ్వేషు రీరిషః". హే పరమేశ్వర, మా బిడ్డలను మనుమలను, మా జీవితములను, ఆవులను, గుర్రములను హింసింపకుము. అస్మాకం పుత్రే వినాశం మా కార్షీః. అస్మాకం పౌత్రే మరణం మా కార్షీః. అస్మాకం గోషు అశ్వేషు రేషణం మా కార్షీః అస్మాకం ఆయుషి రేషణం

మా కార్షిః". ఓ రుద్ర, మా పిల్లలను హింసింపవద్దు. మా మనుమలను బాధింపవద్దు మా ఆవులను, గుర్రములను పరిమార్చకుము. మా ఆయుస్సులను క్షయింపచేయకుము.

"వీరాన్ మా నః రుద్ర భామితః వధీః హవిష్మంతః సదమిత్ త్వా హవామహే." ఓ రుద్ర, నీ కోపములో మా వీరులను సంహరింపకుము. మేము నిన్ను సదా హవిస్సులతో ప్రార్థించుచున్నాము. "వీరాన్" అనగా వీరులను. బ్రహ్మజిజ్ఞాసువులు నిజముగా భయంకరమైన వీరులు. ఎందువల్ల? ఈ ఆధ్యాత్మిక వీరులు మనస్సుతో, ఇంద్రియములతో, వాసనలతో, పూర్వ సంస్కారాలతో బ్రహ్మాండమైన యుద్ధాన్ని సాగిస్తారు వీరికి అనేక అడ్డంకులు ఎదురౌతాయి. వారు ఓర్పుతోగూడిన యత్నాలతో, కృషితో, మెలకువతో, నేర్పుతో ఆ విఘ్నాలను జయిస్తారు ప్రపంచ యుద్ధం కూడా కొన్ని సంవత్సరాల తర్వాత ఆగిపోతుంది. కాని, ఈ అంతర్యుద్ధం చాలాకాలం కొనసాగుతూనే యుంటుంది. అందువల్లనే బ్రహ్మజిజ్ఞాసువులను వీరులంటాము. వీరు యుద్ధ సేనానాయకుల కంటె గొప్పవీరులు యుద్ధంలో చచ్చిపోయినవారు మరల తలెత్తరు. కాని, ఆధ్యాత్మిక అంతర్యుద్ధంలో వాసనలు, యింద్రియాలు పదే పదే తలెత్తుతూంటాయి. "భామితః" అనగా క్రోధితః. కోపంలో, ఓ రుద్ర, నీ కోపంలో మా ఆధ్యాత్మిక యుద్ధవీరుల్ని చంపివేయకు. ఎందువల్ల? "హవిష్మంతః సదమిత్ త్వా హవామహే. (We invoke Thee always with offerings). హవిస్సులతో మేము నిన్నెల్లప్పుడు ఆవాహనచేయు చున్నాము. "సదైవ రక్షణార్థం అహ్వాయామ. నీవు మమ్ములను ఎల్లప్పుడు రక్షించవలసినదిగా కోరుచున్నాము.

పసి పాపలను గాని, యువకులను గాని, యువతులను గాని, వృద్ధులను గాని, పశువులనుగాని, గుర్రాలనుగాని, ఏ శరీర ధారులనుగాని, వీరులను గాని అబలలనుగాని ఎవరికిని బాధకలిగింపవలదని రుద్రునకు హవిస్సులతో ఆవాహనం జరుపబడుతూంది. ఇది లోకకల్యాణార్థము చేయబడిన అందమైన ప్రార్థన. (This is a beautiful mantra (Prayer) for the Prosperity of the entire world).

---

ఇతి శ్వేతాశ్వతరోపనిషద్ భాష్యే

చతుర్థోఽధ్యాయః

# పంచమోఽధ్యాయః

## ఐదవ అధ్యాయము

ద్వే అక్షరే బ్రహ్మపరే త్వనంతే
విద్యావిద్యే నిహితే యత్ర గూఢే।
క్షరం త్వవిద్యా హ్యమృతం తు విద్యా
విద్యావిద్యే ఈశతే యస్తు సోఽన్యః ॥ 1 ॥

టీక: ద్వే = రెండు; అక్షరే = అక్షరమునందు; బ్రహ్మపరే = సర్వోత్కృష్టమైన బ్రహ్మమునందు; తు = నిజముగా; అనంతే = అనంతమునందు; విద్యా విద్యే = జ్ఞానము, అజ్ఞానము; నిహితే = స్థాపితే, ఉన్నది; యత్ర = ఎవనిలో; గూఢే = అనభివ్యక్తే, దాగియున్నది; క్షరం = క్షరము; తు = నిజముగ; అవిద్యా = అజ్ఞానము; హి = నిజముగా; అమృతం = అమృతమైనది; తు = నిజముగా; విద్యా = జ్ఞానము; విద్యావిద్యే = జ్ఞానము, అజ్ఞానము; ఈశతే = నియమించును, నిగ్రహించును; యః = ఎవరు; తు = నిజముగ; సః = ఆతడు; అన్యః = భిన్నమైన.

భావము: అజ్ఞానము నాశవములో మృతమైనది. జ్ఞానము యథార్థముగ అమృతమైనది. అవ్యయమైన, అనంతమైన, సర్వోత్కృష్టమైన పరబ్రహ్మమునందు జ్ఞానము, అజ్ఞానము దాగియున్నవి అజ్ఞానమును, జ్ఞానమును— ఈ రెండింటిని నియమించు బ్రహ్మము వానికంటె పూర్తిగ భిన్నుడు.

వివరణము: "ద్వే అక్షరే బ్రహ్మపరే తు అనంతే విద్యావిద్యేనిహితే యత్ర గూఢే". అక్షరమైన, అనంతమైన, సర్వోత్కృష్టమైన బ్రహ్మమునందు జ్ఞానము అజ్ఞానము దాగియున్నవి. అక్షరే అనగా అవినాశియైన బ్రహ్మమునందు జ్ఞాన, అజ్ఞానములు దాగియున్నవి బ్రహ్మపరే అనగా

హిరణ్యగర్భునికంటె గొప్పవాడైన సర్వోత్కృష్ట బ్రహ్మమునందు, పర బ్రహ్మమునందు విద్య, అవిద్యలు రెండును గూఢమైయున్నవి. విద్య, అవిద్య —ఇవి రెండూ బ్రహ్మములో దాగియున్నవి. బ్రహ్మము విద్య, అవిద్యల కంటె భిన్నుడు. అతడు సాక్షి అతడు విద్య, అవిద్యల చేష్టలను ఊరక చూచుచుండును. అతడు అనంగుడు అతడు విద్య అవిద్యలచే నిర్లిప్తుడు.

"క్షరం తు అవిద్యా." అజ్ఞానము నిజముగా మృతమైనది. అవిద్య నిజముగా మృతమైనది. క్షరమైనది, నశ్వరమైనది. అది బంధహేతువు. అది సంసృతి కారణము. అది సంసారమునకు కారణము. అవిద్య మనస్సులో ఉంటుంది, బ్రహ్మము దాన్ని పాలిస్తాడు, బ్రహ్మము అవిద్యను నియమిస్తాడు. శాసిస్తాడు, నిగ్రహిస్తాడు, అదుపులో ఉంచుతాడు, అ విద్య మనస్సు యొక్క వికారం. అది బ్రహ్మములో జీవిస్తుంది.

"హి అమృతం తు విద్యా." జ్ఞానము యథార్థముగ అమృతమైనది అది మోక్ష హేతువు. అది ముక్తికి కారణము. విద్య మనస్సులో ఉంటుంది. బ్రహ్మము దాన్ని పాలిస్తాడు బ్రహ్మము విద్యను నియమిస్తాడు. బ్రహ్మము జ్ఞానమును శాసిస్తాడు, నిగ్రహిస్తాడు, అదుపులో ఉంచుతాడు జ్ఞానం మనస్సు యొక్క వికారం. అది బ్రహ్మములో జీవిస్తుంది.

"విద్యావిద్యే ఈశతే యః తు సః అన్యః. జ్ఞానమును, అజ్ఞానమును— ఈ రెండింటిని నియమించు బ్రహ్మము వానికంటె పూర్తిగ భిన్నుడు. విద్యను, అవిద్యను శాసిస్తాడు అతడు వానికి సాక్షిగ ఉండుటచే ఆ రెండింటికి భిన్ను డైయున్నాడు. యః తు పునః విద్యావిద్యే ఈశతే నియమయతి సః తాభ్యాం అన్యః తత్ సాక్షిత్వాత్. అతడు విద్యను, అవిద్యను శాసిస్తాడు, అతడు సాక్షిగ ఉండుటచేత ఆ రెండింటికి భిన్నుడై యున్నాడు."

అలా సాక్షిగా ఉన్నది ఎవరో రెండవ మంత్రంలో చెప్పబడుతుంది.

---

**యో యోనిం యోనిం అధితిష్ఠత్యేకో**
**విశ్వాని రూపాణి యోనీశ్చ సర్వాః।**

ఋషిం ప్రసూతం కపిలం యస్తమగ్రే
జ్ఞానైర్బిభర్తి జాయమానం చ పశ్యేత్ ॥ 2 ॥

టీక: యః = ఎవడు; యోనిం యోనిం = స్థానం స్థానం, ప్రతి ఉత్పత్తి స్థానమును; అధితిష్ఠతి = నియమయతి, నియమించును, అధ్యక్షత వహించును; ఏకః = అద్వితీయః, అద్వయుడు, ఒకటి; విశ్వాని = రోహితాదీని, లోహితాది, అన్ని; రూపాణి = రూపములు; యోనీః = ప్రభవస్థానాని, ఉత్పత్తి స్థానముల ; చ = మరియు; సర్వాః = సమస్త సకల, అన్ని; ఋషిం = సర్వజ్ఞం, సర్వము తెలిసినవానిని; ప్రసూతం = జన్మను చూచును; కపిలం = కనక కపిల వర్ణం, బంగారు వన్నెకలిగిన వానిని. హిరణ్యగర్భుని; యః తం అగ్రే = ఎవడు సృష్టికాలమున, ఎవడు సృష్ట్యాదియందు; జ్ఞానైః = సకల విధములైన జ్ఞానముతో, ధర్మజ్ఞానవైరాగ్య ఐశ్వర్యైః; బిభర్తి = బభార, యుక్తునిచేయును, సంపన్నుని గావించును; జాయమానం = పుట్టుక, ఉత్పన్నమగుట; చ = మరియు; పశ్యేత్ = అపశ్యత్, చూచును.

భావము: అద్వయుడై యున్న కారణమున అతడే ప్రతి ఉత్పత్తి స్థానముపై, ప్రతి రూపముపై అధ్యక్షత వహించును; అతడు ప్రథమ జన్మను పడసిన బంగారువన్నెగల ఋషిని దర్శించును; సృష్ట్యాదియందు అతనిని సకల విధ జ్ఞాన సంపన్నుని గావించును.

వివరణము: "యః యోనిం యోనిం అధితిష్ఠతి" ఎవడు ప్రతి ఉత్పత్తిస్థానముపై అధ్యక్షత వహించునో, ఎవడు స్థాన స్థానమును నియమించునో. "యం పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అంతరో యం పృథివీ న వేద యస్య పృథివీ శరీరం యః పృథివీమంతరో యమయత్యేష త ఆత్మాంతర్యా మ్యమృతః" — బృహదారణ్యక ఉపనిషత్తు. ఎవడు పృథివియందు నివసించునో, మరియు పృథివి అంతరమున నుండునో, ఎవనిని పృథివికి తెలియదో, ఎవని శరీరము పృథివియో ఎవడు అంతరముననుండి పృథివిని పాలించునో, అతడే నీ యాత్మ, అంతర్యామి, అమృత స్వరూపుడు, పరమేశ్వరుడు

పృథివియందు స్థితుడై పృథివిని శాసించును. అతడు పృధివ్యాదులను నియమించుచున్నాడని బృహదారణ్యక ఉపనిషత్తు చెప్పుచున్నది.

"ఏకః విశ్వాని రూపాణి యోనీః చ సర్వాః." అతడు ఏకమై సకల రూపములపై, సమస్త ఉత్పత్తి స్థానములపై అధ్యక్షత వహించును. "ఏకః = అద్వితీయః = పరమాత్మ." పరబ్రహ్మము అద్వితీయుడు. అతడు రెండవది లేనివాడు, అతడు రోహితాదీని రూపములను నియమిస్తాడు. అతడు అన్ని ప్రకవద్దానములను నియమిస్తాడు.

"ఋషిం ప్రసూతం కపిలం యః తం అగ్రే" ఎవడు సృష్టిప్రారంభమున సర్వజ్ఞుడగు కనక కపిల వర్ణుడైన హిరణ్యగర్భుని జననమును గాంచెనో. ఋషి అనగా సర్వజ్ఞుడు. హిరణ్యగర్భుడు పరబ్రహ్మము కుమారుడు. పరమాత్మ హిరణ్యగర్భుని తన సంకల్పము లందు తల్లివోలె ధరించును, జన్మాంతరము పరమాత్మ అతనిని తండ్రివలె చూచును. హిరణ్యగర్భుడు అగ్రజుడు. అతడు మొదట జన్మించిన వాడు. అతడు సర్వజ్ఞుడు. అతడు బంగారువన్నెతో నలరారును. ఆ హిరణ్యగర్భుడు ఈ విశ్వమును సృష్టించును. హిరణ్యగర్భునకు మరియొక పేరు కపిలుడు.

"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం"

"యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" అని ఈ ఉపనిషత్తునందే (చూడుము 6 వ అధ్యాయము, 18 వ మంత్రము) చెప్పబడినది. సృష్ట్యారంభమున పరమాత్మ హిరణ్యగర్భుని సృష్టించి అతనికి వేదముల నొసంగెను.

"కపిలోఽగ్రజః" ఇతి పురాణవచనాత్ కపిలో హిరణ్యగర్భో వా నిర్దిశ్యతే, "కపిలుడు మొట్టమొదట పుట్టినవాడు" ఈ పురాణ వచనమువల్ల కూడా కపిలుడు హిరణ్యగర్భుడే యని నిర్దేశింపనగును.

> కపిలర్షిః భగవతః సర్వభూతస్య వై కిల ।
> విష్ణోరంశో జగన్మోహనాశాయ సముపాగతః ॥

జగత్తు యొక్క మోహమును నాశమొందించుటకోసము సర్వభూతమయుడైన భగవంతుడు సాక్షాత్ విష్ణ్వంశ స్వరూపుడైన కపిలమునీంద్రుడుగ అవతరించినాడు.

కృతే యుగే వరం జ్ఞానం కపిలాదిస్వరూపధృక్ ।
దదాతి పరభూతాత్మా సర్వస్య జగతో హితమ్ ॥

సర్వభూతాత్మయైన శ్రీహరి కృతయుగమునందు కపిలాదిమునీంద్రుల రూపము దాల్చి, సకల విశ్వములకు మేలును చేకూర్చుటకై పరమ జ్ఞానము నొసంగును.

ఈ విధమైన పురాణ వచనములందు కపిల నామానికి మహర్షి కపిలుడని ప్రసిద్ధము.

"స ఏవవా కపిలః ప్రసిద్ధోఽగ్రే సృష్టికాలే". శ్రుతి అనుసారము అతడు సృష్టి ఆరంభమున ప్రసద్ధిచెందిన మొదటి పుట్టువుగల కపిలుడే. అనగా హిరణ్యగర్భుడే.

జ్ఞానై ర్బిభర్తి జాయమానం చ పశ్యేత్. అతడు హిరణ్యగర్భుని పుట్టువును గాంచును. మరియు అతనిని సకల విధ జ్ఞాన సంపన్నుని గాంచును. "యో జ్ఞానైః ధర్మ జ్ఞాన వైరాగ్య ఐశ్వర్యైః బిభర్తి బభార జాయమానం చ పశ్యేత్ః అజాశ్యత్" ఇత్యర్థః ఆ పరమాత్మ హిరణ్యగర్భుని తన జ్ఞానముతోనింపి అతని పుట్టువును దర్శించును. హిరణ్యగర్భునకు నాలుగు విధములైన జ్ఞానము ఉండును. 1. ధర్మము (సుగుణము పుణ్యము)

2. (వేదముల) జ్ఞానము
3. వైరాగ్యము (నైరాశ్యము, వాంఛాపరిత్యాగము)
4. ఐశ్వర్యము (విభూతులు, మానవాతీత శక్తులు).

---

ఏకైకం జాలం బహుధా వికుర్వన్
అస్మిన్ క్షేత్రే సంహరత్యేష దేవః ।
భూయః సృష్ట్వా పతయస్తథేశః
సర్వాధిపత్యం కురుతే మహాత్మా ॥ 3 ॥

టీక: ఏకైకం = ప్రతి, ప్రత్యేక: జాలం = శ్లేష్మము వల; బహుధా = నానా ప్రకారం, అనేక విధములలో; వికుర్వన్ = సృష్టించి చేసి; అస్మిన్ = ఈ; క్షేత్రే = పొలమున, క్షేత్రమున; సంహరతి =

ప్రత్యాహారమొనర్చును, వెనుకకులాగికొనును, మరల తీసుకొనును: ఏష = ఈ; దేవః = భగవంతుడు, దేవుడు; భూయః = పునః, మరల; సృష్ట్వా = సృష్టించి; పతయః = ప్రభువులను; తథా = ఇట్లు, ఈ విధముగ, ఈశః = పరిపాలకుడు; సర్వాధిపత్యం = అందరిపై ఆధిపత్యము; కురుతే = వహించును, చేయును; మహాత్మా = పరమాత్మ.

భావము: ఈ దేవుడు నానా ప్రకారములుగ ఒక వల తరువాత మరొక వలను విసిరి, ఆ క్షేత్రమున వానిని ఒకటిగ మరల వెనుకకు తీసికొనును. పరమాత్మ ఇట్లు మరల లోక పాలకులను సృష్టిగావించి వారందరిపై తన సర్వాధిపత్యమును వహించును.

వివరణము: "ఏకైకం జాలం బహుధా వికుర్వన్ అస్మిన్ క్షేత్రే." ఈ క్షేత్రమున పరమేశ్వరుడు ఒక్కొక్క వలవేసి నానా ప్రకారాలుగా సృష్టిస్తాడు. "ఏకైకం" అనగా ప్రత్యేకమైన, "జాలం" అనగా వల, సంసార మనెడి క్లేశము. "అస్మిన్ క్షేత్రే" అనగా ఈక్షేత్రమున, ఈ మూల ప్రకృతి యందు, ఈ ప్రపంచము నందు. మూల ప్రకృతి, మాయ, ప్రధానము, అవ్యక్తము—ఇవి పర్యాయ పదాలు ఈ ప్రపంచానికి బీజం మూల ప్రకృతి. కాబట్టి క్షేత్రం అంటే ప్రపంచం, లేక మాయ. పరమేశ్వరుడు ఈ మాయామయ క్షేత్రంలో సృష్టి సమయంలో దేవతల్ని, మానవుల్ని, జంతువుల్ని, పక్షుల్ని, కీటకాల్ని, వివిధరకముల ప్రాణుల్ని ఒక్కొక్క ప్రాణివర్గానికి ఒక్కొక్క వలవేసి నానా ప్రకారాలుగా సృష్టిస్తాడు పరమేశ్వరుడు సృష్టించేటప్పుడు "ప్రజాతుల" (Species,) జాతులు(Genera), కుటుంబాలు (Families), క్రమాలు (Orders), విభాగాలు (Classes), వర్గాలు (Phyla)— ఈ విధంగా వైవిధ్యాన్ని, విభిన్నత్వాన్ని కలుగజేస్తాడు.

"సంహరతి ఏష దేవః. ఈ దేవుడు వానిని ఒకటిగ ప్రత్యాహారము చేయును. "సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికామ్. — గీతా. ఓ అర్జున, (కల్పాంతమున) అన్ని ప్రాణులు నా ప్రకృతిలోనికి పోవును. ప్రకృతిలో ఉదయించిన ప్రాణులు ప్రళయ కాలమున దానిలోనే లీనమగును. గడ్డి భూమినుండి వస్తుంది, భూమిలోనే ఎండి పోతుంది. అలలు సముద్రం

నుండి వస్తాయి. సముద్రంలోనే అవి అదృశ్యమౌతాయి. కలలు మనస్సు నుండి బయలుదేరుతాయి. అవి మరల మనస్సులోనే లీనమౌతాయి. అలాగే ప్రాణులు ప్రకృతిలో ఉదయించి, ప్రకృతిలోనే లీనమౌతాయి.

"భూయః సృష్ట్వా పతయః తథా ఈశః సర్వాధిపత్యం కురుతే మహాత్మా. మరల లోకపాలకులను సృష్టించి, పరమాత్మ అందరిపై తన సర్వాధిపత్యమును వహించును. "కల్పాదౌ విసృజామ్యహం."— గీతా. కల్పారంభమున నేను వానిని మరల బయటకు పంపుదును. "విసృజామి పునః పునః భూతగ్రామమిమం కృత్స్నం." — గీతా. ఈ ప్రాణికోటి మొత్తాన్ని నేను మరల మరల పంపుతూంటాను. భగవంతుడు ఈ జగత్తును సృష్టించి, దానికి స్థితిని, వ్యవస్థను చేకూర్చేందుకు అతడు మొట్టమొదట మరీచి మొదలగు ప్రజాపతులను సృజించాడు. వారికి వేదంలో చెప్పబడియుండు ప్రవృత్తి లక్షణాత్మకమైన ధర్మాన్ని ఉపదేశించాడు. తరువాత భగవంతుడు సనక సనందాదులను సృష్టించి, ఆ ఋషులకు జ్ఞానవైరాగ్య లక్షణోపేతమైన నివృత్తి ధర్మాన్ని ఉపదేశించాడు. అందువల్ల పరమేశ్వరుడు ధర్మాన్ని జగత్తుయొక్క స్థితికి కారణం చేశాడు. ఈ కారణంచేత ధర్మాన్ని అనుష్ఠించేవారు అభ్యుదయ, నిశ్శ్రేయస్సులను పొందుతారు. పరమేశ్వరుడు భూతకోటిని మరల మరలా పంపుతూంటాడు. అతడు విశ్వాధిపత్యం వహిస్తాడు. అతడే విశ్వానికి గతి. ప్రభువు, భర్త. అతని సంకల్పం వల్లనే, అతని అధ్యక్షతనే అన్నీ సక్రమంగా జరుగుతున్నాయి.

---

సర్వా దిశః ఊర్ధ్వమధశ్చ తిర్యక్
ప్రకాశయన్ భ్రాజతే యద్వనడ్వాన్ ।
ఏవం స దేవో భగవాన్ వరేణ్యో
యోని స్వభావాన్ అధితిష్ఠత్యేకః ॥ 4 ॥

టీక: సర్వాన్ = అన్ని; దిశః = దిక్కులు; ఊర్ధ్వం = పైన; అధః = క్రింద; చ = మరియు; తిర్యక్ = పార్శ్వదిశ; ప్రకాశయన్ = దీప్తికలుగజేయుచు, ప్రకాశింపజేయుచు; భ్రాజతే = దీప్యతే,

ప్రకాశించును, వెలుగొందును; యత్ ఉ = ఏలాగున; అనడ్వాన్ = సూర్యుడు; ఏవం = ఆ విధముగ; సః = అతడు; దేవః = ద్యోతన స్వభావః, ప్రకాశించు స్వభావముగలవాడు, దేవుడు; భగవాన్ = ఐశ్వర్యాది సమన్వితుడు, భగవంతుడు; వరేణ్యః = వరణీయః, సంభజనీయ, వందనీయ పూజనీయ; యోనిస్వభావాన్ = కారణస్వభావముగల ప్రతివస్తువు, ప్రకృతిదాని ఉత్పత్తులు; (యోనిః = కారణం కృత్స్నస్య జగతః, సకల జగత్తునకు కారణము, బ్రహ్మ; స్వభావాన్ = స్వాత్మభూతాన్ పృథివ్యాదీన్ భావాన్, తన స్వభావమును పంచుకొను పృథివి మొదలగు భూతములు;) అధితిష్ఠతి = అధ్యక్షతవహించును, నియమించును; పాలించును; ఏకః = అద్వితీయః, ఒకటి, పరమాత్మ.

భావము: పైన, క్రింద, అడ్డముగ అన్ని దిశలను భాసింపజేయుచు సూర్యుడు ప్రకాశించు తెరగున ఆ పూజనీయుడైన, దివ్యుడైన, ఏకైక భగవంతుడు సకల యోనిజ ప్రాణులను పాలించును.

వివరణము: "సర్వా దిశః ఊర్ధ్వః అధశ్చ తిర్యక్ ప్రకాశయన్ భ్రాజతే యత్ ఉ అనడ్వాన్." పైన, క్రింద, పార్శ్వములందు అన్నిదిక్కులను భాసింపజేయుచు సూర్యుడు ప్రకాశించు రీతిగ. "సర్వాదిశః అనగా అన్నిదిశలు, తూర్పు, పడమర, ఉత్తరము దక్షిణము, ఆగ్నేయము, నైరుతి, వాయువ్యము, ఈశాన్యము సూర్యకాంతి అన్ని దిక్కులకు సోకుతుంది. "ఊర్ధ్వం అధః చ తిర్యక్." పైన క్రింద మరియు పార్శ్వములలో, అన్ని దిశలలో భాస్కరుడు తన వెలుగు కిరణాలను పంపుతాడు. "ప్రకాశయన్ భ్రాజతే యత్ ఉ అనడ్వాన్." సూర్యుడు తన కాంతిని అన్ని దిక్కుల వెద జల్లుచు ప్రకాశిస్తాడు సూర్యుడు తేజోమయుడు, అతడు లేనిదే ప్రపంచము లేదు. సూర్యుడు ఆరోగ్యప్రదాత. అతడు జ్ఞానప్రదాత. అతడు కర్మసాక్షి. సూర్యుడు లేనిచో సృష్టి స్తంభించిపోవును. సూర్యుడు లేనిచో జీవజాలము, వృక్షజాలము త్వరలో నశించిపోవును. "అనడ్వాన్" అనగా సూర్యుడు. ఆకసంలో ఒక్క సూర్యుడు ప్రకాశిస్తాడు. ఆ సూర్యుడు, యావత్ ప్రపంచానికి వెలుగునిస్తాడు, వేడినిస్తాడు. సూర్యకాంతి అనేకవస్తువులపై పడుతుంది. వాటిచేత సూర్యునకు ఎలాటి కలుషితం కలుగదు. అలాగే పరమాత్మ

అద్వితీయము. పరమాత్మ ప్రకృతి నంతటిని భాసింపజేస్తుంది. పరమాత్మ అవ్యక్తంనుండి మృత్పిండం వరకు సర్వ పదార్థాలను భాసింపజేస్తుంది. ఒకే ఒక ఆత్మ సర్వజీవులలో భాసిస్తుంది. అది సర్వ శరీరాలను భాసింపజేస్తుంది. కాని, అది కలుషితం కానేరదు అది సర్వదా నిర్లిప్తంగానే యుంటుంది.

""ఏవం సః దేవః భగవాన్ వరేణ్యః" అతడు ఈవిధంగా అన్నిటిని నియమిస్తాడు. "ఏవం" అనగా అట్లే. సూర్యుడు సకల దిశలను ప్రకాశింప జేసిన విధముగ పరమాత్మ సకల జీవకోటిని భాసింపజేస్తుంది. సః అనగా అతడు. "దేవః" అనగా ద్యోతనస్వభావుడు. అతడు జ్యోతి స్స్వరూపుడు. అతడు వెలుగులకు వెలుగు అతడు అనంత జ్యోతి. "భగవాన్" అనగా భగవంతుడు. అతడు షడ్గుణైశ్వర్య సంపన్నుడు. "వరేణ్యః" అనగా ఆరాధనీయుడు. సంభజనీయుడు. ఆ పరమాత్మను సర్వ ఋషులు, సర్వ దేవతలు, సర్వ యోగులు భజించెదరు. అతడు సర్వభూత హృదయాంతర్యామి. అతడు అద్వితీయుడు.

"యోని స్వభావాన్ అధితిష్ఠతి ఏకః." అతడు, ఆ ఏకైక పరమాత్మ యోనిజ ప్రాణికోటి నెల్లను నియమించును. "యోనిస్వభావాన్" అనగా ప్రకృతియు, దాని యుత్పత్తులు ప్రకృతి యొక్క ఉత్పత్తులు మహత్తు, అహంకారము, మనస్సు మొదలగునవి. ప్రకృతి పంచభూతాలకు కారణము పంచభూతాలు ప్రకృతి నుండి వచ్చినవి కావున అవి తమ కారణముతో సమానంగా, ఒకే పోలికలో ఉంటాయి. ఈ ప్రపంచం మొత్తానికి కారణమైన బ్రహ్మ పృథివ్యాది భూతాలను పాలిస్తాడు. అతడు ప్రకృతి స్వభావాన్ని పంచుకొనేలటువంటి పంచ భూతాలను నియమిస్తాడు. "ఏకః అద్వితీయః పరమాత్మా." పరమాత్మ ఒక్కడే. అతడు అద్వితీయుడు. అతడే అన్నింటికి అధిష్ఠానము. ఆలంబనము. ఆధారము. అతడు సర్వ సృష్టిని నియమించును.

---

యచ్చ స్వభావం పచతి విశ్వయోనిః
పాచ్యాంశ్చ సర్వాన్పరిణామయేద్యః ।

సర్వమేతద్విశ్వమధితిష్ఠత్యేకో
గుణాంశ్చ సర్వాన్వినియోజయేద్యః ॥ 5 ॥

టీక: యత్ = ఎవరు; చ = మరియు: స్వభావం = దాని స్వీయ ప్రకృతి; పచతి = పక్వమునకు తెచ్చును: విశ్వయోనిః = ప్రపంచమునకు ఉత్పత్తి స్థానము: పాచ్యాన్ = పక్వమొందుటకు యోగ్యమైనది; చ = మరియు; సర్వాన్ = అన్ని: పరిణామయేత్ = మార్చును: యః = ఎవరు; సర్వం = అన్ని; ఏతత్ = ఈ; విశ్వం = విశ్వమును; అధితిష్ఠతి = నియమించును. పాలించును; ఏకః = ఒకటి; గుణాన్ = గుణములు; చ = మరియు; సర్వాన్ = అన్ని; వినియోజయేత్ = పంచిపెట్టును; యః = ఎవరు.

భావము: ఎవరు ప్రపంచమునకు ఏకైక ఉద్గమస్థానమో అతడు అన్నింటి స్వభావమును పరిపక్వమునకు దెచ్చి, పరిపక్వమునకు తేదగిన ప్రాణులను పూర్ణత్వమునకు గొంపోయి, ప్రతి ప్రాణిని దాని, దాని ప్రత్యేక గుణములతో నలరించి, ఈ యావద్విశ్వమును పాలించును.

వివరణము: "యత్ చ స్వభావం పచతి." ఎవడు అందరి స్వభావమును పరిపక్వమునకు తెచ్చునో. ఈ సమస్త విశ్వముయొక్క క్రమాభ్యుదయము పరమేశ్వరుని హస్తములలో ఉంటుంది. అతడే అన్నింటిని పక్వానికి తెస్తాడు.

"విశ్వయోనిః." అతడు ఈ విశ్వానికి యోని. అతడు ప్రపంచానికి ఏకైక ఉత్పత్తిస్థానము. అతడు ఆదిమూలము, యావత్ప్రపంచము అతని నుండే జనిస్తుంది, అతడు జగత్తునకు కారణం.

ఓం నారాయణః పరోఽవ్యక్తాత్ అండం అవ్యక్తసంభవమ్ ।
అండస్యాంతః ఇమే లోకాః సప్త ద్వీపా చ మేదినీ ॥

శ్రీమన్నారాయణుడు (పరమాత్మ) అవ్యక్తమునకంటె పరుడు. హిరణ్యగర్భుడు అవ్యక్తమునుండి పుట్టెను. అండమునందు (హిరణ్యగర్భునిలో) ఈ లోకములన్నియు గలవు. ఏడు ద్వీపములతో గూడిన ఈ పృథివి కూడా ఇందె కలదు.

"పాచ్యాన్ చ సర్వాన్ పరిణామయేద్ యః" పక్వమునకు రాదగిన ప్రాణులను అతడు పరి పక్వమునకు గొంపోవును పరమేశ్వరుడు విశ్వయోని. అతడు ఈ విశ్వాన్ని సృష్టించాడు. అతడు ఈ విశ్వానికి దర్శకుడు. నియామకుడు, ఈశుడు, ప్రభువు. అతని కేవలం వీక్షణం వలననే యావత్ జగత్తు క్రమపరిణామాన్ని పొందుతుంది.

"సర్వం ఏతత్ విశ్వం అధితిష్ఠతి ఏకః." ఈ సమస్త విశ్వాన్ని అతడు నియమిస్తాడు. పరమాత్మ అద్వితీయుడు అతని సంకల్పం లేకుండ గడ్డి పరక గూడ చలించదు. అతని ఆధ్వర్యంలో ప్రకృతి సచరాచర జగత్తును సృజిస్తుంది. ఆమాయావి జగన్నాటకానికి సూత్రధారి.

"గుణాన్ చ సర్వాన్ వినియోజయేత్ యః" ఎవడు ప్రతి ప్రాణిని దానిని గుర్తింపగల విశేషగుణములతో నలరించునో. అతడు అన్ని గుణాలను అవి ఏయే ప్రాణులకు సంబంధించినవో వాటికి వానిని పంచిపెడుతాడు. కర్మ సిద్ధాంత ప్రకారం అతడు కర్మ ఫలాలను జీవులకు పంచిపెడుతాడు. అతని ప్రభావంవల్ల కర్మ సిద్ధాంతం ప్రవర్తిల్లుతుంది. కార్య కారణా సిద్ధాంతం (Law of cause and effect) అమలులోనికి వస్తుంది. పరమేశ్వరుడు సర్వజ్ఞుడు. అతడు ఏ ప్రాణికి ఏ కర్మఫలం ఇవ్వాలో దాన్ని సరియైన సమయంలో ఇస్తాడు. అతడు విధాత, కర్మఫలప్రదాత. (He is the Dispenser of the fruits of actions)

---

తద్ వేదగుహ్యోపనిషత్సు గూఢం
తద్ బ్రహ్మా వేదతే బ్రహ్మయోనిమ్ ।
యే పూర్వం దేవా ఋషయశ్చ తద్ విదుః
తే తన్మయా అమృతా వై బభూవుః ॥ 6 ॥

టీక: తత్ = అది: వేద గుహ్య ఉపనిషత్సు = వేదములలో దాగియున్న ఉపనిషత్తులందు; గూఢం = సంవృతం, దాగియున్నది; తత్ = ఆ; బ్రహ్మ = హిరణ్యగర్భుడు; వేదతే = జానాతి, తెలిసికొనును;

బ్రహ్మ యోనిం = వేదములకు ఉత్పత్తిస్థానముగ హిరణ్యగర్భునకు ఉత్ప త్తిస్థానముగ; యః = ఎవడు; పూర్వం = ప్రాచీన కాలమున; దేవాః = దేవతలు; ఋషయః = ఋషులు; చ = మరియు; తత్ = దానిని; విదుః = ప్రత్యక్షీకరణము చేసికొనిరి; తే = వారు; తన్మయాః = అతనితో తాదాత్మ్య మునొందిరి; అమృతాః = అమృతులు; వై = నిజముగ; బభూవుః = అయిరి.

భావము: వేదములలో గుప్తమైయున్న ఉపనిషత్తులలో పరబ్రహ్మ ము గూఢమైయున్నాడు. పరబ్రహ్మము తనకు, వేదములకు ఉత్పత్తిస్థాన మని హిరణ్యగర్భునకు తెలియును. ప్రాచీన కాలమున పరబ్రహ్మమును ప్రత్యక్షీకరణము చేసికొనిన దేవతలు, ఋషులు అతనితో తాదాత్మ్యమును పడసి, అమృతత్వము నొందిరి

వివరణము; "తత్ వేద గుహ్యోపనిషత్సు గూఢం." అది వేదము లలో దాగియున్న ఉపనిషత్తులలో గూఢమైయున్నది. "తత్" అనగా అది, అంటే సర్వమునకు అధిష్ఠానము, ఆలంబనము, ఆధారము అయినటువంటి పరమాత్మ. వేదములలో ఉపనిషత్తులు దాగియున్నవి. ఉపనిషత్తులు వేదముల సారము, ఉపనిషత్తులలో పరమాత్మ దాగియున్నాడు ఉపనిషత్తులను వేదాం తమని పిలుస్తారు. ఈ పరమ రహస్యమైన ఉపనిషత్తులలో పరమ రహస్య మైన ఆత్మతత్త్వం, అనగా పరమాత్మ దాగియున్నాడు. ఉపనిషత్తులలోని మహావాక్యములను అనుసంధానముచేయడం వల్లనే ఆ పరమాత్మ తెలియబడు తుంది, ఉపనిషత్తులు కేవలం జ్ఞాన ఘనం. పరమాత్మ చిద్ఘనం కాబట్టి అతడు ఉపనిషత్తులనే జ్ఞానసాగరంలో నిహితమై యుంటాడు. కావున ముముక్షువు ఉపనిషత్ సత్యాలను సదా ధ్యానించాలి.

"తద్ బ్రహ్మ వేదతే బ్రహ్మయోనిం." తనకు పరబ్రహ్మము ఉత్ప త్తిస్థానమని హిరణ్యగర్భునకు తెలియును. పూర్ణాత్ పూర్ణం ఉదచ్యతే, పూర్ణ మునుండి పూర్ణము ఉదయించెను. అనగా పరబ్రహ్మమునుండి కార్యబ్రహ్మము (హిరణ్యగర్భుడు) పుట్టెను. ఇచ్చట బ్రహ్మ అనగా హిరణ్యగర్భుడు. బ్రహ్మయోనిం. అనగా కార్య బ్రహ్మమునకు ఉత్పత్తిస్థానము.

బ్రహ్మయోనిం అనగా వేదములకు ఉత్పత్తిస్థానము. హిరణ్యగర్భునకు ఈ విషయము (పరబ్రహ్మము హిరణ్యగర్భునకును, వేదములకు ఉద్గమస్థానము అని) తెలియును.

వేదములు పరబ్రహ్మమునుండి ఉద్భవించినవి. వేదములలోని ప్రధాన విషయం పరమాత్మ. వేదములను తెలుసుకోవడం అంటే పరమాత్మను తెలుసుకోవడమే. అన్ని వేదములలో వేద్యవస్తువు పరమాత్మయే. వేదముల అర్థము తెలిసినవాడు పరమాత్మయే. ఆ పరమాత్మ ఆనతి వల్లనే వేదాంత బోధ పరంపరగా సాగిపోతూంది. "వేదాంత కృత్ వేదవిదేవ చాహం".— గీతా. భగవానుడు వేదాంత కర్త. అతడు వేదములను తెలిసినవాడు. (The Lord is indeed the author of the Vedanta and he is the Knower of the Vedas).

"యే పూర్వం దేవా ఋషయశ్చ తద్ విదుః తే తన్మయా అమృతా వై బభూవుః." ప్రాచీన కాలంలో దేవతలు, ఋషులు పరమాత్మ తాదాత్మ్యాన్ని పొంది మోక్షమును పొందారు. పూర్వ కాలంలో రుద్రాది దేవతలు జీవాత్మ పరమాత్మ తాదాత్మ్యాన్ని పొంది మోక్షమును పొందినారు. అట్లాగే వామదేవాది ఋషులు కూడ జీవాత్మ పరమాత్మ అభేదాన్ని సాక్షాత్కారం చేసికొని ముక్తిని పొందినారు, వారు అమృతులైనారు. వారు జనన మరణ రహితులైనారు. ప్రాచీనకాలంలో దేవతలు, ఋషులు వేదాంత జ్ఞానంవల్ల (జీవాత్మ పరమాత్మ అభేద జ్ఞానం వల్ల) అమృతత్వాన్ని పొందినారు. ఈ ఆధునికయుగంలో సైతం ఉపనిషత్ సత్యాలను ధ్యానించి, జీవాత్మ పరమాత్మ అభేద జ్ఞానమును పడయువారు మోక్షమును పొందగలరని తెలిసికొనవలయును.

అగ్ని ఇంధనాన్ని దహించివేయులాగున బ్రహ్మము జిజ్ఞాసువుల అజ్ఞానాన్ని నాశముజేస్తాడు, పురుషార్థంచేతను. పరమేశ్వరానుగ్రహం చేతను బ్రహ్మమును సాక్షాత్కరించుకొని మనం అమృతత్వాన్ని పడయువలసి యున్నది. ఉపనిషద్ ఋషుల ఆశీస్సులు మన యందరిపై సదా యుండుగాక!

గుణాన్వయో యః ఫలకర్మకర్తా
కృతస్య తస్యైవ చోపభోక్తా ।
స విశ్వరూప స్త్రిగుణ స్త్రివర్త్మా
ప్రాణాధిపః సంచరతి స్వకర్మభిః ॥ 7 ॥

టీక: గుణాన్వయః = గుణములతో సంగముగలవాడు; యః = ఎవడు; ఫలకర్మకర్తా = ఫలముల కోసము కర్మచేయువాడు; కృతస్య తస్య = తన స్వంత కర్మలయొక్క; ఏవ = మాత్రము; చ = మరియు; ఉపభోక్తా = భోగము అనుభవించువాడు, భోక్త; సః = అతడు; విశ్వ రూపః = వివిధ రూపములను ధరించినవాడు, త్రిగుణైః = మూడు గుణములచే; త్రివర్త్మ = మూడు రకముల శ్రద్ధద్వారా; ప్రాణాధిపః = ప్రాణమునకు ప్రభువు; సంచరతి = సంచరించును, తిరుగును: స్వకర్మభిః = తన స్వంత కర్మల వలన.

భావము: ఎవడు గుణములతో సంగముపెట్టుకొని, ఫలముల నాసించి కర్మ లొనర్చి, తన స్వకర్మల ఫలముల ననుభవించునో అతడు వాస్తవములో ప్రాణాధిపతి యైనప్పటికిని అతడు త్రిగుణములచేత బద్ధుడై, వివిధ రూపము లను దాల్చి స్వకర్మల ఫలితముగ త్రిమార్గములగుండ సంచరించును.

వివరణము: గుణాన్వయః యః ఫలకర్మకర్తా, ఎవడు గుణములతో సంగము పెట్టుకొని, ఫలముల నాసించి కర్మలు చేయునో, గుణాన్వయః అనగా గుణములతో సంగముగలవాడు. గుణములు త్రిగుణములు, అవి సత్త్వము, రజస్సు, తమస్సు. ఈ గుణముల ప్రాబల్యమున అతడు తన యందు కర్తృత్వ, భోక్తృత్వ భావములను ఆపాదించుకొను చున్నాడు. "గుణైః కర్మజ్ఞాన కృత వాసనామయైః అన్వయో యస్య సో౽యం గుణాన్వయః"

తన కర్మలద్వారా, జ్ఞానముద్వారా జనించిన వాసనామయ గుణములతో సంబంధముగల జీవుడు గుణాన్వయుడు. జీవాత్మ వాసనామయ గుణములతో సంబంధము పెట్టుకొని గుణాన్వయుడు అగుచున్నాడు. వాసనా పుంజము

జీవుని బద్ధుని చేయుచున్నది. "ఫలకర్మకర్తా" అనగా ఫలముల నుద్దేశించి కర్మలు చేయువాడు. "ఫలార్థస్య కర్మణః కర్తా కృతస్య కర్మఫలస్య. స ఏవ ఉపభోక్తా" అతడు కర్మఫలములను ఎదురుచూచి కర్మలు ఆచరిస్తాడు. అతడు తాను చేసిన కర్మల ఫలాలను అనుభవిస్తాడు. అందువల్ల అతడు ఉపభోక్త అయ్యాడు.

"సః విశ్వరూపః" అతడు అనేక రూపములు గలవాడు. జీవాత్మ కార్యకారణ భావముతో వృద్ధినొందుట వలన అతడు నానా దేహధారణలు చేయును. జీవాత్మ ప్రతిఫలాపేక్షతో. సంగముతో కర్మలు చేయడంవల్ల ఆ కర్మఫలాలను అనుభవించడానికి అనేక జన్మలు ఎత్తవలసియుంటుంది. అందువల్ల అతడు సకామ కర్మల ఆచరణవలన అనేక జన్మలు. అనేక రూపాలు దాల్చవలసియుంటుంది.

త్రిగుణః త్రివర్త్మా. మూడు గుణములచే బద్ధుడైనవాడు. మూడు మార్గములగుండా పోవువాడు. జీవాత్మ తన యధార్థమైన పరమార్థ స్వరూపాన్ని విస్మరించి. సత్త్వరజస్తమోగుణములతో సంబంధం పెట్టుకొని. ఆ త్రిగుణ పాశములతో బద్ధుడౌతాడు జీవుడు త్రిగుణములకు లోనై త్రిగుణుడౌతాడు జీవుడు మూడు మార్గములగుండా పోతాడు. ఆ మూడు మార్గలు ఏవి ? జీవుడు దేవయానం. పితృయానం. తిర్యంగ్మార్గం — ఈ మూడు మార్గాల గుండా పయనిస్తాడు. దేవతలమార్గాని దేవయానమని. పితృదేవతల మార్గాన్ని పితృయానమని నికృష్ట యోనుల పథాన్ని తిర్యంగ్ మార్గమని అంటారు. చని పోయిన పిమ్మట జీవుడు ఈ మూడు మార్గాల గుండా పోతాడు.

త్రిమార్గాలను వేరొక విధంగా కూడా చెప్పవచ్చు. "ధర్మ అధర్మ జ్ఞాన మార్గభేదా అస్యేతి వా". త్రివర్త్మ అనుటకు ఇట్లుకూడా అర్థము చెప్పవచ్చును. ధర్మము. అధర్మము. జ్ఞానము అను మూడు మార్గములగుండ పోవువాడు.

"ప్రాణాధిపః సంచరతి స్వకర్మభిః" అతడు ప్రాణాధిపతి యైనప్పటికి తన స్వకర్మలచేత త్రిమార్గములగుండ సంచరించును. ప్రాణాధిపః అనగా ప్రాణమునకు అధిపతి "ప్రాణ్యా పంచవృత్తేరధిపః" జీవాత్మ

పంచవృత్తులు గల ప్రాణమునకు అధిపుడు, ఆతడు ప్రాణమునకు ప్రభువై యుండియు తిరుగాడవలసి వచ్చుచున్నది. సంచరతి అనగా తిరుగును సంచరించును. వాస్తవములో జీవాత్మ పరమాత్మ ఒకటియే కాని, జీవుడు బద్ధ స్థితిలో కనబడుచున్నాడు. ఎందువల్ల ? స్వకర్మభిః అనగా తన కర్మల ద్వారా, కామ్య కర్మలు, ప్రతి ఫలాపేక్షతో చేసే పనులు, భోక్తృత్వ భావముతో చేయ బడిన కృతులు, త్రిగుణములతో సంపర్కముగల చేష్టలు జీవుని త్రిమార్గాల గుండా, త్రిగుణముల పరిధిలో, ద్వంద్వముల సుడిలో నడిపి, పడవైచి అతనిని దీనస్థితికి తెచ్చుచున్నవి.

---

అంగుష్ఠమాత్రో రవితుల్యరూపః
సంకల్పాహంకార సమన్వితో యః ।
బుద్ధేర్ గుణేనాత్మగుణేన చైవ
ఆరాగ్రమాత్రో హ్యపరోఽపి దృష్టః ॥ 8 ॥

టీక: అంగుష్ఠమాత్రః = బొటన వ్రేలియంత పరిమాణముగలవాడు; రవితుల్యరూపః = సూర్యునివలె భ్రాజమానుడు; సంకల్ప అహంకార సమ న్వితః = సంకల్ప అహంకారములతో నొప్పువాడు; యః = ఎవడు; బుద్ధేః గుణేన ఆత్మ గుణేన = బుద్ధి, హృదయములయొక్క పరిమితుల, హద్దుల వలన; చ = మరియు; ఏవ = కూడ; ఆరాగ్రమాత్రః = సూదిమొన మాత్రము; హి = నిజముగ; అపరః = మరియొకటి (జీవాత్మ); అపి = కూడ; దృష్టః = దర్శింపబడును, చూడబడును.

భావము: ఆరె మొనవలె సూక్ష్మమైనట్టి, రవివలె తేజోమయమైనట్టి పరమాత్మయే అవిద్య (బుద్ధి హృదయముల పరిమితి) వలన పరమాత్మకు భిన్నుడుగ ఉన్నట్లును, బొటనవ్రేలి పరిమాణముతో నున్నట్లును, సంకల్పా హంకారములతో నున్నట్లును, జీవాత్మగను చూడబడుచున్నాడు.

వివరణము: "అంగుష్ఠ మాత్రః" బొటనవ్రేలి పరిమాణముగల వాడు. అంగుష్ఠం అంటే చేతి బొటనవ్రేలు, అనంతమైన ఆత్మ అంగుష్ఠ

పరిమాణంగల జీవాత్మగ చూడబడుతూంది. ఇది ఎలా సంభవం? బుద్ధివల్ల, హృదయంవల్ల అలా చూడబడుతూంది. బుద్ధి, హృదయములు ఉపాధులు. వాటి పరిమితివల్ల, అనగా అవిద్య వల్ల పరమాత్మ బద్ధ జీవాత్మగ దర్శింపబడుచున్నాడు.

"రవి తుల్యరూపః" సూర్యునితో సమానమైన తేజస్సుతోనుండువాడు. అంతరిక్షంలో ఒక్కసారిగ వేయి సూర్యులు భాసిస్తే ఎంత కాంతి యుంటుందో ఆ కాంతికి ఆ మహాత్ముని కాంతివి పోల్చవగును. వాస్తవంలో పరమాత్మతో పోల్చినప్పుడు సూర్యుడు మిణుగురు పురుగువంటి వాడనవచ్చును. అటువంటి పరమాత్మ అజ్ఞానం వల్ల, అవిద్యవల్ల జీవాత్మగ దర్శింపబడుతూంది.

"సంకల్ప అహంకార సమన్వితః" సంకల్పముతో, అహంకారముతో కూడినవాడు బుద్ధి, హృదయం, మనస్సు, దేహం, సంకల్పం, అహంకారం —ఇవన్నియూ అవిద్యయొక్క ఫలితాలు. ఇవన్ని అవిద్యయొక్క వికారాలు (Modifications). ఇవి పరమాత్మను పరిమితుని గావిస్తాయి పరమాత్మతో జీవాత్మ తాదాత్మ్యంవల్ల ఈ పరిమితిని దాటితే జీవాత్మ పరమాత్మతో లీనమౌతుంది. జీవాత్మ పరమాత్మ ఔతుంది. దేహంతో తాదాత్మ్యాన్ని అహంకారం అంటాము. పరమాత్మతో తాదాత్మ్యాన్ని అనహంకారం అంటాము జీవభావం సంకల్పము. పరమాత్మ భావం విస్సంకల్పం.

"బుద్ధేః గుణేన ఆత్మగుణేన్న చ ఏవ."బుద్ధి, హృదయముల పరిమితుల వలన గూడ. బుద్ధి, హృదయముల పరిమితి యనగా అవిద్య, పరమాత్మ అవిద్యవలన బద్ధాత్మగా చూడబడుతుంది. అవిద్య త్రిగుణములగుండ పని చేస్తుంది. అది సత్వరజస్తమోగుణములగుండ పనిచేస్తుంది. త్రిగుణములను అతిక్రమిస్తేగాని పరమాత్మతో జీవాత్మ యొక్క తాదాత్మ్యం అసంభవం. గుణములను దాటడం అంటే అజ్ఞానాన్ని నాశంచేయడమే మానవుని పరిమితునిచేసే అవిద్యావికారాలను తుదముట్టింప జేయడమే త్రిగుణములను అతిక్రమించడం, అందువల్లనే భగవానుడు అర్జుననకు ఇలా ఉపదేశిస్తాడు.

విస్త్రైగుణ్యో భవార్జున" ఓ అర్జున, నీవు త్రిగుణాతీతు డవగుము — గీతా.

"ఆరాగ్రమాత్రః" అనగా ఆరెమొనవంటి (సూక్ష్మమైన)వాడు. పరమాత్మ సూక్ష్మాతి సూక్ష్మము. సూక్ష్మత్వాత్ "అవిజ్ఞేయం" పరమాత్మ బహు సూక్ష్మమైన కారణముచేత దానిని తెలిసికొనుట చాల గహనము. అందువల్ల పరమాత్మను తెలిసికొనుటకు ప్రత్యేక ప్రయత్నం చేయాలి; గుర్వనుగ్రహం పొందాలి. పరమేశ్వరుడు అణుమాత్రుడు, అతడు అనంతుడు సైతము. ఈ ఉపనిషద్ రహస్యాన్ని గ్రహించాలి. అపరోక్షానుభూతిని పడయాలి.

"హ అపరోఽపి దృష్టః" ఉండేది ఒక సత్యవస్తువె. ఉపాధివల్ల ఇంకొకటి ఉన్నట్లు కనబడుతుంది. అవిద్యవల్ల ఇంకొక జీవాత్మ యున్నట్లు కనబడుతుంది. జలంలో ప్రతిబింబపడపబడిన సూర్యుని వంటివాడుజీవాత్మ జలం అనే అజ్ఞానాన్ని తీసివేస్తే ఒక్క సూర్యుడే. ఒక్క పరమాత్మయే వెలుగొందుతుంది. ఈ సత్యం తరువాతి మంత్రంలో దృష్టాంతపూర్వకంగా తెలుపబడుతుంది.

---

వాలాగ్రశత భాగస్య
శతధా కల్పితస్య చ ।
భాగో జీవః స విజ్ఞేయః
స చానంత్యాయ కల్పతే ॥ 9 ॥

టీక: వాలాగ్ర = వెంట్రుకకొనయొక్క; శత భాగస్య - నూరవ భాగములో; శతధా = నూరురెట్లు, కల్పితస్య = విభజింపబడిన; చ = మరియు భాగః = భాగము, అంశము; జీవః = జీవుడు: సః = అతడు; విజ్ఞేయః = తెలిసికొనబడవలెను; సః = అతడు: చ = మరియు: ఆనంత్యాయ = అనంతము కోసము: కల్పతే = శక్యము, ఉన్నది.

భావము; ఒక వెంట్రుక కొనయొక్క నూరవభాగమును నూరు భాగములుగ విభజించగ ఏర్పడు భాగమంత సూక్ష్మమైనది జీవాత్మ. కాని అతడు తత్త్వతః అనంతుడు. అతడు విజ్ఞేయుడు.

వివరణము: వాలాగ్రశత భాగస్య. వెంట్రుక కొన యొక్క నూరవ భాగము యొక్క. వెంట్రుక చాల సన్నమైనది దాన్ని నూరుభాగాలు చేస్తే ఒక్కొక్క భాగము అతి సూక్ష్మమౌతుంది. అప్పుడది కంటికి కూడ కన బడదు. అది సూక్ష్మదర్శినిలో కనబడవచ్చును.

"శతధా కల్పితస్య చ నూరు భాగములు చేయబడిన వెంట్రుకకొన భాగమును మరల నూరుభాగాలుగా విభజింపబడిన. అతి సన్నని వెంట్రుక కొనను నూరుభాగాలు చేసి. ఆ నూరు భాగాలలో ఒక దానిని తీసికొని. దాన్ని దాన్ని నూరు భాగాలు చేసి. అట్లు చేయబడిన దాన్ని ఒకదాన్ని తీసికొంటే ఆ భాగం ఎంత సూక్ష్మంగా ఉంటుందో అంత సూక్ష్మమైనది జీవాత్మ.

"భాగః జీవః" జీవాత్మ అత్యంత సూక్ష్మమైనది. ఒకవెంట్రుక కొనను పదివేలు భాగాలు చేస్తే అందులో ఒక్క భాగం ఎంతసూక్ష్మంగా ఉంటుంది? బహుశః అది సాధారణ సూక్ష్మదర్శిని (microscope) లో దర్శనీయం కాక పోవచ్చు. ఆత్మ అతి సూక్ష్మమైనది. ఈ మంత్రం దృష్టాంతంగ చెబుతుంది. బ్రహ్మము ఆకాశములాగా సూక్ష్మమైనది. దాని సూక్ష్మత్వంవల్ల అది అజ్ఞానులకు అవిదితం.

"సః విజ్ఞేయః" ఆతనిని తెలిసికొనవలెను ఆ ఆత్మను తెలిసికొన వలెను. ఈ ఆత్మను తెలిసికొనవలెనంటే సూక్ష్మబుద్ధి కావాలి. బ్రహ్మ మొదలుకొని పారాడే పురుగు వరకు ఉండే సమస్త జీవరాసులలో ఆత్మ దాగియుంది. మానవుడు తత్త్వతః (in essence) బ్రహ్మమే. కాని అతడు అవిద్యా ప్రాబల్యంవల్ల, ఉపదేశించిన పిమ్మటకూడ "అహం బ్రహ్మాస్మి" అనే సత్యాన్ని తెలుసుకోలేక పోతూన్నాడు. అతనికి మనం ఏ బోధచేయక పోయినప్పటికి తాను 'ఫలానా వ్యక్తి కుమారుడు' అని భావిస్తాడు. అతడు మలినమయ దేహాన్నే విశుద్ధ ఆత్మయని భ్రమపడ్తున్నాడు. ఈ సంసారంలో మోహితుడై, మూఢుడై చరిస్తాడు. అవిద్య ఎంతవిచిత్రమైనది! మాయ ఎంత అగాధమైనది! మోహం ఎంత అద్భుతమైనది!

ఈ ఆత్మ అన్ని ప్రాణులలో దాగియున్నది. అది ప్రకాశింపదు: కాని సూక్ష్మద్రష్టలచే వారియొక్క నిశితమైన, సూక్ష్మబుద్ధిచే అది దర్శితమగుచున్నది.

అశుద్ధమైన, స్థూలమైన బుద్ధియుండేవారికి ఈ ఆత్మ ప్రకాశించదు. (ఏష ఆత్మా న ప్రకాశతే) అనగా పరిశుద్ధమైన, కుశాగ్రమైన, సూక్ష్మమైన బుద్ధి గలవారు ఆత్మను సాక్షాత్కరించుకొనవచ్చును

"స చ ఆనంత్యాయ కల్పతే" ఆత్మ అంత అణుతరం అయినప్పటికి అది అనంతం. ఆత్మను ఆకాశానికి పోలుస్తారు. కుండలోని ఆకాశం, గది లోని ఆకాశం మేఘంలోని ఆకాశం అంతా ఒకటే. నానా విధములైన పరిమిత పరిస్థితుల వల్ల ఆకాశానికి వివిధ నామాలు పెడుతాం. కుండలోని ఆకాశాన్ని ఘటాకాశమనియు, గదిలోని ఆకాశాన్ని మఠాకాశ మనియు, మేఘంలోని ఆకాశాన్ని గగనాకాశమనియు వివిధ నామాలతో పిలుస్తాము. అలాగే ఏకైక అఖండ బ్రహ్మము నానా జీవుల రూపాన్ని ధరిస్తుంది. ఒకే అగ్నినుండి వెలువడిన విభిన్న స్ఫులింగాలలాగా ఏకైక ఆత్మనుండి అనేక జీవాత్మల రూపాలు ఆ బ్రహ్మము ధరిస్తుంది. నానా రూపములు, నామములు ఏర్పడుతాయి ఘటంగోడలను, మఠంగోడలను భేదించిన తరువాత ఘటాకాశం, మఠాకాశం అదృశ్యమై, ఆ ఆకాశాలు విశ్వాకాశంతో ఏకమౌతాయి. అదేవిధంగా ఉపాధులు, అనగా వివిధ దేహాలు, మనస్సులు నాశమొందిన పిదప జీవాతల్మ పరమాత్మతో తాదాత్మ్యమౌతాయి.

పరమాత్మ అనంతం, అతడు పరిపూర్ణుడు, అతడు అఖండం. అతడు అద్వితీయుడు. అతడు ఏకైక వస్తువు. అందువల్ల అంతయూ ఆత్మయే. అనంతమే యని అవగతం చేసుకోవాలి. దానికోసమే అవిద్యను అంత మొందించుకోవాలి

నైవ స్త్రీ న పుమానేష
న చైవాయం నపుంసకః ।
యద్యచ్ఛరీరమాదత్తే
తేన తేన స యుజ్యతే ॥ 10 ॥

టీక: న ఏవ స్త్రీ = స్త్రీ కాదు; న ప్రమాన్ = పురుషుడు కాడు; ఏషః = అతడు; న చ ఏవ అయం = ఇదియు కాదు; నపుంసకః = నపుంసకము; యత్ యత్ = ఏయే; శరీరం = శరీరమును;

ఆదత్తే = తాల్చునో; తేన తేన = ఆయా దానితో; సః = అతడు;
యుజ్యతే = కలుపబడును

భావము; అతడు స్త్రీయు కాదు: పురుషుడును కాదు. నపుంసకము నైతముకాదు. తాను ఏయే శరీరమును దాల్చునో దానితో అతడు తాదాత్మ్యము నొందును. (సంబంధపరుపబడును. కలుపబడును)

వివరణము: "న ఏవ స్త్రీ" అతడు స్త్రీయు కాదు. "న పుమాన్ ఏషః" అతడు పురుషుడును కాదు "న చ ఏవ అయం నపుంసకః" ఈ ఆత్మ నపుంసకమును కాదు.

అతడు స్త్రీ కాదు, అతడు ఆత్మ. అతడు అశరీరి. లింగము స్థూల దేహానికి సంబంధించినది. అట్టి యెడ దేహరహితుడైన పరిశుద్ధ బ్రహ్మము నందు. లింగమెక్కడిది? అందువల్ల పరమాత్మను స్త్రీయని గాని, పురుషుడని గాని. నపుంసకమని గాని ఎలా చెప్పగలము? "స్వతః అద్వితీయ అపరోక్ష బ్రహ్మ ఆత్మ స్వభావత్వాత్ నైవ స్త్రీ న పుమాన్ ఏష నైవ చ అయం నపుంసకః", స్వయం సాక్షిత్తు అద్వితీయ బ్రహ్మ స్వరూపము అయిన కారణమున ఈ ఆత్మ స్త్రీ కాదు, పురుషుడుకాదు, నపుంసకము గాదు.

"యత్ యత్ శరీరం ఆదత్తే తెన తేన సః యుజ్యతే". అతడు ఏయే దేహాన్ని ధరిస్తే దానితో తాదాత్మ్యాన్ని పొందుతాడు. అతడు స్త్రీ శరీరాన్నో పురుష శరీరాన్నో. లేక నపుంసక శరీరాన్నో తీసికొన్నప్పుడు ఆ యా శరీరంతో ఒకటి యౌతాడు. దానితో సంబంధ పరుపబడుతాడు. అతడు తాను దాల్చిన శరీరంతో తాదాత్మ్యం చెందుతాడు. "యద్యత్ స్త్రీ శరీరం పురుష శరీరం నపుంసక శరీరం వా ఆదత్తే తేన తేన స చ విజ్ఞానాత్మా యుజ్యతే సంయుజ్యతే తత్తత్ ధర్మాన్ ఆత్మని అధ్యస్య అభిమన్యతే స్థూలోఽహం కృశోఽహం పుమాన్ అహం స్త్రీ అహం నపుంసకోఽహం ఇతి. స్త్రీ దేహమో పురుష దేహమో, నపుంసక దేహమో ఏది తాను ధరిస్తే దానితో విజ్ఞానాత్మ సంబంధ పరుపబడుతాడు, అప్పుడు ఆత్మయందు ఆయా దేహ ధర్మాలను ఆరోపించి. "నేను లావుగా ఉన్నాను. నేను సన్నగా ఉన్నాను. నేను మగవాణ్ణి. నేను మగువను. నేను మగటిమిలేనివాణ్ణి" అని అభిమానం పెంచుకొంటాడు. అనగా అతడు దేహ ధర్మాలను ఆత్మపై ఆరోపిస్తాడు.

ఆత్మ సర్వవ్యాపి అనంతము, దేహరహితము, నిరవయవము అఖండము, శాశ్వతము, నిత్యము, పరిశుద్ధము, ముక్తము అద్వితీయము సర్వోత్కృష్టము. ఇట్టి ఆత్మలో స్త్రీ, పుం, నపుంసక లింగభేదము ఎలా ఉదయించగలదు?

కాబట్టి మనం అనుదినం ఇలా ధ్యానించాలి.

నేను పరిపూర్ణమైన పవిత్రతను ... .... ఓం ఓం ఓం
శుద్ధోఽహం నిరంజనోఽహం ....... " " "
నేను లింగరహిత ఆత్మను ....... " " "
ఆత్మయందు కామము లేక లైంగిక వాసన లేదు ....... ఓం ఓం ఓం
కామము మనోవికారము. నేను ఈ వికారమునకు సాక్షిని ....... " " "
అసంగోఽహం. నేను అసంగుడను....... ఓం ఓం ఓం
నా మనోబలము (ఆత్మబలము) సిద్ధమైనది,
దృఢమైనది, విక్షిరోధమైనది....... ఓం ఓం ఓం
నేను భౌతిక, మానసిక బ్రహ్మచర్యములో
సంపూర్ణముగ సుప్రతిష్ఠుడను... — ఓం ఓం ఓం
ఇప్పుడు నేను శుచిత్వమును అనుభవించుచున్నాను.......ఓం ఓం ఓం

పరమేశ్వరుని అనుగ్రహంవల్ల నేను నానాటికి, సర్వదా ఇనుమడిము. ముమ్మడియు అభివృద్ధిచెందుచున్నాను.

---

సంకల్పన స్పర్శన దృష్ట మోహైః
 గ్రాసాంబువృష్ట్యా చ ఆత్మ వివృద్ధి జన్మ ।
కర్మానుగాని అనుక్రమేణ దేహీ
 స్థానేషు రూపాణి అభిసంప్రపద్యతే ॥ 11 ॥

టీక: సంకల్పన = ఆలోచనలచే· స్పర్శన = స్పర్శచే: దృష్టి = దర్శనముచే: మోహైః = మోహముచే: గ్రాసాంబువృష్ట్యా = గ్రాస అంబు వృష్ట్యా = అన్నపానముల వృష్టిచే: చ = మరియు; ఆత్మవివృద్ధి జన్మ =

దేహముయొక్క పెరుగుదల; కర్మానుగాని = అతడు చేసిన కర్మలనను సరించి; అనుక్రమేణ = క్రమముగ, ఒకదాని వెంట మరొకటిగ; దేహీ = దేహ భృత్, జీవుడు; స్థానేషు = నానా స్థానములలో, వివిధ స్థలములలో: రూపాణి = రూపములను.ఆకారములను : అభిసంప్రపద్యతే = ధరించును దాల్చును.

భావము: దేహము అన్నపానాదులచే వృద్ధినొందునటుల జీవుడు సంకల్ప స్పర్శ దృష్టి మోహములచే తాను చేసిన కర్మల ననుసరించి, నానా ప్రదేశములలో నానా రూపములను క్రమముగ దాల్చును.

వివరణము: "సంకల్పన. మొదటిది. సంకల్పం పరిశుద్ధమైతే జీవుడు చేసే పనులు సుకృతాలు ఔతాయి. ధార్మికమైన పనులు హృదయాన్ని శుద్ధి చేస్తాయి. మానవుడు సత్వరాభ్యుదయం పొందాలంటే సత్సంకల్పసమన్వితుడు కావాలి. సంకల్పమే నిజమైన కర్మ (Thought is real action).

"స్పర్శన" స్పృశించుట రెండవది. సంకల్పము మొదటిది. తరువాతి స్పర్శనం. తాకుట అనేది చర్మముయొక్క పని. స్పర్శ అనేది త్వగింద్రియ వ్యాపారము. సంకల్పముల మూట మనస్సు. ఇంద్రియాల్ని మనస్సు చలింపజేస్తుంది. సంకల్పం (అనగా మనస్సు)యొక్క ప్రమేయంలేకుండా ఇంద్రియ వ్యాపారం జరగదు.

"దృష్టి" దర్శనము మూడవది సంకల్పం తరువాత స్పర్శనంవస్తుంది తతో దృష్టి విధానమే దాని తరువాత స్పర్శనం తరువాత) దృష్టి వస్తుంది అనగా స్పర్శ పిమ్మట దృష్టి. సత్సంకల్పంవల్ల పరమేశ్వరుని పాదాలు పట్టుకోవడం అనే భాగ్యం కలుగుతుంది. పరమేశ్వరుని చరణ కమలాలను స్పృశించిన యనంతరం అతని వదనాన్ని వీక్షించడం జరుగుతుంది. నిర్మల హృదయుడు భగవంతుని సర్వ నామరూపాలలో చూడగలుగుతాడు.

"మోహః" మోహము నాల్గవది తతో మోహః. దృష్టి తరువాత మోహం కల్గుతుంది. ఎల్లప్పుడూ భగవానుని ధ్యానించడం (సంకల్పం),

అతని పాద సరోరుహాములను స్పృశించడం (స్పర్శ), అతనినే సర్వనామ రూపములలో దర్శించడం (దృష్టి) అతనిపై దివ్యానురాగమును, ప్రేమను అలవరచుకోవడం (మోహము)— ఇవి ఆత్మాభ్యుదయానికి వివిధ సోపానాలు.

మనస్సు పరమేశ్వరుని చరణాంబుజములవైపునకు మరలితే జీవుడు సత్వరంగా అభ్యుదయాన్ని పొందుతాడు. అట్లుగాక మనస్సు విషయ వాసనలవైపునకు మరలితే జీవుడు శీఘ్రముగా వినాశాన్ని పొందుతాడు. "తైః సంకల్పన స్పర్శన దృష్టి మోహైః శుభ అశుభాని కర్మాణి విష్పంద్యతే". అతడు సంకల్పము, స్పర్శ, దృష్టి, మోహము — వీనిచే శుభాశుభ కర్మలనొనర్చిన వాడగుచున్నాడు. కాబట్టి మన సంకల్పము, స్పర్శ, దృష్టి, మోహము భగవత్పరము చేయవలెను. అట్లు చేయనచో మనకు వానివలన వినాశము తప్పదు.

"గ్రాసాంబువృష్ట్యా చ ఆత్మ వివృద్ధి జన్మ" అన్నపానములచే దేహము వృద్ధినొందును, అన్నపానాదుల వల్ల స్థూల శరీరం బాగా వృద్ధిచెందుతుంది, అలాగేజీవుడు తన కర్మానుసారము సంకల్పన స్పర్శన దృష్టి మోహములచే వివిధావస్థలను, రూపములను పొందుతాడు.

"కర్మానుగాని అనుక్రమేణ దేహీ" జీవుడు కర్మానుసారము కర్మ ఫలాలను అనుభవిస్తూంటాడు. ఆహారం, పానీయం మన దేహం పెరగటందుకు తోడ్పడుతాయి. అలాగే జీవుడు తానొనరించిన వివిధ కర్మల ఫలాలు జీవాత్మ వివిధ దశలలో, వివిధ రూపాలలో వృద్ధిచెందేందుకు తోడ్పడుతాయి. ఈ వృద్ధి ఒకక్రమంలో జరుగుతుంది కారణకార్య సంబంధాన్ని అనుసరించి జీవుని వృద్ధి పరిణామం సంభవిస్తుంది.

"స్థానేషు రూపాణి అభిసంప్రపద్యతే" జీవుడు తాను చేసిన కర్మల ననుసరించి దేవతలలోనో, నీచ ప్రాణులలోనో మనుష్యులలోనో జన్మిస్తాడు. జీవిడు స్త్రీ గానో, పురుషుడుగానో నపుంసక ప్రాణిగానో జన్మిస్తాడు దేహాన్ని ఆహారం ఎలా బలిష్టం చేస్తుందో అలాగే జీవుణ్ణి కర్మలు ప్రభావితుణ్ణిచేస్తాయి.

Food and drink nourish the physical body. Virtuous actions nourish the inner soul. అన్నపానాలు స్థూల దేహాన్ని పోషిస్తాయి. పుణ్య కర్మలు జీవాత్మను పోషిస్తాయి

---

స్థూలాని సూక్ష్మాణి బహూని చైవ
రూపాణి దేహీ స్వగుణైర్ వృణోతి ।
క్రియాగుణై రాత్మగుణైశ్చ తేషాం
సంయోగహేతురపరోఽపి దృష్టః ॥ 12 ॥

టీక: స్థూలాని = స్థూలమైనవి: సూక్ష్మాణి = సూక్ష్మమైనవి బహూని = అనేకములు; చ = మరియు; ఏవ = కూడ: రూపాణి = రూపములను: దేహీ = జీవాత్మ: స్వగుణైః = తన స్వంత గుణములచే: వృణోతి వరించును, ధరించును: క్రియాగుణైః = కర్మల యొక్క గుణములచే; ఆత్మగుణైః = తనమనస్సుయొక్క గుణములచేత, చ = మరియు; తేషాం = వాని యొక్క; సంయోగహేతుః = కలియుటకు కారణము. సంయుక్తమైయుండుటకు కారణము, ఒకటైయుండుటకు కారణము; అపరః = వేరు. అన్యము, ఇతరము; అపి = కూడ; దృష్టః = దర్శింపబడుచున్నది, కనబడుచున్నది. చూడబడు చున్నది

భావము. జీవాత్మ తన స్వగుణములను, క్రియాగుణములను, మనోగుణములను అనుసరించి స్థూలమైన సూక్ష్మమైన రూపములను అనేకములను వరించును (ధరించును), ఆ రూపములతో సంయోగమునకు కారణము వేరొకటిగ నున్నది

వివరణము: "స్థూలాని సూక్ష్మాణి బహూని చైవ రూపాణి దేహీ". జీవాత్మ స్థూలమైన రూపములను, సూక్ష్మమైన రూపములను అనేకములను. దేహీ అనగా జీవుడు. విజ్ఞానాత్మ, జీవాత్మ. జీవాత్మ సకామ కర్మలచే బద్ధుడగు చున్నాడు అతడు గుణములచే బంధితుడగుచున్నాడు. విహిత కర్మలను

నిషిద్ధ కర్మలను ఆచరించుటచే కలిగిన సంస్కారములద్వారా జీవుడు స్థూల సూక్ష్మ దేహములను పొందుచు పస్థితి నొందుచున్నాడు.

స్థూల రూపములు పెద్దవి. జీవాత్మ తన పూర్వ కర్మల ననుసరించి స్థూల రూపము ధరింపవచ్చును. పాషాణాది రూపములు స్థూలరూపములు. అటు వంటి స్థూలరూపములు అనేక జన్మలలో అనేక రూపములు జీవాత్మ ధరింప వచ్చును. సూక్ష్మరూపములు చిన్నవి. తైజస ధాతువులు మున్నగు వాటితో కూడిన రూపములు సూక్ష్మమైనవి. దేవాది శరీరములు సూక్ష్మమైనవి. ఇటు వంటి సూక్ష్మదేహాలను అనేక జన్మలలో అనేక రూపములను జీవాత్మ పొంద వచ్చును.స్థూల రూపములుగాని, సూక్ష్మరూపములుగాని. ధరించుట పూర్వ కర్మానురూపమే యుండును.

"స్వగుణైర్ వృణోతి క్రియాగుణైః ఆత్మ గుణైః చ". తన స్వగుణ ములను, క్రియాగుణములను, మనోగుణములను అనుసరించి. స్వగుణములు జీవాత్మయొక్క స్వీయగుణములు. ఈ స్వగుణములు అతనిదేహమునకు సంబం ధించినవి క్రియాగుణములు అతని కర్మలకు సంబంధించినవి. ఆత్మగుణ ములు అతని మనస్సునకు సంబంధించినవి మానవుడు తనపూర్వ దేహ గుణముల ననుసరించి, క్రియల యొక్క గుణముల ననుసరించి. మనస్సు యొక్కగుణముల ననుసరించి నూతన దేహాన్ని ధరిస్తాడు. పూర్వదేహముచే పూర్వకర్మల ఫలితముగ ఏర్పడిన సంస్కారములకు అనుగుణముగ మాన వుడు నూతన దేహాన్ని వరిస్తాడు. క్రొత్త దేహంతో సంయోగానికి కారణ మేమిటి ?

"తేషాం సంయోగ హేతుః అపరః అపి దృష్టః" వానియొక్క కూడి కకు కారణము అన్యమై యున్నది దేహంతో సంయోగానికి కారణ మేమిటి ? కర్మ అంటామా ? కాదు కర్మ జడమైనది అది ఫలాన్ని ఇవ్వజాలదు. ఇక కర్మఫలాన్ని ఇవ్వగలిగినవాడు పరమేశ్వరుడే, అతడే కర్మఫల ప్రదాత. అందువల్ల దేహంతో సంయోగానికి కారణం భగవంతుడే The cause of the union with the body is the lord.

అనాద్యనంతం కలిలస్య మధ్యే
విశ్వస్య స్రష్టారమనేకరూపమ్ ।
విశ్వస్యైకం పరివేష్టితారం
జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః ॥ 13 ॥

టీక: అనాది అనంతం = ఆదియును అంతమును లేనివానిని కలిలస్య = గందరగోళపు, అల్లకల్లోలపు; మధ్యే = మధ్య; విశ్వస్య = ప్రపంచముయొక్క; స్రష్టారం సృష్టికర్తను; అనేకరూపం = వివిధరూపములను ధరించువానిని; విశ్వస్య = విశ్వముయొక్క; ఏకం = ఒకటే ఒక పరివేష్టితారం = ఆవరించియుండువానిని జ్ఞాత్వా = తెలిసికొని: దేవం = భగవంతుని: ముచ్యతే = తన్ను విడుదల గావించుకొనును: సర్వపాశైః = సర్వ శృంఖములనుండి. అన్ని బంధములనుండి.

భావము: ఆది మధ్యాంతరహితుడును, అల్లకల్లోలపు మధ్య ప్రపంచమును సృష్టించువాడును, నానా రూపధారియును, విశ్వమును ఆవృతమొనర్చిన ఏకైక స్వామియును అయిన దేవుని సాక్షాత్కరించుకొని జీవాత్మ సర్వ శృంఖములనుండి ముక్తిని పొందును.

వివరణము, అనాది అనంతం పరమేశ్వరునకు ఆద్యంతములులేవు అతనికి ఆది, మధ్యము, అంతములేవు, అతడు అనంతుడు. అతడు సర్వగతుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు అతడు అఖండము, కావున అతనిలో ఆది. అంతము ఉండజాలవు.

"కలిలస్య మధ్యే" గందరగోళము మధ్య గహన గభీర సంసారస్య మధ్యే. అత్యంత గంభీరమైన సంసారము మధ్య పరమేశ్వరుడు విచిత్రమైద సంసారము మధ్య ప్రపంచాన్ని సృష్టిస్తాడు సంసారం దాట శక్యముగానిది, అది దుస్తరం, అగాధం, భగవంతుడు అల్లకల్లోలంలో విశ్వాన్ని సృష్టించి, దానికి స్థితిని చేకూరుస్తాడు,

"విశ్వస్య స్రష్టారం" విశ్వముయొక్క సృష్టికర్తను ఘటమును మనం చూచినపుడు ఘటాన్ని తయారుచేసినకులాలుడు ఒకడున్నాడని తెలుసుకొంటాము.అలాగే విచిత్రమైనటువంటి ఈ విశ్వాన్ని ఆలోకించినపుడు

అనంత శక్తి సంపన్నుడైన పరమేశ్వరుడు (విశ్వస్య స్రష్ట) ఉన్నాడని మనం అనుమానించాలి పరమేశ్వరుడు ప్రపంచాన్ని సృష్టించడమేగాక, దాన్ని రక్షిస్తాడు ప్రళయకాలంలో దాన్ని తనలో లీనం చేసుకొంటాడు పరమేశ్వరునకు విశ్వసృష్టి కార్యంవల్ల ఏ ప్రయోజనం స్వలాభం లేదు. 'భగవంతుడు సృష్టి ఎందుకు చేసినాడు?' అనేది అతి ప్రశ్న. దీనికి సమాధానం లేదు. మనం ఎంత తలబ్రద్దలు చేసుకొన్నా ఈ అతి పశ్నకు సమాధానం దొరకదు ఎలాగో మనం ఈ విశ్వంలో పుట్టినాము. ఇది దుఃఖాలయము, అశాశ్వతము, దానినుండి బయట పడడానికి యత్నించాలి ఆ యత్నమే భగవంతుని పాద పద్మములమీదభక్తి.

'అనేక రూపం,' నానా రూపములు దాల్చువానిని భగవానుడు అనేక రూపాల్ని ధరిస్తాడు. అతడు నిర్గుణుడు. నిరాకారుడు. అతడు ఎందుకు అన్ని రూపాలు ధరిస్తాడు? పరాత్పరుడు భక్త వత్సలుడు. భక్తులు తాము భగవంతుని భక్త్యా ధ్యానించేకోసం అతడు వివిధ రూపాలు ధరిస్తాడు. అతడు సగుణమూర్తి యౌతాడు. ప్రపంచంలో కనబడే సర్వనామ రూపాలలో అతడున్నాడు. ఆ పరమేశ్వరుని సకల నామరూపములలో దర్శించడం, సకల నామ రూపములలో సేవించడం సాధనలో ముఖ్యమైన మెట్టు అప్పుడే మనము చేయు కర్మలు యోగ కృతులు కాగలవు. మనం జీవితగమ్యాన్ని సాధించగలం. "ఏకం సత్ విప్రా బహుధా వదంతి." సత్యము ఒక్కటే. దాన్ని జ్ఞానులు అనేక విధములుగా ప్రవచిస్తారు. అనేకత్వంలో ఏకత్వాన్ని దర్శించడమే ముఖ్యమైన సాధన

"విశ్వస్య ఏకం పరివేష్టితారం." విశ్వమును ఆవ్యాపించియుండే ఏకైక స్వామిని, పరమేశ్వరుడు ఒక్కడే. అతడు అద్వితీయుడు అతడే యావత్ ప్రపంచాన్ని వ్యాపించియున్నాడు. జంగమ స్థావరాత్మకమైన సకల భూత ప్రపంచం పరమేశ్వరునిచే నిండియుంది. "ఈశావాస్యం ఇదం సర్వం". ఈ యావద్ విశ్వం పరమేశ్వరునిచే పరివ్యాప్తమైయుంది. కాబట్టి వేర్పాటు భావనను వదలాలి ఐక్యదృష్టిని అలవరచుకోవాలి. బ్రహ్మానందం అనుభవించేదానికి. మోక్షద్వారం ప్రవేశించేదానికి ఇటువంటి భావన చాలాముఖ్యం

"జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః" భగవంతుని తెలిసికొని అన్ని బంధములనుండి ముక్తుడగును. భగవంతుడు పరంజ్యోతి అతని దర్శన మాత్రమున అవిద్యాంధకారం అదృశ్యమౌతుంది జీవుడు పరమాత్మతో తాదాత్మ్యం పొందిన వెంటనే అవిద్య, కామ, కర్మలు నాశమౌతయి. అవిద్య, కామ, కర్మల నాశంతో జీవుడు బంధ స్థితినుండి మోక్షమును పొందుతాడు దేవుని తెలిసికొనుటయే అవిద్యకు అంతము. అవిద్యా పరిసమాప్తియే అజ్ఞాన బంధములు తొలగుటకు మూలం

నాలుగవ అధ్యాయంలోని పదునార్గవ మంత్రంలో కూడ యిటువంటి భావమే ద్యోతమౌతుంది.

---

భావగ్రాహ్యం అనీడాఖ్యం
భావాభావకరం శివమ్ ।
కలాసర్గకరం దేవం యే
విదుస్తే జహుస్తనుమ్ ॥ 14 ॥

టీక భావగ్రాహ్యం = విశుద్ధమైన అంతఃకరణముతో గ్రహింప దగినది; అనీడాఖ్యం = అశరీరాఖ్యం, పదార్థరహితమైన, దేహములేని; భావ అభావకరం = 'సత్' నకు 'అసత్'నకు కారణమైనవానిని: శివమ్ = శుద్ధుని అవిద్యా తత్కార్య వినిర్ముక్తం, అవిద్యనుండియు దాని కార్యమునుం డియు ముక్తుడైనవానిని· కలాసగకరం = పదునారు కళలు ఉద్భవించుటకు కారణమైనవానిని: దేవం = భగవంతుని: యే = ఎవరు: విదుః = తెలిసికొందురు: తే = వారు; జహు = త్యజింతురు; తనుమ్ = శరీరమును

భావము; "విశుద్ధాంతఃకరణముతో తెలియదగినవాడును, అశరీరు డును, సత్తునకు అసత్తునకు కారణమైనవాడును, అవిద్యయు తత్కార్యమును లేనివాడు, పదునారు కళల ఉద్భవమునకు కారణమైనవాడును అయిన భగవంతుని తెలిసికొనినవారు పునర్జన్మలనుండి ముక్తులగుదురు.

వివరణము; "భావగ్రాహ్యం" అనగా విశుద్ధమైన అంతఃకరణముతో తెలియదగినది పరమేశ్వరుని అపరోక్షానుభూతిచే సాక్షాత్కరించుకొన

వలయును God is to be realised by direct intuitive perception. యోగులు ధ్యానంద్వారా తమ మనస్సులను భగవంతునిలో లీనంచేసి అతన్ని దర్శిస్తారు. పరమేశ్వరుని ఉనుకవను మనం యితరులకు ప్రదర్శింప చేయలేము. ఆ పరమేశ్వరుని నిర్వచించపలేము అతనిని నిర్వచించడం అతనిని నిరాకరించడమే యౌతుంది. To define god is to deny god.

"అనీడాఖ్యం" అనగా శరీర రహితమైనది. It is incorporeal, immaterial. ఆత్మ అశరీరము. దానికి స్థూల.సూక్ష్మ. కారణ శరీరాలులేవు, భగవంతుని దేహము చిన్మయ దేహం. అది మాంసాది ధాతువులతో నిర్మిత మైనది కాదు భగవంతుని శరీరం పాంచభౌతికమైనది గాదు. అతడు చిద్ఘనుడు.

"భావాభావకరం." భావమునకు అభావమునకు కారణమైనది. భగవంతుడు సత్. అసత్‌లకు కారణమైనవాడు. "సత్" అంటే వ్యక్త ప్రపంచం (కార్యము). "అసత్" అంటే అవ్యక్తం (కారణం). అసత్ అంటే శూన్యం కాదు సూక్ష్మమైన, అవ్యక్తమైన కారణాన్ని అసత్ అంటారు. జ్ఞానులకు భగవంతుడు 'సత్' అజ్ఞానులకు వ్యక్త ప్రపంచం "సత్". భగవానుడు గీతలో ఇలా సెలవిస్తారు: సదసచ్చాహమర్జున ఓ అర్జున నేనే సత్తును నేనే అసత్తును.

శివమ్. మంగళ ప్రదమైనది భగవంతుడు మంగళ ప్రదుడు. అతడు తన భక్తులకు సకల శుభములను అనుగ్రహిస్తాడు. అతడు మన పాపములను భస్మం చేస్తాడు. అతడు నిత్యశుద్ధుడు. "శుద్ధం అవిద్యా తత్కార్య వినిర్ముక్తం ఇత్యర్థః" భగవంతుడు శివుడు. అతడు శుద్ధుడు, అతనిలో అవిద్యయు, దాని కార్యములును లేవు. అతనిని ధ్యానించుటవలన అవిద్య అంతమొందు తుంది.

"కలాసర్గకరం" పదునారు కళల పుట్టుకకు కారణమైనది. కళచే సృష్టించునది. కళ అనగా భగవంతుని స్వశక్తి. 'కలాసర్గకరం' అంటే వేదములను, తదితర శాస్త్రములను సృష్టించిన వాడనియు అర్థము చెప్పనగును. "కళానాం షోడశానాం ప్రాణాది నామాంతానామ్". ప్రాణాది నామములుగల పదునారింటిని కళలు అంటారు. ఆ పదునారు కళలు ఏవన.

1. ప్రాణము 2. శ్రద్ధ 3. ఆకాశము 4. వాయువు 5. జ్యోతి 6. ఆపస్సు

7. వృత్తి 8. ఇంద్రియములు 9. మనస్సు 10. అన్నము 11. వీర్యము 12. తపస్సు 13. మంత్రము 14. కర్మ 15 కళ 16. నామము.

"దేవం యే విదుః జహుః తనుమ్" ఎవరు అటువంటి భగవంతుని (ఆత్మను) తెలిసికొందురో వారు శరీరమును త్యజింతురు. "దేవం యే విదుః అహమస్మీతి తే జహుః పరిత్యజేయుః తనుం శరీరమ్" 'అహం బ్రహ్మాస్మి' (నేను బ్రహ్మమును) అని ఎవరు తెలిసికొంటారో వారు దేహాన్ని త్యజిస్తారు దేహాన్ని విడువడం అంటే దేహాధ్యాసను విడిచిపెట్టడం. వారు ఆత్మతో తాదాత్మ్యం పొందుతారు. వారు శరీరాన్ని త్యజిస్తారు. అంటే వారికి యింక దేహాన్ని ధరించడం ఉండదు. అంటే వారికి ఇంక పునర్జన్మ యుండదు. వారికి జన్మ లేమిచే దేహం యుండదు. దేహంలేమిచే వారికి ఇంక యాతన. దుఃఖము ఉండవు కాబట్టి పరమేశ్వరుని యథార్థ స్వభావమును తెలుసుకొన్న వారు దేహాధ్యాసను తొలగించుకొని. పరమాత్మతో తాదాత్మ్యమును పడసి అత్యంత దుఃఖనివృత్తి ని పొందుతారు.

---

ఇతి శ్వేతాశ్వతరోపనిషద్ భాష్యే
పంచమోఽధ్యాయః

---

# షష్ఠోఽధ్యాయః
## ఆరవ అధ్యాయము

స్వభావమేకే కవయో వదంతి
కాలం తథాన్యే పరిముహ్యమానాః।
దేవస్యైష మహిమా తు లోకే
యేనేదం భ్రామ్యతే బ్రహ్మచక్రమ్ ॥ 1 ॥

టీక: స్వభావం = ప్రకృతి; ఏకే = కొందరు; కవయః = ధ్యాతలు, ఆలోచనాపరులు; వదంతి = చెప్పుదురు: కాలం = కాలము: తథా = కూడ: అన్యే = కొందరు; పరిముహ్యమానాః = మోహితులైన వ్యక్తులు; దేవస్య = దేవునియొక్క; ఏషః = ఇది; మహిమా = గొప్పతనము; తు = యథార్థముగ: లోకే = ప్రపంచములో; యేన = దేనిచే; ఇదం = ఈ; భ్రామ్యతే = త్రిప్పబడుచున్నదో; బ్రహ్మచక్రమ్ = బ్రహ్మచక్రము.

భావము: "కొందరు తాత్త్వికులు ప్రకృతిని ఈవిశ్వమునకు కారణమని నుడువుదురు: మరికొందరు మోహితులైన వ్యక్తులు ఈ విశ్వమునకు కాలము కారణమని చెప్పుదురు. కాని వాస్తవములో దేవునియొక్క మహిమచేతనే ఈ బ్రహ్మచక్రము గిర్రున తిరుగుచున్నది.

వివరణము: "స్వభావం ఏకే కవయః వదంతి" కొందరు మోహితులైన తాత్త్వికులు స్వభావమును (ప్రకృతిని) విశ్వమునకు కారణమని చెప్పుదురు అట్లుచెప్పెడి తాత్త్వికులు కడు మోహితులు వారు పరమమూఢులు వారు అజ్ఞానులు. వారు అవిద్యా ప్రాబల్యానికి లోనైన వారు. వారు విశ్వాన్ని విశ్వేశునిపై ఆరోపించారు. వారు దేహాన్ని ఆత్మయని అనుకొంటారు. వారు ప్రకృతినే విశ్వానికి మూల కారణమని చెప్పుతారు. "అవజానంతి మాం మూఢా. మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరం" — గీతా.

మూఢులున్నూ తెలుసుకోలేరు, నా అధ్యక్షతన ప్రకృతి సచరాచర విశ్వాన్ని సృజిస్తుంది. Nature does all actions with the help of the light of the Lord. భగవంతుని కాంతి సాయంతో ప్రకృతి అన్ని పనులు నిర్వర్తిస్తుంది. అందుచేత విశ్వానికి మూలకారణం భగవంతుడు. విశ్వానికి కారణం ప్రకృతి గాదు.

"కాలం తథా అన్యే పరిముహ్య మానాః" మూఢులైన మరికొందరు విశ్వమునకు కాలమును కారణముగ చెప్పుదురు. కాలం అంటే ఏమిటి? కాలం మానసిక వృత్తి. Time is a mode of the mind. మనస్సంటే ప్రకృతి. విశ్వానికి మూలకారణం కాదు. అందువల్ల కాలంకూడ విశ్వానికి మూలకారణం కాదు. పరమేశ్వరుని ఆజ్ఞచేతనే సెకనులు, నిమషాలు

గంటలు, రోజులు, మాసాలు, సంవత్సరాలు, యుగాలు భ్రమిస్తున్నాయి. అందువల్ల విశ్వానికి మూలకారణం పరమేశ్వరుడే. కాలాన్ని విశ్వానికి కారణంగా చెప్పేవారు కాలచక్రంలో కొట్టుకలాడే మూఢులే.

"దేవస్యైష మహిమా తు లోకే యేన ఇదం భ్రామ్యతే బ్రహ్మచక్రమ్." నిజముగ ఈ లోకమున పరమేశ్వరునియొక్క గొప్పతనముచేతనే బ్రహ్మచక్రముగిరగిర భ్రమించుచున్నది. దేవస్య మహిమా అనగా భగవంతుని మహిమ, వైభవము, గొప్పతనము. దేవుడు విశ్వానికి మూలకారణం. అతనియొక్క ప్రభావం వల్లనే ఈ సచరాచర జగత్తు తిరుగుచున్నది. భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా —గీతా. తన మాయాశక్తిచే సర్వప్రాణులను (యంత్రమునందుంచబడిన కొయ్యబొమ్మలవలె) గిర్రున భ్రమింపజేయుచున్నాడు. హేతునానేన కౌంతేయ జగద్ విపరివర్తతే.—గీతా. భగవంతుని అధ్యక్షత కారణంచేత, ఓకుంతీకుమార. ఈ ప్రపంచం భ్రమణం చేస్తూంది. పరమేశ్వరుడు చలన మూలం (PRIMUM MOBILE) అతడే ఈ సంసార చక్రాన్ని త్రిప్పుతాడు. అతని మాయను దాటవలెనంటే అతనిని శరణుజొచ్చుటయే మార్గము.

"మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే" —గీతా నన్ను ఎవరు శరణుపొందుదురో వారే ఈ మాయను దాటుదురు.

"బ్రహ్మచక్రం" సృష్టి చక్రము. ఇదే విశ్వచక్రం. ఒకటవ అధ్యాయంలో నాలుగవ శ్లోకంలో విశ్వచక్రం వర్ణింపబడింది. భగవంతుని విశ్వచక్రంగా ధ్యానిస్తారు. పరమేశ్వరుని ప్రభావంతో విశ్వచక్రం భ్రమిస్తుంది. కాబట్టి విశ్వానికి మూలకారణం భగవంతుడే.

---

యేనావృతం నిత్యమిదంహి సర్వం
జ్ఞః కాలకాలో గుణీ సర్వవిద్ యః ।
తేనేశితం కర్మ వివర్తతేహ
పృథ్వ్యప్తేజోఽనిలిఖాని చింత్యమ్ ॥ 2 ॥

టీక; యేన = ఎవనిచే: ఆవృతం = ఆవరింపబడియున్నది: వ్యాపింపబడియున్నది; నిత్యం = ఎల్లప్పుడు; ఇదం = ఈ; హి = నిజముగ: సర్వం = సమస్తము; అంతయు: జ్ఞః = సర్వవిత్, జ్ఞానస్వరూపుడు: కాలకాలః = కాలస్యాపి కర్తా, కాలమునకు కూడ ప్రభువు: గుణీ = గుణవాన్, గుణములు కలవాడు; సర్వవిద్ = సర్వజ్ఞుడు, సర్వము తెలిసినవాడు: యః = ఎవడు; తేన = అతని చేత: ఈశితం ఆజ్ఞాపింపబడి; కర్మ = పని, సృష్టికార్యము; వివర్తతే = వికసించును, ప్రకాశితమగును; హ = ప్రసిద్ధద్యోతకము: పృథ్వీ అప్ తేజః అనిల ఖాని = భూమి జలము, అగ్ని, వాయువు, అకాశములుగ: చింత్యమ్ = భావింపబడుచున్నది, పిలువబడుచున్నది.

భావము: సర్వజ్ఞుడును, కాలమునకు ప్రభువును గుణవంతుడును, జ్ఞానస్వరూపుడును అయిన పరమేశ్వరునిచే ఈ సమస్త ప్రపంచము సదా వ్యాపింపబడియున్నది. పృథ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అని పిలువబడుచున్న సృష్టికార్యము ఆ పరమేశ్వరుని ఆజ్ఞవలన ప్రకాశితమగుచున్నది.

వివరణము: "యేన ఆవృతం నిత్యం ఇదం హి సర్వం" ఈ యఖిల జగత్తు సదా ఎవనిచే ఆవృతమైయున్నదో. ఈ విశ్వము పరమేశ్వరునిచే వ్యాపితమైయున్నది. ఈ జగత్తు ఒక నియమములో పరమేశ్వరునిచే వ్యాప్తమైయున్నది. ఇది వాస్తవము

"జ్ఞః కాలకాలః గుణీ సర్వవిద్ యః". ఎవడు జ్ఞానస్వరూపుడో, కాలమునకు కూడ ప్రభువో, గుణవంతుడో సర్వజ్ఞుడో. "జ్ఞ" అనగా జ్ఞానస్వరూపుడు, పరమేశ్వరుడు చిన్మయుడు, అతడు విద్వనుడు. అతడు సర్వవిత్. అతనికి అన్ని తెలియుటవలననే ఈ జగత్తును వ్యాపించి పాలించుచున్నాడు. మరియు అతడు అంతర్యామియై ఈ జగత్తును నియమించుచున్నాడు. భగవానుడు తన జ్ఞానంతో సకల భువనాలను రక్షిస్తున్నాడు. "గీతా జ్ఞానం ఉపాశ్రిత్య త్రీన్లోకాన్ పాలయామ్యహమ్." గీతా జ్ఞానముతో నేను (కృష్ణ పరమాత్మ) త్రిభువనములను రక్షింతును.

కాలకాలః అనగా కాలకారః, కాలస్యాపి కర్తా, కాలమునకు ప్రభువు. పరమేశ్వరుడు కాలకాముడు. అతడు కాలమునకు కూడ కర్త. అతడు కాలానికి కాలము. అతడు కాలానికి కర్త. అతని అనుజ్ఞవల్లనే కాలచక్రం త్రొక్కు తుంది. "కాలోఽస్మి లోకక్షయకృత్ ప్రవృద్ధః" — గీత. నేను జగత్సం హారకుడనై విజృంభించిన కాలుడను. "అహం ఏవ అక్షయః కాలః." — గీత. అక్షయమగు, నాశములేని కాలమును నేనే.

"గుణీ" అనగా గుణవాన్, గుణవంతుడు. "గుణ్యపహత పాప్మాదిమాన్." అతడు సర్వ కిల్బిషరహితుడు. అతడు సకల కల్యాణ గుణములతో శోభిల్లు విగ్రహుడు "సర్వవిత్ యః," ఎవడు సర్వవిదుడో "సర్వం వేత్తి ఇతి సర్వవిద్యః." అన్నింటిని తెలిసినవాడగుట చేత సర్వవిదుడని పిలువబడుచున్నాడు.

"తేన ఈశితం కర్మ వివర్తతే హ." ఎవని ఆనతిచే సృష్టికార్యము ప్రకాశితమగుచున్నదో. ఈ పని ఆ పరమేశ్వరుని ఆజ్ఞవలన ప్రకాశితమగు చున్నది. ఈ పని అనగా సృష్టికార్యము "తేన ఈశ్వరేణ ఈశితం ప్రేరితం కర్మ ప్రజీవ ఫణీ, హ శబ్దః ప్రసిద్ధి ద్యోతికః" ఆ పరమేశ్వరునిచే ప్రేరితమైన ప్రసిద్ధకర్మ మాలయందలి సర్పముతో సమానమైనది. 'హ' శబ్దము ప్రసిద్ధమును సూచించును. "వివర్తతే." అనగా వికసించును, ప్రకాశితమగును. ఇచ్చట శ్రీ శంకరులవారి వివర్తవాదం కనిపిస్తుంది. త్రాడు పాముగ కనబడుతుంది. అలా కనబడినప్పటికీ త్రాడు ఎటువంటి మార్పును చెందదు. బ్రహ్మము జగత్తుగ కనబడుతాడు అతడు అలా కనిపించినప్పటికి ఎటువంటి పరిణామం పొందడు. కావున ఆ పరమేశ్వరుని యానతి వలననే ఈ యావత్ సృష్టికార్యము ప్రకాశితమగుచున్నది.

"పృథ్వి అప్ తేజః అనిల ఖాని చింత్యం" అది భూమి, జలము అగ్ని, వాయువు, ఆకాశముగ భావింపబడుచున్నది. జగత్తు పంచభూత నిర్మితము. జగత్తు పరిణామం చెందుతుంది. జగదీశ్వరుడు అవిక్రియుడు మార్పులేనివాడు. విశ్వం విశ్వేశ్వరునిపై ఆరోపింపబడింది. భగవంతుడు మార్పుచెందుతున్నట్లు కనబడుతాడు. ఎందువల్ల? అవిద్యా దోషంచేత

పరమేశ్వరుడు పరిణామం చెందినట్లు కనబడుతాడు. జగత్ ఆత్మనా వివర్తత ప్రపంచంపరమాత్మపై ఆరోపింపబడింది.

తత్కర్మ కృత్వా వినివర్త్య భూయః
తత్త్వస్య తత్త్వేన సమేత్య యోగం ।
ఏకేన ద్వాభ్యాం త్రిభిరష్టభిర్వా
కాలేన చైవాత్మగుణైశ్చ సూక్ష్మైః ॥ 3 ॥

టీక: తత్కర్మ = ఆ పని. సృష్టి: కృత్వా = చేసి: వినివర్త్య = తాను ప్రత్యాహారముచేయును; భూయః = పునః, మరల; తత్త్వస్య = తత్త్వము యొక్క; తత్త్వేన = తత్త్వములతో; సమేత్య = కూడి; యోగం = సంయోగమును, ఏకత్వమును; ఏకేన = ఒక దానితో; ద్వాభ్యాం = రెండింటి చేత; త్రిభిః = మూడింటితో; వా = లేక; కాలేన = కాలముతో; చ = మరియు; ఏవ = మాత్రమే; ఆత్మగుణైః = మనస్సుయొక్క గుణములచే; చ = మరియు; సూక్ష్మైః = సూక్ష్మమైన వానిచే.

భావము: పరమేశ్వరుడు ఆ పనిని చేసి (సృష్టించి), ఒక తత్త్వము తరువాత మరొక తత్త్వమును ఒకదానితో. రెండింటితో, మూడింటితో, ఎనిమిదింటితో, మరియు కాలముతో, మనస్సు (అంతఃకరణము) యొక్క సూక్ష్మగుణములతో తాను సంయోగమై, ప్రవేశించి విశ్రాంతి నొందును.

వివరణము: "తత్ కర్మ కృత్వా వినివర్త్య భూయః." అతడు ఆ పనిని చేసి (అనగా సృష్టి గావించి), మరల విశ్రాంతి గైకొనును. "తత్ కర్మ కృత్వా" అనగా పృధివ్యాది కర్మలను గావించి, ఈ విశ్వాన్ని సృష్టించి. పరమేశ్వరుడు విశ్వాన్ని సృష్టించిన తరువాత విశ్రాంతి తీసుకొంటాడు. భగవంతునకు విశ్రాంతి ఎమిటి? అతడు సాక్షిమాత్రుడుగ ఉంటాడు, ఈసాక్షిగా ఉండడమె భగవంతునకు విశ్రాంతి. ఈప్రపంచాన్ని సంసారాన్ని అతడు సృజించినప్పటికి దాని ప్రాబల్యానికి అతడు గురికాడు ఈ సగోచర విశ్వప్రాబల్యానికి అతడు లోనుగాడు. అతడు ఆకాశవత్

నిర్లిప్తుడు. అతడు అన్నిటికి ఆధారము, అధిష్ఠానము. ఆలంబనము అయి నప్పటికి అన్ని కర్మలకు అతీతుడై, అస్పృశ్యుడై యుంటాడు. పరమేశ్వరుని ఏదియు అంటదు: భగవానుడు అసంగుడు.

"తత్త్వస్య తత్త్వేన సమేత్య యోగం" అతడు ఒక తత్త్వం తరువాత మరొక తత్త్వంతో సంయోగం చెందుతూ ప్రవేశిస్తాడు.

"ఏకేన ద్వాభ్యాం త్రిభిః అష్టభిర్ వా కాలేన చ ఏవ ఆత్మగుణైః చ సూక్ష్మైః". అతడు ఏకముతో రెండింటితో, మూడింటితో, ఎనిమి దింటితో కాలముతో మరియు మనస్సుయొక్క సూక్ష్మగుణములతో సంయోగమౌతాడు. ఏకేన అనగా ఒకదానితో. ఈ ఒక తత్త్వం ఏమిటి? అది అవిద్య, అజ్ఞానము ఈ ఒక తత్త్వంతో ఆత్మ సంయోగం చెందుతుంది. ఈ ఒక తత్త్వాన్ని అవ్యక్తము అనికూడ వివరిస్తారు.

ద్వాభ్యాం అనగా రెండింటితో. ఆత్మ, ధర్మము, అధర్మము అనే రెండు తత్త్వాలతో సంయోగం చెందుతుంది. అది రాగము, ద్వేషము అనే రెండు తత్త్వాలతో సంయోగమౌతుంది. ఈ రెండు తత్త్వాలను అవ్యక్తము బుద్ధి అని పైతము వివరిస్తారు. త్రిభిః అనగా మూడింటితో. ఆత్మమూడు తత్త్వాలతో సంయోగమౌతుంది. ఆమూడు తత్త్వాలు ఏవి? స్థూలశరీరం, సూక్ష్మ శరీరం, కారణ శరీరం —వీటిని, సత్త్వగుణము, రజోగుణము, తమోగుణము—వీటిని. జాగ్రదవస్థ స్వప్నావస్థ సుషుప్త్యవస్థ —వీటిని. దేశ, కాల, కారణములు —వీటిని మూడు తత్త్వాలు అనుకోవచ్చు వీటిలో ఆత్మ సంయోగమౌతుంది. ఈమూడు తత్త్వాలను అవ్యక్తము, బుద్ధి, అహంకారము అని పైతము వివరిస్తారు. అష్టభిః అనగా ఎనిమిదింటితో. ఆత్మ ఎనిమిది తత్త్వాలతో సంయోగమౌతుంది. ఆ అష్టతత్త్వాలు ఏవన: పంచభూతములు, మనస్సు, బుద్ధి, అహంకారము. ఈ ఎనిమిది తత్త్వాలను అవ్యక్తము, బుద్ధి, అహంకారము, పంచ తన్మాత్రలు అనికూడ వివరిస్తాయి.

భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిః అష్టధా॥—గీతా

భూమి జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము— ఈ ఎనిమిది విధములుగా నా ప్రకృతి భేదమును పొందియున్నది.

కాలేన అనగా కాలముతో కాలము కూడ ఒక తత్త్వమే. కాలముతో ఆత్మ సంయోగంచెందుతుంది. భగవంతుడు కాలాన్ని నియమిస్తాడు. అతని అతని అనుజ్ఞ చేతనే అన్ని సంభవిస్తున్నాయి. ఆత్మగుణైః సూక్ష్మైః అనగా సూక్ష్మములైన ఆత్మగుణములతో. ఇచ్చట ఆత్మ యంటే మనస్సు. అంతఃకరణము. ఆత్మగుణములు అంటే మనస్సుయొక్క గుణములు రాగద్వేషాది గుణములు అని అర్థము. అవి సూక్ష్మమైనవి. ఆత్మ రాగ ద్వేషాది గుణములు అని అర్థము అవి సూక్ష్మమైనవి. ఆత్మ రాగద్వే షాది గుణములతో సంయోగమౌతుంది.

పరమేశ్వరుడు (ఆత్మ) ఈవిధంగా ఓకటితో, రెండింటితో, మూడింటి తో, ఎనిమిదింటితో, కాలంతో అంతఃకరణ గుణముల తోతత్త్వం వెంట తత్త్వంతో సంయోగమై, వానిలో ప్రవేశించినప్పటికి అతడు అసంగుడు, నిర్లిప్తుడు కేవలం సాక్షీస్వరూపుడు అని తెలిసికొనవలెను.

అసక్తం సర్వభృత్ చైవ—గీత
ఆత్మ ఏ సంబంధము లేనిదయ్యును అన్నిటిని ధరించియున్నది.

---

ఆరభ్య కర్మాణి గుణాన్వితాని
భావాంశ్చ సర్వాన్ వినియోజయేద్ యః ।
తేషామభావే కృతకర్మ నాశః
కర్మక్షయే యాతి స తత్త్వతో౽న్యః ॥ 4 ॥

టీక: ఆరభ్య = ప్రారంభించి కర్మాణి = సృష్టిని; గుణాన్వితాని = గుణములతో కూడిన; భావాన్ = ప్రాణులను: చ = మరియు; సర్వాన్ = అన్ని; వినియోజయేత్ = ఆజ్ఞాపించునో; యః = ఎవడు; తేషాం = వాని యొక్క; అభావే = లేమియందు: కృతకర్మ నాశః = చేయబడిన కర్మలను

నాశమొనరించును: కర్మక్షయే = కర్మనాశమొందిన తరువాత; యాతి = ఉం డును; సః = అతడు; తత్త్వతః = తన సారరూపములో; తన తత్త్వభావ ములో; అన్యః = మరొకడు, ఇతరము

భావము: పరమేశ్వరుడు త్రిగుణములతో కూడిన సృష్టిని ప్రారం భించి. సకల ప్రాణికోటిని ఆజ్ఞాపించును. గుణములు లేనపుడు అతడు కర్మనాశనమును కలుగచేసి. అవిధ్వంసము తదుపరి తనసార రూపమున అతడు వేరై యుండును.

వివరణము: ఆరభ్య కర్మాణి గుణాన్వితాని. పరమేశ్వరుడు గుణ ములతోగూడిన కర్మలను (సృష్టి) ఆరంభించి గుణములు త్రిగుణములు అవి సత్త్వము. రజస్సు. తమస్సు ఈ మూడు గుణములతోగూడిన సృష్టిని భగవానుడు ప్రారంభించి ప్రకృతి త్రిగుణములలో కూడియుంటుంది. కర్మలు సైతము సాత్త్విక. రాజసిక. తామసిక కర్మలుగ ఉండును. భగ వంతుడు త్రిగుణాత్మకమయిన సృష్టిని ప్రారంభించి దానికి కదలిక కలుగ జేయును.

"భావాంశ్చ సర్వాన్ వినియోజయేత్ యః ఎవడు సకల ప్రాణికోటిని ఆజ్ఞాపించునో. పరమేశ్వరుడు త్రిగుణాత్మకమైన సృష్టిని గావించి. అంద లి సకల ప్రాణులను ఆజ్ఞాపించును. అక్షరమైన పరమాత్మయొక్క ఆనతి వలననే ఈ విశ్వము సక్రమముగ నడచుచున్నది.

తేషాం అభావే కృతకర్మనాశః ఆగుణములు లేనపుడు అతడు కర్మ నాశమును గావించును. త్రిగుణాతీతులైన మహాత్ములు సకల కర్మబంధ ములనుండి ముక్తులగుదురు

"కర్మక్షయే యాతి స తత్త్వతోఽన్యః" కర్మలు నాశమొందిన పిదప అతడు తన సారరూపమున వేరై యుండును. గుణసామ్య అవస్థలో త్రిగుణ ములు నిశ్చల స్థితిలో నుండును. ఈ నిశ్చలస్థితికి భంగము కలిగినపుడు, అనగా విషమావస్థయందు సృష్టికలుగుతుంది. భగవానుడు తాను ఈ సృష్టిని మొన ర్చినను ఆ సృష్టికార్యముచే అతడు లిప్తుడు కాడు. అతడు సర్వదా సాక్షి స్వరూపుడు.

"కర్మక్షయే యాతి స తత్త్వతోఽన్యః." కర్మలు నాశమొందిన పిదప అతడు తన పరమార్థ దివ్య స్వరూపమున వేరైయుండును. పరమేశ్వర అర్పణంగా చేసిన కర్మలు మానవుని బంధింపవు. అవి అతనికి హృదయ శుద్ధి కలుగజేస్తాయి. అందువల్ల ఈశ్వరార్పణ బుద్ధితో కర్మలొనరించువాడు అవిద్యా తత్కార్యములనుండి తానుభిన్నుమని తెలిసికొనును. మరియు అతడు తాను సాక్షాత్ బ్రహ్మము అని తెలిసికొనును. 'అన్యః' అనుటకు బదులు 'అన్యద్' అని మనం పాఠాంతరం గ్రహిస్తే అప్పుడు అర్థం ఇలా ఉంటుంది; "అతడు ప్రకృతి యొక్క తత్త్వములన్నింటిని భిన్నమైయుండు బ్రహ్మమును చేరును. అనగా అతడు బ్రహ్మమువలె నగును." "కర్మక్షయే" అనగా అవిద్యా నాశమైనపుడు. అవిద్య నశించినచో మానవుడు చేసిన కర్మలు ఇక ఉండవు. మానవు డొనరించిన కర్మలు నాశనమైనపుడు జీవాత్మ తత్త్వతః వేరైన దానివల్ల. అంటే అవిద్యా తత్కార్యములనుండి అతడు భిన్నమైన దానివల్ల సంసారమునుండి ముక్తుడౌతాడు.

మానవునకు కర్మక్షయం ఎప్పుడు కలుగుతుంది? అతనికి మోక్షం ఎప్పుడు లభ్యమౌతుంది? మానవుడు కర్మక్షయానికై సాధన చేయాలి అతడు 1. గురూపదేశం పొందాలి. 2. అతనికి భగవద్భక్తి యుండాలి. 3 అతనికి భగవద్భక్తియంత గురుభక్తి కూడా ఉండాలి. 4 అతడు శ్రవణ మనన, నిధిధ్యాసనముల ను అభ్యసించాలి. 5. అతడు యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధియను అంగములుగల అష్టాంగ యోగమును అభ్యసింపవలయును. 6 అతడు కాలము... యోగ అభ్యాసమున గడుపవలయును. 7 అతడు సద్గుణములను అలవరచుకొనవలయును. 8. దుర్గుణములను తొలగించుకొనవలయును. ఈ పై అభ్యాసములవల్ల సాధకుడు కర్మలను విడనాడిన పిదప "తత్" "త్వం" సంయోగముచే అతడు అవిద్యనుండి ముక్తుడౌతాడు అప్పుడతడు మోక్షమును పొందుతాడు.



ఆదిః స సంయోగనిమిత్తహేతుః
పరః త్రికాలాదకలోఽపి దృష్టః ।
తం విశ్వరూపం భవభూతమీడ్యం
దేవం స్వచిత్తస్థముపాస్య పూర్వమ్ ॥ 5 ॥

టీక: ఆదిః = మొదలు. అన్నిటికి కారణము; సః = అతడు; సంయోగ నిమిత్త హేతుః = సంయోగమునకు కారణము. శరీర సంయోగమునకు నిమిత్తభూతమైన అవిద్యాజనిత కర్మలకు కారణము; పరః త్రికాలాత్ = కాలముయొక్క త్రిభాగముల అతీతము, భూత భవిష్యత్‌వర్తమాన కాలములకు అతీతము: అకలః = భాగములులేని, అఖండమైన: అపి = కూడ; దృష్టః = చూడబడును; తం = అతనిని; విశ్వరూపం = విశ్వముగ కనబడుచున్న వానిని; భవభూతం = అన్ని ప్రాణులకు అసలు కారణమైన వానిని; ఈడ్యం = వందనీయమైన వానిని; దేవం = ఆ భగవంతుని; స్వచిత్తస్థం = స్వీయ హృదయములో ఆసీనుడైయున్న వానిని; ఉపాస్య = ధ్యానించి; పూర్వమ్ = మునుపు, ఇంతకు ముందు.

భావము: అతడు ఆత్మ శరీరముల సంయోగమునకు నిమిత్తభూతమైన అవిద్యాజనిత కర్మలకు మూలకారణము; అతడు భూత భవిష్యత్ వర్తమాన కాలత్రయమునకు తీతుడు; అతడు నిష్కలుడు కూడ. అతడు ఈ విశ్వముగ కనబడును, అతడు అన్ని ప్రాణులకు అసలైన కారణము. ఆరాధనీయుడైన ఆ భగవంతుని, హృదయ సీమయందు ఆసీనుడైయున్న ఆ దేవుని ఎవడు ఇతఃపూర్వమే ధ్యానించునో అతడు తన హృదయమున ఆ పరమేశ్వరుని దర్శించును.

వివరణము: "ఆదిః సః సంయోగ నిమిత్తహేతుః," అతడు అన్నింటికి కారణము శరీర ఆత్మల కలయికకు కారణమైన అవిద్యకు హేతువైన వాడు. అతని అనుగ్రహమువలననే అవిద్య అంతమొందుతుంది.

తేషాం ఏవ అనుకంపార్థం అహం అజ్ఞానజం తమః ।
నాశయామి ఆత్మభావస్థ జ్ఞానదీపేన భాస్వత ॥ —గీతా

వారియందుగల కేవలము కరుణవలననే, నేను, వారి ఆత్మయందు నివసించుచు ప్రకాశించుచున్న జ్ఞానదీపముతో అజ్ఞాన జనిత తమస్సును నాశమొనర్తును.

"పరః త్రికాలాత్ అకలః అపి దృష్టః" అతడు మూడు కాలములకు అతీతుడు. అతడు ఈ విశ్వముగ కనబడును. భూతకాలము, వర్తమానకాలము, భవిష్యత్కాలము అనునవి మూడు కాలములు. ఆ పరమేశ్వరుడు ఈ త్రికాలములకు అతీతుడు. అతడు నిష్కలుడు, భాగములులేనివాడు. అవిభాజ్యుడు భగవంతునిలో భాగాలు అంశాలు ఉంటే అతడు వినాశం పొందుతాడు. అతడు అఖండం. అతడు అకలుడేగాక అకాలుడు గూడ అతడు కాలములేనివాడు, అతడు కాలత్రయ పరిచ్ఛిన్నుడుకాడు అతడు అకలుడు కావునఅతనికి వినాశము లేదు, అతనిని యిట్లు ధ్యానించువారు అమృతత్త్వమును పడయుదురు. ఆ పరమేశ్వరుడు విశ్వముగ కనిపించును తం విశ్వాని రూపాణి అస్యేతి విశ్వరూపమ్. ఆ భగవానుడు ఈ ప్రపంచంగా కనబడుతాడు

యస్మాత్ అర్వాక్ సంవత్సరః అహోభిః పరివర్తతే ।
తద్ దేవా జ్యోతిషాం జ్యోతిః ఆయుః హోపాసతే అమృతమ్ ॥

—బృహదారణ్యక ఉపనిషత్తు.

ఏ భగవంతుని పాదపద్మల క్రింద సంవత్సరములు రోజులుగ దొర్లుచుండినో ఆదేవునిదేవతలువెలుగులకువెలుగుగ, ఆయువుగ, అమృతముగ ఉపాసిస్తారు.

"తం విశ్వరూపం భవభూతం ఈడ్యం." అతడు ఈజగత్తుగ కనబడును, అతడు అన్ని ప్రాణులను అసలైన కారణము అతడు ఆరాధనీయుడు. "తం విశ్వాని రూపాణి అస్యేతి విశ్వరూపం." ఆ భగవానుడు ఈ ప్రపంచంగా కనబడుతాడు. అతడు అన్నిజీవులకు మూలకారణమైన వాడు. అతడు సకల జీవరాశులకు ఆరాధనీయుడు. ఈ ప్రపంచం భగవంతుని వ్యక్తస్వరూపం (Manifestation of the Lord). అది విరాట్పురుషుని దేహం. ఆ పరమేశ్వరుడు సర్వులకు ఆరాధ్యుడు, ఉపాస్యుడు, పూర్వము అతనిని ఉపాసించియున్నట్టి ముముక్షువు బ్రహ్మజ్ఞానమును పడయును. భక్తి జ్ఞానంలో అంతమొందుతుంది, పరాభక్తి, జ్ఞానము ఒక్కటే

"దేవం స్వచిత్తస్థం ఉపాస్య పూర్వమ్". ఇతః పూర్వమే తన హృదయమున ఆసీనుడైయున్న పరమేశ్వరుని ధ్యానించునట్టి ముముక్షువు తన హృదయమున ఆ పరమేశ్వరుని దర్శించును. పరమాత్మ సర్వభూతాంతరాత్మ. అమృతాత్మ ప్రతి వ్యక్తి హృదయంలో ఉంది. పరమాత్మ సకల జీవుల అంతరాత్మ. ఆతడు అంతర్నియామకుడు, అంతర్యామి. "అహం బ్రహ్మాస్మి, నేను బ్రహ్మమును", అను జ్ఞానం ఉదయించే దానికి పూర్వం సాధకుడు ఉపాసన చేయాలి, ధ్యానించాలి. చిత్తమును ఏకాగ్రత నొందించాలి, అప్పుడు భగవంతుని దర్శనం ప్రాప్తిస్తుంది. ఆ భగవంతుని తన హృదయముననే దర్శిస్తాడు

గురు చరణాంబుజ నిర్భర భక్తః
సంసారాత్ అచిరాత్ భవ ముక్తః ।
సేంద్రియమానస నియమాదేవం
ద్రక్ష్యసి నిజహృదయస్థం దేవం॥
— మోహ ముద్గర.

గురు భగవానుని పాదసరోరుహములయెడ పరమ భక్తితో నీవు సంసారమునుండి సత్వరముగ విడుదల పొందుము. మనస్సును, ఇంద్రియములను నిగ్రహించి, గురుదేవుని అనుగ్రహముతో, నీవు నీ హృదయముననే పరమేశ్వరుని దర్శింతువు.

---

స వృక్షకాలాకృతిభిః పరోఽన్యో
యస్మాత్ ప్రపంచః పరివర్తతేఽయం ।
ధర్మావహం పాపనుదం భగేశం
జ్ఞాత్వాత్మస్థమమృతం విశ్వధామ ॥ 6 ॥

టీక : సః = ఆతడు; వృక్ష కాల ఆకృతిభిః పరః = సంసార వృక్షమునకు, కాలమునకు, రూపమునకు అతీతుడు; అన్యః = వానికంటె వేరైనవాడు; యస్మాత్ = ఎవనినుండి; ప్రపంచః = ప్రపంచము, విశ్వము; పరివర్తతే = బయలుదేరునో; అయం = ఈ; ధర్మావహం = సకల సద్గుణము

లకు ఉద్గమస్థానమును; పాపనుదం = సర్వ పాపములను నాశ మొనర్చువానిని; భగేశం = సకల సల్లక్షణములకు ప్రభువును; జ్ఞాత్వా = తెలిసికొని; ఆత్మస్థం = తన హృదయమందే ఆసీనుడై యున్నవానిని; అమృతం = అమృతుడైన వానిని; విశ్వధామ = విశ్వమునకు నివాసమైన వానిని.

భావము : ఎవనినుండి ఈ ప్రపంచము బయలుదేరినదో అతడు సంసార వృక్షము, కాలము, రూపము — వీనికంటె పరుడు మరియు అన్యుడు అతడు సకల సద్గుణములకు ఉద్గమస్థానము, సర్వపాపనాశకుడు, సకల సల్లక్షణములకు ప్రభువు. అతనిని నీ హృదయమున ఆసీనుడై యున్న పరమాత్మ గను. యావద్ విశ్వమునకు అమృత నివాసముగ - తెలిసికొనుము.

వివరణము : "సః వృక్ష కాల ఆకృతిభిః పరః" అతడు సంసార వృక్షాని కంటె, కాలానికంటె, రూపాలకంటె ఉత్కృష్టుడు. అతడు వాటి కంటే వేరైనవాడు, అతడు అంతరాత్మ. పరమాత్మ. అతడు అన్నిటికీ పరుడు, అతడు అన్నిటికంటే ఉత్కృష్టుడు, అతడు అన్నిటికీ అన్యుడు, అతడు అన్నింటికంటే వేరైనవాడు

"విశ్వవృక్షం" సంసార వృక్షం. ఈ సంసార వృక్షము మాయా వృక్షము. కఠోపనిషత్తులోను, శ్రీ మద్భగవద్గీతలోను సంసార వృక్షం వర్ణింపబడింది సంసారాన్ని వృక్షంగా వర్ణించారు, చెట్టును గొడ్డలితో, ఖడ్గంతో నరికివేయవచ్చు. అలాగే ఈ సంసార వృక్షాన్ని ఆత్మజ్ఞాన కరవాలంతో, అసంగ పరశువుతో ఛేదించవచ్చు బ్రహ్మము సంసార వృక్షానికి ఉద్గమస్థానం. ఈ చెట్టుకు జీవరసం బ్రహ్మమునుండి వస్తుంది. అజ్ఞాన (అవిద్య) బీజం ద్వారా అది అభివృద్ధి చెందుతుంది. కార్యబ్రహ్మము దాని మొలక. జీవకోటి సూక్ష్మ శరీరాలన్నీ దాని కాండం. విశ్వవృక్షం అవ్యక్తంనుండి స్థావర పదార్థంవరకు వ్యాప్తి చెందుతుంది సంసార వృక్షానికి మూలం బ్రహ్మములో ఉంటుంది. బ్రహ్మమునుండియే విశ్వం బయలుదేరుతుంది. (యస్మాత్ ప్రపంచః పరివర్తతేఽయం). ముముక్షువు పరమేశ్వరుని తన ఆత్మయందు సాక్షాత్కరించుకొనునపుడు పరమేశ్వరుడు ఈ విధంగా దర్శింపబడుచున్నాడు.

భగవంతుడు "కాలానికి కర్త". అతడు కాలానికి ప్రభువు. అతడు త్రికాలములకు అతీతుడు. అతడు నిత్యుడు కాలం అనేది మాయ. ఆ మాయ పరమేశ్వరుడు అధీనంలో ఉంటుంది.

'ఆకారాలు', రూపాలు రంగుల భేదాలు మాత్రమే. అవి సత్యాలు కావు. ఈ విశ్వంలో కనబడే రూపాలన్నిటికంటె భగవంతుడు పరుడు. అతడు వాటికి అన్యుడు కూడ.

విశ్వవృక్షానికి, కాలానికి, రూపాలకునిత్యత్వం లేదు. వాటికి ఆధారం, ఆలంబనం, అధిష్ఠానం, భగవంతుడే నామ రూపకాల గుణ క్రియలలో వైవిధ్యం కనిపిస్తుంది. కాని వీటన్నింటికి వెనుక ఉండే మార్పులేని పదార్థం భగవంతుడు.

"యస్మాత్ ప్రపంచః పరివర్తతేఽయం" ఈ విశ్వం అతనినుండి బయలుదేరుచున్నది. ఈ విశ్వం గిర్రున భ్రమిస్తోంది. ఇది సృష్టి, స్థితి, లయముల ప్రవాహంలో చక్రీయంగా భ్రమిస్తూంది. సృష్టినుండి స్థితికి, స్థితినుండి సంహారానికి, మరల సంహారాన్నుండి సృష్టి. ఈ విశ్వచక్రం భ్రమణం చేస్తూంటుంది.

హేతునా అనేన కౌంతేయ జగత్ విపరివర్తతే —గీతా
అర్జునా, నా అధ్యక్షతన ఈ ప్రపంచం భ్రమిస్తుంది. ఈ విశ్వంపై పరమేశ్వరుడు ప్రభువై అధ్యక్షత వహిస్తాడు ఈ సచరాచర జగత్తు, వ్యక్తావ్యక్త స్వరూపాలు తిరుగుతూంటాయి.

"ధర్మావహం" అతడు సకల ధర్మములకు యోని. అతడు ధర్మసంస్థాపకుడు ధర్మం అంటే ఏమిటి? మానవునకు మోక్షప్రాప్తికి తోడ్పడేదంతా ధర్మము. మానవుడు ఆత్మజ్ఞానం పొందేందుకు సాయపడేదిధర్మం, మానవుని అధమస్థితినుండి ఉన్నత పరచేది ధర్మం, రక్షించి ధరించేది ధర్మం. ధర్మ సంస్థాపకుడైన భగవంతుని తెలుసుకొన్నవారు ఐహిక ఫలముకాన్న అనల్ప మోక్షపదం పొందుతారు.

"పాపనుదం" అతడు పాపహరుడు. భగవంతుడు పాపమనెడి తూలరాశి పాలిటి అగ్నివంటివాడు. వెలుతురుముందు చీకటి అదృశ్యమైనట్లు

భగవంతుని సమక్షంలో పాపం పూర్తిగా మటుమాయమౌతుంది. పాపులు సునిశ్చయ బుద్ధితో భగవంతుని పూజిస్తే వారు వెంటనే ధర్మాత్ములు. పుణ్యాత్ములు, సాధుసంగవులు ఔతారు. భగవన్నామంయొక్క శక్తి అటువంటిది. ఎన్ని వ్రతాలు ఆచరించినా. ఎన్ని కర్మానుష్టానాలు గావించినా పాపంపూర్తిగా నాశం కాదు. కాని ఆత్మజ్ఞానంతో పాపం తృటిలో అంతమొందుతుంది. నారాయణుడు సర్వకిల్బిషరహితుడు. అతని ధ్యానం పాపహరం.

"భగేశం" అతడు ఐశ్వర్యములకు. విభూతులకు అధిపతి. పరమేశ్వరునిలో జ్ఞానం ఐశ్వర్యం. బలం, శక్తి, వీర్యం. తేజస్సు సదా అలరారుతూంటాయి అందువల్ల అతడు సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు,సర్వవ్యాపి. అతడు ఈవిధంగా ధ్యానించి. తెలుసుకొనునతడు మోక్షమును పడయుడు.

జ్ఞాత్వా ఆత్మస్థం అమృతం విశ్వధామ, ఆపరమేశ్వరుని సర్వహృదయాంతర్వాసియనియు, విశ్వములకు అన్నింటికి అమృతమయ ధామమనియు తెలుసుకొనవలెను. అమృతుడైన భగవానుడు ధ్యాత హృదయంలోనే యున్నాడు. భగవంతునకు మార్పులేదు. అతడు అవిక్రియుడు. అతడు అమృతుడు అమరణధర్మంగలవాడు, అతడు విశ్వానికి ఆధారభూతుడు. అతనిని తెలిసికొనుటయే మన జీవిత లక్ష్యము. భగవంతుని తెలిసికొన్నవాడు ఈసృష్టి తత్త్వముల కంటె, పృథివ్యాది తత్త్వములకంటె భిన్నమైన ఫలమును, అనగా నిశ్శ్రేయస్సును పొందును.

మనము అటువంటి పరమేశ్వరుని సాక్షాత్కరించుకొందముగాక యని తరువాతి మంత్రంలో ఋషి ప్రవచిస్తాడు,

---

తం ఈశ్వరాణాం పరమం మహేశ్వరం
తం దేవతానాం పరమం చ దైవతమ్ ।
పతిం పతీనాం పరమం పరస్తాత్
విదామ దేవం భువనేశమీడ్యమ్ ॥ 7 ॥

టీక: తం = ఆతనిని; ఈశ్వరాణాం = ప్రభువులకు; పరమం = సర్వోత్కృష్టుడైన; మహేశ్వరం = గొప్ప ప్రభువును; తం = ఆతనిని; దేవతానాం = దేవతలకు; పరమం = మహోత్కృష్టుడైన; చ = మరియు; దైవతం = దేవతయైన వానిని; పతిం = ప్రభువైనవానిని; పతీనాం = ప్రభువులకు; పరమం = పరమమైన; పరస్తాత్ = అతీతుని; విదామ = తెలిసికొందముగాక: దేవం = ప్రభువును, దేవుని. భగవంతుని: భువనేశం = ప్రపంచపాలకుని: ఈడ్యం = ఆరాధ్యుని. పూజనీయుని. స్తవనీయుని.

భావము: ప్రభువులకు మహాప్రభువైన వానిని, పరాత్పరుని, దేవతలకు మహాదేవతయైన వానిని, పాలకులకు మహాపాలకుడైనవానిని, అన్నింటికి అతీతుడైనవానిని, ఆరాధనీయుడైన జగత్పతిని, భగవంతుని మనము తెలిసికొందముగాక.

వివరణము: "తం ఈశ్వరాణాం పరమం మహేశ్వరం." ఈశ్వరాదులకే మహేశ్వరుడైన ఆ పరాత్పరుని (మనము తెలిసికొందము గాక) భగవంతుడు సర్వోత్కృష్టుడు. అతడు ప్రభువులకు ప్రభువు. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, వైవస్వతుడు, యముడు మున్నగువారు ప్రభువులు. భగవంతుడు వీరందరికి పరమ మహేశ్వరుడు.

"తం దేవతానాం పరమం చ దైవతం." దేవతలకు పరమ దేవతయగు ఆతనిని (మనము తెలిసికొందము గాక). ఇంద్రుడు, అగ్ని వాయువు, వరుణుడు మున్నగువారు దేవతలు. ఈ దేవతలందరు మిగుల, భయ, భక్తులతో భగవంతుని సేవింతురు.

"పతిం పతీనాం పరమం పరస్తాత్." పాలకులకు పరమ పాలకుడు, అతీతుడు అయిన వానిని (మనము తెలిసికొందము గాక). పరమేశ్వరుడు పాలకులకు పాలకుడు. కశ్యపుడు, హిరణ్యగర్భుడు మున్నగువారు పాలకులు. వారు ప్రజాపతులు. వారు పరమేశ్వరుని యాజ్ఞలను భక్తి, శ్రద్ధలతో నిర్వర్తించెదరు.

"పరస్తాత్ అనగా అతీతుని. భగవంతుడు మాయావృక్షానికి అతీతుడు. మాయావృక్షాన్ని, లేక సంసారవృక్షాన్ని క్షరము అంటారు. సంసారవృక్షానికి

నికి బీజమైన దానిని అక్షరం అంటారు. భగవంతుడు క్షరానికి, అక్షరానికి అతీతుడు. అతడు క్షరమునకంటె పరమమైనవాడు కావున శాస్త్రములు అతనిని పురుషోత్తముడని వర్ణించాయి.

"విదామ దేవం భువనేశం ఈడ్యం". భగవంతుని, సకలలోక పాలకుని, ఆరాధనీయుని మనము తెలిసికొందముగాక, పరమేశ్వరుడు సకల భువనములకు భర్త. అతడు ఆరాధనీయుడు అతడు స్తవనీయుడు. అతడు పరంజ్యోతి అటువంటి పరమ ప్రభువును మనము తెలుసుకొందముగాక. ఈ లోకమున మనము జన్మించినది ఆ పరమేశ్వరుని సాక్షాత్కారము చేసికొనుటకే. అతని దివ్య వైభవము వర్ణనాతీతము

న తస్య కార్యం కరణం చ విద్యతే
న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే ।
పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే
స్వాభావికీ జ్ఞానబలక్రియా చ ॥ 8 ॥

టీక: న = లేదు; తస్య = అతనియొక్క; కార్యం = effect, కార్యము, ఫలితము; కరణం = organ, అవయవము; చ = మరియు; విద్యతే = ఉన్నది, కలదు, కనబడును; న = లేదు; తత్ సమః = అతనికి సముడు, అతనితో సమానమైనవాడు; చ = మరియు; దృశ్యతే = కనబడును, ఉన్నది; పరాస్య శక్తిః అస్య; పరాశక్తిః = అతనియొక్క మహాశక్తి; వివిధా = అనేక రకములైన; ఏవ = మాత్రమే; శ్రూయతే = ప్రకటింపబడినది, ప్రవచింపబడినది; స్వాభావికీ = సహజమైన; జ్ఞాన బల క్రియా = జ్ఞానము, బలము, పని; చ = మరియు.

భావము: అతనికికార్యము (effect) గాని, కరణము (organ) గాని కనబడదు. అతనితో సమానుడుగాని, అతనికంటె అధికుడుగాని కనబడడు, అతనియొక్క మహాశక్తి వివిధముగ ఉన్నదనియు, అతనియొక్క జ్ఞానము, బలము, క్రియలు అతనికి నైసర్గికము లనియు (వేదములలో) ప్రవచింపబడినది

వివరణము: "న తస్య కార్యం కరణం చ విద్యతే." అతనికి కార్యముగాని, కరణముగాని కనబడదు, చక్షురాది అవయవములను కరణము లంటారు, అవయవములతో శరీరం ఏర్పడుతుంది. అందువల్ల శరీరం కార్య మౌతుంది, పరమేశ్వరునకు శరీరంలేదు. అవయవాలులేవు. అతనికి స్థూల శరీరం కాని, సూక్ష్మ శరీరంకాని కారణ శరీరంకాని లేవు. ఆత్మ నిరవయ వము. ఆత్మకు అవయములు లేవు. అందువల్ల ఆత్మ అవినాశి. అవయవములు కారణము. దేహము కార్యము. ఆత్మ నిరవయవము, అశరీరము కావున దాని కారణము, కార్యము లేవు. కాన పరమాత్మ (పరమేశ్వరుడు) కారణరహితుడు, కార్యరహితుడు. అతడు అన్నింటికి పరమకారణము.

"న తత్ సమః చ అభ్యధికః చ దృశ్యతే." అతనితో సాటివాడు గాని, అతనిని మించినవాడుగాని కనపడదు. పరమేశ్వరునితో సాటివాన్ని గురించి మనము వినలేదు. ఇక అతనిని మించిన వానిని చూడలేము, విన లేము. పరమేశ్వరుడు అద్వితీయుడు, అనంతుడు. అద్వితీయుడు గావున రెండవవాడు ఉండడు. అతడు అనంతుడు. రెండు అనంతము లుండుట అసంభవము. అందువల్ల పరమేశ్వరుడు ఏకైక సత్యము. అతడు నానాత్వ మునందు. వెలయుచున్న ఏకైక సత్యము, అద్వైత వస్తువు. మార్పునొందు చున్న వైవిధ్యమునందు వెలయు నిత్యైకత్వము అతడు (He is the eternal unity in the changing diversity.) శ్రీ కృష్ణ భగవానుని అర్జు నుడు ఇలా స్తుతిస్తాడు;

> పితాసి లోకస్య చరాచరస్య
>
> త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్ ।
>
> న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో
>
> లోకత్రయేఽ ప్యప్రతిమప్రభావ ॥
>
> —గీత

నీవు ఈ సచరాచర జగత్తునకు తండ్రివి. నీవు ఈ ప్రపంచముచే పూజింప తగినవాడవు. నీవు పరమ గురువు. ఏలన, నీతో సమానమైనవాడులేడు;

అట్టియెడ ఈ ముల్లోకములలో సాటిలేని ప్రభావముగల ఓ భగవన్. నీకంటె అధికుడెట్లుండగలడు?

"పరా అస్య శక్తిః వివిధైవ శ్రూయతే". అతనియొక్క మహాశక్తిని వేదములలో వివిధ రకములుగ వర్ణించియున్నారు. వేదము పరమేశ్వరుని ప్రభావములను వేనోళ్ళ వర్ణించుటకు యత్నించినది. పరమేశ్వరుని ప్రభావములు శక్తులు వర్ణింపనలవికావు. "నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప —గీతా

ఓ అర్జున. నా దివ్య విభూతులకు (దివ్య మహిమలకు) అంతములేదు. పరమేశ్వరుని దివ్యమహిమలను సంపూర్ణంగా వర్ణించడం ఎవరికిని సాధ్యమైన విషయంకాదు, అతని శక్తులకు హద్దులేదు. పరిమితి లేదు. అతని శక్తులతో పోలిస్తే అతన్ని గురించి వర్ణింపగలిగినది శూన్యమే ఔతుంది.

"స్వాభావికీ జ్ఞాన బల క్రియా చ" అతనికి జ్ఞానము, బలము, క్రియలు నైసర్గికములు, పరమేశ్వరునకు జ్ఞానక్రియ నైజము అలాగే బలక్రియ కూడ అతనికి సహజము; సర్వవిషయజ్ఞాన ప్రవృత్తిని జ్ఞానక్రియ అంటారు. తన సన్నిధిమాత్రం చేత అన్నిటిని వశపరచుకొని నియమించడాన్ని బలక్రియ అంటారు. ఈ బలక్రియ. జ్ఞానక్రియ పరమేశ్వరునకు స్వతస్సిద్ధములు,

భగవంతుని గొప్ప తనము తరువాతి మంత్రమున నైతము వర్ణింపబడుచున్నది.

---

న తస్య కశ్చిత్ పతిరస్తి లోకే
న చేశితా నైవ చ తస్య లింగమ్ ।
స కారణం కరణాధిపాధిపో
న చాస్య కశ్చిత్ జనితా న చాధిపః ॥ 9 ॥

టీక; న = లేదు; తస్య = అతనియొక్క; కశ్చిత్ = ఎవరుగాని; పతిః = ప్రభువు, యజమాని; అస్తి = ఉండు, ఉన్నాడు; లోకే = ఈ ప్రపం

చమున; న = లేదు; చ = మరియు: ఈశితా = పాలకుడు;న = లేదు: ఏవ = మాత్రము; చ = మరియు; తస్య = అతనియొక్క: లింగం = గుర్తు; సః = అతడు; కారణం = కారణము; హేతువు; కరణాధిపాధిపః = కరణ అధిప అధిపః = ఇంద్రియాధిపతులకు అధిపతి; న = లేదు; చ = మరియు; అస్య = అతనియొక్క; కశ్చిత్ జనితా = ఏ జనకుడును; న = లేదు; చ = మరియు: అధిపః = ప్రభువు.

ఈ ప్రపంచములో అతనికి ఏ యజమానియు లేదు. అతనిని పాలించువాడు ఎవడును లేడు. (మనము అతనిని అనుమాన ప్రమాణముద్వారా తెలిసికొనుటకు) అతనికి ఏగుర్తు లేదు. అతడు అన్నింటికి కారణము. అతడు ఇంద్రియాధిపతులకు ప్రభువు. అతనికి ఏ జనకుడును లేడు అతనికి ప్రభువు ఎవడును లేడు.

వివరణము: "న తస్య కశ్చిత్ పతిః అస్తి లోకే" ఈ లోకమున అతనికి ఏ యజమానియులేడు. పతిః అనగా పతి, యజమాని. పరమేశ్వరుడు పతులకు పతి. స్వాములకు స్వామి. యజమానులకు యజమాని. అతడు అందరకు గతి. అతడు అందరికి పతి. అతడు లోకనాథుడు. విశ్వనాథుడు. జగతీపతి. అందువల్ల అతన్ని నియమించేవాడంటూ ఎవడూ లేడు.

"న చ ఈశితా న ఏవ చ తస్య లింగమ్". అతనికి పాలకుడుగాని, గుర్తుగాని లేదు. ఈశితా అనగా పాలకుడు, అతన్ని నియమించేవాడు, అతనిపై నియంత ఎవడో లేరు. అతడు సర్వశక్తిమంతుడు. అంతటిని నియమించేవాడు, శాసించేవాడు అతడే. లింగం అనగా గుర్తు. ధూమమును చూచి అగ్ని ఉన్నదని అనుమానింపవచ్చు. అనుమానం ఒక ప్రమాణం. లింగం అనగా చిహ్నము, పరమేశ్వరుడు ధూమాది చిహ్నరూపుడు కాదు కూడ. మనం ఏదో ఒక గుర్తుచే పరమేశ్వరుణ్ణి అనుమానింపగలిగితే ఇక వేదములకు అతనిని ప్రకాశింపజేయ వలసిన అవసరం ఉండి ఉండేది కాదు. అతడు తర్కానికి, వాదానికి, న్యాయానికి. హేతువుకు అతీతుడు. పరమేశ్వరుని ఉనుకవమ ప్రదర్శింపలేము. జ్ఞాన చక్షువు ద్వారా (బ్రహ్మాకారవృత్తి వల్ల) సమాధిలో అతన్ని దర్శింపగలం.

సః కారణం కరణ అధిప అధిపః. అతడు అన్నింటికి మూలకారణము అతడు ఇంద్రియాధిపతులకు ప్రభువు. "స కారణం సర్వస్యకారణం అతడు కారణము. అతడు సర్వమునకు కారణము. అతడు స్వయంభువు, ఆత్మభవుడు. అతడు సర్వమునకు యోని. అతడు ఆది కారణము, అతడు కారణరహిత కారణము. He is the causeless cause. అతడు పరమ కారణము. "కరణాధిపః" అనగా ఇంద్రియములకు అధిపతి. కరణాధిపాధిపః అనగా కరణాధిపులకు అధిపతి కరణం అనగా ఇంద్రియము ఇంద్రియములకు అధిపది జీవాత్మ, అతడు జీవాత్మలకు అధిపతి. అతడుజీవాత్మలకు పాలకుడు, అందువల్ల అతడు పరమేశ్వరుడు.

"న చ అస్య కశ్చిత్ జనితా న చ అధిపః" అతనికి జనకుడ్డుగాని అతనిని ఏలు ప్రభువుగాని లేదు. జనితా అనగా జనకుడు. అధిపః అనగా అధిపుడు. అతడు జీవాత్మలకు అధిపుడైన కారణంచేత, అతడు పరమేశ్వరుడైనందువలన, అతడు లింగాతీతుడగుటవలన, అతడు అవర్ణనీయుడైనందువలన అతనికి జనకుడు లేడు. అతడు అన్నిటికి మూలకారణం, కావున అతనికి జనకుడెట్లుండగలడు? అతడుఅంతరికి జనకుడు. అతడు జగతఃపిత అతడే అందరికి ప్రభువు.

పరమేశ్వరుడు ఇటువంటివాడు కావున మనం అతని పాదపద్మముల క్రింద రక్షణ పొందాలి.

---

యస్తూర్ణనాభ ఇవ తంతుభిః
ప్రధానజైః స్వభావజః ।
దేవ ఏకః స్వమావృణోతి
స నో దధాతు బ్రహ్మాప్యయమ్ ॥ 10 ॥

టీక: యః = ఎవడు; తు = నిజముగ; ఊర్ణనాభః = తంతునాభః, సాలెపురుగు; ఇవ = వలె; తంతుభిః = దారములతో; ప్రధానజైః = ప్రకృతినుండి పుట్టినవానిద్వారా; స్వభావజః = స్వభావతః; అయత్నకృతముగ, స్వాభావికముగ; దేవః = భగవంతుడు; ఏకః = ఒక; స్వం = తనను; ఆవృణోతి =

ఆచ్ఛాదించును, కప్పును, ఆవృతమొనర్చును; సః = అతడు; నః = మాకు; దధాతు = దయసేయుగాక, అనుగ్రహించుగాక; బ్రహ్మాప్యయమ్ = బ్రహ్మముతో అభేదత్వమును, బ్రహ్మలీనతను, బ్రహ్మతో ఏకీ భావమును.

భావము: సాలె పురుగు (తన నాభినుండి లాగబడిన దారములతో) తన్ను తాను ఆవృతము చేసికొను విధమున ఆ ఏకైక పరమేశ్వరుడు సహజముగ ప్రకృతి వికారములతో తాను ఆవృతుడగును. ఆ పరమేశ్వరుడు మాకు బ్రహ్మముతో అభేదత్వమును దయసేయుగాక.

వివరణము: ఊర్ణనాభము, ఊర్ణనాభి, తంతునాభము, తంతువాయము సాలె పురుగు, సాలీడు, లూత — ఇవి పర్యాయపదములు సాలీడు తన బొడ్డు నుంచి వచ్చే దారంతో అది తన్ను తాను కప్పుకొంటుంది. అది దానికి నైజం. అద్వితీయుడైన పరమేశ్వరుడు నైజంగా ప్రకృతి జనితాలతో ఆవృతుడౌతాడు. అతడు మాయావృతుడౌతాడు. అందువల్లనే అతడు అందరికి దృశ్యుడు కాడు.

"అజ్ఞానేన ఆవృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః"..గీతా జ్ఞానం అజ్ఞానంచేత కప్పబడియుంది అందువల్ల దానిచే మానవులు మోహితులగుచున్నారు, భగవానుడు మాయచేత కప్పబడియున్నాడు, కావున మనము అతని గాంచలేము సాలె పురుగు తనలోనుండి ఉత్పన్నమైన దారములతో తన్ను తాను ఆవృతము చేసికొంటుంది. ఆ విధముగనే పరమేశ్వరుడు ప్రకృతి యుత్పత్తులతో, అనగా అవ్యక్తమునుండి జనించిన తంతురూపమైన నామ రూప, క్రియా గుణములతో తన్ను తాను ఆచ్ఛాదమొనర్చుకొనును. అటువంటి సర్వశక్తిమంతుడైన, మాయావియైన పరాత్పరుడు మాకు బ్రహ్మాప్యయమును (బ్రహ్మలీనతను) దయసేయుగాక అతడు మాకు బ్రహ్మతో అభేదత్వమును అనుగ్రహించుగాక! మేము బ్రహ్మముతో లయమొందుదుము గాక

---

ఏకో దేవః సర్వభూతేషు గూఢః
సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా ।

కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః
సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ ॥ 11 ॥

టీక; ఏకః = అద్వితీయః, ఒక్కడు; దేవః = ద్యోతనస్వభావః, దేవుడు, భగవంతుడు; సర్వభూతేషు = సర్వ ప్రాణిషు, అన్ని ప్రాణుల యందు; గూఢః = సంవృతః, దాగియున్న: సర్వవ్యాపీ = అన్నిటిని వ్యాపించును; సర్వభూతాంతరాత్మా = స్వరూపభూత, అన్ని ప్రాణులయొక్క అంతరాత్మ; కర్మాధ్యక్షః = సర్వ ప్రాణికృత విచిత్ర కర్మ అధిష్ఠాతా, సకల కర్మలపై అధ్యక్షతవహించును: సర్వభూతాధివాసః - సర్వ ప్రాణేషు వసతి. అతనిలో ప్రాణులు నివసించును; సాక్షీ = సర్వద్రష్టా, సాక్షి; చేతా = శుద్ధ చైతన్యము; కేవలః = ఉపాధి శూన్యము ఏకమాత్రుడు; నిర్గుణః = సత్త్వాదిగుణరహితః, గుణరహితుడు: చ = మరియు.

భావము: భగవంతుడు ఒక్కడే. అతడు అన్ని ప్రాణులలో దాగియున్నాడు. అతడు అన్నిటిని వ్యాపించును. అతడు అన్ని ప్రాణుల అంతరాత్మ, అతడు సకల కర్మలపై అధ్యక్షత వహించును. సర్వ ప్రాణులు అతనిలో వసించును. అతడు సాక్షి. అతడు శుద్ధ చైతన్యము. అతడు కేవలుడు. అతడు నిర్గుణుడు.

వివరణము: "ఏకో దేవః సర్వభూతేషు గూఢః. దేవుడుఒక్కడే. అతడు అన్ని ప్రాణులలో దాగియున్నాడు, పరమేశ్వరుడు అనంతుడు. రెండు అనంతాలు ఉండేందుకు వీల్లేదు అందువల్ల పరమేశ్వరుడు ఒక్కడే. God is one only. అతడు అన్ని ప్రాణులలో దాగియున్నాడు? అతడు ఏలాదాగియున్నాడు! కొయ్యలోని నిప్పులాగా, పాలలో వెన్నలాగా, ఒతిలోని తైలంలాగా, భూగర్భ స్రోతస్సులలోని నీటిలాగా అతడు అన్ని ప్రాణులలో దాగియున్నాడు. అతడు అంతర్యామి, సర్వవ్యాపి,

"సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా" అతడు అన్నిటిని వ్యాపించును. అతడు అన్ని ప్రాణులయొక్క అంతరాత్మ, అతడు పరిపూర్ణుడు గావున సర్వవ్యాపి. అతడు అన్నిట నిండియున్నాడు గావున సర్వవ్యాపి. అతడుఅన్ని భూతములందు దాగియుండుటచే, అన్ని భూతములను వ్యాపించియుండుటచే

అన్ని భూతములయొక్క అంతరాత్మ యగుచున్నాడు.

"కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః" అతడు సమస్త కర్మలపై అధ్యక్షత వహించును. సమస్త ప్రాణులొనర్చు విభిన్న కర్మలకు అతడు అధిష్ఠాత అతని అధ్యక్షతన సచరాచర జగత్తు నడచుచున్నది. సకలజీవులు అతనియందు వసించును. సకల ప్రాణులకు అతడు నివాసస్థానము. అతడు ఆశ్రితులకు పరమ రక్షణ.

"సాక్షీ చేతా కేవలః నిర్గుణశ్చ" అతడు సమస్త ప్రాణికోటి కర్మలకు సాక్షి అతడు సర్వద్రష్ట. అతడు అన్నిటిని చూచుచుండును. అతని కేవల వీక్షణ వలననే ప్రకృతి సర్వసృష్టికార్యమును నిర్వర్తించును. "చేతా" అనగా శుద్ధ చైతన్యము. అతడు చేతయితా. అతడు చేతనత్వమును ప్రసాదించును. పరమేశ్వరుడు చిన్మయుడు, చిద్ఘనుడు. అతడు జ్ఞానరాశి, అతడు కేవలుడు. అతడు నిరుపాధికుడు అతడు ఉపాధిశూన్యుడు అతడు అన్ని ఉపాధులకు అధిష్ఠానం. అతడు ఏకమాత్రుడు. అతడు అద్వితీయుడు. అతడు ఏకైక సత్యము. "ఏకమేవాఽద్వితీయః" అతడు ఒక్కడే. అతడు అద్వితీయుడు He is one without a second. అతడునిర్గుణుడు అతడు త్రిగుణ రహితుడు, సత్త్వము. రజస్సు. తమస్సు అనేవి త్రిగుణాలు. (సత్త్వం = శుచిత్వం. మంచితనం పొందిక. సమరసం; రజస్సు = చేష్ట. పని. కామం; తమస్సు = తిమిరము చీకటి. ఆలస్యము. సోమరితనం) నిర్గుణుడు అంటే సత్త్వాది గుణరహితుడు. మాయ త్రిగుణాత్మకము. పరమేశ్వరుడు మాయాతీతుడు.

---

ఏకో వశీ నిష్క్రియాణాం బహూనాం
ఏకం బీజం బహుధా యః కరోతి ।
తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరాః
తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్ ॥ 12 ॥

టీక: ఏకః = ఒక్క; వశీ = ప్రభువు, స్వతంత్రుడు; నిష్క్రియాణాం = క్రియారహితమైన; బహూనాం = అనేకములైన; ఏకం = ఒక్క; బీజం = విత్తనమును; బహుధా = బహువిధములుగ, యః = ఎవడు; కరోతి = చేయును; తం = అతనిని; ఆత్మసం = తన ఆత్మయందు నివసించుచున్నవానిని; యః = ఎవరు; అనుపశ్యంతి = చూతురు; ధీరాః = ప్రజ్ఞావంతులు; తేషాం = వారికి; సుఖం = ఆనందము; శాశ్వతం = నిత్యమైన; న = లేదు; ఇతరేషామ్ = ఇతరులకు.

భావము: అతడు బహుళములైన నిష్క్రియ జీవులకు ఏకైక నియామకుడు. అతడు ఒక్క బీజము (అవ్యక్తము) ను నానాత్వము నొందించును. తమ ఆత్మయందే అతనిని (పరమాత్మను) దర్శించు ప్రాజ్ఞులకు మాత్రము నిత్యానందము దక్కును; తదితరులకు కాదు.

వివరణము: "ఏకో వశీ నిష్క్రియాణాం బహూనాం (జీవానాం). అనేకములైన క్రియారహిత జీవులను నియమించు ఏకైక స్వామి అతడు ఏకః వశీ అనగా అతడు ఏకైక నియామకుడు వశీ అనగా స్వతంత్రుడు ఈ ప్రపంచమంతయు అతని వశమునందున్నది. అతడు సర్వులకు ప్రభువు అతడు పరమేశ్వరుడు అతడు సర్వవ్యాపి, అతడు సర్వగతుడు. అతని సమానుడుగాని; అతనికంటె అధికుడుగాని లేడు, అతడు ఇంద్రియాలను, మనస్సును, జీవాత్మలను విగ్రహిస్తాడు.

"నిష్క్రియాణాం బహూనాం జీవానాం" బహుళమైన నిష్క్రియమైన జీవరాశులను అతడు తన వశమునందుంచుకొనును. అతడు స్వతంత్రుడు. జీవరాశులు తమ కరణములతో పనులుచేయును. కరణములు అనగా ఇంద్రియములు. జీవరాశుల చేష్టలచే నిష్క్రియుడును, సాక్షీ మాత్రుడునుఅయిన పరమాత్మ ప్రభావితుడు కాడు. అతడు సర్వదా అవిక్రియుడు. అతడు ప్రకృతి యొనరించు పనులను కేవలము వీక్షించుచుండును. ప్రకృతియే అంతయు చేయును.

"ఏకం బీజం బహుధా యః కరోతి" అతడు ఒక్క బీజమును అనే

కములగునట్లు చేయును. అవ్యక్తము అనునది బీజము. మూలప్రకృతియే బీజము దానినుండి సర్వము ఉత్పన్నమగుచున్నది. ఆత్మ వాస్తవములో నిష్క్రియము. సత్వాదిగుణరహితము. కూటస్థము అయినప్పటికిని దాని యందు అనాత్మ ధర్మములను ఆరోపించుటచే అభిమానము జనించుటచే కర్త. భోక్త. సుఖి. దుఃఖి. కృశుడు. స్థూలుడు. మనుమడు. అతడు నా పుత్రుడు. ఈమె నా పత్ని మొదలగునవి ఉదయించుచున్నవి.

"తం ఆత్మస్థం యః అనుపశ్యంతి ధీరాః తేషాం సుఖం శాశ్వతం న ఇతరేషామ్." హృదయాకాశమున ఆసీనుడైయున్న అతనిని ఏధీరులు ప్రత్యక్షముగ తెలిసికొందురో వారికి శాశ్వత సుఖము ప్రాప్తించును. విషయాసక్తులకు లభ్యముకాదు. తం ఆత్మస్థం తన ఆత్మయందు స్థితుడై యున్నవానిని. ఆత్మస్థం అనగా బుద్ధౌ స్థితం అనగా బుద్ధియందు ఆసీనుడై యున్న వానిని· పరమేశ్వరుడు హృదయాకాశమున ఆసీనుడైయున్నాడు. యః అనుపశ్యంతి అనగా ఎవరు దర్శింతురో. యః సాక్షాత్ జానంతి అనగా ఎవరు ప్రత్యక్షమున తెలిసికొందురో. పరమాత్మను సాక్షాత్కరించుకొను విజ్ఞులైన ధీరులకే నిత్యానందం కలుగును. ధీరాః అనగా ధీరులు బుద్ధిమంతులు. ప్రాజ్ఞులు· ధీరులు పరమాత్మను తమఆత్మయందు దర్శించి. శాశ్వత సుఖమును పద యుదురు. బాహ్య విషయములలో నిమగ్నులైన విషయాసక్తులు. వివేకహీనులు ఈ ఆత్మానందమును పొందలేరు. ఈ ఆత్మ వారికి అవిద్యచే కప్పబడి నదగును

ఆనందం ఎవరికి ప్రాప్తిస్తుంది? ఆనందం విషయ వస్తువులలో లేదు. ఆనందం ఆత్మలోనే ఉంది. ఆత్మవిదులకే ఆనందం ప్రాప్తిస్తుంది. అనాత్మవిదులకు ఆనందంలేదు. భగవంతుడు సచ్చిదానందుడు. భగవత్ప్రాప్తి కలిగితే మనకు నిత్యత్వం. జ్ఞానం. ఆనందం కలుగుతాయి. ప్రపంచం దుఃఖాలయం. అందలి వస్తువులవల్ల దుఃఖమే కలుగుతుంది. శ్రీ త్యాగరాజస్వామి వారు ఇలా గానం చేస్తారు రామభక్తి సామ్రాజ్యము ఏ మానవులకు అబ్బెనో మనసా ఆ మానవులకు అత్యంతానందము.

11. 12 మంత్రాలు మనకిచ్చే సందేశం ఇది. Peace can be had only in Atma. if you cannot find it there you can find

it now here శాంతి పరమేశ్వరునియందే (ఆత్మలోనే) లభ్యమౌతుంది. భగవంతునిలో నీవు శాంతిని పొందలేకపోతే మరియంకెక్కడను నీకు శాంతి లభ్యం కాదు

---

నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానాం
ఏకో బహూనాం యో విదధాతి కామాన్ ।
తత్కారణం సాంఖ్యయోగాదిగమ్యం
జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః ॥ 13 ॥

టీక: నిత్యః = నిత్యుడు; నిత్యానాం = నిత్యులలో; చేతనః = చేతనము, తెలివి: చేతనానాం = చేతనములందు. బుద్ధి ప్రకర్షణములందు; ఏకః = ఒక్కడు; బహూనాం = అనేకులలో; యః = ఎవరు: విదధాతి = ప్రసాదించును; అనుగ్రహించును: కామాన్ = కోరికలను; తత్కారణం = ఆకారణమును, సాంఖ్య యోగాది గమ్యం = తత్త్వముద్వారా, యోగశిక్షణద్వారా అవగతముచేసికొనదగినది;జ్ఞాత్వా = తెలిసికొని; దేవం = భగవంతుని;ముచ్యతే = ముక్తుడగును: సర్వపాశైః = అన్ని బంధములనుండి. అన్ని శృంఖముల నుండి

భావము; అతడు నిత్యులలో పరమ నిత్యుడు; బుద్ధిమంతులలో అత్యంత బుద్ధిమంతుడు. ఆతడు ఒక్కడై యుండియు పలువురి కోరికలను అనుగ్రహించును. అన్నిటికి కారణమైనటువంటి అతడు సాంఖ్యము (తత్త్వజ్ఞానము) చేతను, యోగము (మత శిక్షణ)చేతను అవగతముచేసికొనబడును. అతనిని తెలిసికొన్నవారు సర్వశృంఖలములనుండి ముక్తులగుదురు

వివరణము: "నిత్యః నిత్యానాం చేతనః చేతనానామ్". అతడు నిత్యులలో నిత్యుడు, బుద్ధిమంతులలో బుద్ధిమంతుడు, అతడు అజుడు. నిత్యుడు. శాశ్వతడు, పురాణుడు, దేహము వధింపబడునపుడు అతడు వధింపబడడు, అన్ని ప్రాణులు ఆరు భావములకు గురియగుచున్నవి —గీతా అస్తిత్వము, పుట్టువు, పెరుగుదల, మార్పు, క్షయము, నాశము అనునవి ఆరు

భావములు. పరమేశ్వరునకు ఈ షడ్భావ వికారములు లేవు. కొందరు తత్త్వజ్ఞానులు, పామరులు పంచభూతములను (పృథ్వి, అప్పు, తేజస్సు వాయువు, ఆకాశము) నిత్యములుగ చెప్పుదురు. కాని, వాస్తవములో బ్రహ్మ మొక్కటియే నిత్యవస్తువు. "చేతనః చేతనానాం" బుద్ధిమంతులలో బుద్ధి మంతుడు. చంద్రుడు స్వయంప్రకాశకుడు కాడు. చంద్రుడు సూర్యునినుండి కాంతిని గ్రహించి వెలుగుతాడు. చంద్రుడు తన వెలుగునకు సూర్యునిపై ఆధారపడుతాడు. అలాగే ఇంద్రియాలు, మనస్సు, బుద్ధిచేతనములుకావు. అవి చేతనములుగ కనబడుతాయి. అవి బ్రహ్మమునుండి తమ చేతనత్వా న్ని పొందుతాయి. అవి తమ చేతనత్వమునకు బ్రహ్మముపై ఆధారపడుతాయి. అందువల్ల వాస్తవములో బ్రహ్మమే మహాచేతనము అని చెప్పవచ్చును.

భూతానామస్మి చేతనా — గీత

ప్రాణులయందలి చైతన్యమును నేనే.

"ఏకః బహూనాం యః విదధాతి కామాన్" అతడు ఏకమై యున్నప్ప టికి అనేకుల కోర్కెలను అనుగ్రహించును. పరమేశ్వరుడు సర్వజ్ఞుడు. అనంతుడు, అద్వితీయుడు. జీవులొనర్చిన కర్మలకు ఫలములు తెలిసిన వాడు పరమేశ్వరుడొక్కడే. పరమేశ్వరుడు సకల జీవాత్మల కర్మఫలము లను పంచిపెడుతాడు. దేవతలుగా, మానవులుగా, పశువులుగా, కీటకములు గా, పక్షులుగా వివిధ పరిణామ దశలలో నున్న అసంఖ్యాక జీవరాశులకు కర్మ ఫలాలను పరమేశ్వరుడొక్కడే పంచిపెడుతాడు. అతడు సర్వజ్ఞుడు, సర్వ శక్తిమంతుడు. సర్వవ్యాపి కావున ఈ పని (కర్మఫలాలను పంచిపెట్టడం) అతనికొకనికే సాధ్యమౌతుంది. కోరికలవల్ల జీవుడు కర్మలు చేస్తాడు. ఆ కోరికల కర్మల ఫలాలను అనుభవించడానికి జీవులకు పునర్జన్మలు దాపురిస్తా యి ఆవిశ్వేశుడే అద్భుతమైన కర్మఫల ప్రదాత.

"తత్కారణం సాంఖ్యయోగాధిగమ్యం, అతడు అన్నిటికి కారణము. అతడు సాంఖ్యముచేతను, యోగముచేతను తెలిసికొనబడుతాడు. భగవంతు డు అన్నింటికి మూలకారణము. ఈ యావత్సృష్టికి అతడు చలనమూలము (Primum mobile), అతన్ని సాక్షాత్కరించుకొంటే, అతన్ని తెలుసుకొంటే

అవిద్య, అజ్ఞానం అంతమొందుతాయి. అతన్ని తెలిసికోవడానికి సాంఖ్యము యోగము సాధనాలు. సాంఖ్య మంటే తత్త్వజ్ఞానం (Philosophy).యోగ మంటే మత సంబంధ శిక్షణ (religious training). సాధకుడు ప్రథమంలో ఉపనిషత్తులను పఠించి, పరబ్రహ్మమునుగూర్చి పరోక్ష జ్ఞానం పొందాలి. అతడు యమమును, నియమమును అభ్యసించాలి. అతడు ఇంద్రియాల్ని మనస్సును అదుపులో ఉంచాలి. తదుపరి అతడు నిరంతరం సక్రమ ధ్యానాన్ని ఆచరించాలి. ధ్యానంద్వారా ప్రత్యక్షమైన బ్రహ్మ సందర్శనం పడయాలి. అప్పుడే అతడు సర్వ బంధాలనుండి విమోచనం పొందుతాడు.

జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః భగవంతుని తెలిసకొని అతడు అన్ని బంధములనుండి ముక్తుడగును. భగవంతుడు జ్యోతిర్మయుడు అతడు జ్ఞానదీపం. ఆ భగవంతుని సాక్షాత్కరించుకోవడమే జీవిత గమ్యం. పరమేశ్వరుని తెలిసికొనుటచే అన్ని బంధములు తొలగును. అవిద్య, కామము, కర్మ అనునవి బంధములు. ఈ బంధములు నాశమైనప్పుడే మోక్షము సాధ్యమగును. జ్యోతిర్మయుడైన భగవానుని దర్శనము అవిద్య, కామము, కర్మలు అనెడి తిమిరమును పూర్తిగ నశింపచేయును.

---

న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం
నేమా విద్యుతో భాంతి కుతో ఒయమగ్నిః ।
తమేవ భాంతమనుభాతి సర్వం
తస్య భాసా సర్వమిదం విభాతి ॥ 14 ॥

టీక: న = లేదు; తత్ర = అక్కడ; సూర్యః = సూర్యుడు;భాతి = ప్రకాశించును; న = లేదు; చంద్రతారకం = చంద్రుడు; నక్షత్రములు; న = లేదు; ఇమా = ఈ: విద్యుతః = మెరుపులు; భాంతి = ప్రకాశించును; కుతః = ఎక్కడ; అయం = ఈ; అగ్నిః = తమ్ = అతనిని; ఏవ = మాత్రమే: భాంతం = వెలుగుచు; అనుభాతి = ప్రకాశించును; సర్వం = సమస్తము; తస్య = అతనియొక్క; భాసా = కాంతిచే; సర్వం = అంతయు;

ఇదం = ఇది; విభాతి = ప్రకాశించును.

భావము: అచ్చట సూర్యుడు ప్రకాశింపడు, చంద్ర తారకములు వెలుగొందవు. అచ్చట ఈ మెరపులు ప్రకాశింపవు. అట్టియెడ ఈ యగ్ని ఏమి వెలుగొందును? అతడు ప్రకాశించినప్పుడు మాత్రమే సమస్తము అతని వెంట ప్రకాశించును. అతని కాంతిచే ఇదంతయు ప్రకాశించును.

వివరణము: "న తత్ర సూర్యః భాతి న చంద్రతారకం," అచ్చట సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు ప్రకాశింపవు.

"యత్ ధామ వైష్ణవం పదం గత్వా ప్రాప్య న నివర్తంతే యత్ చ సూర్యాదిభిః న భాసయతే తత్ ధామ పదం పరమం మమ విష్ణోః" ఏ నివాసమునకు పోయి, ఎవడు తిరిగిరాడో: ఏ నివాసమును సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, మెరపు, అగ్ని ప్రకాశింప జేయజాలవో అది అత్యుత్తమమైన విష్ణుపదము

బ్రహ్మము వెలుగులకు వెలుగు. అని ఈ మంత్రములో వివరింపబడినది. సూర్యుడు బ్రహ్మమును ప్రకాశపరచలేడు. బ్రహ్మము యొక్క ప్రకాశ ప్రభావముచే సూర్య, చంద్ర, నక్షత్రాదులు వెలుగొందుచున్నవి. సూర్యాదులు బ్రహ్మమును ప్రకాశింప చేయలేవు. అంటే అవి బ్రహ్మమును వ్యక్తముచేయజాలవు. They cannot make Brahman manifest అగ్నిపైనుంచిన, లేదా ఎండలో ఉంచిన నీరు ఎలాగున అగ్నినుండి లేక సూర్యునినుండి ఉష్ణాన్ని గ్రహించిన రీతిగా సూర్యచంద్రులు తమకాంతిని బ్రహ్మమునుండి పొందుతారు. వాటికి బ్రహ్మమును ప్రకాశింపజేయడానికి నైజశక్తిలేదు ఆత్మకాంతితో సూర్యుడు జగత్తునంతా భాసిపంజేసాడు.

"న ఇమా విద్యుతః భాంతి కుతః అయం అగ్నిః". అతనిని ఈ మెరపు భాసింపచేయజాలదు, ఇక అగ్నిమాట చెప్పనేల? ఘటానికి భాసత్వం లేదు. అనగా కుండకు వస్తువుల్ని ప్రకాశింపజేసే శక్తిలేదు, అందువల్ల అది ఇతర వస్తువుల్ని ప్రకాశింపచేయజాలదు. స్వయం ప్రకాశకం కాని వస్తువు ఇతర వస్తువుల్ని ఎలా ప్రకాశింపజేస్తుంది? సూర్యునకు, చంద్రునకు అగ్నికి, మెరపునకు కాంతి యుంది. అందువల్ల అవి ఈ విశ్వంలోని

వస్తు జాలాన్ని ప్రకాశింప జేస్తాయి. బ్రహ్మము సూర్యుని. చంద్రుని. నక్షత్రాలను, విద్యుత్తును. అగ్నిని ప్రకాశింపజేస్తాను. బ్రహ్మము స్వయం ప్రకాశకము అతనిని బాహ్యకాంతితో, వేరొక కాంతితో అవసరములేదు ఈ మంత్రంలో బ్రహ్మముయొక్క నిరుపమ స్వయం ప్రకాశకత్వం నిరూపింపబడుతూంది. జ్వాజల్యమాన కాంతితో భాసించు సూర్యుడే బ్రహ్మమును ప్రకాశింపజేయజాలనపుడు ఇక తక్కువ ప్రకాశముగల నిప్పు మాట చెప్పనేల?

"తం ఏవ భాంతం అనుభాతి సర్వం." బ్రహ్మము ప్రకాశించినపుడు మాత్రమే ఈ సమస్తము అతని వెంట ప్రకాశించును.

"తస్య భాసా సర్వం ఇదం విభాతి." అతని కాంతిచే ఇదంతయు ప్రకాశించును. ఈ మంత్రంలో కాంతి యంటే జ్ఞానం. నేత్ర యొక జ్యోతి, కన్నుద్వారా మనకు ఈ ప్రపంచం గురించి జ్ఞానం కలుగుతూంది. కర్ణ మొక వెలుగు, మనం చెవులతో శబ్దాన్ని వింటాము. శబ్దం ద్వారా మనకు అర్థం, జ్ఞానం కలుగుతుంది, బుద్ధి సైతము ఒక వెలుగే. మనకు బుద్ధిద్వారా జ్ఞానం ప్రాప్తిస్తుంది. సర్వేంద్రియాలు, మనస్సు, బుద్ధి —ఇవి తమ శక్తిని జ్ఞానాన్ని బ్రహ్మమునుండియే పొందుతాయి.

బ్రహ్మము జ్ఞాన నిధి. బ్రహ్మముయొక్క కాంతి వల్లనే మనకు ఏజ్ఞానమైనా కలుగుతూన్నది పరబ్రహ్మ జ్యోతియే వస్తువులను భాసింపజేయుచున్నది. స్మృతిశక్తి, జ్ఞాపకశక్తి, గుర్తింపుశక్తి, ఎరుకశక్తి - ఇవి బ్రహ్మ ప్రకాశంలేకుండ మనకు ఉండజాలవు.

ఇదే మంత్రం కఠోపనిషత్తులో. ముండకోపనిషత్తులో. భగవద్గీతలో వస్తుంది.

---

ఏకో హంసో భువనస్యాస్య మధ్యే
స ఏవాగ్నిః సలిలే సంనివిష్టః ।
తమేవ విదిత్వా అతిమృత్యుమేతి
నాన్యః పంథా విద్యతేఽయనాయ ॥ 15 ॥

ఏకః = ఒక; హంసః = అజ్ఞాననాశకుడు, పరమాత్మ; భువనస్య = ఈ ప్రపంచముయొక్క, అస్య = ఈ; మధ్యే = నడుమ, మధ్యలో; సః = అతడు; ఏవ = మాత్రమే; అగ్నిః = అగ్ని; సలిలే = సలిలమందు, నీటియందు; సంనివిష్టః = ఉపవిష్టుడైన, ఆసీనుడైవ; తం = అతనిని; ఏవ = మాత్రమే; విదిత్వా = సాక్షాత్కరించుకొని, తెలిసికొని; అతి మృత్యుమ్ ఏతి = మృత్యుం అతి ఏతి = మృత్యుం అత్యేతి = మత్యువును దాటును; న = లేదు; అన్యః = మరొక; పంథా = పథము, మార్గము; విద్యతే = ఉన్నది; అయనాయ = విముక్తి కొరకు మోక్షమునకు.

భావము: ఈ విశ్వాంతరాళమున వెలయుచున్న అద్వితీయ హంసము అతడు. అతడే ఆపస్సునందు ఆసీనుడైయున్న అగ్ని. అతనిని తెలిసికొనుటవలననేనరుడు మృత్యువును అతిక్రమించును. విమోచనమునకు వేరొక మార్గము లేదు.

వివరణము: "ఏకః హంసః భువనస్య అస్య మధ్యే", ఈ త్రిలోకముల మధ్య స్థితుడైయున్న అద్వితీయ పరమాత్మ అతడు. ఏకః అనగా అద్వితీయుడు అనగా పరమాత్మ. హంసః అనగా హంస, ఆత్మ. హంతి అవిద్యాది బంధకారణం ఇతి హంసః. అవిద్యాది బంధకారణమును నాశమొనర్చుచున్నాడు కావున హంస యనిపిలువబడినాడు. హంస యనగా అజ్ఞానమును నాశముచేయువాడు. అతనిని తెలిసికొనుటచేతనే, సాక్షాత్కారం చేసుకోవడం వల్లనే అజ్ఞానం నాశమౌతుంది; మనల్ని కప్పిన అవిద్యా అనే తెర తొలగుతుంది. ఇదొకటే మార్గం. మోక్షానికి మరొక మార్గం లేదు. పరమాత్ముడు త్రిలోకముల మధ్య స్థితుడైయున్నాడు. అతడు తప్ప ఇంకొకరెవ్వరును లేరు. ఎందువల్ల మరొకరు లేరు. అతడు అగ్నికావున

"స ఏవ అగ్నిః సలిలే సన్నివిష్టః," అతడే ఆపస్సునందు ఆసీనుడైయున్న అగ్నిపరమాత్మ అతనిని అగ్నికి పోల్చారు, అతడు అవిద్యను. దాని కార్యములను దగ్ధమొనరిస్తాడు. "వ్యోమాతీతః అగ్నిః ఈశ్వరః (ఈశ్వరుడు ఆకాశాతీతమైన అగ్ని) అని స్తోత్రము పలుపబడినాడు. "అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహం ఆశ్రితః".—గీతా.

నేను వైశ్వానరాగ్నియై ప్రాణుల దేహమునందుండి...
ఆ పరమాత్మ దేహంలో అగ్ని రూపంలో ఉన్నాడు.

"సలిలే" అంటే నీటిలో. సలిలం అంటే దేహం. మన దేహంలో తొంబది శాతము నీరే కావున సలిలం అంటే దేహమనవచ్చు.

కర్మలు సలిలంతో చేయబడుతాయి. యజ్ఞ దానాలు, తర్పణాలు చేసే టప్పుడు మనం సలిలాన్ని (నీటిని) ఉపయోగిస్తాం. సలిలము అనగాకర్మలు అనిచెప్పవచ్చు. యజ్ఞదాన తపః కర్మలు సద్భావంతో చేయడం ద్వారా అంతఃకరణం శుద్ధియౌతుంది. సలిలే సన్నివిష్టః అనగా అటువంటి విమలీ కృతమైన, నిర్మలమైన అంతఃకరణంలో పరమాత్మ ఆసీనుడైయుంటాడు. వేదాంత వాక్యార్థముయొక్క అనుసంధానంవల్ల కలిగిన సమ్యగ్జ్ఞాన ఫల రూపముతో అవిద్యను, తత్కార్యములను ఆ పరమాత్మ దగ్ధం చేస్తాడు. అతడు అవిద్యను దగ్ధము చేసెడి పరమ పావనమైనఅగ్ని. అతడు జ్ఞానాగ్ని. ఆ అగ్ని సర్వకర్మల్ని బూదిచేస్తుంది

"తమ్ ఏవ విదిత్వా మృత్యుం అతి ఏతి" అతనిని తెలిసికొనట వలననే మానవుడు మృత్యువును దాటును. పూర్వఋషి ఋషులు ఆ పరమాత్మను పూజించి ముక్తినిపొందారు. అందువల్ల అతనిని తెలిసకొనుట వల్లనే నరుడు ముత్యువుబారినుండి దూరం కాగలడు.

"ఏకో హంసః అనే ఈమంత్రం పరమేశ్వరుని విభూతులను. సర్వ వ్యాపిత్వాన్ని ప్రవచిస్తుంది. అగ్నిఉదధిలో దాగియుంది. ప్రాచీన ఋషులు మహాసముద్రాంతర్గత వహ్నిని అర్చించారు అగ్నియంటే బ్రహ్మము. ఈ ప్రపంచమున దాగియున్న పరమాత్మ. సముద్రాంతర్గత వహ్ని (బ్రహ్మము) అగ్నినీటిలో ఉన్న విధముగా బ్రహ్మము ఈ ప్రపంచములో గూఢుడై యున్నాడు. నీరు నిప్పు ఒకదానికొకటి శత్రువులు, అయినప్పటికి నీటిలో నిప్పుఉంది. పరస్పర విరుద్ధగుణములు కలిగినవి ఒకదానిలో ఒకటి యుంది. బ్రహ్మము నిరంజనము. సూక్ష్మము. ఆధ్యాత్మికము. ఈ ప్రపంచం కలుషితం. స్థూలము, లౌకికం. నిప్పు నీటిలో దాగియున్న విధంగా బ్రహ్మము

ప్రపంచములో దాగియున్నాడు. "ఏకో దేవో సర్వ భూతేషు గూఢః," ఆ ఏకైక పరమాత్మ సకల ప్రాణికోటిలో దాగియున్నాడు.

స విశ్వకృద్ విశ్వవిదాత్మ యోనిః
జ్ఞః కాలకాలో గుణీ సర్వవిద్యః ।
ప్రధానక్షేత్రజ్ఞ పతిర్గుణేశః
సంసారమోక్షస్థితిబంధహేతుః ॥ 16 ॥

టీక: సః = అతడు; విశ్వకృత్ = విశ్వముయొక్క సృష్టికర్త; విశ్వవిత్ = విశ్వమును తెలుసుకొన్నవాడు; ఆత్మయోనిః = తనకు తానే కారణమైనవాడు; జ్ఞః = సర్వజ్ఞుడు. అంతయు తెలిసినవాడు: కాలకాలః = కాలమునకు కాలము. కాలనాశకుడు; గుణీ = సకల సద్గుణములు గలవాడు సర్వవిద్యః = సకలము వివరముగ. విశదముగ తెలిసినవాడు; ప్రధాన క్షేత్రజ్ఞ పతిః = ప్రకృతికి. మానవునకు పతి; గుణేశః = గుణములకు; ప్రభువు; సంసార మోక్ష స్థితి బంధ హేతుః = ప్రపంచము యొక్క విమోచనమునకు, అస్తిత్వమునకు, బంధమునకు కారణము.

భావము: అతడు విశ్వకర్త. విశ్వవేత్త. స్వయంభువు. అతడు సర్వజ్ఞుడు కాలనాశకుడు, అపహతపాప్మత్వాది గుణవంతుడు. సర్వవిద్యలకు ఆశ్రయుడు. అతడు ప్రకృతికి. నరునకు యజమాని. అతడు గుణములకు ప్రభువు. అతడు ప్రపంచముయొక్క విమోచనమునకు. అస్తిత్వమునకు. బంధమునకు హేతువు.

వివరణము; సః విశ్వకృత్ విశ్వవిత్ ఆత్మయోనిః అతడు విశ్వమునుసృష్టించినవాడు (విశ్వస్య కర్తా) అతడు విశ్వమును తెలిసినవాడు. అతడు విశ్వరహస్యమును తెలిసిన ప్రభువు. అతడు విశ్వకారణుడు అగుటచే అతడు విశ్వవిత్. అతడు స్వయంభువు. అతడు అభవుడు. అతని పుట్టుకకు ఎవరు కారణముకాదు. అతనికి అతడే కారణము. ఆత్మా చ అసౌ యోనిః చ ఇతి ఆత్మయోనిః అతడు ఆత్మ మరియు యోనియగుటచే ఆత్మయోనిః అని పిలువబడుచున్నాడు.

"జ్ఞః కాలకాలః గుణీ సర్వవిద్యః" అతడు తెలిసినవాడు కాలమునకు కాలుడు. గుణములు కలవాడు. అన్నింటిని విశదముగ తెలిసినవాడు. జానాతి ఇతి జ్ఞః తెలిసినవాడు కవున జ్ఞః అనబడుచున్నాడు. "సర్వస్య ఆత్మా సర్వస్య చ యోనిః సర్వజ్ఞః చైతన్య జ్యోతిః ఇతి అర్థః అందరియొక్క ఆత్మయు, అందరికి కారణమును అనుటవలన అతడు సర్వజ్ఞుడనియు చైతన్య స్వరూపుడనియు పరంజ్యోతి (జ్ఞానము) అనియు అర్థము. కాల కాలః అనగా కాలమునకు కాలుడు, కాలమునకు కర్త. అతడు దేశకాల కారణములకు అతీతుడు గుణీ అనగా గుణములు కలవాడు. అతడు అనంత కల్యాణగుణ సంపన్నుడు. అతడు సకలగుణాభిరాముడు. ఈ సుగుణ పరంపర అతనిలో సహజంగా ఉంటుంది. సాధకులు ఆ దివ్య గుణములను అలవర చుకొని అతన్ని చేరవలసియుండును భగవంతుడు విశ్వకృత్ అగుటచే అతడు విశ్వవిత్. అతనికి విశ్వరహస్యము కరతలామలకము. అతడు సర్వ విద్యః. అతనికి అన్నియు విశదముగ తెలియును.

"ప్రధాన క్షేత్రజ్ఞ పతిః గుణేశః అతడు ప్రకృతికి, నరునకు యజ మాని. గుణములకు ఈశుడు. ప్రధానం = అవ్యక్తం; క్షేత్రజ్ఞః = విజ్ఞానా త్మ. ప్రధానం అంటే అవ్యక్తం, మూల ప్రకృతి. క్షేత్రజ్ఞుడు అంటే విజ్ఞానాత్మ. జీవాత్మ. మానవుడు. పతిః అంటే పాలించువాడు. అతడు ప్రకృతిని, నరుని పాలిస్తాడు. గుణేశః అనగా గుణములకు ప్రభువు. సత్త్వము, రజస్సు తమస్సు అనునవి గుణములు. ఆ గుణములకు అతడు ప్రభువగుటచే గుణేశుడని పిలువబడుచున్నాడు. అతడు త్రిగుణాత్మక మయిన మాయను తన వశమునందుంచుకొనును.

"సంసార మోక్ష స్థితి బంధ హేతుః అతడు ఈ ప్రపంచముయొక్క మోక్షమునకు, అస్తిత్వమునకు, బంధమునకు కారణము. పరమేశ్వరుడు అన్నింటికీ పరమకారణము అతని అధ్యక్షతనే అన్నీ జరుగుతాయి.

---

స తన్మయో హ్యమృత ఈశసంస్థో
జ్ఞః సర్వగో భువనస్యాస్య గోప్తా ।

యఈశే అస్య జగతో నిత్యమేవ
నాన్యో హేతుర్విద్యత ఈశనాయ ॥ 17 ॥

టీక: సః = అతడు; తన్మయః = తనవలెనే; హి = నిశ్చయముగా అమృతః = అమృతుడు; ఈశసంస్థః = పాలకుని రూపములో నుండును; జ్ఞః = సర్వజ్ఞుడు, అన్నియు తెలిసినవాడు; సర్వగః = సర్వవ్యాపి; భువనస్య అస్య = ఈ ప్రపంచముయొక్క; గోప్తా = రక్షకుడు; యః = ఎవడు; ఈశే = పరిపాలకుడు; అస్య = ఈ; జగతః - ప్రపంచము యొక్క; నిత్యం ఏవ = నిత్యమైన; న అన్యః = వేరొకటి లేదు; హేతుః = కారణము; విద్యత = ఉన్నది; ఈశనాయ = దానిని పరిపాలించుటకు.

భావము : అతడు తన్మయుడు అమృతుడు. అతడు పరిపాలకుని రూపమున నెలకొనియుండును. అతడు సర్వజ్ఞుడు, సర్వవ్యాపి. సర్వజగద్రక్షకుడు అతడు ఈ ప్రపంచమునకు శాశ్వతుడైన పరిపాలకుడు. ఈజగత్తును శాసించుటకు మరియొక సమర్థుడు లేడు.

వివరణము : "సః తన్మయః హి అమృత ఈశసంస్థః". అతడు తన్మయుడు, అమృతుడు, పరిపాలకుని రూపములో స్థితుడైయుండును. "సః తన్మయః". అతడు తన్మయుడు. అతడు తనవలె నుండును. (He is like Himself) తన్మయుడనగా విశ్వమువలె నున్నవాడు. అనగా అతడు విశ్వాత్మ. "తస్య భాసా సర్వం ఇదం విభాతి". అతని కాంతివల్లనే ఇదంతా ప్రకాశిస్తుంది. ఈవిధంగా చెప్పబడియుండుటచే తన్మయుడు అంటే జ్యోతిర్మయుడు అని చెప్పవచ్చు 'అమృతః' అనగా మరణము లేనివాడు. అతడు అజుడయినందువలన అతనికి మరణము లేదు. అతడు మృత్యుభీతిని తొలగించే పరమాత్మ. అతడు అవినాశి. జనన మరణ వర్జితుడు. "ఈశ సంసః". అనగా అతడు పరిపాలకుని రూపమున స్థితుడై యుండును. జగత్ పాలకత్వం సర్వదా అతనిదే. అతడెప్పుడూ ఈశ్వర భావంలో సమ్యగ్ స్థితుడై యుంటాడు. అందువల్ల అతనిని ఈశసంస్థః అనడం సమంజసం.

"జ్ఞః సర్వగః భువనస్య అస్య గోప్తా". అతడు సర్వజ్ఞుడు, సర్వవ్యాపి, విశ్వ సంరక్షకుడు, 'జానాతీతి జ్ఞః. అతనికి సమస్తము తెలియును గాన

అతనిని జ్ఞః అంటారు. "సర్వగః" అనగా అంతటా గమించువాడు. "సర్వత్ర గచ్ఛతీతి సర్వగః". అనగా అతడు సర్వగతుడు, సర్వవ్యాపి. "భువనస్యాస్య" గోప్తా పాలయితా". అతడు చతుర్దశ భువనాలను పరిపాలిస్తాడు.

"యః ఈశః అస్య జగతః నిత్యం ఏవ" ఈ జగత్తునకు అతడు నిత్య పాలకుడు. అతడు ఈ లోకాన్ని శాసిస్తాడు. అతడు విశ్వనియంత. "య ఈశ ఈష్టే అస్య జగతః నిత్యం ఏవ నియమేన", ఈ జగతును నియమ ముతో అతడు శాసిస్తాడు. అతడు విశ్వ పాలకుడు జగద్రక్షకుడు.

"న అన్యః హేతుః విద్యత ఈశనాయ." ఈ విశ్వమును సమర్థవంత ముగ పాలించే మరొక పాలకుడు లేడు. "న అన్యః హేతుః సమర్థః విద్యత ఈశనాయ జగదీశ్వరాయ" పరమేశ్వరుడు బంధానికి, అస్తిత్వానికి విమోచ నానికి హేతువు. అతడు విశ్వనియంత, విశ్వపాలకుడు, విశ్వరక్షకుడు. ఆ కారణంచేత బ్రహ్మజిజ్ఞాసువులు, ముముక్షువులు అతనిని శరణుపొందాలి.

---

**యో బ్రహ్మాణం విదధాతి పూర్వం**
**యో వేదాంశ్చ ప్రహిణోతి తస్మై ।**
**తం హ దేవమాత్మబుద్ధిప్రకాశం**
**ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే ॥ 18 ॥**

టీక: యః = ఏవరు; బ్రహ్మాణం = బ్రహ్మను విదధాతి = సృష్టించెను; పూర్వం = సృష్టికి పూర్వము; యః = ఎవరు; వేదాన్ = వేదములను; చ = మరియు; ప్రహిణోతి = ఇచ్చెను; తస్మై = అతనికిః తం = అతనిని; హ = నిశ్చయార్థకము; దేవం = భగవంతుని; ఆత్మ బుద్ధి ప్రకాశం = ఎవని ప్రకాశము బుద్ధిని ఆత్మవైపునకు మరల్చునో; మముక్షుః = మోక్షమును కోరి: వై = నిశ్చయార్థకము; శరణం = ఆశ్రయము; అహం = నేను; ప్రపద్యే = గైకొందును

భావము: ఎవడు సృష్ట్యాదియందు హిరణ్యగర్భుని సృష్టించి. అతనికి వేదముల నొసెంగెనో; ఎవడు బుద్ధి ఆత్మవైపునకు మరలించునో; అతనిని (ఆ జ్యోతిర్మయుని), మోక్షమును వాంఛించి. నేను శరణు పొందుదుమగాక

వివరణము: "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం" ఎవడు సృష్టికి పూర్వము బ్రహ్మను సృష్టించెనో. పరబ్రహ్మము సృష్టికి పూర్వం బ్రహ్మను. సృష్టించెను. సృష్ట్యాదియందు (సర్గాదౌ) పరమేశ్వరుడు హిరణ్యగర్భుని సృజించెను. విశ్వ చైతన్యమే హిరణ్యగర్భుడు. హిరణ్యగర్భుని కార్యబ్రహ్మమనియు పిలుతురు. పరమేశ్వరుడు స్వప్రయోజన భావములేకుండ విశ్వసృష్టియొనర్చి. దానికి భద్రతచేకూర్చుటకై బ్రహ్మను సృజించెను.

"యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" ఎవడు వేదములను అతనికి (ఆ బ్రహ్మకు) ఒసంగెనో, పరమేశ్వరుడు బ్రహ్మకు వేదాలను ప్రసాదించెను. వేదములు జ్ఞానరాశి. ఆ వేదములను బ్రహ్మకు పరమేశ్వరుడొసంగెను. ఆ వేదములు పరబ్రహ్మమునుండి విసర్గతమైనవి. వేదములు రెండు ధర్మములను ప్రబోధించును. 1. ప్రవృత్తి ధర్మము. 2. నివృత్తి ధర్మము. ఈ రెండు ధర్మములు మానవుడు అభ్యుదయ, నిశ్శ్రేయస్సులను పొందుటలో అతనికి తోడ్పడుతాయి.

"తం హ దేవం ఆత్మబుద్ధిప్రకాశం" బుద్ధిని ఆత్మవైపు మరల్చు ఆ దేవుని, మానవుని జీవిత గమ్యం కైవల్య మోక్షం. జ్ఞానంవల్లనే మోక్షప్రాప్తి వీలౌతుంది. పరిశుద్ధ హృదయంతో భగవంతుని ధ్యానించడంవల్లనే జ్ఞానం కలుగుతుంది. మానవుని మనస్సు బహిర్ముఖ ప్రవృత్తి కలది. ఆ బుద్ధిని ఆత్మవైపు మరల్చడం మనం చేయవలసిన సాధన. భగవంతుని సర్వధర్మాన్ పరిత్యజ్య. అతనినే శరణు పొందినచో మనకు కైవల్యపదం సిద్ధిస్తుంది. భగవంతుని అనుగ్రహంవల్లనే మనకు వైరాగ్యం కలిగి మన బుద్ధి ఆత్మవైపు మరలుతుంది, కావున నేను,

"ముముక్షుః వై శరణం అహం ప్రపద్యే" మోక్షమును వాంఛించియే నేను ఆ జ్యోతిర్మయుని శరణు పొందుచున్నాను. పరమేశ్వరుని అల్పఫలాలను కోరి ఆశ్రయించరాదు. పరమేశ్వరుని అనల్పఫలమైన మోక్షాన్ని

ఈప్సించి. నేను అతనిని శరణు పొందుచున్నాను. స్వల్పఫలాలకై భగవంతుని ఆశ్రయించువారు దిక్కుమాలినవారు. "కృపణాః ఫలహేతవః.— గీతా. ఫలముల నుద్దేశించి కరలొనరించువారు కృపణులు. దౌర్భాగ్యులు. Wretched are they whose motive is the fruit.

---

నిష్కలం నిష్క్రియం శాంతం
నిరవద్యం నిరంజనమ్ ।
అమృతస్య పరం సేతుం
దగ్ధేంధనమివానలమ్ ॥ 19 ॥

టీక: నిష్కలం = భాగములు లేనిది; నిష్క్రియం = క్రియలు లేనిది; శాంతం = ప్రశాంతమైనది; నిరవద్యం = నిర్దుష్టమైనది, దోషరహితమైనది; నిరంజనమ్ = మచ్చలేనిది, నిష్కల్మషమైనది; అమృతస్య పరం సేతుం = అమృతత్త్వమునకు పరమ సేతువును; దగ్ధ ఇంధనం ఇవ అనలమ్ = ఇంధనమును దగ్ధమొనర్చు అగ్ని వలె

భావము: అంశరహితుని, క్రియారహితుని, ప్రశాంతుని, దోషరహితుని, నిరంజనుని, అమృతత్త్వమునకు పరమ సేతువును, ధుటధుటాయమానమైన అగ్ని సదృశుని (నేను శరణు పొందుచున్నాను)

వివరణము: "నిష్కలం నిష్క్రియం నిరవద్యం నిరంజనమ్", నిరవయవుని. కూటస్థుని, ప్రశాంతుని, దోషరహితుని, నిర్లిప్తుని. "కలా అవయనా నిర్గతా యస్మాత్ తం నిష్కలం నిరవయవం ఇత్యర్థం". ఎవని నుండి అవయవములు బయలువెడలునో అతడు నిష్కలుడు. అనగా అవయవరహితుడు, నిరవయవుడు. నిష్కలం అంటే నిరవయవం. "నిష్క్రియం స్వమహిమప్రతిష్ఠ కూటస్థం ఇత్యర్థః". అతడు తన దివ్యమహిమ యందు స్థితుడై యుండును. అనగా అతడు కూటస్థుడు. నిష్క్రియం అంటే కూటస్థం. "శాంతం ఉపసంహృత సర్వవికారమ్". అతనిలో సర్వ వికారములు అంతమొందుతాయి, అందువల్ల అతడు శాంతుడు. అతనిలో అన్ని తాపాలు శాంతిస్తాయి. అతనిలో భక్తులకు అఖండ శాంతి లభ్యమౌతుంది. అతడు

పరమ శాంతి స్వరూపుడు. "నిరవద్యం అగర్హణీయం. అతడు అనింద్యుడు, దోషరహితుడు, మచ్చలేనివాడు, పరిశుద్ధుడు, కల్మషరహితుడు. "నిరంజనం నిర్లేపం. నిరంజన మనగా నిర్లేపము, పరమేశ్వరుడు నిర్లిప్తుడు, అతడు దేనిచేతను లిప్తుడు గాడు.

"అమృతస్య పరం సేతుం దగ్ధ ఇంధనం ఇవ అనలం". అమృతత్వమునకు పరమ సేతువును, ఇంధనమును కాల్చివేసిన అగ్ని సదృశుని, అమృతత్వము అనగా మోక్షము. మోక్షప్రాప్తికి అతడు వారధివంటివాడు. సంసార మహోదధేః ఉత్తారణ ఉపాయత్వాత్ తమ్ అమృతస్య పరంసేతుం సంసార మహాసాగరమును దాటుటకు సాధనమగుటవలన పరమసేతువువంటి వానిని నేను శరణ పొందుచున్నాను. దగ్ధేంధన అనలమివ, దేదీప్యమానం ఝటఝటాయమానం. ఇంధనమును భస్మీభూత మొనర్చు అగ్ని వలె, దేదీప్యమానమైన వహ్నివలెనుండువానిని నేను శరణు పొందుచున్నాను. పరమేశ్వరుడు మహాతేజస్వి. అగ్ని ఇంధనాన్ని భస్మీపటలమొనర్చు పగిది భగవంతుడు తన భక్తుల అజ్ఞానాన్ని; ఆధ్యాత్మిక, సత్య పథంలో పయనించే ముముక్షువుల అవిద్యను నాశంచేస్తాడు.

నిష్కలుడును, నిష్క్రియుడును, ప్రశాంతుడును, నిరవద్యుడును, నిరంజనుడును, అమృతత్వసేతువును, అవిద్యా నాశకుడును అయిన పరమేశ్వరుని "శరణమహం ప్రపద్యే" (నేను శరణు పొందుచున్నాను).

---

యదా చర్మవదాకాశం
వేష్టయిష్యంతి మానవాః ।
తదా దేవమవిజ్ఞాయ
దుఃఖస్యాంతో భవిష్యతి ॥ 20 ॥

టీక: యదా = ఎప్పుడు; చర్మవత్ = చర్మమువలె; ఆకాశం = ఆకసమును; వేష్టయిష్యంతి = చుటివేయుదురు; మానవాః = మనుష్యులు;

తదా = అప్పుడు; దేవం = దేవుని;అవిజ్ఞాయ = తెలిసికొనకుండ; దుఃఖస్య = దుఃఖముయొక్క; అంతః = అంతము; భవిష్యతి = సంభవించును.

భావము: మానవులు ఆకసమును చర్మమువలె చుట్టివేయగలిగినపుడు మాత్రమే వారు పరమేశ్వరుని (మొట్టమొదట) తెలిసికొనకుండ తమ దుఃఖమును అంతమొందించుకొనగలరు.

వివరణము; "యదా చర్మవత్ ఆకాశం వేష్టయిష్యంతి మానవాః". ఎప్పుడు మానవులు ఆకసమును చర్మమును చుట్టినట్లు చుట్టివేయుదురో ఆకసమును చుట్టడం అసాధ్యంమైన విషయం అసాధ్యం సాధ్యమైనప్పుడే. అనగా మానవులు ఆకాశాన్ని చుట్టడం చేయగలిగినప్పుడే. వారు ప్రప్రథమంలో తమ హృతీమయందు భగవంతుని సాక్షాత్కరించుకొనకుండ, తమ దుఃఖాన్ని అంతమొందించు కొనగలరు. మానవుడు తన దుఃఖాన్ని,శోకాన్ని అంతమొందించుకోవాలంటే అతడు భగవంతుని సాక్షాత్కరించుకోవాలి. పరమేశ్వరుని సాక్షాత్కరించుకొన్నప్పుడు మానవుడు శోకాన్ని దాటగలడు.

"తదా దేవం అవిజ్ఞాయ దుఃఖస్య అంతః భవిష్యతి". అప్పుడు భగవంతుని తెలిసికొనకుండ దుఃఖము అంతమొందును,

భగవంతుని తెలిసికోకుండ, భగవద్దర్శనం కాకుండ దుఃఖం అంతం కావడం వీలుకాదు. భగవంతుని సాక్షాత్కారం అయిన మీదటనే మనకు దుఃఖనివృత్తి కలుగుతుంది భగవంతుని తెలిసికొనకుండ, ఎవడైనా దుఃఖవిమోచనం కోసం యత్నిస్తే అతని యత్నాలన్నీ వృథాయౌతాయి. అతని యత్నాలు ఆకాశాన్ని చుట్ట చుట్టినట్లే యౌతుంది.

దుఃఖానికి కారణమేమిటి? ఆ కారణాన్ని తొలగిస్తే దుఃఖం తొలగుతుంది. అంతేగాని దుఃఖ కారణాన్ని తొలగించే యత్నం తప్ప మరొక విధంగా యత్నిస్తే అది నీడవెంబడి పరుగౌతుంది. మనం ఎంత పరుగెత్తినా వస్తువును పట్టుకోలేము. సంసారంలో నిమగ్నుడైన మానవుని ఈ దుఃఖాలు అంటిపెట్టుకొనియుంటాయి. ఆత్మను తెలిసికోకుండ అజ్ఞానంలో ఉండే స్థితియే సంసారం. పరమాత్మ జ్ఞానంలేనివాడు ఈ సంసారసాగరంలో రాగద్వేషాదులనెడి నక్రమునోట చిక్కి చాల యిక్కట్లు పడుతూంటాడు.

మానవుని దుఃఖం ఎప్పుడు అంతమొందుతుంది? అతడు ఈ కడ గండ్లను ఎప్పుడు దాటుతాడు? శ్రీ శ్వేతాశ్వతర ఋషిపుంగవుని సందేశాన్ని ఆలకించండి. "హే మర్త్యాః పరమం హితం శృణుత వోవక్ష్యామి సంక్షేపతః". ఓ మర్త్యులారా, మీకు పరమహితమును సంక్షేపముగ ప్రవచించెదను. శ్రద్ధాళురై ఆలకింపుడు. వివేకమును, వైరాగ్యమును, షట్సంపత్తిని ముముక్షుత్వమును అలవరచుకొనుడు. ఉపనిషత్తులను పఠింపుడు. "నేతి నేతి" వాక్యముల ద్వారా బ్రహ్మమునుగూర్చి పరోక్ష జ్ఞానమును పొందుడు. తదుపరి బ్రహ్మము క్షుధాపిపాసలచే నిర్లిప్తమైనదనియు, ఉదయాస్తమానములులేనిదనియు, జ్ఞానస్వరూపమైనదనియు, పూర్ణానందమయమైనదనియు, ఏకమనియు, ఆనందఘనమనియు, జీవితగమ్యమనియు తెలిసికొని; నిరంతర ధ్యానము సల్పి, భగవత్సాక్షాత్కారము నొంది, అజ్ఞానమును, తత్కార్యములను నాశమొందించుకొనుడు. అప్పుడే మీరు శోకమోహములనుండి విడుదల పొందుదురు "తరతి శోకం ఆత్మవిత్" ఆత్మను సాక్షాత్కరించుకొనిన వాడు శోకమును దాటును.

శ్రీకృష్ణ భగవానుడు భగవద్గీతలో ఇలా సెలవిస్తారు,
అజ్ఞానేన ఆవృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః ॥

"జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।
తేషామాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరం ॥

తద్బుద్ధయః తదాత్మానః తన్నిష్ఠాః తత్పరాయణాః ।
గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః ॥ — గీతా.

అజ్ఞానంచే జ్ఞానం కప్పబడియుంది. అందుచే జీవులు మోహితులౌతారు. కాని జ్ఞానంచేత అజ్ఞానం నశించినవారికి సూర్యునిలాగా, జ్ఞానం బ్రహ్మమును ప్రకాశపరుస్తుంది. బ్రహ్మమునందే వారి బుద్ధిలీనమై, వారి ఆత్మ బ్రహ్మమేయై, బ్రహ్మమునందు స్థితులై, బ్రహ్మమును గమ్యముగ నెంచుకొని, జ్ఞానంవల్ల పాపములు తొలగినవారై వారు మర్త్యసంసారమునకు తిరిగిరారు.

దీనిబట్టి దుఃఖం అంతమొందుటకు బ్రహ్మజ్ఞానం ఒక్కటియే త్రోవ ఈ సత్యాన్నే అన్ని ఉపనిషత్తులు శాస్త్రములు ఎలుగెత్తి చాటుతున్నాయి.

అందువల్లనే మనం భగవంతుని ఆరాధించాలి. భగవద్భక్తులకు నాశంలేదు. ఈ విషయాన్ని చాటిచెప్పవలసినదిగ శ్రీకృష్ణ భగవానుడు అర్జుననకు ఉపదేశిస్తాడు. "కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి" ఓ కుంతీ సుతా! నా భక్తునకు నాశములేదని జగతికి చాటి చెప్పుము

---

తపః ప్రభావాద్ దేవప్రసాదాచ్చ
బ్రహ్మ హ శ్వేతాశ్వతరోఽథ విద్వాన్ ।
అత్యాశ్రమిభ్యః పరమం పవిత్రం
ప్రోవాచ సమ్యగృషిసంఘజుష్టమ్ ॥ 21 ॥

టీక: తపః = తపస్సుయొక్క; ప్రభావాత్ = ప్రభావముద్వారా, శక్తివలన; దేవప్రసాదాత్ = భగవంతుని అనుగ్రహమువలన; చ = మరియు; బ్రహ్మ = బ్రహ్మమును; హ = నిశ్చయాత్మకము; శ్వేతాశ్వతరః = శ్వేతాశ్వతర ఋషిపుంగవుడు; అథః = పిమ్మట; విద్వాన్ (సన్) = తెలుసుకొని. సాక్షాత్కరించుకొని; అత్యాశ్రమిభ్యః = సర్వోత్కృష్ట వరమునకు చెందిన సంన్యాసులకు; పరమం = పరమ; పవిత్రం = పవిత్రమైన; ప్రోవాచ = ఉపదేశించెను; సమ్యక్ = బాగుగ. చక్కగ: ఋషి సంఘ జుష్టమ్ = సకల ఋషులచే ఆశ్రయింపబడినది.

భావము: తన తపశ్శక్తిద్వారా. భగవదనుగ్రహము ద్వారా బ్రహ్మమును సాక్షాత్కరించుకొని, ప్రాజ్ఞుడైన శ్వేతాశ్వతరుడు సర్వోత్కృష్టమైన ఆశ్రమమునకు చెందిన సంన్యాసులకు సకల ఋషులచే ఆశ్రయింపబడిన పరమ పవిత్రమైన బ్రహ్మతత్త్వమును ప్రవచించెను.

వివరణము: "తపః ప్రభావాత్" తపశ్శక్తివలన, కృచ్ఛ్రచాంద్రాదియణా వ్రతరూపమగు తపస్సుయొక్క ప్రభావమువలన నియమ నిష్ఠలతో అనుదినము ఆచరించు కర్మలరూపమైన తపస్సు ప్రభావమువలన, మనస్సుయొక్క, ఇంద్రియములయొక్క ఏకాగ్రతారూపమైన తపోప్రభావమువలన.

"మనసశ్చేంద్రియాణాం చ హి ఏకాగ్ర్యం పరమం తపః" మనస్సుయొక్క ఇంద్రియములయొక్క ఏకాగ్రతను పరమ తపస్సు అని చెప్పవచ్చును. ఈ తపస్సు లన్నియూ శ్వేతాశ్వతర ఋషిపుంగవునిలో సంపూర్ణంగా ఉన్నాయి. ఆ తపో ప్రభావతంచేత. ఆ తపస్సుయొక్క శక్తిచేత;

"దేవప్రసాదాత్ చ" మరియు భగవదనుగ్రహంవల్ల. కైవల్యాన్ని మోక్షాన్ని పొందాలనే ఉద్దేశ్యంతో. మోక్షపదవికి అధికారాన్ని సిద్ధింపచేసికొనేందుకు అనేక జన్మలలో పరమేశ్వరుని మనఃపూర్వకంగా ఆరాధించడం వల్ల కలిగిన భగవదనుగ్రహం వల్ల. శ్వేతాశ్వతర ఋషీశ్వరుడు తపోప్రభావం వల్లను, భగవదనుగ్రహంవల్లను ఆత్మను సాక్షాత్కరించుకొన్నాడు.

అందువల్ల ఆత్మసాక్షాత్కారం పొందడానికి తపః ప్రభావం ఉండాలి, భగవదనుగ్రహం కావాలి పరమేశ్వరుని ప్రత్యక్షీకరణం చేసుకోవడానికి పురుష ప్రయత్నం ఉండాలి. పరమేశ్వర ప్రసాదం (దైవానుగ్రహం) ఉండాలి. పురుషార్థం సల్పేవారికి భగవంతుని దయ కలుగుతుంది. (God help those who help themselves.) మనం భగవంతుని పొందేదాని కోసం నిరంతరం సాధన చేయాలి. జన్మజన్మలలో ఆతనిని భజించాలి, ఆరాధించాలి అప్పుడు జ్ఞానం కలుగుతుంది ఆ పిమ్మట కూడ సాధన సాగిస్తూ ఉండాలి. ఎందువల్లనంటే జ్ఞానులు కూడ పరమేశ్వరుని చేరడానికి అనేక జన్మలు దాల్చవలసియుంటుంది సాధకుడు అనేక జన్మలలో పరిశుద్ధుడౌతూ వస్తాడు. ఈ సత్యాన్ని భగవంతుడు గీతలో ఇలా సెలవిసాడు.

(అనేక జన్మ సంసిద్ధః తతో యాంతి పరాంగతిం ।
బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే ।)

"బ్రహ్మ హ శ్వేతాశ్వతరః అథ విద్వాన్"- శ్వేతాశ్వరుడు బ్రహ్మమును సాక్షత్కరించుకొని. పిమ్మట. శ్వేతాశ్వతరుడు అను ఋషిపుంగవుడు బ్రహ్మమును తెలిసికొన్నాడు. అతడు బ్రహ్మముయొక్క అపరిచ్ఛిన్న మహిమను దర్శించాడు. అతడు బ్రహ్మమును ఎలా తెలిసికొన్నాడు? ప్రప్రథమంలో అతడు సాధన చతుష్టయ సంపన్నుడైనాడు తరువాత అతడు గురువును ఆశ్రయించాడు. గురుభక్తి తత్పరుడై గురుముఖంగా బ్రహ్మ

విద్యను అభ్యసించాడు. గురూపదేశం పొందాడు. శ్రవణానంతరం మననం. నిధి ధ్యాసనం శ్రద్ధతో అభ్యసించాడు. అభ్యాసం (ధ్యానం) నిరంతరం సాగించాడు. ఈ విధమైన జ్ఞానయోగ సాధన ద్వారా "అహం బ్రహ్మాస్మి" (నేను బ్రహ్మమును) అనే అపరోక్షాను భూతిని పడశాడు. ఈ బ్రహ్మాకార వృత్తిచే, జ్ఞానచక్షువుచే అతడు బ్రహ్మసాక్షాత్కారం పొందినాడు. "విద్వాన్" అనగా తెలిసికొని. అతడు బ్రహ్మమును తెలిసికొని బ్రహ్మము అయినాడు. "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి". బ్రహ్మమును తెలుసుకొన్నవాడు బ్రహ్మము ఔతాడు. అథ అనగా పిమ్మట. శ్వేతాశ్వతరుడు బ్రహ్మమును సాక్షాత్కరించుకొనిన అనంతరం ఉ ప దే ష అయ్యాడు. బ్రహ్మజ్ఞానముగలవాడు మాత్రమే గురువు కాగలడు. అజ్ఞాని గురువు కాలేడు. అంధుడు అంధునకు మార్గము చూపలేడు కదా! గ్రుడ్డివాడు గ్రుడ్డివానికి మార్గదర్శియైనచో ఇరువురు గోతిలో బడుతారు. "అథ" అనగా తరువాత. శ్వేతాశ్వతరుడు ఆత్మసాక్షాత్కారం పడసిన తరువాత. అతడు ఆత్మజ్ఞానవిలసితుడు కావున అందరకు ఆచార్యుడు అయ్యాడు. అతడు సర్వోత్కృష్టులైన పరమహంస సంన్యాసులకు ఉపదేశం చేశాడు ఇది జ్ఞాన యజ్ఞం, పరమేశ్వరునకు చాల యిష్టమైనది.

"అత్యాశ్రమిభ్యః సర్వోత్కృష్టమై ఆశ్రమమునకు చెందిన సంన్యాసులకు వారు పూజ్యతమమైన ఆశ్రమమునకు చెందిన యతీశ్వరులు. ఆ సన్యాసి వరేణ్యులు దేహాధ్యాస లేనివారు. వారికి భోగములందు ఆసక్తి లేదు. వారు పరమ వైరాగ్య శోభితులు. వారు పరమహంస సంన్యాసులు అన్ని ఆశ్రమములలో సంన్యాసాశ్రమము అత్యుత్తమమైనది. వైరాగ్యం లేనివారికి బ్రహ్మదర్శనం కాదు. కావున శ్వేతాశ్వతరుడు వైరాగ్యశోభితులైన పరమ హంస సంన్యాసులకు బ్రహ్మతత్త్వమును ఉపదేశిస్తున్నాడు.

"పరమం పవిత్రం ప్రోవాచ సమ్యక్ ఋషి సంఘ జుష్టం" సకల ఋషిగణముచే ఆశ్రయింపబడిన పరమ పవిత్రమైన బ్రహ్మతత్త్వమును శ్వేతాశ్వతర ఋషిపుంగవుడు పరమహంస సంన్యాసులకు ఉపదేశము సల్పెను.

పరమం, బ్రహ్మము సర్వోత్కృష్టమైనది. అవిద్యను, తత్కార్యమును నాశమొనర్చి, నిరతిశయ సుఖైక రస స్వరూపముగ వెలుగుటచే బ్రహ్మము

పరమైనది, పవిత్రం అనగా శుద్ధమైన. ప్రకృతి గుణములనెడి మలినమునుండి ముక్తమైనదగుటచే బ్రహ్మము పవిత్రము. ఋషిసంఘము, వామదేవ, సనకాది ఋషుల సమూహము, ఆ ఋషి సమూహముచే పరమేశ్వరుడు సేవితుడు.

సమ్యక్ ప్రోవాచ, సమ్యక్ జుష్టం, చక్కగా ఉపదేశించెను, బాగుగా సేవించిరి. శ్వేతాశ్వతర ఋషిపుంగవుడు పరమహంస సంన్యాసులకు చక్కగా బ్రహ్మతత్త్వాన్ని ప్రవచించారు ఋషిసంఘం పరమ పవిత్రమైన బ్రహ్మ తత్త్వాన్ని చక్కగా సేవించారు. కాకాక్షిన్యాయం ప్రకారం 'సమ్యక్' అనే ఈ పదాన్ని రెండు పదములతో (ప్రోవాచ, జుష్టం) చేర్చుకోవాలి.

---

వేదాంతే పరమం గుహ్యం
పురాకల్పే ప్రచోదితం ।
నాఽప్రశాంతాయ దాతవ్యం
నాఽపుత్రాయా శిష్యాయ వా పునః ॥ 22 ॥

టీక: వేదాంతే = వేదాంతములో: పరమం = పరమ: గుహ్యం = రహస్యమైనది: పురాకల్పే = పూర్వకల్పములో, ఇంతకు ముందు యుగమున; ప్రచోదితం = ఉపదేశింపబడినది, బోధింపబడినది, న = లేదు; అప్రశాంతాయ = అదుపులేని కామములు గలవానికి: దాతవ్యం = వక్తవ్యం. చెప్పవలెను, ఇవ్వవలెను;న = లేదు; అపుత్రాయ - యోగ్యుడైన పుత్రుడు కాని వానికి; అశిష్యాయ = యోగ్యుడైన శిష్యుడు కానివానికి; వా = లేక; పునః = మరల.

భావము: పూర్వకల్పములో ఉపనిషత్తులందు ఉపదేశింపబడిన ఈ పరమ రహస్యమును కామములను నిగ్రహింపనివానికిగాని, యోగ్యుడైన పుత్రుడుకానివానికి గాని, అయోగ్యుడైన శిష్యునకు గాని ఉపదేశింపరాదు.

వివరణము: శ్రీ ఆదిశంకరులవారు తమ ఉపదేశసాహస్రిలో శిష్య ప్రతిబోధ విధి ప్రకరణంలో మోక్షసాధనోపదేశవిధిని వివరంగా తెలివిస్తారు. గురువు శిష్యునకు ఎలా ఉపదేశంచేయాలో చక్కగా చెప్తారు.

శిష్యుడు పరిశుద్ధమైన అంతఃకరణం కలిగియుండాలి. అతడు వైరాగ్య సమన్వితుడై యుండాలి పుత్రునికోసం ప్రపంచంకోసం విత్తంకోసం, పరలోకానికోసం అతడు కోరికలను విడనాడాలి. అతడు మనోనిగ్రహం, ఇంద్రియ నిగ్రహం, దయ, అనుకంప మొదలగు సద్గుణాలు కలిగి యుండాలి అతడు అప్పుడు సముచిత రీతిని గురువును ఆశ్రయించాలి. అతడు శ్రద్ధావవై బ్రహ్మవిద్యను అభ్యసించాలి. "ఆచార్యవాన్ పురుషో వేద" గురువుగలవాడే బ్రహ్మమును తెలుసుకోగలడు గురుముఖంగా శిష్యుడు ఉపదేశాన్ని పొంది, జ్ఞానమనెడి నావనెక్కి సంసార తరంగిణిని సులభంగా దాటుతాడు శిష్యుడు బోధిత విషయాన్ని బాగుగ గ్రహించే వరకు గురువు పదేపదే వివరించాలి. గురువు వేదములలో నిష్ణాతుడై బ్రహ్మ వందు ప్రతిష్ఠతుడై యుండాలి."వేదాంతే సకలాసు ఉపనిషత్సు ఇతి భావం. వేదాంతములో అనగా అన్ని ఉపనిషత్తులలో, గురువు అన్ని ఉప నిషత్తులలో నిష్ణాతుడై యుండాలి.

"వేదాంతే పరమం గుహ్యం". వేదాంతములో పరమ రహస్యమైన దానిని. సకలాసు ఉపనిషత్సు ఇతి భావం అన్ని ఉపనిషత్తులలో అని భావము. "పరమం పరమ పురుషార్థ స్వరూపం గుహ్యం గోప్యానామపి గోప్యతమం. సర్వోత్కృష్టమైన పురుషార్థరూపమైనది రహస్యములన్నిటి కంటె అతి రహస్యమైనది. అనగా జ్ఞానము.

ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామి అనసూయవే ।
జ్ఞానం విజ్ఞానసహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥ —గీతా

అర్జునా, నీవు అసూయలేనివాడవు. నేనిప్పుడు నీకు పరమ రహస్యమును అనుభవము (ఆత్మ సాక్షాత్కారముతో గూడిన) జ్ఞానమును ప్రవచించు చున్నాను. దీనిని తెలిసికొని నీవు అశుభమునుండి, సంసారబంధమునుండి ముక్తుడవయ్యెదవు.

ఆత్మజ్ఞానము అతిరహస్యమైనది. అది పరమపవిత్రమైనది. దాన్ని మాటల్లో వర్ణించలేము ఆధ్యాత్మిక అంతర్ జ్ఞానంచేత, ప్రత్యక్ష అనుభవం తో దాన్ని తెలుసుకోవచ్చు. స్వయం ప్రకాశమైన, నిత్యమైన పరబ్రహ్మము మన హృదయాంతరాళమందు సదా ప్రకాశించుచున్నాడు. యుగయుగాలలో

చూస్తే ఏ కొద్దిమంది ధీరులలో (కశ్చిత్ ధీరాః) ఈ ఆధ్యాత్మికమార్గంమీద పయనించి. ఆత్మ యనెడి అమూల్య రత్నాన్ని కనుగొన్నారు. ముముక్షువునకు ముఖ్యమైన అర్హత ద్వేషం ఈర్ష్య మాత్సర్యం అసూయలేకుండుట. ముముక్షువునకు విశాల హృదయం చిత్తవిశాలత యుండాలి. ఆత్మవిద్య విద్యలలోకెల్ల సర్వోత్కృష్టమైనది; అది రహస్యాలలోకెల్ల పరమరహస్య మైనది; అది అత్యంత పావనకరమైనది. అతి పవిత్రమైనది. అది ధర్మ సమ్మతమైనది అది అవ్యయమైనది ఈ పరమజ్ఞానాన్ని శ్రద్ధాళువులైన భగవద్భక్తులకు ప్రాజ్ఞులైనవారు బోధచేయాలి. అటువంటి వారంటే భగ వంతునకు చాల ప్రీతిపాత్రులు ఈపరమ రహస్యాన్ని వెదజల్లే వారంటే పరమేశ్వరునకు ఎంతో సంతోషం ఉపనిషత్తుల్ని వ్యాఖ్యానించేస్తే, భగ వద్గీతను పఠిస్తే అది జ్ఞానయజ్ఞం సల్పినట్లౌతుంది. ఆత్మజ్ఞానం పరమరహ స్యం అని చెప్పబడింది. మనం అమృతత్వం పొందేందుకు అది తోడ్ప డుతుంది. కాబట్టి దాన్ని (ఆత్మజ్ఞానాన్ని) పరమ రహస్యం పరమగుహ్యం అన్నారు.

"పురాకల్పే ప్రచోదితమ్" పూర్వకల్పములో చెప్పబడినది. పూర్వ కల్పే చోదితం ఉపదిష్టమితి సంప్రదాయ ప్రదర్శనం కృత్యమిత్యేతత్ ఈ రహస్యము పూర్వకల్పములో ఉపదేశింపబడినది. అది సంప్రదాయ ప్రద ర్శనము చేయబడినది. గురుపరంపర ద్వారా లోకమున ఆ జ్ఞానము అంద జేయడమైనది. ఈ జ్ఞానం సృష్ట్యాదికి పూర్వమేయుంది. ఈ ప్రాచీన జ్ఞానాన్నే పరమేశ్వరుడు కృష్ణభగవానుడుగ అవతరించి. విశ్వశ్రేయస్సునకై అర్జునుని నిమిత్తంగా చేసికొని ప్రపంచానికి ప్రబోధించాడు. శ్రీమద్ భగ వద్ గీత సర్వోపనిషత్తుల సారము.

న అప్రశాంతాయ దాతవ్యం న అపుత్రాయ అశిష్యాయ వా పునః ఈ పరమ రహస్యమును కామములను నిగ్రహింపనివానికిగాని యోగ్యుడైన పుత్రుడు కానివానికిగాని, యోగ్యుడైన శిష్యుడు కానివానికిగాని ఉపదేశింప రాదు. అప్రశాంతాయ రాగద్వేషాదిమలముతో కూడినవాడు అప్రశాంతుడు. అతడు తన కామములను నిగ్రహింపలేడు. అతని మనస్సు సంకల్పము

లు కామ పూరితములు. అటువంటి అప్రశాంతునకు ఆత్మవిద్య గరపితే అనర్థం గలుగుతుంది. రాతినేల మీద విత్తనం ఫలించదు గదా! అపుత్రాయ తల్లిదండ్రుల పట్ల తన విధులను నిర్వర్తించనివాడు అపుత్రుడు తల్లిదండ్రుల యెడ దయలేని పుత్రుండు పుట్టనేమి వాడు గిట్టనేమి? అపుత్రుడు అయోగ్యుడు. వానికి ఆత్మవిద్యను ప్రబోధింపరాదు. అశిష్యాయ అయోగ్యుడైన శిష్యుడు అశిష్యుడు. అతనిలో శిష్యునకు ఉండవలసిన విధేయత కనబడదు. గర్వం పొగరుబోతుతనం. రాక్షసత్వం. అధర్మం. రంధ్రాన్వేషణం. గురుదూషణ అతనిలో పరాకాష్ఠ చెంది యుంటాయి. అటువంటి అప్రశాంతులకు, అపుత్రులకు, అశిష్యులకు ఆత్మజ్ఞానాన్ని "స్నేహాదిన న వక్తవ్యా అటువంటివారు మనకు స్నేహితులైనను సరే వారికి ఈ పరమ రహస్యాన్ని చెప్పరాదు. వరాహాలు అపిలు పండ్లను ఇష్టపడుతాయా? "వా పునః కాని మరల, —అన్యథా ప్రత్యవాయ పతిరితి పునః శబ్దార్థః" అలా అప్రశాంతులకు, అపుత్రులకు. అశిష్యులకు ఆత్మజ్ఞానాన్ని బోధిస్తే ప్రత్యవాయం (పాపం) సంభవిస్తుంది పునః శబ్దానికి ఇచ్చట అర్థం ఇది.

ఇక ఈ జ్ఞానాన్ని ఎవరికి బోధచేయవచ్చు? ప్రశాంతాయ పుత్రాయ ప్రకర్షేణ శాంతం సకల రాగాదిమలరాహితం చిత్తం యస్య తస్మై పుత్రాయ తాదృశ శిష్యాయ వా దాతవ్యం వక్తవ్యం ఇతి యావత్" రాగాది దుర్గుణములనుండి ముక్తమైన నిర్మల చిత్తముగల వానికి, అటువంటి సుగుణోపేతుడైన పుత్రునకు, సుపుత్ర సదృశుడైన శిష్యునకు ఈ ఆత్మజ్ఞాన రహస్యాన్ని అందజేయాలి, ఉపదేశించాలి. భగవంతుని దూషించని వానికి, తపస్సంపన్నునకు, భక్తి గలవానికి, ఆధ్యాత్మిక దాహంగలవానికి, గురుశుశ్రూషచేసే వానికి ఈ ఆత్మజ్ఞానాన్ని బోధింపవచ్చు. యోగ్యులకు ఈజ్ఞానాన్ని అందజేస్తే వారికి సత్యం అవగతమౌతుంది.

---

యస్య దేవే పరా భక్తిః

యథా దేవే తథా గురౌ ।

తస్యైతే కథితా హ్యర్థాః
ప్రకాశంతే మహాత్మనః ।
ప్రకాశంతే మహాత్మనః ।

టీక: యస్య = ఎవనికి; దేవే = భగవంతునిలో; పరా భక్తిః = పరమ భక్తి; యథా దేవే = భగవంతునియందు వలె; తథా = అటులే; గురౌ = గురుదేవునియందు: తస్య = అతనికి; ఏతే = ఈ; కథితాః = చెప్పబడినచో; హి = నిజముగ; అర్థాః = సత్యములు; ప్రకాశంతే = ప్రకాశించును; మహాత్మనః = మహాత్మునకు, ఆ మహనీయునకు,

భావము; ఎవనికి భగవంతుని యందు పరమ భక్తి గలదో, ఎవనికి భగవంతుని యందున్న పరమ భక్తి గురువరేణ్యుని యందునుగలదో, ఆ మహాత్మునకు ఈ సత్యములను (ఉపనిషత్ సత్యములను) తెల్పినచో అవి ప్రకాశించును, అవి తప్పక ప్రకాశించును.

వివరణము: "యస్య", ఎవనికి, అనగా ఏ అధికార పురుషునకు,

వైరాగ్యం పుష్కలం న స్యాత్ నిష్ఫలం బ్రహ్మదర్శనమ్ ।
తస్మాద్ రక్షేత విరతిం బుధో యత్నేన సర్వదా ॥

బ్రహ్మజిజ్ఞాసువునకు పూర్ణ వైరాగ్యం ఉండాలి వైరాగ్యం లేకపోతే బ్రహ్మజ్ఞానం అతనికి నిష్ఫల మౌతుంది అందువల్ల బుద్ధిమంతుడైన సాధకుడు ఎల్లప్పుడూ ప్రయత్నపూర్వకంగా తన వైరాగ్యాన్ని రక్షించుకోవాలి.

యదా మనసి వైరాగ్యం జాయతే సర్వవస్తుషు
తత్రైవ సంన్యసేద్ విద్వాన్ అన్యథా పతితో భవేత్ ॥

ఎప్పుడు మనస్సులో సమస్త విషయముల యెడ వైరాగ్యం ఉత్పన్నమౌతుందో అప్పుడే ప్రాజ్ఞుడైనవాడు సంన్యాసం స్వీకరించవలెను. అలా చేయకపోతే అతడు పతనమౌతాడు. వైరాగ్యం వివేకపూర్వకంగా ఉండాలి, బ్రహ్మచర్య సకల ఆధ్యాత్మిక సాధనలకు పునాది. వైరాగ్యం, బ్రహ్మచర్యం లేని సాధకుని సాధన నిష్ఫలం.

"దేవే పరాభక్తిః" భగవంతునియందు పరమ భక్తి. పరమేశ్వరుడు ఒక్కడే. అతడు సర్వభూతములలో దాగియున్నాడు. అతడు సర్వవ్యాపి. సర్వాంతరాత్మ. కర్మాధ్యక్షుడు. సర్వభూతాధివాసుడు. కూటస్థుడు. కేవలుడు. నిర్గుణుడు. అతడు శాంతుడు. శివుడు. అద్వైత స్వరూపుడు. అమలుడు. విమలుడు. అచలుడు. అవాఙ్ మనోగోచరుడు. అఖండైకరస చిన్మాత్రుడు. సచ్చిదానందుడు. స్వయంజ్యోతి. పూర్ణ పరబ్రహ్మము. పరంజ్యోతి. నిత్యశుద్ధ బుద్ధ ముక్త ఆత్మ. అటువంటి పరమేశ్వరుని యందలి పరమోత్కృష్టమైన, అకృత్రిమమైన అచంచలమైన, అవ్యభిచారిణీ భక్తిని అనన్య భక్తి. లేక పరాభక్తి అంటారు. పరమ శ్రద్ధతో కూడినభక్తి పరమ భక్తి. లేక పరా భక్తి.

"యథా దేవే తథా గురౌ". పరమేశ్వరుని యందు ఎంత అచంచల భక్తిగలదో అంత పరమ భక్తి గురు చరణారవిందములయందు పరమేశ్వరుని యెడగల పరమ శ్రద్ధ. శిష్యుల భక్తి గురుదేవుని యెడ కూడ చూపవలెను. "గురౌ" అనగా గురుని యందు బోధకుని సాయంలేకుండా గణిత శాస్త్రాన్నిగాని. భౌతిక రసాయనికి శాస్త్రాలనుగాని నేర్చుకోగలమా? వృక్ష శాస్త్రంలో.జీవ శాస్త్రంలో అధ్యాపకుని తోడ్పాటు లేకుండా మనం నిష్ణాతులం కాగంలమా? అది అసాధ్యం. అల్పశాస్త్రాల విషయంలోనే ఇలా ఉంటే ఇక విద్యలకు విద్యయైన బ్రహ్మవిద్య విషయాన్ని గురించి ఏం చెప్పాలి? ఆత్మ విద్యారంగంలో స్వతంత్ర స్వేచ్ఛా యోచనను గురించి మటాడడం తెలివి తక్కువ తనమనిపించుకుంటుంది. కాబట్టి ఆధ్యాత్మిక మార్గంలో పయనించే వారికి తప్పక ఒక మార్గదర్శి, గురువు ఉండి తీరాలి, ఆ గురువు సైతం బ్రహ్మనిష్ఠుడు; వేదవిదుడు అయిఉండాలి అటువంటి గురువు కోసం అన్వేషణ సల్పుతూ మనం మన కాలాన్ని వృథాచేసికోనవసరం లేదు, మనం మనం ప్రాథమిక పాఠశాలలో విద్యను అభ్యసించేటప్పుడు మనకు బోధించడానికి ఒక సెకండరీగ్రేడు ఉపాధ్యాయుడు చాలును. మనం కళాశాలకు వెళ్ళితే అప్పుడు మనకు ఎం. ఏలు. చదివినవారు అధ్యాపకులౌతారు. అలాగే ఆధ్యాత్మిక విద్యాభ్యాసంలో కూడ. ప్రప్రథమంలో మనకు దారిచూపడానికి

ఒక సాధకుడు చాలును. తరువాత తరువాత పూర్ణయోగులను ఆశ్రయింప వచ్చును. ఒకటి రెండు తరగతులలో విద్య ప్రారంభించే విద్యార్థి ఏవిధంగా తాను ఎం.ఏ. పి. హెచ్‌డి., కాగోరుతాడో అలాగే మనం కూడా యోగ విద్యలో ఆరంభకులుగా ఉన్నప్పుడే ఆత్మ సాక్షాత్కార డిగ్రీని పొందాలని ఆశ ఉంచుకోవాలి. అందుకు సదా ఆ ఆదర్శాన్ని మన ముందుంచుకోవాలి. సర్వహృదయాంతర్వాసియైన పరమేశ్వరుడు మనకు దారిచూపుతాడు. సరియైన కాలంలో, సరియైన గురువు పాదాల చెంతకు మనకు పరమేశ్వరుడు దారిచూపుతాడు.

"ఆదర్శ గురువరేణ్యునకు మనం ఆదర్శ శిష్యులంకావాలి. అప్పుడు దివ్యమైన ఆధ్యాత్మిక విద్యుత్ వలయం పూర్తి ఔతుంది. అప్పుడు మాత్రమె మనలో ఆత్మజ్ఞానము అనెడి విద్యుత్ ప్రవాహం ధారాళంగా ప్రసరిస్తుంది".

ఆదర్శ శిష్యుడు ఎలా ఉండాలి? అతడు సర్వదా సేవ చేయడానికి తరుణాలకోసం వేచియుండాలి. అతడు ఎల్లప్పుడూ జీవిత గమ్యాన్ని చేరాలనే తలపుతో ఉండాలి. అతడు అనవరతం ప్రశాంతంగా, నెమ్మదిగా, ఆనందంగా, అనవసాదంతో ఉండాలి. ఆతడు సక్రమంగా సాధనచేయాలి అతడు అన్ని జీవరాశులలో భగవంతుని దర్శించాలి. అతడు పశుపక్షిదులకు గూడ మిత్రుడుగా ఉండాలి. కొందరి శిష్యులలో ఈ సద్గుణాలన్నీ సహజంగా ఉంటాయి. వారు మొదటి రకపు జిజ్ఞాసువులు అటువంటి ఆధ్యాత్మిక సంస్కారములు లెనివారు ప్రయత్నంతో శిష్యులకు ఆవశ్యకమైన సుగుణాలన్నింటిని అలవరచుకోవాలి, ఆత్మజ్ఞానాన్ని ఆర్జించడం అంత తేలికైన పనిగాదు. డబ్బు ఇచ్చి దాన్ని బజారులో కొనలేము అది అంతస్సంస్కృతి తీవ్రమైన సాధనద్వారా, నిష్కామ్య సేవద్వారా. గుర్వను గ్రహంద్వారా, భగవంతుని కృపవల్ల దాన్ని సాధించవలసి యుంటుంది.

గురుకృప ఎలా కలుగుతుంది? శిష్యుడు గురువును పరబ్రహ్మ స్వరూపునిగా ఆరాధించాలి. అతన్ని ధ్యానించాలి, ఆతని మాట తనకు వేదం కావాలి, అతనిలో తాను ఈశ్వరుని దర్శించాలి, అతనితో ఆధ్యాత్మిక సంబంధాన్ని పెంచుకోవాలి. అతనిని శరణు పొందాలి గురుదేవునకు శిష్యుడు

తమ్ముతాను సంపూర్ణంగా ఆత్మార్పణం చేసికోవాలి. అప్పుడు గుర్వనుగ్రహం శిష్యునిపై ప్రసరిస్తుంది. శిష్యుడు త్వరగా అభ్యుదయం చెందుతాడు. అతడు దివ్యత్వంలోకి మార్పుచెందుతాడు. క్రమేణ అతడు ఆత్మజ్ఞానం పొందుతాడు. గురువే అంతా బాధ్యత తీసికొంటాడు. శిష్యునికి మార్గంలో ఎదురయ్యే అడ్డంకులను తొలగిస్తాడు. అతడు శిష్యుని ప్రలోభాలనుంచి రక్షిస్తాడు (జైమినిని వ్యాసుడు అట్టి ప్రలోభాల నుండి రక్షించాడు). చేయిపట్టుకొని, శిష్యుని గమ్యస్థానానికి తీసుక వెళ్తాడు. అందువల్ల శిష్యుడు, సాధకుడు ఆత్మసాక్షాత్కారానికై అనుక్షణం యత్నించేయాలి. అధ్యాత్మిక మార్గంలో గురువు అత్యంత అవసరమని తెలుపడానికి నిదర్శనం ఈ ఉపనిషన్ మంత్రం.

ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరాన్ నిబోధత ।

క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గం పథస్తత్

కవయో వదంతి ॥ — కఠోపనిషత్తు.

లెమ్ము, మేల్కొనుము. సర్వోత్కృష్టులైన గురువరేణ్యులను చేరి నేర్చుకొనుము. (ఆత్మను సాక్షాత్కరించుకొనుము). ఆ మార్గము ఖడ్గపుటంచువలె పదునైనదియు, దాటుటకు చాలకష్టమైనదన్నియు, నడచుటకు దుష్కరమైనదనియు ప్రాజ్ఞులువచింతురు.

ఓ మర్త్యులారా! సంసార పంకాన్నుండి ఇప్పుడే లేవండి. ఆధ్యాత్మిక జ్ఞానార్జనపైష్టే మరలండి. పాపచింక విషయాల్ని గురించి ఆలోచించడం. మానండి. అజ్ఞాన నిద్రనుండి మేల్కొనండి. అజ్ఞాన నిద్ర అన్ని యిడుమలకు బీజం. దాన్ని నిర్మూలించండి. ఈ అజ్ఞానాన్ని అవిద్యను నాశం చేయడం ఎలాగు? ఆత్మసాక్షాత్కారము పొందిన బ్రహ్మనిష్ఠులు, బ్రహ్మశ్రోత్రియులు అయిన గురువరేణ్యులను సమీపించండి. వారిచే బోధింపబడే ఈ ఆత్మను సాక్షాత్కరించుకోండి. 'సోఽహం' అని భావించండి. దీన్ని ఉపేక్ష సేయకండి. ఇది ప్రపథమ కర్తవ్యం. "శ్రుతి భగవతి పరమ ప్రేమమయురాలు, మహాకరుణామయి. ఆమె తల్లిలాగా మనల్ని ఆదేశిస్తుంది". ఆత్మ అతి సూక్ష్మమైనది. కాబట్టి ఆత్మను చేరేటటువంటి జ్ఞానపథంలో

పయనించడం చాల కష్టమైనది. ఆ మార్గంలో నడిచే బ్రహ్మ జిజ్ఞాసువు చాల మెలకువగా. అప్రమత్తుడుగా. చురుకుగా. మేధావిగా ఉండాలి. గురు కటాక్షంచేత అతనికి అంతా సుగమమం ఔతుంది.

"తస్య ఏతే కథితా హి అర్థాః ప్రకాశంతే మహాత్మనః" అటువంటి మహాత్మునకు ఈ ఉపనిషత్సత్వాలు చెప్పితే అవి ప్రకాశిస్తాయి.

ముఖ్య అధికారిణః మహాత్మన ఉత్తమస్య ఏతే కథితా అస్యాం శ్వేతాశ్వతరోపనిషది శ్వేతాశ్వతరేణ మహాత్మనా కవినోపదిష్టా అర్థాః పకాశంతే స్వానుభవాయ భవంతి. సాధన చతుష్టయ సంపన్నుడైన, బ్రహ్మవిద్యాధికారియైన మహాత్మునకు ఈ శ్వేతాశ్వతరోపనిషత్తునందలి శ్వేతాశ్వతర మహర్షిచే ప్రవచింపబడిన ఉపనిషత్ సత్యములను ఉపదేశించినచో అవి అతనియందు ప్రకాశించును. అతడు స్వానుభవమున ఆత్మజ్ఞానమును పొందును.

"ప్రకాశంతే మహాత్మనః. ప్రకాశంతే మహాత్మనః" —ఈద్విరుక్తి ముఖ్యశిష్యుని. అతని దుర్లభ సాధనము ప్రదర్శించును. అధ్యాయముయొక్క పరిసమాప్తిని సూచించును. ఇది సాదర వాక్యము.

ఇతి

శ్వేతాశ్వతరోపనిషద్ భాష్యే

షష్ఠోఽధ్యాయః

## సమాప్తమిదం శ్వేతాశ్వతరోపనిషద్ భాష్యమ్.

## ఓం తత్ సత్

## శాంతి పాఠః

ఓం సహ నావవతు ।
సహ నౌ భునక్తు ।
సహ వీర్యం కరవావహై ।
తేజస్వి నావధీతమస్తు ।
మా విద్విషావహై ॥
ఓం శాంతిః ! శాంతిః !! శాంతిః !!!
హరిః ఓం తత్ సత్

ఓం అతడు మనల నిరువురను (గురు శిష్యులను) రక్షించుగాక! అతడు మనల నిద్దరను మోక్షానందము ననుభవించునటుల చేయుగాక!
మేమిరువురము శాస్త్రముల యథార్థ భావమును దర్శించుటకు యత్నింతుము గాక!

మా అధ్యయనము ఫలవంత మగుగాక!

మేము ఒకరితో నొకరు కలహించు కొనకుండ ఉందుము గాక!

ఓం శాంతిః శాంతిః శాంతిః

హరిః ఓం తత్ సత్



# మంత్ర వర్ణానుక్రమణికా